# ప్రేమసాగరుడు

## అవతార్ మెహెర్‌బాబా
## జీవిత చరిత్ర




3వ భాగం

రచయిత :
నిట్టల భీమశంకరం

ప్రచురణ :
అవతార్ మెహెర్‌బాబా
ఆంధ్ర సెంటర్ - కాకినాడ

అవతార్ మెహెర్‌బాబా

జీవిత చరిత్ర 3వ భాగం

ఈ మూడవ భాగము
అవతార్ మెహెర్‌బాబావారి
57వ మౌనవార్షికోత్సవ పవిత్ర దినము
10–7–81న ప్రకటించడమైనది

అవతార్ మెహెర్‌బాబా–ట్రస్టు
అహమ్మద్‌నగర్ వారి –
సౌజన్యముతో

సర్వహక్కులు :
అవతార్ మెహెర్‌బాబా
ఆంధ్ర సెంటరు–కాకినాడ

ముద్రణ :
కాంతి ప్రింటింగ్ ప్రెస్,
గవర్నరుపేట, విజయవాడ–2

అ వ తా ర్ మె హె ర్ బా బా కి జ య్

# ఒక మాట

'అవతార్ మెహెర్‌బాబా చరిత్ర' (రెండవ భాగము) 'ముందు మాట'లో వివరించిన రీతిగా, 1979 ఏప్రెల్ నెలలో నిజామాబాద్‌లో సోదరులు ఆది. కే. ఇరానీ, జాక్. సి. స్మాల్‌గార్ల సమక్షములో జరిగిన బాబా ప్రేమికుల ఆంధ్రసెంటరు సహవాస్ సమావేశములో జరిగిన నిర్ణయానుసారము, 'అవతార్ మెహెర్‌బాబా, ఆంధ్రాసెంటరు' — పక్షమున — 'అవతార్ మెహెర్‌బాబా చరిత్ర' మూడవభాగమును బాబా ప్రేమికుల ముందుంచుచున్నాను. ఇదివరలో వలెనే, ఈ భాగమును కూడా స్వీకరించి, త్వరలోనే మిగతా భాగములను కూడా ముద్రించుటకు అవకాశము ఏర్పడు రీతిగా ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతములందలి ఆంధ్రా బాబా ప్రేమికులు నాతో సహకరించి, బాబా సేవలో తోడ్పడెదరని ఆశించు చున్నాను.

ఇట్లు

చింతా సర్వారావు

జై బా బా

# అవతార్ మెహెర్‌బాబా జీవితచరిత్ర

## మూడవ భాగం

# భారతదేశ పర్యటన

## హైదరాబాద్ మకాం

1938 వ సం డిశెంబరు నెలలో 8వ తేదీన బాబా ప్రత్యేకంగా కట్టించిన నీలిరంగు మోటారు బస్సులో 22 మంది ప్రాచ్య పాశ్చాత్య శిష్యులతోను శిష్యురాండ్రతోను భారతదేశ పర్యటనకై మెహెరాబాదు నుంచి బయలుదేరారు. బస్సు సారధ్యం ఎలిజిబెత్ పాటర్సన్ చేసినది. వెనుక రెండు వరుసలు భారతీయ స్త్రీ శిష్యురాండ్ర కోసం కేటాయించి వాటికి ముందు తెర కట్టించారు. ఈ స్త్రీలు చిరకాలం నుండియు ఏకాంతంలో ఘోషా స్త్రీల వలె ఉంటున్నారు వారు మగవారి మాటలు కూడా వినడానికి వీలులేనంత తీవ్రమయిన కట్టుడిని. వారిని గురించి బాబా చేసారు. ప్రయాణంలో పురుషులు రహస్యంగా మాట్లాడ, కోవలసినదే. ప్రయాణం రోజునే స్త్రీమండలిలో "వాలూ" అనే ఆమె వంటయింటిలో ఏదో చేస్తుంటే చీరకు నిప్పంటుకున్నది. ఆమె కాళ్ళు కొంచెం కాలినవి. వెంటనే నిప్పు ఆర్పేసారు. అయినా పాపం ఆమె నడవలేక పోయింది. మిగతా స్త్రీలలో యిద్దరు ఆమెని సాయంపట్టి తీసికొని వచ్చి బాబాకి చూపించారు. వెంటనే బాబా డాక్టరును రమ్మని కబురు చేసారు. డాక్టరు వచ్చి వాలూని చూసి "ఆమెను మెహెరాబాద్‌లో ఉంచినట్లయితే బాగుంటుంది. నేను రోజూ వచ్చి మందు వేస్తుంటాను" అన్నాడు. "అబ్బే! అలా వీలులేదు. అందరితోను కలిసి ఆమెకూడా బయలుదేరవలసినదే" అన్నారు బాబా. 'సరే' అని ఆమె కాళ్ళకి మందు వేసి నాలుగు రోజులకు సరిపడ మందు యిచ్చి డాక్టరు సెలవు తీసుకున్నాడు. సామానులన్నీ బస్సుపైన సర్దేశారు. అందులో వంటసామాను కూడా ఉన్నది. మండలి వారి పరుపు చుట్టలు, సంచులు అన్నీ బస్సు పైకి ఎక్కించారు. అందరూ ఎక్కిన తరువాత బాబా బస్సు ఎక్కారు. వారు ముందు సీటులో డ్రైవరు ప్రక్కన కూర్చోవడానికి వెళుతూంటే అందరూ లేచి ఒక ప్రక్కన నిలబడి బాబాకి దారి యిచ్చారు. బాబా కూర్చొనిన తరువాత డ్రైవరుకి బస్సుని స్టార్ట్ చేయమని చెప్పడానికి శిష్యులు బస్సు ప్రక్కను చేతితో కొట్టి సౌంజ్ఞ చేసారు. తరువాత వెనుక కూర్చున్న మండలికి వ్రేళ్లతో చిటికె వేసి తలుపు వేయమని చెప్పారు బాబా.

ఒక్కొక్క చోట 300 మైళ్ళ ప్రయాణం చేసి వెళ్లినా పాశ్చాత్య స్త్రీలు కూడా వట్టి నేలమీదనే పరుండవలసి వచ్చేది. ఒక్కొక్క చోట మహారాజుల సౌధాలలో పట్టు పరుపులున్న మంచముల మీద పరున్నారు. ఒక ఊళ్లో ఒక చోట బస చేసినప్పుడు ఒక బిచ్చగాడు ప్రతిరోజు వచ్చేవాడు. వానిని చూసి ఒక పాశ్చాత్య శిష్యురాలు మొదటి రోజున ధర్మం చేసినది. వాడు ప్రతిరోజూ రావడం చూసి వాడిని వెళ్లమనినా వాడు వెళ్లేవాడు కాదు. ఈ విధంగా ఆ బిచ్చగాడు చెప్పిన మాట వినకపోవడం భరించలేక ఆమె బాబాని యిలా అడిగింది. "ప్రతి రోజు ఎందుకు వస్తాడు బాబా వాడు?" ఈ ప్రశ్నవిని బాబా ఆమెవైపు గంభీరంగా చూసి "వాడికి రోజూ ఆకలి వేస్తుంది గనుక" అన్నారు. ప్రతిప్రయాణం లోనూ బాబా ముందు సీటులో కూర్చొనగా నీలిరంగు బస్సులో అందరూ వెనుక కూర్చొని వెళ్లేవారు. శిష్యులందరూ తెల్లవారి 4 గంటలకే లేస్తారు. కిట్టీతో 4 గంటలకే అల్పాహారములు తయారుచేయాలన్నారు. ఇంకొకామెతో బస్సులో పెట్టవలసిన సామానులన్నీ సర్దుకుని సిద్ధంచేయాలని చెప్పి బస్సు నడిపే బాధ్యత ఎలిజిబెత్‌ది గనుక ఆమెను పెందరాడే తయారవమని బాబా చెప్పేవారు. ఆమెకు "బస్సు బయలుదేరే ముందు మంచి కాఫీ ఒక కప్పు యివ్వాలి" లేకపోతే బస్సు నడవనే నడవదు" అనేవారు బాబా. ఎలిజిబెత్‌కి ముందుగా చెప్తేచాలు. ఎన్ని గంటలకు బయలుదేరాలని చెప్తే అన్ని గంటలకు సిద్ధంగా ఉండేది ఆమె. పడకలు పెద్దపెట్టెలు అన్ని బస్సు టాపుపైన పెట్టించే వారు బాబా. పాత్ర సామానులు, వంట సామగ్రి అన్నీ బస్సుమీద పెడుతూంటే బాబా స్వయంగా పర్యవేక్షణ చేసేవారు. చలికాలానికి వేసంగికి కావలసినవన్నీ తీసుకున్నారు. "ఫలానా పెట్టె పెట్టావా?" అని బాబా అడిగేవారు. 'అది వర్షం పడినా తడవకూడదు' అనే వారు. పెట్టెలు పడకలు అన్నీ పెట్టిన తరువాత టార్పాలిన్ వాటి అన్నిటి మీదికి వచ్చే విధంగా కప్పించి త్రాళ్లతో మండలిచేత బిగింపించేవారు బాబా. తరువాత చేతిలోనికి ఒక్కొక్కరికి చిన్నపెట్టె గాని సంచిగాని ఉండవచ్చునని అనుమతించి బాబా దానిని బస్సులో వారు కూర్చున్న సీటుక్రిందనో తలమీది అరలోనో పెట్టడానికి ఒప్పుకున్నారు. "ఇవితల ఏదీ ఉండకూడదు" అంటార్రు బాబా. కొందరు బాబా చెప్పిన పనులు చేయడానికి మెహెరాబాద్‌లో దిగిపోయారు. వారంతా బస్సు బయలుదేరినపుడు బాబాకు, ఆయనతో బయలుదేరిన వారికి వీడ్కోలు చెప్పారు. వారిని బాబా విడిచి వెళ్లిపోతున్నా వారికి ఆంతరికంగా

ఆయనయొక్క సహాయం ఎప్పుడూ ఉంటుందని వారికి తెలుసును. ఇంక బస్సు బయలుదేరినది. కూర్చున్న ఆడవాళ్లు ఊరికే ఉండలేరు. పురుషమండలి అంద రికీ అందులో చోటు ఉండదు గనుక బస్సు వెళ్లిపోయిన తరువాత బస్సులో చోటు లేక వెళ్లకుండ మిగిలిపోయిన పురుషులు రైలులో బయలుదేరి వెళ్లేవారు. రైలులేకపోతే వేరొక బస్సు మాట్లాడుకొని వాళ్లు వాళ్ల సామానులతో, ఒక్కొక్కప్పుడు బాబా వెళ్లిన బస్సుకన్న ముందే వెళ్లి చేరుకునేవారు. వెళ్లి ఎక్కడ దిగాలో ఆ బంగళా వద్ద బాబా కోసం ఎదురు చూసేవారు.

పైన చెప్పినట్లు బాబా బస్సులో ముందు సీటులో కూర్చున్నారబా బస్సులో వెళుతూంటే వెనుకవైపు స్త్రీలు రణగొణ ధ్వని చేస్తున్నారు. ఒకామె నిలబడి ఉంటే ఇంకొకామె "ఏం కూర్చోవేం"? అంది. అందుకా నిలబడిన ఆమె "ఎక్కడ కూర్చోమంటావు? చోటులేందే"! అంది. వేరొక ఆమెనిలబడిన ఆమెను "నా కుర్చీ ఎవరు తీసుకున్నారు?" అని అడిగింది. ఇంకొకామె — "అయ్యో! అయ్యో! ఇది నా నెత్తిమీద పడేలా ఉంది యీపెట్టె!" అని అరి చింది. ఇలా గొడవ చేస్తుంటే ముందుసీటులో ఉన్న బాబా చెవులు మూసు కున్నారు: అదిచూసి వెనుక స్త్రీలు అందరూ గప్‌చిప్‌గా ఉన్నారు కొంతసేపు. పాపం బాబా ఎన్ని ప్రయాణాల్లో యిలాంటి గొడవలు ఎన్ని భరించారో! ఇలాంటి వాళ్లు ఆధ్యాత్మిక శిక్షణకోసం బాబా వద్ద చేరారు. వాళ్లకి కోరికలు ఉండ కుండా, మమకారాలుండకుండా అహంకారం తొలగిపోయేలా, బాబా ఎంతకష్ట పడితే వారు తయారయారో ఊహించవచ్చును. బస్సు వెళ్లి బాబా ఆజ్ఞ ప్రకారం ఒక ఊళ్లో ఆగింది. అక్కడ శనగలు, అటుకులు, బటాణీలు. మరమరాలు ఇన్నికొని ముందు ఒకరకం కొద్ది కొద్దిగా అందరికీ పంచిపెట్టారు, దానితో వాళ్లు కాలక్షేపం చేసారు. ప్రక్క ఆమెకి తనకంటే ఎక్కువ వచ్చా యేమో అని ఒకతె "ఏదీ నీ చెయ్యి చూపించు" అని అడిగింది. తరువాతవారి కిచ్చిన శిక్షణలో యిలాంటి ఈర్ష్యలూ స్వార్థాలు రూపుమాపారు బాబా. భోజ నానికి రొట్టెలు, పళ్లు వగైరాలు కూడా తీసికొని వచ్చారు. దారిలో ఒక చెట్టు నీడన బస్సు ఆపించారు బాబా. అందరూ బిలబిలా దిగి బస్సు దగ్గర నిలబడి బాబా తొందర పెడుతూంటే అప్పటిమటుకు ఒక అరటిపండో, ఒక రొట్టెముక్కో. ఒక పచ్చి ఉల్లిపాయో తినేసి కాసిని మంచినీళ్లు తాగి మళ్లీ బస్సు ఎక్కారు, ఈ ప్రయాణీకుల వైఖరులు వాతావరణాన్ని బట్టి, వారి ఆకలిని బట్టి వాటి అడ

నటని బట్టి మారుతుండేవి. గమ్యస్థానం చేరారు. ముందు బాబా దిగి వారుంటు బోయే బంగళా లోపల ప్రవేశించి చూసిమరీ శిష్యులందరిని రమ్మని పిలిచారు. సీట్లక్రింద పైన అరలోను పెట్టిన చిన్నపెట్టెలు సంచులు జాగ్రత్తగా అన్నీ దింపే బాధ్యత బాబా రాణికి అప్పజెప్పారు. అవసరం అని తోచింది కాబోలు మంచినీళ్లు మరిగించి అవే తాగలన్నారు బాబా అందరినీ.

శిష్యబృందాన్ని బంగళాలో వదిలేసి యిద్దరు ముగ్గురు మండలితో మన్సు పనిమీద బాబా ఊళ్లోకి వెళ్లారు. బాబా తిరిగి వచ్చేసరికి రాత్రి పొద్దుపోయింది. రాత్రి భోజనానికి ఉడకబెట్టిన పదార్థాలు ఎండ వేడివలన బాబా వచ్చేసరికి పుల్లగా పాడయిపోయాయి. "పరవాలేదు. మనం టీ, పాలు, రొట్టె తిందాము." అన్నారు బాబా. స్త్రీ మండలి "సారీ బాబా! పాలులేవు. పాలు తేవడానికి ఏడుమైళ్ళు వెళ్లిరావాలి. ఇప్పుడు చాలా పొద్దు పోయింది" అంది ఒకామె. ఒక శిష్యుని పిలిచి బాబా "మన దగ్గర ఇంకేమయినా ఉందా తినడానికి" అని అడిగారు బాబా. 'ఉంది బాబా' అని అతడు జన్నో ఏదో తీసి యిచ్చాడు. అది ఎంతమందికి సర్దుతారు బాబా! ముందు బస్సు నడిపే ఎలిజబెత్‌కి కొంత పెట్టారు. బాబా కొంచెం తిని ఎరచ్‌కి కొంచెం పెట్టించారు. మిగిలిన వారు రొట్టె తినిన తరువాత బాబా పాలు లేకుండా టీ తయారు చేయించి అందరినీ తాగమని యిచ్చారు. రాణి "సామానంతా నేను కదా దింపించి సర్దించాను తెల్లవారి 3 గంటలకు లేచానుకదా నాకు కొంచెం జున్నుపెట్టించరా బాబా." అని అడిగింది. ఒకరు తిన్నారని తనకు తినడానికి లేదని పోట్లాట మరలా ప్రారంభం అయినది. అప్పుడు అక్షరాల పలకమీద బాబా చూపిస్తూంటే మణి అది చదివి యిలా చెప్పింది.

"శ్రద్ధగా వినండి. నా యెడల మీకు ఉన్న ప్రేమ ద్వారా నాతో యిన్నాళ్లుండి మీరింకా ఒకరినొకరు ప్రేమించుకోలేకపోతే యెలాగ? మీ ఉద్వే గాలను అణచుకోండి అప్పటిమట్టుకయినా. మిమ్మల్ని మీరు గిల్లుకోండి. ప్రక్కకి వెళ్లి నాట్యం చేయండి. బాబాను తలచుకోండి. కోరడం మానేయండి." ఈ విధంగా వారి నడవడిని దిద్దేవారు బాబా. ఇదియొక అమూల్యావకాశం అని వారు భావించాలి. లేకపోతే అలాచేయకపోతే ఏదయినా అపాయం కలుగుతుందని భావించాలి. అప్పుడు వారి ధోరణి మారాక బాబా సంతోషించారు. సరియయిన సమయానికి తగినట్లుగా ప్రవర్తించడం బాబా అందరికీ నేర్పారు.

ఏదయినా పనికోసమో, ఎక్కడికో బయలుదేరడానికో ఎవరయినా ఒకామె తయారుకాక ఆలస్యం చేస్తుంటే బాబా ఆమెను కోపగించుకోనేవారు కారు. మిగిలిన వారితో ఆమెను గురించి బాబా "ఫలానా...ఆమె యింకా రాలేదు. పాపం నాకు చాలా విచారంగా ఉంది. ఆమె గనుక వస్తే మనందరికీ ఆధ్యాత్మికమార్గంలో ఎంతో సహాయంగా ఉండేది. ఎందుచేతనంటే ఆమె చెప్పినది సులభంగా చేయ లేదు గనుక. అయినా ఆమెకు అందరం సుఖం కల్గించడంలో తోడ్పడాలి అనేవారు.

వారి పరివారాన్ని తీసికొని ఇండియాలో అనేక స్థలములకు వెళ్లడమే యీ ప్రయాణంలో వారి ఆశయం. ఈ పర్యటనలో వారు స్త్రీ పురుష మండలికి శిక్షణ యివ్వడమే కాకుండా వారి ఆధ్యాత్మిక సహాయం ఎక్కడ ఎవరికి అవసరమో ఆ ప్రకారం బాబా వారికి కలుగ జేస్తారు. వారి పనితో పాల్గొనే అవకాశం శిష్యులకు యివ్వడమూ, యీ దేశాటన వలన అమూల్యమైన అనుభవ ములు శిష్యులకు కలుగజేయడమూ బాబా ఉద్దేశ్యం. ఎక్కడెక్కడికి బాబా వారిని తీసికొని వెళ్లనున్నారో ఎవరికీ ముందుగా తెలియదు. మొదట హైదరాబాద్ (నైజాం రాష్ట్రం) వెళతారని మాత్రం తెలుసును. మొత్తం యీ పర్యటన అంతా ఆరుమాసములు తీసుకోవచ్చును. వారి పర్యటన అందరిని హిమాలయ ములకు కూడా తీసికొని పోవచ్చును. నిజంగా బాబా వెళుతూన్నపుడు వారు వారి అంతరంగ ఆధ్యాత్మిక ప్రయాణం ప్రారంభించారని వారు అనుకుంటారు. దానికి బాబా బాహ్యరూపం కల్పిస్తున్నారు.

బస్సు రాత్రికి షోలాపూరు చేరుకుని అక్కడ విశ్రాంతిగృహం వద్ద ఆగింది. ఆ బంగళా రైలుస్టేషను సమీపంలో ఉంది. సామాను బరువువల్ల బస్సు నెమ్మదిగా ప్రయాణం చేసినది. అందువలన రావడం ఆలస్యం అయినది. పోనుపోను బరువు తగ్గుతుంది. బరువు తగ్గిన కొలది వేగం హెచ్చుతుంది. అప్పుడు ప్రయాణం త్వరగా సాగుతుంది.

## హైదరాబాద్ రాక

మరల తెల్లవారుఝామున బయలుదేరాలి గనుక బాబా' బస్సు మీద వేసిన పరుపు చుట్టలు తీయనద్దని' చెప్పగా అవి అలాగే ఉంచి, ఆ బంగళాలో ఉన్న

పల్లిలమీద పరుండి ఆ రాత్రి ఎలాగో గడిపారు. అది డిసెంబరు రాత్రి గనుక చలిగానే ఉంది. కప్పుకునేందుకు వారు వేసుకొని ఓవరుకోట్లు విప్పి వారికే యింకేమీ లేవు. దీనిని బట్టి యీ ప్రయాణం ఎంత సుఖంగా ఉంటుందనో ఊహా పడలేదు వారు. అయినా బాబా ఎవరెవరి భావాలు, ఆలోచనలు ఏలా ఉన్నాయో అన్నీ కనుక్కుంటూనే ఉన్నారు. ఎంత బాధపడుతున్నా బాబా దగ్గర నుంచి ఒక్క అనునయ వాక్యం వస్తే చాలు, వారికి ఉన్న ఏటువంటి ఇబ్బందులైనా సంతోషంతో ఎదుర్కొన గలరు. మరల తెల్లవారుఝామున బాబా పెందల కడనే లేచి కాలకృత్యములు తీర్చుకుని బయలుదేరారు. నైజాం రాష్ట్రంలో ప్రవేశించింది బస్సు. ఒక్క నదీతీరమున ఆగి అక్కడ అందరూ అల్పాహారములు తీసుకున్నారు. చాలామటుకు బస్సు వెళ్ళే మార్గానికి యిరుప్రక్కలా అంతా రాళ్ళతో నిండిన పీఠభూమి. అప్పుడప్పుడు తాటిచెట్లు మాత్రం కనిపించేవి. పంటకి వచ్చిన పైరులు అక్కడక్కడ కనిపించేవి. హైదరాబాద్ నగరం సమీపిస్తోంది. మొగల్ రాజ్యం నాటి నుండియు ఉన్న కోటలు, బురుజులు, మినార్లు, మసీదులు కనిపిస్తున్నాయి.

బాబా పరివారంతో హైదరాబాద్ మాజీ ప్రధానమంత్రులు అతిథులుగా ఉండడానికి ఏర్పాటయింది కాని హైదరాబాద్‌లో ప్లేగు వ్యాధి వచ్చినందు వలన బాబా అతిథిలందరికీ సురక్షితంగా ఒక దూరవు తోటలో ఒక బంగళాలో వసతి ఏర్పాటయింది. అది ఒక మహమ్మదీయ ఘోషా స్త్రీలు ఉండే భవనం. బాబాకి వారి స్త్రీసంఘానికి కావలసినట్లుగా యిక్కడ ఏకాంతం లభ్యం కావచ్చును. బాబాతో ఉన్న స్త్రీలందరికీ ఆ ఘోషావారికి కావలసినట్లుగా ఉంది. బయటి ప్రపంచానికి యిందులో ఎవరు ఉన్నారో ఏమీ తెలియదు. బాబా వారి స్త్రీలకు అంతరిక ఆధ్యాత్మిక శిక్షణ కలుగజేస్తారు. ఈ పురాతన భవనంలో వారి పరివారంతో బాబా ఒక్క రాత్రే ఉన్నారు. ఆతిథ్యమిచ్చిన ఆ గృహిణి బాబా దర్శనం చేసుకుని వారు ఆ నగరమున ఉన్నంతకాలము ఆమె స్వయముగా వారికి భోజనముము పెట్టె భాగ్యమును కలుగజేయమని వేడుకుంది.

మర్నాడు ఉదయం బాబా ఒక అధికారితో ఇద్దరు మండలి సభ్యులతో కారులో బయలుదేరి బయటకు వెళ్ళి వచ్చి ఆ మధ్యాహ్నమే వేరొక భవనమునకు మకాం మార్చివేసారు. అది నైజాం నవాబు యొక్క సోదరుని భవనమనియు

నగరమ్మునకు మధ్య భాగంలో ఉన్నదనియు తెలిసినది. ఆ సోదరుడు ఖుస్రూ డందులో ఉండుట లేదు. అది ఒక పెద్దతోట మధ్యన ఉండుట చేత బాబా యొక్క ఏకాంతమునకు అంతరాయమ్ముండదు. ఆ రోజునే మహమ్మద్ మస్తాను మెహెరాబాద్ నుంచి తీసికొని వచ్చారు.

బాబా వారి స్త్రీ మండలితో హైదరాబాద్‌లోని బాబా షరఫుద్దీన్ దర్గాకి వెళ్లి చూసారు. ఈ దర్గా ఒక కొండమీద ఉంది. మెట్లమీద ఒక ముసలివాడు కూర్చొని ఉండెను. అతడు బాబా వైపు వింతగ చూసాడు. ఆ చూపులోని విశిష్టత బాబాకే తెలిసింది. బాబా అతని సాంగత్యం చేసిన తరువాత యీవృద్ధుడు ఆధ్యాత్మిక మార్గంలో బాగా అభివృద్ధి చెందాడని బాబా చెప్పారు.

బాబా హైదరాబాద్‌లో ఉన్న రోజులలో ఒక ఆధ్యాత్మిక కేంద్రమును యీ నగర పరిసరములలో స్థాపించడాన్ని గురించి ప్రభుత్వ అధికారులతోను అందులో అభిరుచి కలవారితోను చర్చించారు. దానికి కావలసిన పథకములన్నీ స్విడ్జర్లాండు నుండి వచ్చిన బాబా ప్రేమికుడొకడు నిర్వహించెడివాడు. హైదరాబాద్ నగరం మధ్యలో ఉన్న హుస్సేన్‌సాగర్ అనే సరస్సుగాక, నగర పరిసరములలో హిమాయత్ సాగర్, ఉస్మాన్‌సాగర్ అనెడి మరి రెండు పెద్ద సరస్సులు ఉన్నాయి. ఒకనాడు ఆరెండు సరస్సుల మధ్య ఉన్న ఒక విశాల ప్రదేశానికి వెళ్లి బాబా అది తిలకించారు. అది కొండలతోను అడవులతోను నిండి ఉన్నది. దానికి అటు ఉస్మాన్ సాగర్, యిటు హిమయత్ సాగర్ అదే పైన చెప్పిన పెద్ద సరస్సులు ఉన్నాయి. ఇవి మొగల్‌రాజులు మొదట పెట్టిన పేర్లు. ఈ ప్రదేశమును గురించి ఆరాతీయగా యీ క్రింది సంగతులు తెలిసినవి.

దాదాపు రెండువేల సంవత్సరముల క్రిందట క్రీస్తు యొక్క శిష్యుడొకడు క్రీస్తు శిలువ వేయబడిన యనంతరము తూర్పుదేశములకు పయనమై వచ్చి యీ
~~క్రీస్తు శిలువ వేయబడిన యనంతరము తూర్పుదేశములకు పయనమై వచ్చి యీ~~
ప్రదేశమునందే నివసింపసాగెను. అతడు కుతుబ్ స్థాయికి చెందిన ఒక సాధు పుంగవుడు. కుతుబ్ ఒకచోటు ఎన్నుకొని అక్కడ ఉంటే మరి అది వదిలి వారు యింకొక చోటుకు వెళ్లరని చెప్తారు. ఆరోజులలో ఆ రాజ్యం పాలించే రాజు ఆ అడవికే వేటకోసం వచ్చేవాడు. అందువలన ఒకదినము క్రీస్తు శిష్యుడగు ఆ సాధు

పుంగవుని 'రాజాగారు వేటకు వస్తున్నారు గనుక ఆ తావు విడి వేరొక చోటునకు పోవలెనని' రాజభటులు చెప్పారు. కానీ ఆ స్థలమును విడిచి పోవుటకు ఆ సాధువు నిరాకరించెను. ఆ సంగతి విని రాజా సాయుధభటులను పిలిచి వారితో ఆ సాధువును బలవంతముగా అక్కడినుండి విడిపోవునట్లు చేయుమని చెప్పి పంపెను. ఆయుధ పాణులయిన వారు వచ్చినను అతడా స్థలమునుండి కదలిపోలేదు! అతడు మిగుల శాంతమయిన వచనములతో వారిని వెనుకకు పంపివైచెను. రాజా వేటాడే అడవిలో వేరొకరు — వారెవరయిననూ ఉండకూడదని అతనిని వెడలగొట్టమని రాజా మరి యొక సాయుధ దళమును పంపెను. వీరు కూడా ఆ సాధువు వద్దకు వచ్చి అతనిని కదల్చలేక రాజావద్దకు పోయి చెప్పారు. 'ఈతడెవరో మొండిఘటంలా ఉన్నాడని ఆ రాజా స్వయంగా వేట దుస్తులతో బయలుదేరి ఆ సాధుపుంగవుని దగ్గరకు వెళ్లాడు. రాజా అతని దర్శనం చేసికొనిన తరువాత అతని నక్కడే ఉండమని విన్న వించుకొనుటయే కాక, రాజా అతనిని తన ఆధ్యాత్మిక గురువుగా కూడా అంగీకరించెను.

ఈతడు క్రీస్తు వద్ద ఉన్నప్పుడు క్రీస్తు స్వయంగా అతనికొక అంగీనిచ్చెను. ఆ శిష్యుడు వచ్చినప్పుడు ఆ అంగీని తనతో యిక్కడికి తెచ్చుకొని దానిని ధరించు చుండెను. కొంతకాలమునకు అతడు వృద్ధుడై ఒక యువక శిష్యుని సంపాదించెను. ఆ వృద్ధుడు తన అవసాన దశయందు ఆక్రీస్తు యిచ్చిన అంగీని ఆ శిష్యునకిస్తూ "ఈ స్థలము వదలి యీ చొక్కాను ఎక్కడికీ తీసికొని పోరాదు" అని చెప్పెను. అనతికాలములో ఆ వృద్ధసాధువు పరమపదమును పొందెను. ఆరాజు కూడా గతించెను. కాలము మారెను. ఆరాజ్యమునందు యుద్ధము సంభవించెను. ఆ యువక శిష్యుడిపుడు నడివయస్కుడయ్యెను. అతడా స్థలము వదలి వెళ్ళునప్పుడు గురువు ఆదేశానుసారము తనతో ఆ చొక్కాను తీసుకుని వెళ్లక తన గురువు కూర్చుండి యుండిన చోటనే ఒక గొయ్యితీసి ఆ పవిత్రమయిన అంగీని అందు నిక్షిప్తము చేసెను.

ఈ కారణం చేతనే బాబా యీ ప్రదేశము ఆధ్యాత్మికముగా పవిత్రమయిన స్థలమని దీనిని ఎన్నుకున్నారు. పురాతనమయిన ఈ రాజ్యముయొక్క చరిత్ర ఆధ్యాత్మికముగా చాలా గొప్పదని చెప్పడానికి యింకా కారణములు ఉన్నవి. ఇది అన్ని మతముల వారికి యాత్రాస్థలమై విలసిల్లుచుండెను. ఆకాలంనాటి నవాబు కూడా ఆధ్యాత్మికంగా మనసు మళ్లినవాడే. అతని పూర్వీకులు కూడా ఆధ్యాత్మిక గురువులను సేవించేవారు. నగరమునకు వెలుపల సార్వభౌముడగు ఢిల్లీసుల్తాన్ ఎప్పుడయినా వచ్చినపుడు విడిది చేయుటకు ఒక ఎత్తయిన కొండమీద రాజభవనం

ఒకటి ఉంది. ఇంకొక కొండ మీద ఒక రాతి గృహం ఉంది. ఇది సాధు పురుషుల నివాసముగా నుండెను. ఈ కొండకు ఋషుల కొండయని పేరు గలదు. బాబా పరివారము మెట్లెక్కి పైకి వెళ్ళగా అక్కడొక యాత్రికుడు నిరాడంబరముగ కూర్చుని ధ్యానమొనర్చుచుండుట చూసారు. అతడొక దివ్యమైన ఆత్మఅని బాబా చెప్పారు. అతని దాపుచేరి బాబా ఒక్కసారి అతనివైపు చూసారు. అంత అతని మోమున ఒక హాసరేఖ పొడమినది. అతడానందముతో నిలచెను. బాబాను అతడు గుర్తించినట్లు అతని చూపే తెలుపుతోంది.

హైదరాబాద్‌కు రాకపూర్వమే బాబా మండలితో హైదరాబాద్ నందొక నిజమైన సాధువుండెనని చెప్పారు. నగరమునకు వచ్చిన తర్వాత మండలి పురవాసులని అడిగి ఆమె ఒక స్త్రీ అని తెలుసుకున్నారు 'ఆమె నివాసమెక్కడున్నదీ చెప్పజాలమని' మండలితో వారు చెప్పారు. కొన్ని రోజుల తరువాత బాబా, ఆధ్యాత్మిక శిక్షణ బడసిన ప్లీడర్ అనునొక వ్యక్తిని 'ఆ స్త్రీ సాధువెక్కడ ఉన్నదీ తెలిసికొని రమ్మని' పంపించారు. ఆమె ఎక్కడో పేదవారు నివసించెడి చోటున వెనుక దొడ్డిలో నుండెను. ఆమె ఆరవ భూమికలోని ఒక మస్తానీ. ఆమె మానసము ఊర్ధ్వ లోకములందే విహరించుచుండెను. ఈ భౌతిక ప్రపంచపు ఆలోచనలే ఆమెకు లేవు. ఆమె చుట్టూను అన్ని వేళలా భక్తులు చాలామంది కూర్చొని ఉంటారు. కానీ ఆమె వారి కెట్టి ఉపదేశమును చేయుట లేదు. ఆమె ధోరణిలో ఆమె ఉంటుంది. ఈ సంగతి తెలుసుకొని బాబా ఆయన శిష్యునొకనితో వాల్టర్ మోర్ట్సన్ను హెడీ మోర్ట్సన్ను అను వారినిచ్చి ఆమెను దర్శించి రమ్మని పంపించారు. ఈ దంపతులు జూరిచ్ నుంచి వచ్చారు. వీరు అక్కడికి వెళ్ళగానే ఆమె యీ మువ్వురను తను వద్దకు రమ్మని పిలిచి కూర్చుండమని చెప్పినది. ఆ పాశ్చాత్యులు ఫోటో తీసుకుంటామని అడుగగా ఆమె అనుమతించినది. ఆ ఫోటో చూచినచో ఆమె వదనము నిండా ఆధ్యాత్మిక జ్యోతి వెలుగుచున్నట్లు తెలియుచుండెను. ఆమె ఊర్ధ్వదృష్టితో నుండెను. ఆనాడే బాబా ఇంకొక నుజ్జాల్ వంటి ముసలి మస్తును కలిసారు. ఇతడు గడియారం స్తంభం వద్ద చినిగిన బట్టలతో ఉన్నాడు.

బాబా హైదరాబాద్ వచ్చిన పని ముగిసింది. మరునాడు 1938, డిశంబరు 19వ తేదీన నగరమునుండి బాబా తమ పరివారముతో బయలుదేరారు. వెళ్ళునపుడు బాబా తమతో మహమ్మద్ మస్తును కూడాతీసికొని వెళ్ళారు. బాబాహైదరాబాద్‌లో

యింకా కొంతకాలం ఉంటారని అందరూ అనుకున్నారు. బాబా ఆరునెలల్న పాటు మోటారు బస్సులో పర్యటన చేస్తారు. ఏరోజున ఎక్కడికి వెళ్ళనదీ ఎవరికీ వివరాలు తెలుపలేదు. పుణ్యక్షేత్రములకు శిష్యులతో వెళుతున్నారని మాత్రము తెలుసును. జబల్‌పూర్‌కి వస్తున్నారని అక్కడ బాబా ఎంతకాలం ఉంటారో తెలి యదు గనుక ఎన్నాళ్లయినా ఉండడానికి తగిన ఏర్పాట్లు అక్కడ ఒక శిష్యుడు చేస్తున్నాడు.

జబల్‌పూర్ వెళ్లేదారిలో నాగపూర్‌లో ఒక శిష్యుని యింటిలో దిగారు బాబా. బాబా నాగపూర్ వచ్చారని అక్కడి భక్తులనేకులు ఆయన దర్శనం కోసం, పాదాభి వందనం కోసం వచ్చారు. "ఎంతోమంది వస్తారు కానీ అందులో నిజమైన భగవ త్ప్రేమికులు అరుదు" అన్నారు బాబా. ఎంతో కాలం నుండి తెలిసివున్న భక్తులు కూడా బాబా దర్శనానికి వచ్చారు. గేటుకి బయట ఒక సాధువు నిలబడి 'మెహెర్ బాబా కీ జై' అని పాడుతున్నాడు. గతరాత్రికూడా ఆ యింటిలో వారికి యీపాట వినిపించినది. బాబా నాగపూర్ వదలి వెళ్లేరోజున అందరికీ దర్శనం యిచ్చారు. బాబా ఎదుటకు ఒక పొడుగైన సాధువు వచ్చి నిలిచాడు. అతని కళ్లు ప్రకాశవంత ముగా నుండెను. ఇతడు బాబా జన్మదినోత్సవానికి అహమద్‌నగర్ కూడా వచ్చి యుండెను. హృదయంలో భగవంతుని దర్శించాలని నిజంగా ఆకాంక్ష వున్నవారికి కొంచెం ఓర్పు, స్థిరత్వము కలిగి ఉంటే వారి కోరిక తీరడానికి ఎంతకాలము కావాలి? ప్రభువు అనుగ్రహం కలిగితే ఒక్క క్షణం చాలు. ప్రభువుకు కూడా తెలుసు.

1938 డిశెంబరు 21వ తేదీనుండి జనవరి (1939) 15వ తేదీ వరకు బాబా జబల్‌పూర్‌లోనే ఉన్నారు. అక్కడ ఒక మేజిస్ట్రేటు యింటిలో బాబా విడిది చేసారు. దాని ప్రక్కనే బాబా శిష్యులకు వసతి ఏర్పాటు చేయబడినది. బాబా అక్కడ ఉన్న రోజులలో ఆ స్థలమంతా ఆధ్యాత్మిక వాతావరణముతో నిండిపోయినది. ఒక పుణ్యక్షేత్రానికి యాత్రికులు పోయినట్లుగ మెహెర్‌బాబా దర్శనార్థము అనేక మంది వచ్చి పోతూఉండెడివారు. రెండురోజులు పూర్తిగా బహిరంగ దర్శన కార్యక్రమంలో గడిపారు బాబా.

డిశెంబరు ఆఖరివారంలో జబల్‌పూర్‌కి 60 మైళ్ల దూరంలో ఉన్న మండ్ల అనే పట్టణమునకు, అక్కడ మూడురోజులుండి వద్దామని వెళ్లారు. అక్కడ పవిత్రమైన రెండు నదుల సంగమం ఉంది. 'మండ్ల' చిన్న పట్టణమైనా భారత

దేశమునకు సరిగ్గా మధ్యన ఉందని దానికా పేరు. ఈ రెండు కారణముల వలన అదియొక పుణ్యక్షేత్రంగా పరిగణింపబడుతోంది. ఈ సమీపమునందుగల కొండ లలో నర్మదానది జన్మస్థానం ఉంది. ఈ నర్మదానదీ తీరమున పూర్వకాలములో మునులు, ఋషులు తపోధ్యాన నిమగ్నులై దీర్ఘకాలం వాసం చేసారు. సంవత్సరం పొడుగునా యీ సంగమంలో నదీ స్నానానికి సాధుసన్యాసులు వస్తూనే ఉంటారు. బాబా అక్కడఉన్నా కొద్దికాలంలోను ఆవూరి వారందరికీ బాబా వచ్చారని తెలియుట చేత అనేకమంది వారి దర్శనార్థం వచ్చారు. ఎప్పుడో ఒకప్పుడు ఒక మహాను భావుడు యిక్కడికి తప్పక రాగలడనే ఈ ఊరివారి నమ్మకం. యిప్పుడు నిజమయి నది. ఈ శుభతరుణం కోసం మండ్ల ప్రజలు చాలాకాలము నుండియు నిరీక్షిస్తు న్నారు.

1939వ సం. జనవరి మాసంలో సబ్బుల్‌బువా అనే మంచి మస్తును బాబా మండ్లలో సాంగత్యం చేసారు. అతడు నూటికి 90 పాళ్లు ఇత్తెఫాకే మస్తు. అతనిలో జమాలీ జలాలీ లక్షణములు కూడా ఉన్నవి. అతడు పొట్టిగ ఉండేవాడు. సబ్బుల్‌బువా గోనిగుడ్డ నడుముకు చుట్టుకునేవాడు. అది తప్ప అతడు దిగంబరుడు గా తిరిగేవాడు. ఇతనివద్ద ఇనుపగొలుసులు, తీగలు, తాళములు పాతఎముకలు యింకా ఎన్నో యిలాంటివి తన శరీరానికి తగిలించుకునేవాడు. అతని మొలకు గోనిగుడ్డతో బాటు కొన్ని మూటలు, కొడవళ్ళు వేళ్లాడేలా కట్టుకునేవాడు. అతని భుజం మీద గునపం ఒకటి మోస్తూ ఉండేవాడు. దానిని ఉర్దూలో సబల్ అంటారు. అందుకే అతనిని సబల్ బువా అని పిలిచేవారు. ఆ ఊరిప్రజలు అతనికోసం నిర్మించిన ఒక గుడిసెలో అతడు నివసించేవాడు. ఆ గుడిసె ఒక చెట్టు క్రింద ఉండేడిది. ఆ ఊరివారే ఆ గుడిసె శుభ్రంగా తుడిచి అతనికి ఆహారం తెచ్చి పెట్టేవారు. సబ్బుల్‌బువా ఆ దారిన వెళ్లివారిని రమ్మని పిలిచేవాడు. వాళ్ళు వచ్చి కూర్చొనేవారు. తరువాత అతడు వారిని తిట్టేవాడు. వాళ్లని డబ్బు అడిగే వాడు. వాళ్లెవరయినా అతనికి డబ్బు యిస్తే ఒక పుస్తకంలో వ్రాసి సంతకం చేయుమనేవాడు. ఒక శిష్యునికి యీ పుస్తకం వ్రాయమని అప్పగించాడు. ఇలా చేసి పెట్టినందుకు నర్మదానది నుండి తెచ్చిన నీటిని త్రాగమని యిచ్చేవాడు. ఇదివరలో సబ్బుల్‌బువా మండ్లలో ఒక కోర్టులో బంట్రోతుగా పనిచేసాడు. యీ పుస్తకం పెట్టడంలో కూడా అతడు ఉద్యోగం చేసినవాటి జ్ఞాపక చిహ్నంగా మిగిలింది.

బాబా నర్మదానది ఎంతెన మీదుగా ఒకరోజున కారులో వెళ్తూఉండగా నబ్బుల్‌బువా కారు ఆపగా అప్పుడు బాబా అతనితో సాంగత్యం చేసారు. వంతెన వద్ద నిలబడి వచ్చేపోయేకార్లను ఆపటం అతని అలవాటు.

మండ్లా నుంచి జబల్‌పూర్ తిరిగివచ్చిన తరువాత ఒకనాడు ఒక మోటారు కారులో ఒక పెద్దమనిషి వచ్చి బాబాను దర్శించాలని పట్టుబట్టాడు. ఆ కారు ఆగిన యింటిలో అప్పుడు బాబా నివసించుట లేదు. బాబా యొక్క మండలి ఆ కారు ఆగిన యింటిలో అప్పుడు బాబా నివసించుట లేదు. బాబా యొక్క మండలి ఉన్నారు. అది రాత్రి సమయం అవడంచేత యిప్పుడు బాబాని దర్శించుటకు వీలుకాదని మండలి అతనికి చెప్పారు. అప్పటికి వెళ్ళిపోయి అతను మర్నాడు ఉదయాన్నే తిరిగి వచ్చాడు. బాబాతో ముఖ్యమయిన పని ఉందనికూడా అతడు చెప్పాడు. అయినా ఏకారణంచేతనో వెంటనే బాబాను దర్శించుటకు వీలులేక కొంచెం సేపయిన తరువాత రమ్మని చెప్పారు. బాబా హైదరాబాద్ నుండి ప్రత్యేకంగా ఒకరికోసం జబల్‌పూర్‌కి వెళ్తున్నానని చెప్పారు. బాబాను దర్శించవలెననెడి కాంక్ష ఆ మనిషియందు ఎంత బలంగా ఉందో అని పరీక్షిస్తున్నట్లుగా రెండుసార్లు పైన చెప్పినట్లు 'మరల రండి' అని బాబా మండలి అతనికి చెప్పారు. చెప్పిన ప్రకారం. బాబాను, అతడు వచ్చి దర్శించినపుడు బాబాతో యిట్లు విన్నవించుకున్నాడు "బాబా! తమరు మండ్లా వచ్చినరోజున నేనక్కడలేను. నేను తిరిగి అక్కడకు రాగానే తమరు జబల్ ర్పూవెళ్లారని నాకు తెలిసింది. వెంటనే తమ దర్శనము చేయువలెనని యిక్కడకు వచ్చాను. తమరు ఉద్దేశించిన విశ్వకేంద్రస్థాపనకు అనువయిన స్థలమును నేను తమకు సమర్పించదలచితిని. తమరు అంగీకరించవలెనని నా ప్రార్థన" బాబా యీ మాటలు విని సంతోషించారు. అనతికాలముననే దానపట్టా దస్తావేజు వ్రాయించారు.

బాబా ఒకసారు "విద్యుచ్ఛక్తి కేంద్రము (పవర్‌హౌస్) ఊరిబయట ఏకాంతస్థలమున ఉంటుంది. కానీ అది ఊరంతా వెలుగు యిస్తుంది. బాబా యే ఆ కాంతి కేంద్రము." అని చెప్పారు. భగవంతుని సన్నిధి నుండి తిన్నగావచ్చు ఆధ్యాత్మిక శక్తికి బాబా ప్రపంచమంతటికీ ప్రసరింప చేస్తారు. జబల్‌పూర్‌లో ఉన్నపుడు కూడా బాబా తమ శిష్యమండలికి యివ్వవలసిన శిక్షణ యిస్తూనే ఉండేవారు. వారానికి రెండు మూడు ఆధ్యాత్మిక ప్రసంగములు చేసి, విన్నవారిని ఉత్తేజ పరచవచ్చును. కానీ బాబా అలా చేయరు. ఈ ప్రసంగముల వలన కలిగిన మంచి

ఏదో ఒక చిన్న సంఘటన వలన అంతా పోవచ్చును. అందుచేత బాబా అట్లుచేయక జీవితమనే ఒక ఆదర్శమయిన దృష్టాంతముగా కనబరచి మానవులు చిన్న సంఘటనల వెనుక వున్న ఆధ్యాత్మిక సత్యములను తెలుసుకొనేలా చేస్తారు. బాబా ఆ విధంగా చేయకపోయినచో అవే భగవద్దర్శనమునకుఅడ్డుతెరలలా ఏర్పడుతాయి. బాబా అను సరించే విధానము నందు ఆధ్యాత్మికోత్తేజము కలిగి మళ్లీ దిగజారి పోవడ మనునది ఉండదు.

ఒకరోజున యిద్దరి శిష్యులమధ్య ఏదో తగాదా వచ్చింది. కొంత సేపు పేచీ పడ్డారు. ఇద్దరూ బాబా వద్దకు వచ్చారు. అప్పుడు బాబా వారికి యీ విధంగా హితభోధ చేసారు. ''యోగములు, ధ్యానములు ఎన్ని అభ్యాసం చేసినప్పటికీ బాబా మీకు దైనందిన జీవితం ద్వారా బోధించినట్లు చెప్పజాలను. ఈ జీవితం ద్వారా మీరు నేర్చేది:-మిమ్ములను తిరస్కరించి అపకారం చేసినవారి యెడల దయగా ఉండడం, మీకు యిష్టంలేనివారిని ప్రేమించడం, యిదే అన్నిటికన్న ఉతమమైన సాధన. క్రీస్తును అపహసించి, నిరసించి, అతనిపై ఉమ్మివేసి అగౌరవపరచినా క్రీస్తుకి కోపం రాలేదు. అతని అపారమైన శక్తిని అతడు ఉపయోగించలేదు. కానీ అతడు చూపిన ప్రతీకారమల్లా వారిని ప్రేమించుటయే. ఇతరులెవరైనా మీకు అగౌరవ కలిగేలా మీ యెడల ప్రవర్తించినపుడు మీకు అటువంటి అవకాశం కలిగినందుకు మీరు నిజంగా సంతోషించాలి. అప్పుడే మీరు ఆ బాధను సహించాలి.అది కలుగ జేసినవారిని ప్రేమించాలి. మీరు బాబాతో ఉన్నందునవలన మీ అహంకారము నిర్మూలం కావాలి'' అని బాబా వివరించారు.

1939వ సం. ప్రారంభము నందు ఉపాసనీ మహారాజ్ తన శిష్యులతో ఈ జబల్‌పూర్ ప్రాంతమునందే పర్యటించు చుండెను. ఆ దారినే మహారాజ్ సాకోరీ తిరిగి వెళ్తూ తన శిష్యునొకనిని పిలిచి''నేను తన గృహము ద్వారా వెళ్లియుంటినని మెర్వాన్‌తో చెప్పు'' అని ఆ శిష్యుని బాబా వద్దకు బంపెను. ఇందులోని అంత రార్ధము ఆ సద్గురునికీ, యీ అవతారునికే తెలియవలెను. మహత్తర మయిన ఆధ్యాత్మిక శక్తుల కలయిక ప్రపంచమునకే మహోపకారముగా పరిణమించును

## కాశీ ఆగమనము

జబల్‌పూర్ నుండి శిష్యులతో కలసి వారణాసి వెళ్తూ బాబా కట్నీ వెళ్లారు. అక్కడ బాబా బసచేసిన గదిలోనే అంతకుముందే ఉపాసనీమహరాజ్ ఉండి వెళ్లారని.

తెలిసినది. పుణ్యభూమి అయిన భారతదేశమునందలి క్షేత్రము లన్నిటికీ శిరోభూష ణము వంటిది పుణ్యక్షేత్రమయిన కాశీ. ఆధ్యాత్మిక సార్వభౌముడైన మెహెర్‌బాబా యీ నగరమునకు తీసికొని వెళ్లిన ఆ శిష్యమండలి బాబాతో అక్కడికి వెళ్లడానికి ఎంత పుణ్యము చేసుకున్నారోకదా!

కాశీక్షేత్రమునందు పావన గంగా జలమునందు గ్రుంకులిడుటకు అనేక మంది వారి పాపపరిహారమునకై వస్తూంటారు. అనేకమంది విశ్వేశ్వర దర్శనమునకు వచ్చిన పుణ్యాత్ములుందురు. "నీ తీరమునందలి ఒక వృక్షము యొక్క తొర్రలో నివసిస్తున్న పక్షి నయం మానవులమని విర్రవీగుతూ జన్మలో నీపావన తోయము లందు స్నానం చేయని వారికంటే, నీ నీటిలో ఆడుకొనుచుండే చేపలు, తాబేళ్లు నయం నీలో స్నానం చేసుకుని జన్మ సార్థకపరచుకొనని మానవుల కంటె" అని ఒక మహాకవి గానం చేసాడు. ఒక యువకుడు 80 సంవత్సరములు దాటిన వయసుగల తన నాయనమ్మను, రోగిష్టియై పక్షవాతముతో పడిపోయిన ముసలమ్మను 400 మైళ్ల దూరము నుంచి తన వీపుమీద మోసుకుని మజిలీలు చేసుకుంటూ కొన్ని మాసములకు తీసికొని వచ్చి. ఆమెకు గల మహత్తరమయిన కాశీ దర్శనమను కోరికను తీర్చుటలో కృతకృత్యుడయ్యాడు. ఆ ముదుసలి కాశీక్షేత్రమునకు చేరగానే అక్కడి గంగానది పవిత్ర తోయమందు స్నానము చేసి, కాశీ విశ్వేశ్వరుని దర్శనం చేసుకొనగానే ఆమె హృదయము నందు నిండిన సంతృప్తి, ఆమె వదనము నందు ద్యోతకమయిన అపూర్వానందము దేవతలకయినా వర్ణించ సాధ్యము కాదు. విశ్వేశ్వరుడే ఆమె హృదయంలో ప్రవేశించి యుండవోపు. కేవలము గంగాస్నానమే కాక, ఆ పుణ్యస్థలమందలి ఆధ్యాత్మిక వాతావరణము అంత గొప్పది. ఎటువంటి వారినయినా భగవంతునికి సన్నిహితులను చేస్తుంది. పాశ్చాత్య దేశాలలో [illegible] యుండు సెయింట్ ఫ్రాన్సిస్ అను మహాభక్తుడుండిన 'అస్సిసి' అను క్షేత్రమునందు కూడా వాతావరణము గొప్ప ఆధ్యాత్మిక శక్తితో నిండియుండును" అని బాబా ఒకసారు సెలవిచ్చారు. కాశీలో కాలిడగానే బాబా వారి పరివారముతో యిట్లు చెప్పారు:— "మహాపురుషులు యిక్కడికి వచ్చి వెళ్లారు—రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, శంకరుడు—వీరందరూ వారి జీవితములందు కాశీని దర్శించారు." కొన్ని సంవత్సరములకు పూర్వము నుండియు భారతదేశము నందు కాశీ ప్రధాన పుణ్య క్షేత్రముగా విలసిల్లినది.

ఆరోజు జనవరి (1939) 21వ తేదీ. ఆనాడు బాబా వారణాసిలో వారి మండలిని గంగాతీరములోని దశాశ్వమేధఘట్టమునకు తీసికొని వెళ్ళారు. ఈ ఘట్టంలో శవదహనములు చేస్తారు. తదనంతరం అపర కర్మలు కూడా చేస్తాంటారు. 'హరిహర్‌బాబా' అనే ముసలి వృద్ధుడు, గుడ్డివాడు. ఇతడు దశాశ్వమేధ ఘట్టంలో ఒక పడవ మీద కూర్చుని ఉన్నాడు. కాశీకి ఆధ్యాత్మిక పరిపాలకుడు. బాబా తన మండలిలోని కాకాను, నౌకీనాను అతని వద్దకు పంపి మెహెర్‌బాబా రమ్మంటున్నారని కబురు చేసారు. ఆ పిలుపు అందుకొనిన వెంటనే హరిహర్‌బాబా మెహెర్! మెహెర్! మెహెర్! అని భక్తిపూరితమయిన కంఠముతో ఉచ్చరించాడు. తరువాత అతడు బాబా వద్దకు రాగా, బాబా అతని సాంగత్యము చేసారు.

బాబా గంగానదిలో నావలో శిష్యులతో వెళ్తూ ఒకరోజు "ఈ మహానగరము నందు నిజమయిన పుణ్యపురుషులు సత్పురుషులు లేని కాలమే లేదు. మత గురువులు, పురోహితులు, పండాలు యాత్రికుల డబ్బును కాజేయుటకు ఎప్పుడూ సిద్ధముగా నుండి వారికని నిత్యమూ వారు చేయుచుండినను యీ క్షేత్రము యొక్క ఆధ్యాత్మిక వాతావరణమును మాత్రము పాడుచేయలేక పోయారు" అని చెప్పారు. అప్పుడు ఒక శిష్యుడు "అయితే బాబా! నిజమైన భక్తులు యీ పురోహితులు, పండాలు వీళ్ల చేతులలో పడి మోసపోవుట కంటె అసలు నమ్మకము లేకుండా యుండుట మంచిది కాదా?" అని యడుగగా, బాబా "సత్యము మీద ఆధారపడిన నమ్మకము 'అసలు నమ్మకము లేకుండుట కంటే మేలుకదా'. తప్పు దారిన నడచి అందులో నుంచి సరియయిన మార్గమునకు వచ్చుట' అసలు నడవకుండుట కంటె మేలు కదా'. ఆధ్యాత్మికముగా ముఖ్యమయినది నమ్మకమే. ఆ నమ్మకమే ప్రేమగా పరిణమించినపుడు ఇంక నమ్మకముతో పని లేదు" అన్నారు.

ఇక్కడి రేవులలో ఎల్లపుడు ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందిన ఆత్మలు ఉండనే ఉంటారు. ఆరోజునే బాబా ఒక సాధువుని చూసి ఒక అణా అతనికి యిచ్చారు. ఆనాణెం యివ్వడం మూలంగా బాబా అతనిని మొదటి భూమిక నుండి రెండవ భూమికలోనికి తీసికొని వెళ్లారు. ఇలాగే ఆరోజున యింకా ముగ్గురు నల్గురు సాధువులకు నాణాలిచ్చి వారికి ఆధ్యాత్మిక ప్రగతి కలిగించారు బాబా.

"అనేక సంవత్సరముల నుంచి యీ కాశీనే నివాసస్థలముగా చేసుకున్న వారున్నారు. బాబా వీరిని మౌనంగా ఉన్న భగవత్సేవకులు అన్నారు. వీరివలననే

ఆధ్యాత్మిక జ్యోతి కొడిగట్టకుండా యిక్కడ వెలుగుతోంది. సాధారణంగా ప్రజలు వారిని కనుగొనలేరు.. ప్రజలు సాధారణంగా వెళ్లని స్థలములలో వారు ఉంటారు. నేను వారిని వెదకి చూడటానికే వచ్చి యున్నాను'' అని బాబా వివరించి చెప్పారు. ఒక శిష్యుడు ''బాబా! మీరు వాళ్ల దగ్గరికి వెళ్లడమెందుకు? వారు ఆధ్యాత్మికంగా అభివృద్ధి పొందిన వాళ్లేకదా కావాలంటే వారే మీ దగ్గరకు రాగలరు'' అన్నాడు. అప్పుడు బాబా '' అవును వారు నన్ను యిదివరకే ఎరుగుదురు అయినా నేను వచ్చినది నాపనికోసం. వారి పనికోసం కాదు. అందుచేత నేనే వెళ్లాలి'' అని బాబా చెప్పారు.

''బుద్ధుడు సర్వము త్యాగము చేసి భగవత్సాక్షాత్కారం పొంది తన శిష్యులకు ప్రథమముగా బోధచేసినది యిక్కడే. ఇక్కడ 8 మైళ్ల దూరంలో ఉన్న సారనాథ్ లో అతని జ్ఞాపకార్థము అనేక చిహ్నాలున్నాయి. నాకన్నీ యింకా జ్ఞాపకమున్నాయి'' అని తమ బుద్ధావతార విశేషముల గురించి బాబా వ్యాఖ్యానించారు.

ఒకరోజున వారణాసిలో ఒకరి యింటికి వెళ్ల ఆశీర్వదించడానికి బాబా తమతో కొద్దిమంది శిష్యులను కూడా తీసికొని వెళ్లారు. వారిలో నరీనా లాంటి పాశ్చాత్యులు కూడా ఉన్నారు. వారు అప్పుడు చూడబోవుచున్నది ఒక సాధువునని బాబా వారితో చెప్పారు. గంగానది ఒడ్డునే నడుస్తూ ''వీరంతా నమ్మకం బాగా ఉన్నవారే. కానీ వాళ్లు భయస్థులు. అందుచేతనే యీ నది నీరంటే చాలా గౌరవిస్తారు. వారికి దివ్యానుగ్రహాన్ని కలుగచేస్తాను. ప్రతిమలలోను కర్మకాండల లోను కనిపించే వారి మూఢభక్తిని సడలించడానికి ధైర్యం కలుగ చేస్తాను'' అని చెప్తూ గంగా తీరాన్ని కర్మకలాపంలో నిమగ్నమయి యున్న యాత్రికుల ప్రక్కనుంచి నడచి వెళ్లారు బాబా. ఆ యాత్రికులు కష్టపడి కూడబెట్టుకున్న డబ్బును ఆ కర్మ చేయించే వారికి ధారపోస్తారు. అక్కడి ప్రజలలో అన్ని రకాలవారు ఉన్నారు-- మంచివారు, చెడ్డవారు, అమాయకులు.

వెళ్తూ వెళ్తూ అకస్మాత్తుగ బాబా ఒకని యెదుట నిలబడ్డారు. బాబా అతను మామూలు మనిషిలాగే కనిపించాడు. కాని బాబా ఆ విధంగా కనిపించా రంటే, అతని వద్ద నిలబడి, అందులో ముఖ్యమయిన కారణం ఉండకుండా ఉండదు. బాబా శిష్యులతో 'అతనికి ఒక పావలా యిమ్మని' చెప్పారు. బాబా చెప్పినట్లు వారు చేసారు. బాబా అతనిని అధిగమించి ముందుకు పోతూ శిష్యులతో ''ఇతనిని మొదటి

భూమికలో నుండి రెండవభూమికలోనికి తీసికొని వెళ్ళాను. ఆధ్యాత్మిక మార్గంలో అతనికి అభివృద్ధి కలిగింది'' అన్నారు.

బాబా వడిగా నడవడం ప్రారంభించేసరికి శిష్యులు కూడా ఆయనతో నడవ లేక పోయారు. తీరాన్ని నిలబడి బాబా ఒక పడవ వైపు చూపించారు. అది ఒక విధమైన బల్లకట్టు. ఒడ్డున లంగరు వేయుబడి ఉంది. ఆ సమీపంలో అజాను బాహువయిన ఒక మానవుడు భగవంతుని ధ్యానం చేస్తూ కూర్చుని యున్నాడు. అక్కడ కొద్దిమంది యువకులు ఒక స్రీ కూడా కూర్చుని ఉన్నారు. అతడు ఎన్నో జన్మలు స్వార్థరహితంగా అహంకారం లేకుండా గడిపాడు' అని బాబా చెప్తూ ''ఇతనిని యిక్కడ ఒక సాధు పురుషుడుగా గౌరవిస్తారు' అన్నారు. ఇతనిలాంటి సత్పురుషుడు ఆత్మ త్యాగం చేయడం లోనే ఆత్మసాక్షాత్కారం పొందుతాడు. ఆ రోజున ఆ సాధువు తపం పండింది. అతనిని బాబా ఉన్నత భూమికకు గొంపోయారు. బాబా శిష్యులతో ''ఈ గంగానదికి ఈవలి ఒడ్డున ఒకడు, ఆవలిఒడ్డున ఒకడు నా ప్రతి నిధులు ఉన్నారు. అదిగో అతని వద్దకు వెళ్లి నాపేరు ఉచ్చరించు తెలుస్తుంది' అని బాబా ఒకనిని ఒక శిష్యునికి చూపించారు. ఆమాట చెప్పి బాబా అక్కడే కదల కుండా నిలబడి యున్నారు. ఆ శిష్యుడు యితరులతో కూడా వెళ్లి ఆసాధువు యెదుట నిలబడ్డాడు. అంతట ఆసాధువు ''మెహెర్! మెహెర్! మెహెక్! అని మూడుమారులు బాబా పేరు ఉచ్చరించాడు. శిష్యుడు ఏమీ చెప్పకుండానే ఆ సాధువు ప్రభువు పేరు ఉచ్చరించాడు. అతడే వారణాసిలో బాబా యొక్క ప్రతినిధి. ''ఇతనిని నేను అనంత పరమాత్మయే తానను స్థితికి తీసికొని వెళ్లాను. నేను ఈ అనంత సృష్టిలో అందరినీ ఒకరుగానే చూస్తున్నాను. అందరిలోను ఉన్న నన్ను మీరు ప్రేమించండి'' అని బాబా అన్నారు.

కాశి వదలి, శిష్యబృందముతో బాబా ఆగ్రా నగరమునకు బయలుదేరారు దారిలో ఒకచోట ఒక కొంటెపిల్లవాడు ఉండేలబద్దతో ఒక వడ్రంగి పిట్టను కొట్టి క్రింద పడేసాడు. అదిచూసి బాబా ఒక శిష్యునిచేత ఆపిట్టను వారి వద్దకు తెప్పిం చుకుని, బాబా దానికి ఉపచారం చేసారు. దానికి తగిలిన దెబ్బకి మందు వేసి కట్టు కట్టించారు. బాబా ఆపిట్టను ఒడిలో పెట్టుకొని ఎంతో దయతో దానిని చేతితో నిమిరి దానికి ఆహారం కూడా పెట్టారు. పాపం! యింత ఉపచారం చేసినా ఆపిట్ట

బతుకలేదు. దానిని ఒక పెట్టెలో పెట్టి ఉంచితే ఎలాగో వెలుపలకు వచ్చి బాబా పాదముల వద్ద ప్రాణములు విడిచినది. దానిని ఎత్తి పట్టుకుని మండలికి చూపిస్తూ బాబా యిలా అన్నారు. "ఇది ఎంత అదృష్టం చేసుకుందో మీకు తెలియదు. ఇది తిన్నగా మానవజన్మ ఎత్తుతుంది" అని చెప్పారు. అపారకరుణామయు డయిన బాబా దానికి యీ విధంగా ఉత్తమజన్మ కలిగించారు.

ఆగ్రా నగరం చేరుకుని బాబా, వారి శిష్యులు తాజ్‌మహల్‌కు సమీపమున గల బంగళాలలో విడిది చేసారు. మానవప్రేమ సృష్టించిన సౌందర్యానికి శాశ్వతము, అతిలోకపు అయిన దివ్య సౌందర్యానికి ఉన్న తేడా గురించి బాబా శిష్యులకు ప్రసంగ వశాత్తు చెప్పారు.

ఆగ్రాకు 20 మైళ్ల దూరంలో జనవరి ఆఖరివారంలో పర్యటిస్తూ 28వ తేదీకి బాబా మధుర, బృందావన్‌కి వచ్చారు. అనేక వేలసంవత్సరముల క్రితం బాబా తమ పూర్వావతారంలో శ్రీకృష్ణ పరమాత్మగా సంచారం చేసిన పుణ్యస్థలాలివి. ఇప్పటికీ అక్కడ శ్రీకృష్ణ లీలలు ప్రత్యక్షముగా నాటకరూపంలో ప్రదర్శిస్తూ ఉంటారు. మధుర, బృందావన్ నగరములలో శ్రీకృష్ణుడు విహరించిన స్థలములు అతడు గోపికాస్త్రీలతో రాసక్రీడ సలిపిన వనములు, గోపబాలురతో ఆటలాడిన చోట్లు, భువన మోహనంగా మురళి వాయించిన ప్రదేశములు అన్నీ బాబా వారి శిష్యులకు చూపించారు. అక్కడ ఒకచోట యమునానది సోపానాల మీద ఒక విదూషకుని వలె టోపీ ధరించిన ఒక మనిషి మనోహరముగా వేణువు నూదుచుండెను. అతడు వాల్ట్‌డిజ్నీ సినిమాలో 'ఏడుగురు మరుగుజ్జుల' లోని డోపీని బోలియున్నాడు. బాబాను చూడగానే అతడు పిల్లనగ్రోవి వాయించుట మాని అక్కడ ఉన్నవారందరూ వినునట్లు "అదుగో వేణుగోపాలుడు వచ్చాడు" అని అతడు బాబా వెంటబడెను. అతనికేమీ యిచ్చినా పుచ్చుకొనలేదు. కొంతసేపు అతడు మురళి వాయిస్తూ నాట్యం చేసాడు. అంతలో మరల బాబాను చూసి మురళి వాయించుట చాలించి బాబా చేయి పుచ్చుకొని ప్రక్కన నడుస్తూ ఆనందముతో ఏవో పద్యములు చదివెను. బాబా అతనిని చూపిస్తూ "ఇతని కోసమే నేను ఈ రోజున యిక్కడికి వచ్చాను. ఇతడు చాలా పరిణతి పొందిన ఆత్మ. ఇతడు నానిజమైన ప్రేమికుడు. ఈ మనిషి మూడవ భూమికలో ఉన్నాడు. బాబా అతనితో ఏవో సౌంజ్ఞల ద్వారా సాంగత్యము

చేసారు. బాబా తన శిష్యబృందముతో బస్సులో ఎక్కుచుండగా ఆ మస్తు ఆనందాతిరేకముతో నృత్యము చేయుచుండెను. అతనిని 'ఏదయినా కావాలా?'' అని అడుగగా ఆమస్తు 'నాకేమీ వద్దని' చెప్పెను. ఆతడు అవతారపురుషుని గుర్తించుటయే కాక ఆయనతో మాట్లాడి, ఆయన అంతరంగ కార్యమునందు పాల్గొనినట్లు స్పష్టమయినది. మధుర, బృందావన్ నగరములు పర్యటించి బాబా ఢిల్లీకి బయలుదేరారు.

## ఢిల్లీలో బాబా

ఢిల్లీకి వెళ్తూండగా బాబా తమ శిష్యులతో ''ఢిల్లీలో మీరొక సాధు పురుషుని చూడగలరు. అతడు నాఆధ్యాత్మిక ప్రతినిధులలో ఒకడు'' అని చెప్పారు.

ఢిల్లీ చేరుకుని అక్కడ బాబా మస్తు అన్వేషణ చేస్తున్నారు. ఢిల్లీలో బాబా పర్యటిస్తుండగా ఒకనాడు నగరపరిసరములలో ఉన్న కుతుబ్‌మినార్ వద్దకు వెళ్లారు. దానిని గురించి బాబా ''కుతుబ్‌మినార్ యీ రోజులలో ప్రాముఖ్యత కలిగియున్నది. ఈ భౌలిక లోకమునందే కాక సూక్ష్మలోకంలో కూడా యిది ప్రముఖమైన పాత్ర వహిస్తున్నది.'' అని చెప్పారు. అక్కడినుండి బాబా శిష్యులతో బసకి వెళ్తూ బస్సును ఒకచోట ఆపించారు. అక్కడ హజ్రత్ నిజాముద్దీన్ దర్గా ఉంది. నిజాముద్దీన్ 14వ శతాబ్దము నందుండిన ఒక సాధుపురుషుడు. ఇప్పటికీ అసంఖ్యాకులగు యాత్రీకులు అతని సమాధికి వచ్చి పోతూంటారు. ఆ సాధువు నివసించిన స్థలమును కూడా బాబా చూపించారు. నిజాముద్దీన్ దర్గా సమీపమునందే మరియొక సమాధి ఉంది. అది మొగల్ చక్రవర్తి అయిన షాజహాన్ యొక్క కుమార్తె జహనారాది. ఆమె మహారాణివాసపు భోగములను విడనాడి హజ్రత్ నిజాముద్దీన్ యొక్క శిష్యురాలయినది. వైరాగ్యముతో అంతా త్యాగం చేసినది. ఆమె 'తన గోరికి ఎటువంటి ఆడంబరమయిన అలంకారములు చేయవద్దనీ, పుష్పాలు కూడా అస్థలమున వేయవద్దనీ, తనకు ఆధ్యాత్మిక గురువయిన నిజాముద్దీన్ సమాధికి సమీపమున తన శరీరమును ఖననము చేయవలసినదనియు' ఆమె చెప్పెను. అందుచేత ఆమె గోరీమీద మట్టివేసి దానిమీద పచ్చగడ్డిని మాత్రం మొలిపిస్తున్నారు.

బాబా నిజాముద్దీన్ దర్గానుండి ఒక సందులోనికి శిష్యులనందరినీ తీసికొని వెళ్లారు. అక్కడ ఒక పెద్ద ఆవరణలో ఒక చిన్నగది ఉంది. ఆగదిలో ఒక

వృద్ధుడు ఉన్నాడు. అతడు తెల్లని గడ్డము కలిగి అసాధారణ తేజోవంతమయిన నేత్రాలతో నొప్పారుచుండెను. తలుపు తీసిన వెంటనే వెలుగు కిరణములు పడుటచే ఆతని వదనమును బాగుగా చూచుటకు వీలయ్యెను. ఆతని ముఖము—అతడొక మహాత్ముడని చెప్పక చెప్పుచుండెను. అతడొక ప్రవక్తవలె నుండెను. ఆతడు బాబాను చూడగానే ఆయనను గుర్తించినట్లు ఆతని ముఖము వికాసభాసురమయ్యెను. బాబా నోవము నందు చర్మచక్షువులకు గోచరము కాని దివ్యస్వరూపమును ఆ మహాను భావుడు తిలకించి యుండనోపు. బాబా అచటినుండి వెలుపలకు వచ్చిన తరువాత "ఈ జిల్లాకతడు ఆధ్యాత్మిక రక్షకుడు. ఈ కొద్ది సాంగత్యము నందు నేను అతనిని ఆధ్యాత్మికముగా ఒక మెట్టుపైకి నెక్కించియున్నాను" అన్నారు.

బాబా తమ పరివారంతో ఢిల్లీలో పదిరోజులు ఉండాలని అనుకున్నారు. కానీ, ఒకటి రెండు రోజుల అనంతరం బాబాకి యింక అక్కడ ఉండాలనిపించలేదు. హజ్రత్ నిజాముద్దీన్ సమాధి వద్దనే బాబా వేరొక మహాత్ముని కలిసారు. ఇతడు ఒక చిన్నగదిలో ఒక దుప్పటి కప్పుకొని కూర్చున్నాడు. ఇతడు పొడవుగా ఉన్నా ఒక మధ్యవయస్కుడు. ఇతడు ఆరవభూమికలోని ఉత్తీర్ణుడయిన యాత్రికుడు" అని బాబా చెప్పారు. ఇతని పేరు కంబల్‌పోష్ బాబా. ఫిబ్రవరి (1939) 6వ తేదీన బాబా యీతని సాంగత్యం చేసారు. నిజాముద్దీన్ దర్గాకి బాబా వారి స్త్రీమండలిని తీసికొని వెళ్లినపుడు యీ యాత్రికుని వారికి చూపారు. ఇతనిని చూసి వారు ఆశ్చర పోయారు. హజ్రత్‌సాహెబ్ దర్గా ఇండియాలోని ఒక గొప్ప మహాత్ముని సమాధికి తగినట్లుగా మనోహరంగా నిర్మింపబడి యుండెను. అందుకు తగినట్లుగా కంబల్‌పోష్ బాబా అక్కడే నివసించడం సముచితంగానే ఉంది. అతనికి 8, 10 మంది శిష్యులు కూడా ఉన్నారు.

ఒకరోజున బాబాతో వారి శిష్యులంతా ఢిల్లీ వీధులలో బస్సు వెళ్తుంటే నగరం మధ్య ప్రదేశంలోని జుమ్మా మసీదు మెట్లమీద ఒక నడి వయస్కుడయిన మస్తును చూసారు. జుమ్మా మసీదు ఢిల్లీలో కెల్లా పెద్ద మసీదు. అది మొగల్ సార్వభౌముడు షాజహాన్ కట్టించాడు. తాజ్‌మహల్ కట్టించిన వాడు కూడా యితడే. బాబా తమ బస్సును జుమ్మామసీదు మెట్లవద్దకి పోనిచ్చారు. అక్కడ అనేక మంది పేదవారు, కుంటివారు యింకా అనేక విధము

లయిన వికలాంగులు ఉన్నారు. వారిలో చింకి బట్టలులో ఉన్న ఒకడు బాబాని ఆకర్షించాడు. వెంటనే బాబా బస్సుని ఆపించి అతని వైపు క్షణమాత్రం చూసి ఎవరూ దిగకుండానే బస్సును బసకి తిరిగి పోనిమ్మని, బసకి వచ్చిన తరువాత యిద్దరు శిష్యులను ఆమసీదు వద్దకు పంపి, 'యింతకు ముందు బాబా చూసిన మస్తుని గొనిరమ్మని' చెప్పారు. వారు మసీదుకి వచ్చి చూసినపుడు బాబా వర్ణించిన వ్యక్తిని పోల్చుకొనుట వారికి కష్టమయ్యెను. అందరికీ కూడా బాబా చెప్పిన చినిగిన బట్టలు, గడ్డము, నల్లటిజుట్టు ఉన్నాయి. ఇదివరకు యీ మస్తుల అన్వేషణలో ఆరితేరి మెహెరాబాద్‌కి అనేకమంది మస్తులను వెదకి తీసికొని వచ్చిన అనుభవజ్ఞులు గనుక అక్కడ ఉన్నవారిలో యిద్దరిపై వారి దృష్టిని కేంద్రీకరించి ఒకనిని పలుకరించి మాట్లాడగా అతడు 'పదవిని ధనమును పోగొట్టుకున్న అభాగ్యుడ'నని విచారము వ్యక్తపరచెను. రెండవ వానితో మాట్లాడగా అన్నిప్రశ్నలకు అతని జవాబు భగవన్నామమే. అందుచేత యితనినే బాబా వద్దకు తీసికొని వెళ్ళారు. అతడు బాబా వద్దకు వెళ్తూండగా కాళ్ళమీద నిలబడలేక పోయెను. అందుచేత మండలి అందుచేత మండలి అతనిని సాయంపట్టి బాబా వద్ద కూర్చోబెట్టారు. బాబా అతనికి స్నానం చేయించారు. బాహ్యంగా పోసిన నీరు అతని శరీరమాలిన్యం పోగొడుతుంది. బాబా స్వయంగా అతనిని స్పృజించినపుడు అతనిలో అంతః శుచిని కలుగజేసి ఆధ్యాత్మికంగా మార్పు తీసికొని వస్తుంది. స్నానం అయిన తరువాత ఆమస్తు "ఈ రోజున నేను భగవంతుని చూసాను' అని ఆనందిస్తూ అనుక్షణమూ భగవన్నామమును ఉచ్చరించాడు. ఈ సాంగత్యము అయిన తరువాత బాబా యీమస్తును మరల బయుట ప్రపంచంలోనికి పంపేముందు క్రొత్తబట్టలు తొడిగి భోజనం పెట్టి పంపించారు.

బాబా ఢిల్లీలో ఉన్నప్పుడు సింధు, పంజాబు, కాశ్మీరు దేశములు వెళ్దామని మండలితో చెప్పారు. కొద్దిరోజులు పోయిన తరువాత బాబా ఆ ప్రయాణములు మానేసి దక్షిణమునకు వెళ్లుటకు నిశ్చయించారు. 'ఎక్కడయితే అవసరమయిన పని ఉందో అక్కడికే వెళ్దామని' బాబా అన్నారు. దక్షిణమునకు వెళ్తూ బాబా తమ మండలి అందరిని రాజస్థాన్‌లోని జైపూర్‌కి తీసికొని వెళ్ళారు. ప్రాచీనము, చారిత్రాత్మకము, సుందరము అయిన నగరములలో జైపూర్ అతి ముఖ్యమయినది. అక్కడ ఉన్నప్పుడు బాబా ఏకాంతంగా గడిపారు. మండలి-అందరికీ-స్త్రీలకు, పురు

షులకు—బాబా కఠినమయిన నిబంధనలను విధించారు. ఆ ప్రకారం వారందరూ రోజుకొక్కపూటే భోజనం చేసేవారు. మండలి ఉదయం 5—30 గంటలకు లేచి ధ్యానము చేసుకొని భజన గీతములు గానం చేస్తూండెడివారు. పెద్ద పులుల భయంచేత రాత్రి త్వరగా 7 గంటలకే తలుపులు వేసుకుని పరుండేవారు.

ఒకరోజున బాబా వారి పనిమీద గ్రామాంతరమునకు వెళ్తూ మండలిచేత ఒక పత్రంమీద అందరివద్ద సంతకాలు తీసికొని వెళ్లారు. ఆపత్రంలో బాబా యిట్లు వ్రాయించి పుచ్చుకున్నారు. "మేమందరము సరదాగా ఉంటాము. ఆనందంగా ఉంటాము. కళ్లనీరు పెట్టుకోము. ఏకారణం చేతను దుఃఖించము. ఒకరి నొకరు పరుషముగా మాట్లాడుకోము. ఒకరిమీద ఒకరు అలిగి నిర్దయగల ఆలోచనలను చేయము". మండలి స్త్రీ పురుషులందరూ యీ నియమములను పాటించడానికి శాయశక్తులా ప్రయత్నం చేసారు. ఒకరినొకరు చిరునవ్వుతో కలుసుకునేవారు. 20 రోజులు బాబా ఊళ్లోలేరు. ఈ 20 రోజులు బాబా చెప్పిన ప్రకారం పోట్లాటలు లేకుండా మెలగి బాబా యొక్క పనిలో వీరంతా సహాయపడిన వారయారు.

'బాబా తిరిగి వచ్చిన తరువాత ఒకరోజున బాబా పరివారంతో అంబర్‌కోటకు వెళ్లారు. 'అంబర్ పట్టణంలో యిదివరకు అనేకమంది అభివృద్ధి చెందిన ఆత్మలుండేవారని' బాబా చెప్పారు. ఇక్కడి కోట జైపూర్ మహారాజా వారి పాతకోట. ఇది ఒక పెద్దకొండమీద రాతిప్రదేశంలో ఉంది. ఆనాడు అక్కడ వార్షికోత్సవములు జరుగుచున్నవి. ఎన్నో ఏనుగులకు అంబారీలు వేసి ఊరేగింపు కోసం అలంకరించారు. మహారాజ భటులు బ్యాండు వాయిస్తూండగా, అవి ఊరేగింపుగా కోట లోనికి వెళ్లినవి. ఎంతోమంది రాజబంధువులు అతిధులు కార్లలో వచ్చి ఉన్నారు. బాబా వచ్చిన సమయమునకే యిలాంటి ఊరేగింపులు తటస్థపడుతుంటాయి.

బాబా మండలితో వెళ్తూ ఉన్నా బస్సును ఎలిజిబెత్ నడుపుతోంది. అందరిలో వెళ్తూంటే బాబా బస్సును దారిలో ఆపి, 'అందరినీ రోడ్డుప్రక్కన దిగమన్నారు. వీరంతా దిగుతూ ఉంటే ఆప్రక్కనుంచి ఒక మనిషి నడిచి వెళ్లాడు. బాబా తప్ప అతని నెవరూ చూడలేదు. తక్కినవారంతా ఏనుగుల వైపు చూస్తున్నారు. అది కొండమీద కోటకి వెళ్లేదారి. ఆ ఎగువనుంచి నగరదృశ్యము సుందరముగా నుండుట చేత 'శిష్యులనందరిని తిలకించమని' బాబా కోరారు. బాబా ప్రశాంతముగా ఉన్నారు.

చుట్టుప్రక్కల చూస్తున్నారు. కానీ బాబా తక్కినవారి వైపు కోటవైపు చూచుట లేదు. ఒక నిమిషం తరువాత బాబా 'ఆవలి వైపున అరణ్యమునకు వెళ్ళేదారి వైపు చూడమని' వారందరికి సౌంజ్ఞచేసారు. బాబా చూపించిన వైపు చూడగా అక్కడ గోచి మాత్రం ధరించి చేతనొక కర్రపుచ్చుకొని వెళ్తూన్న ఒకవృద్ధుడు కనిపించాడు. అతనికి తెల్లటి జడలు కట్టిన కేశపాశము, గడ్డము ఉన్నాయి. "అతడు ఒక సాధువు అని, యీ జిల్లాలో నిజమయిన ఆధ్యాత్మిక వ్యక్తి యితడేనని, నిజమైన భగవత్ప్రేమి కుడని, ఇతడే జైపూర్‌కి ఆధ్యాత్మికనాధుడని పేరు 'నంగా బాబా' అని" బాబా చెప్పారు. అందరూ తరువాత బస్సులో కోటకు వెళ్లారు. నంగాబాబాను చూసిన తరువాత బాబా చాల ఉల్లాసంగా ఉన్నారు. ఆ రోజున వైస్రాయి రాకకోసం కోటవద్ద అందరూ యెదురు చూసున్నారు. మహారాజు కోటలో ఉన్నాడనీ, వైస్రాయి రానున్నాడని బయటవారి నెవరినీ కోటలో ప్రవేశించనీయడం లేదు. ఇంతలో ఊరేగింపు కోటవరకూ వచ్చుట చేత బాబా తమ పరివారంతో సమీపమందలి ఒక డాబా యెక్కి ఊరేగింపు చూసారు. బాబా మండలి వారందరికీ కోటలోపల చూడడానికి ప్రవేశమునకు అనుమతులున్నప్పటికిన్నీ- బయటివారి నెవరినీ అనుమతి పత్రాలున్నాసరే- రాజభటులు లోనికి వెళ్లనీయక అడ్డుపెడుతున్నారు. బాబా మండలితో దిగిన హోటల్ యజమాని రాజస్థానమునకు టెలిఫోను చేసెను. ఈలోగా బాబా పరివారంతో వెనుక దారిని మహారాజు కోటలో ప్రవేశించి, కోట వైభవమును లోపలి భాగములన్నియును బాబా మండలికి చూపించారు.

## అజ్మీర్ మకాం

జైపూర్‌లోని పని ముగించుకుని బాబా రాజస్థాన్‌లోని అజ్మీర్ నగరమునకు మండలితో వెళ్లారు. అజ్మీర్ ఆరావళీకొండల లోని ఒక యాత్రాస్థలం.

అజ్మీర్ రాజవీధికి కొంచెం దూరంలో ఉన్న ప్రక్కవీధిలో ఒక పెద్ద బంగళా బాబా కోసం ఏర్పాటయినది. బాబా ఆయన బృందంతో అందులో దిగారు. అక్కడ అభివృద్ధి చెందిన ఆత్మల కోసం, పిచ్చివారి కోసం, ఆధ్యాత్మికంగా-అభివృద్ధి చెంది దిగ్భ్రాంతిలో పడిపోయిన మస్తుల కోసం-బాబా అన్వేషణ సాగించారు. ఇద్దరు పాశ్చాత్య శిష్యురాండ్రకు- లండన్ నుంచి ఒకామెకు, న్యూయార్కు నుంచి వచ్చిన

వేరొక ఆమెకు బాబా పనులు పురమాయించారు. ఒకామెను, వచ్చిన మస్తుల కోసం బొగ్గుల కుంపట్లమీద వేడినీళ్లు కాచడానికి, కావలసిన నీరు బకెట్లలో మోసుకొని బాబా వద్దకు తీసికొని వెళ్లుటకు నియోగించారు. రెండవ ఆమెను వచ్చిన వారందరికీ ఆహారం వండిపెట్టమని నియోగించారు బాబా.

అజ్మీర్ ఒకనాడు తమ పరివారంతో పిరాన్‌పీరు అనే మహమ్మదీయ సాధువు యొక్క దర్గా దర్శనార్థము అందరినీ ఒక కొండమీదకు తీసికొని వెళ్లారు. వెళ్లేసరికి రాత్రి అయినది. బాబాకి అక్కడ ఆధ్యాత్మికమైన పని చేయవలసియుండెను. ఆకొండ యెక్కినప్పుడు చూసిన సుందరమగు ప్రకృతి దృశ్యము బాబా మండలివారి ఆ పర్యటనలో మరి యెచ్చటను చూడలేదు.

ఒకమస్తు అనేక సంవత్సరముల నుండియు ఒక రోడ్డు ప్రక్కన ఉండేవాడు. అక్కడి నుండి పొమ్మన్నా కదిలేవాడు కాదు. అతని మీద వేడి వేడి నీళ్లు చల్లినా లేచి పారిపోయేవాడు కాదు. ఆవేడి నీళ్లు చల్లినందు వలన అతని వంటిమీద పుళ్లు అయినా పాపం! భరించేవాడు. తరువాత బాబా శిష్యులు వెళ్లి 'అతనిని రమ్మని' పిలువగా బాబా వద్దకు వచ్చి చేరాడు. బాబా అతనికి స్నానం చేయించి చిన్నపిల్లవానికి వలె అన్నం తినిపించారు. తరువాత ఒక క్రొత్త కఫ్నీ తొడిగించారు. ఆ మస్తుకి బాబా తమ గదిలోనే ఆతెల్లటి క్రొత్త కఫ్నీ ధరించిన మస్తును 'ఒక కుర్చీలో కూర్చో'మన్నారు. చిరుగడ్డముతో నేలకేసి చూస్తూ కూర్చున్న అతడు ఒక పవిత్రమయిన మహాపురుషుడులా ఉన్నాడు. బాబా చేసిన యీ సాంగత్యమునకు యీ సపర్యకు ఆ మస్తులో ఎంతటి ఆధ్యాత్మిక పరివర్తన కలిగిందో-బాబాకే తెలియాలి.

ఇంకొక మారు బాబా 'స్మశానభూమిలో ఒక మస్తు ఉన్నాడు, తీసుకుని రమ్మని' తమ శిష్యులను పంపారు. అజ్మీర్‌పుర బాహ్యప్రదేశమున నున్న ఆ పల్లె కాడులో అనేక సంవత్సరములుగా అతడుంటున్నాడు. అతడు పగలు నగరమంతయు తిరిగి, రాత్రికి ఎప్పుడో యిక్కడకు చేరుతుంటాడు. బాబా శిష్యులు యితనిని కనుగొనుటకు అనేకమారులు వచ్చి చూసారు. ఎల్లవేళల అతనియొద్ద పలువురు ఉండేవారు. అతనిని ఆధ్యాత్మికోన్నతి గలవాడని అందరూ మనసుల గౌరవించేవారు. అజ్మీర్ నగరంలో అతనికి భక్తులు మెండుగా నున్నారు. ఎప్పుడు చూచినా అతడు ఆనందంగా ఉంటాడు. అతని వద్దకు వచ్చినవారు కూడా వారి చింతలు మరచి

ఆనందంతో తిరిగి వెళ్లేవారు. బాబా శిష్యులు యితనిని బజారులో జనసమూహంలో కనుగొన్నారు.

అతడు బాబా శిష్యులతో బయలుదేరి రావడానికి అంగీకరించెను. వారు అతనితో సన్నటి సందులోనుండి వెళ్తూ బీదవారుండేపేటలలో నుంచి తీసికొని వెళ్తూం డగా బజారులో చాలామంది యీ మస్తుకి ఆహారం పెట్టి "తినమనే" వారు. సాధారణంగా అతడు ఎవరి వద్దనుండియు ఏమీ తీసుకుని భుజించడు. ఈ రోజున మాత్రం అతడు కొందరిని అనుగ్రహించి కొద్దిగా తినుబండారములను అంగీకరించి తీసుకున్నాడు. అట్లనుగ్రహింపబడిన అదృష్టవంతులు ఆనందించారు. బాబా శిష్యులు ఒక టాంగా మాట్లాడి ఆమస్తుతో యింటికి వెళ్దామని చెప్పారు. అతడు విననట్లు ఊరుకున్నాడు. అతని వెనుక చాలా మంది జనం నడుస్తూ వస్తున్నారు. ఎట్టకేలకు అతడు టాంగాలో ఎక్కగా, ఆ టాంగావాలా మస్తుని ఒక టీ అంగడికి తీసికొని వెళ్లాడు. అక్కడినుండి టాంగావాడు అతనిని బండిలో ఎక్కించుకొని వెంటనే ఎక్కువ వేగంతో పోనిచ్చాడు. అది చూసి బాబా శిష్యులు ఆ టాంగావాడు మస్తుని కూర్చుండబెట్టుకుని పారిపోతున్నాడేమోనని, వేరొక టాంగాలో వారు బయలుదేరారు. రోడ్డు మలుపు వద్ద మొదటి టాంగావాడు బండిని ఆపాడు. అక్కడ బాబా శిష్యులు కూడా వారి బండిని ఆపి ఆమస్తుని వారి బండిలోనికి ఎక్కించుకున్నారు. బాబా వద్దకు తీసికొని రాగానే బాబా ఆమస్తుకి స్నానం చేయించారు. బాబా సాంగత్యం అయిన తరువాత మరల బాబా శిష్యులు అతనిని యథాస్థలంలో దిగబెడతామంటే ఆమస్తు 'బాబాను విడిచి రాన'న్నాడు. అతడు, బాబా అజ్మీర్‌లో ఉన్నన్నాళ్లూ బాబాతోనే ఉన్నాడు. ఏదో అదృశ్యమైన అనుబంధం బాబాతో అతనిని బంధించింది. బాబాతో యీమస్తు ఉన్నాడని అతని భక్తులకు తెలిసింది. అతనిని బాబా ఎలా రప్పించి తమ వద్ద ఉంచుకోగలిగారో అది గొప్ప అద్భుతంలా వారికి కనిపించింది.

అజ్మీర్‌కు బయలుదేరినపుడే బాబా శిష్యులతో 'అజ్మీర్‌లో అయిదవ భూమిక లో ఒకడు, ఏడవ భూమికలో ఒకడు, యిద్దరు మస్తులు ఉన్నారనీ, అక్కడ తమ వద్దకు వారు వస్తారనీ' బాబా చెప్పారు.

ఒకనాడు బాబా మండలికి అజ్మీర్ గురించి చెప్తూ 'రాజపుతానాలో అజ్మీర్ ప్రధానమయిన నగరములలో ఒకటని, అది చారిత్రాత్మకమైనదని, పృథ్వీరాజ్ చౌహన్

ఢిల్లీ పరిపాలించేటప్పుడు అజ్మీర్ కొన్నాళ్ళు అతని రాజధానిగా ఉండేదని' చెప్పారు. 'అదియును గాక అజ్మీర్‌లో ఖ్వాజామొయినుద్దీన్ చిష్టి అనే సుప్రసిద్ధుడయిన కుతుబ్ అక్కడ ఉండేవాడనీ, ఖ్వాజాసాహెబ్ యొక్క హజర్ (సమాధి) కి యిప్పటికీ వేలాది భక్తులు అన్నిమతముల వారు వస్తూ ఉంటారనీ' బాబా చెప్పారు. హిందువులకు, మహమ్మదీయులకు కూడా అది గొప్ప పవిత్ర యాత్రా స్థలమయినది. షాజహాన్ చక్రవర్తి ఢిల్లీ నుంచి అజ్మీర్ వరకు ఉన్న 200 మైళ్లరోడ్డున ప్రతి మైలుకి చిన్నమినార్‌లను కట్టించి వాటిమీద భేరీలను ప్రయోగింప చేసేవాడు. అతడు ఖ్వాజాసాహెబ్ దర్శనమునకు వచ్చినప్పుడు ఆప్రకారంగా అతడు తనతల్లి యభీష్టమును నెరవేర్చెనని చెప్తారు.

బాబా అజ్మీర్‌కి వెళ్లడంలో ఖ్వాజాసాహెబ్ సమాధి వద్ద భగవంతుని ధ్యానంలో నిమగ్నమయి యున్న మస్తులను సాంగత్యం చేయడం ఒక ముఖ్యమయిన ఉద్దేశం. బాబాతో కూడా 30 మంది వారి పరివారం ఉన్నారు. కొంతమంది మస్తులను తీసికొని వచ్చి అక్కడ వారికి స్నానాలు చేయించి భోజనములు పెట్టించడానికీ ప్రతిరోజు వారి సాంగత్యము చేయడానికీ, మండలివారితో బాబా ఉండడానికీ బాబా తీసికొనిన పెద్ద భవనం అన్ని విధముల సరిపోయినది. అది ప్రశాంతమయిన ఏకాంత స్థలములో ఉన్నది. అక్కడ ఉన్నవారికి తప్ప, బాబా ఫలానాచోట బస చేసారని బయట ప్రపంచమునకు తెలియకుండ రహస్యముగా ఉన్నది. అలా ఉండాలనే బాబా ఎవరికినీ తెలియజేయలేదు. అయినప్పటికి ఉత్తరాలు, టెలిగ్రాములు, కేబిల్‌లు వస్తూనే ఉన్నాయి. బాబా ఎవరో అజ్మీర్ నగరంలో బహిరంగపరచలేదు. ఈ భవనంలోనే అజ్మీర్‌లో బాబా తాత్కాలిక మస్తు ఆశ్రమం ఏర్పాటు చేసారు. వారి ఏకాంతమునకు భంగం కలుగకుండా 'బాబా, కేరాఫ్ స్టేషన్‌మాస్టర్, మార్వార్ జంక్షన్, రాజపుతానా' అనే అడ్రస్ అందరికీ యిచ్చారు. అక్కడికి వచ్చిన ఉత్తరములు టెలిగ్రాంలు వగైరా బాబా రోజు విడిచి రోజు ఒక శిష్యుని పంపి తెప్పించేవారు. అజ్మీర్‌కి మార్వార్ జంక్షన్ 85 మైళ్ల దూరంలో ఉన్నది. మెహెరాబాద్‌లో ఉన్నవారికి కూడా మార్వార్ జంక్షన్ ఎడ్రస్‌గానీ, అజ్మీర్ ఎడ్రసుగానీ బాబా యివ్వలేదు. అలా కాకపోతే బాబా ఎక్కడ ఉంటే అక్కడికి అనేక మంది భక్తులు బాబా దర్శనం కోసం ఎంత దూరము నుండి అయినా ప్రతిరోజు వచ్చియుండేవాళ్లు. బాబాకి 'ప్రపంచంలో ఎవరికి వారి సహాయం అవసరంగా కావాలో తెలుసును' గనుక వారికి ఆంతరికంగా బాబా సహాయం చేస్తూనే ఉన్నారు.

## చాచా మస్తు

అజ్మీర్‌లో 'నూర్ ఆలీషా పఠాన్' అనే అసలు పేరు కలిగిన 'చాచా' అనే చాలా అభివృద్ధి చెందిన భగవత్ప్రేమికుడు ఒకడు ఉన్నాడు. 'అతడు ఏడవ భూమిక లో ఉన్నాడని' బాబా చెప్పారు. కొన్ని సంవత్సరముల నుండి అతడు ఖ్వాజాసాహెబ్ దర్గా వద్ద ఉంటున్నాడు. ఆ ప్రాంతంలో అతడు చాలా ప్రసిద్ధుడు. అక్కడి జనులు అతనిని పూజించేవారు. ఒకనాడు అతనిని ఒక టాంగాలో ఎక్కించి మండలి వారు బాబా వద్దకు తీసికొని వచ్చారు. ఆ టాంగావాలా పేరు ఫతేఖాన్.

ఫతేఖాన్‌కి తాగుడు అలవాటు బాగా ఉంది. అయినా అతడిని బాబా తమ పనికి ఉపయోగించుకున్నారు. ప్రతిరోజూ ఎప్పుడు అవసరం వస్తే అప్పుడు ఫతే ఖాన్ తన టాంగాలో చాచా మస్తును బాబా వద్దకు తీసికొని వస్తుండేవాడు. బాబాకి పనిచేయడం అంటే ఫతేఖాన్ ఎగిరిగంతేసే వాడు. అనేక సంవత్సరముల నుండి ఎక్కడికీ కదలకుండా ఒకేచోట ఉంటూ, ఇప్పుడు యిలా ఇంకొక చోటుకి వెళ్తున్న చాచా మస్తును చూసి జనులు ఆశ్చర్యపడేవారు. ఆ మస్తు ఎప్పుడూ భగవద్దర్శనంలోనే నిమగ్నుడయి యుండేవాడు. అతడు పొడగరి. బక్కపలచగా ఉండేవాడు., కోలముఖం కలవాడు. ఎప్పుడు చూసినా అతని దృష్టి యీ ప్రపంచం లో ఉన్నట్లుండేది కాదు. భగవంతుని చూస్తూ విభ్రాంతుడైనట్లు ఉండేవాడు. ఆ నేత్రములలోని తేజస్సు అలౌకికంగా ఉండేది. అతని పెదవుల మీద నాట్యం చేస్తున్న చిరునవ్వు కూడా భగవదన్వేషణలో తననుతాను పోగొట్టుకొనిన వానివలె ఉంది. ఆ మస్తు మేకపిల్లలా ఎంతో సాధువు జమాలీ రకం. ఆస్థితిలో ఉన్న మస్తులను ప్రాపంచిక పనులు చేయమని చెప్పి ఆ ఉన్నతస్థితిలో నుంచి వారిని దిగ లాగుతే వారు చాలా దుఃఖపడతారు. ఏడుస్తారు కూడాను. అందుచేతనే బాబా 'మస్తుల చేత బలవంతంగా ఏపనీ చేయించవద్దని' ఆదేశిస్తారు. వారి యెడల బాబా అపారమైన ఓర్పు వహించి వారంతట వారు కావలసిన పని చేసేవరకు వేచి యుం టారు. కానీ యితరులెవరైనా చెప్తే వినని వారు బాబా చెప్పిన వెంటనే ఎటువంటి వారయినా విని ఆపని చేస్తారని అనుభవం వలన తెలుస్తోంది. పనులంటే యేమీ కష్టమయిన పనులు కావు. స్నానం చేయడం, దుస్తులు ధరించడం, ఆహారం తిన డం, బండి ఎక్కడం, దిగడం, యిలాంటి మామూలు పనులే. అవే వారికి యిష్ట మయితేనే గానీ బాబా చేయించరు.

బాబా అజ్మీర్‌లో మస్తులతో చేసే యీ ఆంతరికకార్యంలో, నిమగ్నమై యుండుట చేత ఆ సంవత్సరం బాబా తమ జన్మదినోత్సవం జరుపుటకు అనుమతి యివ్వలేదు. అజ్మీర్ నగరములో ఉండే సుమారు 20 మంది మస్తులను రావించి, ఆరోజున వారికి స్నానం చేయించి భోజనములు పెట్టి, వారి సాంగత్యము చేసిన తరువాత బాబా భుజించారు. వారందరినీ వెదకి వెదకి తీసికొని రావడానికే మండలికి కొన్ని గంటలు పట్టింది. మస్తులు ఎక్కడ నడితే అక్కడ పనిలేకుండ తిరిగేవారు కాదు. వారిని కనుగొనడమే కష్టం. కనుగొన్నా తమతో వారిని తీసుకురావడం అంతకన్నా కష్టం. ఆపనిలో బాబా సహాయం లేనిదే, ఆయన మండలికి 'తాళం చెవి' యివ్వనిదే, అది సులభం గాదు. అనేక సంవత్సరములుగా ఒకేచోటు నుండి కదల కుండా ఉన్న యీ మస్తులను-చాచా లాంటి ఉన్నత భూమికల లోని వారిని కదల్చి టాంగాలలో తీసికొని వస్తుంటే ప్రజలు ఆశ్చర్యపడి వారితో ఊరేగింపుగా వచ్చేవారు. చాచాను ఖ్వాజాసాహెబ్ దర్గానుండి తీసికొని రాగానే "లోపలికి రమ్మంటే" సంకో చిస్తూ నిలబడి, మళ్లీ వెనక్కు తిరిగి వెళ్లిపోయేటట్లు కనబడగా, బాబా ఎదురువెళ్లి లోపలికి తీసుకువచ్చారు. స్నానం చేయించడానికి చాచా దుస్తులు తీయడం ఒక పెద్ద పని అయినది. చాచా టీ తాగినంత తాగి మిగిలినది నెత్తిన పోసుకునేవాడు. అతనికి టీ అంటే మహాయిష్టం. ఎన్ని కప్పులయిన అడిగి తాగేసే వాడు. టీ కావలసినప్పుడు 'చా,చా' అనేవాడు. అందుకే అతనికి ఆపేరు వచ్చినది. అతని చొక్కా, టోపీ టీ నీళ్లతో తడిసి, ఎండి ఒంటికి అతుక్కు పోయెడివి. అతని తల మీద టోపీ, చొక్కాకూడా కత్తెరతో కత్తిరించవలసి వచ్చేది. అతనికి బాబా శుభ్రంగా స్నానం చేయించారు. తరువాత చాచాకి తెల్లటి కఫ్నీ తొడిగారు. ఇప్పుడు చాచా క్రొత్తవాడయ్యాడు. బాబా సాంగత్యం వలన అతని మనసుకూ కూడా క్రొత్త దనం వచ్చిందనుటకు సందేహం లేదు. 'దురవగాహమైన సంపూర్ణదైవత్వంతో నిండిన ఒక మహానుభావుని సన్నిధానంలో ఉన్నానని గ్రహించినట్లుగా' అతని కన్నులు చెప్తున్నాయి. ఆ మస్తుకి అసలు కావలసినదే దైవసన్నిధానం కదా. అందుచేత అతని మోములో తృప్తి తొణికిసలాడుతుంది. తరువాత బాబా స్వయంగా వారి గదిలో పప్పు, అన్నం కలిపి ఆయన స్వహస్తములతో ముద్దలు చేసి చాచా చేత తిని పించారు. రొట్టెలు కూడా తినిపించారు. మస్తులకు బాబా ఆహారం పెట్టినప్పుడు అక్కడ యింకెవరినీ ఉండనివ్వరు. ఆహారంతో పాటు బాబా అంతరికంగా ఆత్మలోనికి ఆధ్యాత్మికాహారాన్ని కూడా యిస్తుంటారు. బాబా దివ్యప్రేమామృతాన్ని కూడా

మస్తులచేత త్రాగిస్తారనడానికి సందేహం లేదు. బాబా నుంచి నిరంతరం వెలువడే దివ్యత్వంతో వారి ఆత్మలను నింపులారు.

కొద్దిరోజులయిన తరువాత 'మస్తు' విశ్రాంతి తీసుకుంటుండగా బాబావచ్చి, అతని వద్ద కూర్చుని, మృదువైన వారి దివ్య కరకమలములతో మస్తు పాదములను ఒత్తసాగారు. పరిపూర్ణ అవతార పురుషుడైన బాబా ఎంత అణకువతో తమ ప్రేమికుల సేవ చేస్తున్నారో చూడండి! నిజమైన భగవత్ప్రేమికుల యెడల బాబాకు ఎంత గౌరవభావమున్నదో! ఈ విధంగా మస్తు సేవ చేయుటకు బాబా చాలా ఆనందిస్తారు. బాబాలో ఉన్న నిత్యానందము యిలాంటి సమయములలో నూతనముగా ఆయన సుందర ముఖారవిందము మీద నాట్యం చేస్తూంటుంది. ఈ సపర్యల వలన బాబా ఆ భాగ్యశాలురను ఆధ్యాత్మికంగా భగవంతునికి దగ్గరగా ఒక సోపానము పైకి ఎక్కించి తీసికొని వెళ్తారు. దివ్య ప్రియుతముడగు బాబా, భగవత్ప్రేమికులు., ఆధ్యాత్మికంగా ఉన్నతులు. ప్రపంచం అక్కర లేనివారు, భగవంతుని స్మరణలో ఎన్ని కష్టముల నయినా సరకుగొననివారు, నిజమైన ధీరులు (కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్ — ఉపనిషద్వాక్యము) అయిన యీ మస్తులంటే అమితముగా అందరికన్నా మిన్నగా ప్రేమిస్తారు. వారి ప్రేమా సాంగత్యంలో ఉన్న ఆనందం బాబాకు వేలకొలది భక్తులు వచ్చి ఆయనను పూజించినా ఉండదు.

ఐహికంగా భాగ్యవంతుడయినవాడు తన ధనమును పేదవారికి దానము చేసినప్పుడు తన ఐశ్వర్యానికి సార్థక్యం కల్గిందని ఏవిధంగా సంతోషిస్తాడో, ఆధ్యాత్మిక సార్వభౌముడైన మెహెర్‌బాబా తనను చేరవచ్చే మార్గము కంటకావృతమైనప్పుడు తన నిజమైన ప్రేమికులు దానిలో చిక్కులు పడుతున్నప్పుడు, అపారమైన కృపతో వారిదారి సుగమం చేయుటకు ఆ కంటకములను తొలగించుటలో అంటే యీ మస్తులకు అంతరికమైన సేవ చేయడంలో అంతకన్నా మిన్నగా సంతోషిస్తారు. ఉన్నత భూమికలలో బాబా వీరి ద్వారా తమ ఆధ్యాత్మిక కార్యములను చేయుట తగిన వారినిగా తయారుచేసుకుంటున్నారు. బాబా యొక్క దైవత్వమును చూసి మస్తులు గుర్తించి ఆనందం పొందుతున్నారంటేనే — సాధారణ స్థితిలో ఉన్న మనము. సంతోషిస్తున్నామే, సాక్షాత్తు దైవసాన్నిధ్యంలో ఉండి ఆ సంగతి తెలుసుకున్న వారు నిజంగా ఎంత ఆనందముతో పొంగిపోయెడి వారో! బాబాను తమ ప్రేమికులు ఎవరైనా నిజంగా గుర్తించినప్పుడు బాబాకు కలిగే ఆనందము కూడా వర్ణనాతీతమే. "నీవు

ఎవరి దగర్గకు వచ్చేవో నీకు తెలుసునా?" అని ఆ మస్తాని అడుగగానే "మాలిక్ కే పాస్ ఆయా" (నా ప్రభువు వద్దకు వచ్చాను) అని సమాధానం ఇచ్చాడు. చాచా. బాబా తను దివ్యహస్తములతో ఆమస్తు పాదములు ఒత్తబోతూ ఉంటే "మాలిక్ ఐపా మతె కరో" (మీరు అలా చేయకండి ప్రభూ!) అన్నాడు. ఆధ్యాత్మికోన్నత వీధులలో ఊర్ధ్వలోకాలలో విహరించే ఆ మస్తు యొక్క మానసము, బాబా యీ విధంగా తమ ఉన్నతస్థాయి నుండి దిగి, తన పాదములను ఒత్తి శుశ్రూష చేయడానికి ఒప్పుకోరు.

మస్తు యీ విధంగా బాబా వద్ద ఉండి ఆయన స్వహస్తములతో తినిపించి నది తినుటకు, త్రాగించినది త్రాగుటకు, అలవాటుపడ్డాడు. బాబా వేరే ఏదయినా పనిలో నిమగ్నమై యున్నప్పుడు బాబా గదిలో కూర్చొని తనలో తాను అనిర్వచనీయ మైన ఆనందంలో మునిగి ఏవో దివ్యమైన పాటలు పాడుకుంటూ ఉంటాడు. మస్తు. ఆ పాటలలో ఒకటి ———

"జిస్ నే దియా హై దర్ద్-ఏ-దిల్
ఉస్కా ఖుదా భలా కరే"

అంటే ఎవరు హృదయానికి యీ బాధ కలిగించారో అతనికి భగవంతుడు మంచి కలుగ జేయుగాక!

ఒకనాడు బాబా మస్తుకి స్నానం చేయిస్తుంటే, అతడు బాబా పాదమును చేతితో స్పృశించి, ఆచేతిని తన ఫాలమునకు అద్దుకొనెను. దీనివలన బాబా ఎవరో తెలుసుకున్నాడని స్పష్టమవుతోంది.

అజ్మీర్ ఆశ్రమంలో చాలామంది మస్తులున్నారు. కానీ చాచా తరువాత లఖన్ షా ఒకడు, ఖబ్రిస్తాన్‌వాలా ఒకడు చెప్పుకోదగ్గవారు. లఖన్ షా మజాబ్ వంటి స్థితిలో ఉన్నాడు. ఇతనిలో ఎక్కువగా జమాలీ లక్షణములు ఉన్నవి. జలాలీ లక్షణములు తక్కువగా ఉన్నవి. బాబా 'అతనిలో ముప్పాతిక వంతులు జమాలీ పాతిక వంతులు జలాలీ లక్షణాలు ఉన్నాయని' చెప్పారు. బాబా బజారులో తమ శిష్యులకు ఒక పొడుగైన మనిషిని చూపించారే అతడే లఖన్‌షా. మొదట అజ్మీర్‌లో యితనిని ఖ్వాజాసాహెబ్ దర్గా వద్ద బాబా కనుగొన్నారు. అప్పుడతని దుస్తులు బాగాలేకపోయినా ముఖవర్చస్సు ప్రకాశవంతంగా ఉండడం చూసి, బాబాతో ఉన్న

పాశ్చాత్య శిష్యురాండ్రు ఆశ్చర్యపోయారు. తరువాత బాబా 'లఖన్‌షాని తీసికొని రమ్మనగా' కాకా వెళ్లి బాబా బస చేసిన యింటికి ఆ మస్తును తీసుకువచ్చాడని లఖన్‌షా పొడవుగా బక్కపలుచగా ఉంటాడు. కోలముఖం, కళ్లు ఏదో శక్తి కలవిగా ఉంటాయి. అతనికి పాటలు పాడడం యిష్టం. కంఠం చాలా శ్రావ్యంగా ఉంటుంది. ఆ పాట విన్న వాళ్లకి ఉత్తేజం కలిగేది.

బాబా లఖన్‌షాకి క్షవరం చేసి, స్నానం చేయించి, భోజనం పెట్టారు. మొదటి రాత్రి అతడు బాబా గదిలోనే పడుకున్నాడు. కాకా కూడా ఆగదిలోనే ఉన్నాడు. ఆగదిలో 'ఖబ్రిస్తాన్ వాలా' అనే వేరొక మస్తు కూడా ఉన్నాడు. బాబా వారికి రోజూ భోజనం తెచ్చి పెట్టే ఏర్పాటు చేయించారు.' ఈ యిద్దరు మస్తులూ రాత్రిపూట చల్లగా జారుకుంటారేమోనని, కాకాని జాగ్రత్తగా చూస్తూ ఉండమని బాబా హెచ్చరించారు. ఆరేబియాలోని ఇబిన్‌సాద్‌లా నిద్రపోతాడు కాకా. అతడిది అంత మెలకువ నిద్ర. కాస్త అలికిడి అయితే చాలు నిద్ర లేస్తాడు. ఒకరాత్రి వేళ ఎవరో లేచి తలుపు గడియ లాగుతుంటే కాకా మెలకువ వచ్చి లేచి, టార్చిలైటు వేసాడు. లఖన్‌షాని ఆవెలుగులో తలుపు దగ్గర చూసాడు. ఆ మస్తు బయటకు పారిపోదామని ప్రయత్నం చేస్తుంటే యితని కంటబడ్డాడు. అతనితో బయటకు తానుకూడా వెళ్లి 'ఎక్కడికి వెళ్తున్నావని' అన్నాడు. ఆ పని చేసుకున్న తరువాత లోపలికి వస్తూ "కాకా! నీవు చాలా గట్టివాడవు" అన్నాడు. తరువాత రోజుల్లో బాబా యొక్క శుశ్రూషను పొందాడు. లఖన్‌షా బాబా అతని కాళ్లు ఒత్తుతూ ఉంటే ఒకమారు, ఆ మస్తు "గురూ! ఆ పనిమాత్రం చేయకండి" అన్నాడు. 'నీవు ఎక్కడికివచ్చావు' అని లఖన్‌షాని ఎవరయినా అడిగితే "హ్రప్రభువు వద్దకు", అని చెప్పేవాడు. ఒక వారంరోజులున్న తరువాత బాబా అతనిని పంపించేసారు. అతడు వెళ్లినప్పుడు బాబా అతనికి ఒక దుప్పటి, నెమలి కంఠం రంగున్న ఒక మంచి ఉన్ని శాలువ యిచ్చారు.

ఒకరోజున అజ్మీర్‌లో ఖ్వాజా సాహెబ్ దర్గా చుట్టుప్రక్కల ఉన్న వీధులలో, బాబా యిద్దరు శిష్యులతో మస్తు అన్వేషణకై తిరుగుచుండగా, ఒక మనిషి బాబాను చూసి ఆనందాతిశయంతో అరే! దేఖో శంకర్ ఆయా—భాగో భగవాన్ కా దర్శన్ కర్ లో"

"అదిగో చూడండి. భగవానుడయిన శంకరుడు వచ్చాడు. పరుగెత్తి వెళ్లి అతని దర్శనం చేసుకోండి'' అని అరిచాడు. అది విన్నవారు, మిగిలిన మస్తులు బాబా చేతులెత్తి నమస్కరించారు. ఇంకా ముందుకి వెళ్లి బాబా ఒక మస్తుని చక్క మండలితో "అడుగో అతనిని నా వద్దకు తీసుకురండి'' అని చెప్పారు. ముందు వారు వెళ్లి, అతనిని బాబా వద్దకు రమ్మనగా 'ఆహా! నేను ధన్యుడను. ప్రభు నన్ను పిలువనంపుట కంటె అదృష్టమున్నదా! నా జన్మ ధన్యత గాంచినది'' అ మండలితో అతడు బాబా సన్నిధి కేగెను. బాబా అతనికి ఒక వెండి నాణెము యిమ్మని చెప్పారు. తరువాత మండలి అతనిని బాబా ఉన్న యింటికి తీసికొని వచ్చారు అతనికి బాబా స్నానం చేయించి, క్రొత్తబట్టలు కట్టబెట్టి భోజనం పెట్టి పంపించారు

ఫిబ్రవరి (1939) 9వ తారీఖున బాబా అజ్మీర్ నుంచి 12 మైళ్ల దూరంలో ఉన్న పుష్కరక్షేత్రానికి వెళ్లారు. అక్కడ పేరు తెలియని ఒక మస్తును బాబా కలుసుకున్నారు. ఈ మస్తు ఒక పాత కుండను ఒక చేతితో పట్టుకొని తెస్తుంటాడు.ఎక్కడికి వెళ్లినా. ఇతని వెనుక కొన్ని కుక్కలు, కుక్కపిల్లలు వెంబడిస్తుంటాయి. బాబా వచ్చినప్పుడు అతడు కళ్ళు ఎత్తి ఆయనవైపు ఎంతో విశిష్టమైన దృష్టితో చూసాడు. 'ఆ మస్తుకి ఏమి ఆహారం పెట్టినా, అతడు ఉన్న మూగజీవులకు పెట్టిన తరువాత తాను తింటాడని' బాబా చెప్పారు ఆ రాత్రికే బాబాఅజ్మీర్ తిరిగి వచ్చేసారు.

11వ తేదీన నగరము నుండి ఆరుగురు మస్తులను బాబా బసలోనికి తీసు కొని వచ్చారు మండలి. బాబా వారందరినీ స్నానం చేయించి నూతన వస్త్రము కట్టించి వారికి భోజనం పెట్టి పంపించారు. పార్సీ పంచాంగం ప్రకారం ఫిబ్రవరి 15వ తేదీనాడు బాబా జన్మదినోత్సవం అయినది. ఆ సందర్భంలో 20 మందిని బాబా ఆదేశం ప్రకారం మండలి తీసికొని వచ్చారు. వారిలో కొందరినీ మస్తులు, కొందరు పిచ్చివారు ఉన్నారు. మిగిలిన వారు పేదవారు. వారందరూ స్నానం చేయించి క్రొత్త బట్టలు కట్టించి అందరికీ భోజనం పెట్టారు.బాబా ఈ పని పూర్తి అయిన వరకూ అంటే మధ్యాహ్నం రెండు గంటల వరకూ బాబా గాని వారి మండలిగాని ఏ విధమై ఆహారము తీసికొనలేదు.

అజ్మీర్‌లో ఉండగా బాబా తమ మండలినందరినీ ఖ్వాజామోయినుద్దీన్ చిష్టి దర్గాకు తీసికొని వెళ్లి చూపించారు. ఖ్వాజాసాహెబ్ అరేబియా నుంచి ఇండియాకు వచ్చి, అజ్మీర్‌లో స్థిరపడిపోయాడు. అతడు ఆకాలపు ప్రాచీన సాంప్రదాయస్తులకు బలియైపోయాడు. అతడు ఆధ్యాత్మికంగా అత్యుత్తమ స్థాన మలంకరించి ఉండుట చేత హిందూ ముసల్మానులకు సమానముగా పూజనీయుడయ్యాడు. అందుచేత అనేకవేల మంది రెండుమతముల వారు సంవత్సరం పొడుగునా ఖ్వాజా సాహెబ్ దర్గాను దర్శిస్తూంటారు. మహ్మదీయులకు అజ్మీర్ ఇండియాలో మెక్కావంటిది. సమాధివున్నస్థలం దగ్గరకు—అంటే దర్గాలోపలికి పాశ్చాత్యులను పోనివ్వరు. సమాధిమందిరములో మహ్మదీయ అర్చకులున్నారు. దర్శనార్థం వచ్చిన యాత్రికుల వద్ద వారు రుసుములు వసూలు చేస్తూంటారు. అయినా ఆ సమాధి యొక్క పవిత్రత, దాని ప్రాధాన్యత యిసుమంతైనా తగ్గలేదు.

బాబా శిష్యులు అందరూ దర్గా నుండి బయటకు వచ్చి బస్సులో కూర్చున్నారు. ఇంతలో ఒక పవిత్ర పురుషుడు బాబా కూర్చున్న వైపు నుండి ఆయన ప్రక్కనుండి వెళ్తూ 'బాబాను గుర్తించినట్లు' ఆయనవైపు చూసాడు. ఇంటికి వెళ్లిన తరువాత బాబా యిద్దరు శిష్యులను పంపి 'అతనిని తీసికొని రమ్మనమని' చెప్పారు. వారు వచ్చి వెదుకగా అతడొక కుళ్లు కాలువలో పడి ఉండడం వారు చూసారు. అతనికి శరీర స్పృహ లేదు. భగవద్ధ్యానంలో అతడు మైమరచి యుండెను. అతనిని బాబా వద్దకు తీసికొని వచ్చారు. బాబా అజ్మీరులో ఉన్నంతవరకు అతడు బాబాతోనే యుండెను. ఇతడు మధ్యవయస్కుడు. సన్నగా పొడవుగా టీవిగా నుండెను. బాబాతో ఉన్నంతకాలము అంతరంగమున ఎల్లప్పుడు ఆనందముతో నిండియుండెను. అతని నేత్రములు ఎంతో దూరమున ఉన్న వస్తువులను కూడా చూడగలవనునట్లు నిశితమైన దృష్టి కలవిగా నుండెను. అతని చేతులు కళాత్మకములై అదృశ్యలోకముల వారితో సంభాషించుచుండినట్లు ఏవో సైగలతో నిరంతరము కదులుచుండెడివి. అతడు ఎప్పుడోగానీ మాట్లాడడు. ఆ మాటలయినా తెలిసేలా ఉండవు. బాబా 'ఆమాటలు ఆధ్యాత్మికముగా అర్థము కలిగియున్నవని' చెప్పుచుండెడివారు. ఒక్కొక్కప్పుడు అర్ధరాత్రి సమయమందు అతని గదిలో ఎలుగెత్తి అతడు పాడుకుంటుండే వాడు. అతడు బాబా వద్ద ఉన్నరోజులలో బాబా అతనికి స్వయంగా స్నానం చేయించి, స్వహస్తములతో భోజనము పెట్టెడివారు. బాబా

అతనిని ఆధ్యాత్మికముగా ముందుకు తీసికొని వెళ్లారు. ఇతడు అయిదవ భూమికలో ఉండినవాడు. యిప్పుడు యింకా పైకి వెళ్లాడు. బాబాకు యితడు ఆధ్యాత్మిక ప్రతినిధిగా ఉన్నాడు.

ఫతేఖాన్ అనే టాంగావాడి ద్వారా బాబా శిష్యులు ఇంకొకనిని కనుగొన్నారు. ఈ టాంగావాడు అజ్మీర్‌లోని సందులు గొందులు అన్నీ తెలిసినవాడు. అందరి కంటె ముందునుంచి ఉన్న టాంగావాడు యితడే. ముఖ్యంగా యిటువంటి ఆధ్యాత్మిక వ్యక్తులు, వలీలు ఉండే చోట్లు అన్నీ అతనికి సుపరిచితము లే. చిత్తుగా త్రాగడం ఒక్కటే ఫతేఖాన్‌లో ఉన్న లోపం. అయినా బాబాకి పనిచేయడం అంటే ఎన్ని పనులు ఉన్నా మానుకొని వచ్చేవాడు. ఎప్పుడూ ఒక కోటు తొడుగుకుండేవాడు అతడు. అతనికి కావలసిన దానికంటె పెద్దటోపీ పెట్టుకుండేవాడు. ఫతేఖాన్ చాలా నిజాయితీ గల వ్యక్తి. ప్రతిరోజూ ఎంత తాగేవాడో బాబా శిష్యులలో అతను చెప్తుండేవాడు.

ఒకరోజున అతడు ఒక్కడూ 'ప్రత్యేకమైన ఒక ఆధ్యాత్మిక వ్యక్తిని తీసికొని వస్తానని' వెళ్లి బాబా వద్దకు ఒకనిని తీసికొని వచ్చాడు. అతడు ఆ జిల్లాకు ఆధ్యాత్మిక అధికారి. మూడు సంవత్సరముల నుండి జనసమ్మర్ధమయిన ఒక స్థలంలో ఉంటున్నాడు. మనిషి ఆజానుబాహువు. పొడుగాటి గడ్డము, శక్తివంతములయిన కళ్లు కలిగి ఉండెడివాడు. ఇతనిని మూడు మారులు బాబా వద్దకు తీసికొని వచ్చారు. తెలిసిన ప్రజలు అతని వద్దకు వచ్చి కొన్ని గంటలసేపు మౌనంగా కూర్చొనేవారు. 'అతని వంటి వారి సన్నిధిలో ఉంటే చాలుననుకునే' యిలాంటి వారు ఇండియాలోనే ఉంటారు. 'అతను ఆరవ భూమికలో ఉన్నాడని' బాబా చెప్పారు. ఈ విధంగా యీ మార్గంలో ఉన్నవారంతా బాబా వద్దకు వచ్చారు.

ఆరవ భూమికలో ఉన్న ఆ ఆధ్యాత్మికాధికారి గురించి బాబా యిలా చెప్పారు— "చూడడం వేరు, తెలుసుకొనడం వేరు, అనుభవించడం వేరు. అతడింకా అవినాశనుడనగు నావద్దకు ఆరోహించి రావాలి. ఆత్మను భరించడానికి ప్రాయశ్చిత్తం లేదు. అతడు నాఅనుగ్రహం కోసం యింకా వేచి యుండాలి. నేనూ అతడూ ఒకటే. నాకు తోచినపుడు నేను అతనికి అనుగ్రహాన్ని కలుగజేస్తాను. నా పనివాళ్లు వాళ్లని నావద్దకు తీసికొని వచ్చినప్పుడు, నాపని నిమిత్తం వారిని యీ ఉన్నత స్థానంలో

ఉంచుతాను. వారు పనిచేసే ప్రతినిధులు. అనంతుడు నయిన నాలో అతడున్నాడు. అవి భాజ్యుడను, నిర్మలుడను, సత్యవంతుడను అయిన నేను—అతనిలోనూ ''ఉన్నాను.

బాబా వద్దకు వచ్చిన రెండవవాడు పైన చెప్పిన రకం కాదు. అతడింకొక విధమయిన ఆధ్యాత్మికసాధకుడు. దివ్యమైన మానసంతో అతడు స్వార్ధరహితంగా అంటాడు. ''కాలక్రమంగా యితనిని కూడా నాలో మేల్కొనేటట్లు చేస్తాను.'' అని బాబా అన్నారు.

బాబా ''నాదగ్గరికి అందరూ రండి అంటాను. మీమీ బరువులతో రండి అంటాను. అందరికీ నేను బరువు తీసివేసి బాధలను తొలిగిస్తాను. అందరికీ తేలిక చేస్తాను. నన్ను ప్రేమించే వారందరికీ యిదే నా సలహా. మీరు నన్ను చూడండి—భగవంతుడనై నేను అందరికీ సహాయం చేయడం, అందరికీ సేవ చేయుడం చేస్తాను. ప్రేమలో నేను నావద్దకు వచ్చిన వారిని పునరుజ్జీవితులను చేస్తాను.' 'మెహెర్ బాబా దయాదాక్షిణ్యములు కలిగి మనసుతో అందరికీ మంచి చేయాలని ఉన్నాడ'ని మీరు చెప్పండి. 'పరిశుద్ధమైన ప్రేమతో అందరికోసం బాబా యిక్కడ ఉన్నాడు. ఇదివరలో ఎన్నడూ చేయని విధంగా సత్యాన్ని జీవితంలో వ్యక్తం చేయుటకు బాబా వచ్చియున్నాడు' అని ఆయన జీవితం చూసి మీరు చెప్పండి''. అన్నారు. బాబా యింకా యిలా చెప్పారు. ''ఈలోకంలో ఉన్నదంతా నాశనమయే జీవిత కల్మషభూయిష్టమయినది. అందులో నిన్ను చూసుకో. అందరిలోను నేను ఉన్నాను. ఆ నన్ను మీరు చూడండి. దిక్కులేని వారిని ఎందుకు బాబా స్నానం చేయిస్తారని అడుగుతారు కొంతమంది మిమ్మల్ని. మీరు సమాధానం చెప్పండి. 'మెహెర్ బాబా ఆయన చేసే పనులన్నిటిలోను నిజమైన కరుణ చూపిస్తారు. ఆయన దివ్యపురుషుడు. ''అందుకే ఆయన అంత మంచిని కనపరుస్తాడని మీరు చెప్పండి.''

ఇంకొక మస్తుని చూసి మండలి, బాబా వద్దకు రమ్మనగా అతడు — ''ప్రేమయే అన్నిటికంటె ఉత్తమోత్తమమైనది'' అని పలుమారులు ఉచ్చరించి, బాబా వద్దకు వచ్చి ఆయనను చూడగానే ఆమస్తు ''నా హృదయాన్ని ఒకడికి యిచ్చేను. నా హృదయేశ్వరుడు నా ప్రియతముడు అదృశ్యమై పోయాడు. నాకు మళ్లీ కనిపించలేదు. ఎన్ని సంవత్సరముల నుండియో అతనికోసం వెదకుచున్నాను. అయినా కనబడలేదు. కానీ, యీ రోజున యిక్కడ మరల నాకన్నుల పండువుగా అతనిని నేను కనుగొన్నాను అని కొద్దిసేపు ఊరుకొని ఆ మస్తు మళ్లీ యిలా

చెప్పాడు. "ప్రేమించడం సులభమయిన పనికాదు. జీవితం సుఖంగా గడుపుతున్నవారు, భోగభాగ్యములతో తులతూగుచున్నవారు దానికోసం పోరాడరు (దివ్య ప్రేమ కోసం) ప్రేమ వారికోసం కానేకాదు. ప్రేమ అనేది ధీరుల కోసం. ధైర్యం ఓర్పు కలవారి కోసం బాధలను భరించగలిగే వారికోసం. ప్రేమయే అసలు వస్తువు." అతడు మస్తు అయినా, తన మనస్సంతా భగవదాయత్తమై యున్నా, ప్రేమ గురించి ఎంతబాగా చెప్పాడో చూడండి. శుష్కమయిన కబుర్లు చెప్పేవాళ్ళు అనుభవపూర్వకమైన యీమాటలు వింటే నిజమైన ప్రేమ అంటే ఏమిటో తెలుసుకుంటారు.

తరువాత బాబా అజ్మీరు నుంచి భోపాల్ వెళ్లారు. భోపాల్‌లో మార్చి (1939) 4వ తేదీన బాబా ఒక మస్తును వారి దగ్గరకు రప్పించారు. 'నీ పేరేమిటని' అడిగితే అతడు 'లెట్బ్యాన్' అని చెప్పాడు. లెట్బ్యాన్‌ను బాబా నాలుగురోజులు తమతో ఉంచుకొని పంపించారు. తరువాత అతడు తన యిష్టం వచ్చినప్పుడు బాబా దగ్గరకు వచ్చిపోతూ ఉండేవాడు. పగలూ రాత్రీ అనే భేదం లేకుండా ఎల్లప్పుడూ బాబా బంగళా తలుపులు తెరిచే ఉండేవి. అందుచేత అతడు అర్ధరాత్రయినా వచ్చేవాడు. వచ్చి హాయిగా కొన్ని గంటలు పరుండేవాడు. లెట్బ్యాన్ మధ్యవయస్కుడు. నల్లని చిన్న గడ్డము కలిగి ఉండేవాడు. చింపిగుడ్డలు కట్టుకునే వాడు. మాసిన తురక టోపీ పెట్టుకునే వాడు. పొట్టిగా ఒక్కగా ఉండేవాడు. పరున్నప్పుడు తనలో తాను ఏదో గొణుగుతూ ఉండేవాడు. ఒక్కొక్కప్పుడు చిరాకు కలిగిందంటే మందపాని కొట్టేవాడు. చేతికందిన ఏ వస్తువునయినా వారి మీదకి గిరవాటువేసేవాడు. మనిషి కనిపిస్తే చాలు 'టైమెంతయిందని' అడిగేవాడు. అతనితో బాబా సాంగత్యం చేసినప్పుడు 'నాకొక చేతిగడియారం కావాలి' అని అతడు అడిగాడు. బాబా అతనికి, ఒక చేతిగడియారం తెప్పించి కానుకగా యిచ్చారు. ఒకరోజున మండలి ప్రపంచ రాజకీయములు చర్చిస్తుంటే ఆ మస్తు "యే సబ్‌కో ఉఖాడ్ దేంగే--సీధా కర్‌దేంగే" ఈ దుర్మార్గులందరినీ తుడిచి పెట్టేస్తాము. అన్నీ సరిగా చేసేస్తాం. ఈ మాటలు ఒక ఆధ్యాత్మిక సంపన్నుడన్నాడంటే ప్రపంచంలోని అభివృద్ధి నిరోధక శక్తులు ఎప్పటికయినా నాశనం గాక తప్పదని తెల్లమవుతుంది. ఈ మస్తుల ఒక్కొక్కప్పుడు ఆనందాతిశయంతో పరవశులౌతారని బాబా చెప్తూ యిలా అన్నారు. "బాబాను చూస్తే వారికి ఆనందం చెప్పడానికి వీలులేనంతగా కలుగుతుంది. ఎందుచేతవంటే-బాబాను వారు చూడడమే కాకుండా బాబా నిజంగా ఎవరో వారికి

తెలుసును. ఆసంగతి మీరు మీకళ్లతో చూడలేరు. బాబా యొక్క దివ్యస్వరూపం చూసే కళ్లువేరు. మీ కళ్లతో మీరు మాయలో ఉన్న 'ఆటవస్తువులు' చూస్తారు. బల్ల, కుర్చీ వగైరా అంతే. భగవంతుని చూసే అంతశ్చక్షువు వేరు.''

మార్చి 5వ తేదీన భోపాల్‌లో బాబా 'టిప్పుసుల్తాన్' అనే మస్తును కలిశారు. బాబా అతనిని స్నానం చేయిస్తానంటే తిరస్కరించాడు. తరువాత అక్కడ బషీర్ అనే మస్తుతో సాంగత్యం చేసారు. అతనిని బాబా రెండురోజులు ఉంచుకున్నారు. ఆరోజులలో బషీర్‌ని స్నానం చేయించి బట్టలు తొడిగి భోజనం పెట్టేవారు. ఆరోజునే రెండవ భూమికలో ఉన్న 'మామా మస్తానీ' అనే ఆమెను బాబా స్నానం చేయించి భోజనం పెట్టారు. ఆమె ఒక వృద్ధురాలు. ఆమెను ఒక కుక్క ముక్కు మీద కరిచింది. బాబా భోపాల్‌కి మహమ్మద్ మస్తును కూడా తీసికొని వచ్చి కొన్నాళ్లు వారివద్ద ఉంచుకున్నారు.

మార్చి (1939) 7వ తేదీన మండలితో కూర్చున్నపుడు బాబా యిలా ప్రసంగించారు. ''వియోగం అనేది కలిగించే బాధ ఎక్కువయినప్పుడు అందరూ కావాలనే ఐక్యతాభావాన్ని కలిగించడానికి ఎంతో ఉపయోగపడుతుంది. పుణ్యపురుషుని కయినా పాపికయినా అనుభవం వలననే మంచి కలుగుతుంది. మీరు అందరికి సహాయం చేయాలంటే వారిలో నన్ను చూడాలి. ఇది మీరు ఎప్పుడూ మరిచిపోవద్దు. ఇది జ్ఞాపకం పెట్టుకున్నారంటే మీరు అర్థం చేసుకునేందుకు, వారికీ సహాయం చేసేందుకు మీకు చాలా సులభం అవుతుంది.''

భోపాల్‌లో మార్చి 9వ తేదీన బాబా ఒక ఫకీర్‌ని రప్పించి అతనిని వారి బసలో స్నానం చేయించారు. బాబా భోపాల్ నుంచి ఉజ్జయిని వెళ్లారు. ఉజ్జయినిలో బాబా ఒక మస్తుతో సాంగత్యం చేసారు. అతడొక ముఖ్యమయినవాడు. ఆరవ భూమికకు చెందిన వాడు. అతనిని జనసమ్మర్దంగా ఉన్న వీధిలో బాబా చూసారు. ఒకమారు అతనిని చూసినవారు యింక మరవడం కష్టం. అతడు కొంచెం లావుగా ఉంటాడు. వయస్సు 50 సంవత్సరము లుంటుంది. గోచీపాతరాయుడు ఆరోడ్డు ప్రక్కన చింకిగుడ్డలు కాగితంముక్కలు ఎత్తుగా ఒక కుప్ప చేసుకొని దానివద్ద కూర్చున్నాడు. ఆకుప్పలు నుంచి పాతగుడ్డలు తీసి యింకా చిన్న ముక్కలు చేస్తున్నాడు. బాబా ఆదారినే వెళ్తూ అతనిని మండలికి చూపించి 'ఇతడు చాలా అభివృద్ధి చెందిన మస్తు' అన్నారు'ఆమస్తుకి ఒక రూపాయిచ్చి రమ్మని'పంపించారు.

ఉజ్జయినిలో పని అయిపోయిన వెంటనే బాబా మండలితో మరల జబల్ పూర్ వెళ్ళి, అక్కడ మస్తు ఆశ్రమం ఒకటి నెలకొల్పారు. ఈ ఆశ్రమం మే మాసం మొదటివరకు జరిగినది. మార్చి ఏప్రిల్ మాసములు చురుకుగా పని చేసినది. మనోహరమయిన తోటలో అందమైన భవనంలో యీ ఆశ్రమం నడుపబడినది. భువిలో దివిని సృష్టించినట్లుంది ఆ ఆశ్రమం. మస్తులకోసం యేర్పాటు చేసిన యీఆశ్రమానికి బాబా, 'ఉజ్జయినిలో సాంగత్యం చేసిన మస్తును జబ్బల్‌పూర్ తీసికొని రమ్మని' ఛగన్‌ను పంపించి రప్పించారు. జబ్బల్‌పూర్‌లో పదిరోజుల పాటు తమ ఆశ్రమంలో ఆమస్తును ఉంచుకున్నారు బాబా. తరువాత 'అతనిని ఉజ్జయిని తీసికొని వెళ్లి దిగబెట్టి రమ్మని' ఛగన్ చేత మళ్లీ పంపించేసారు.

బాబా మస్తులను తీసికొని వచ్చేందుకు జబ్బల్‌పూర్ నుంచి కాకాను, జాల్‌భాయిని యిద్దరినీ పంపించారు. వారు ఎల్లిచ్‌పూర్ వెళ్లి అక్కడినుంచి మస్తాన్ మియా అనే మస్తును మార్చినెలలో జబ్బల్‌పూర్ ఆశ్రమానికి తీసుకు రావడానికి చాలా ప్రయత్నించారు. అతడు రావడానికి ఏదో సాకు చెప్పి తప్పించు కున్నాడు. అతడు వచ్చేవాడిలా లేచి నిలబడి టాంగాను తీసుకురమ్మన్నాడు. వెంటనే కాకా వెళ్లి టాంగా తీసికొని వచ్చాడు. కాకాని అందులో ముందు ఎక్కమన్నాడు. సరేనని తీరా కాకా టాంగాలో ఎక్కాక మస్తాన్‌మియా అన్నాడు- ''వెళ్ళునాయనా! నీపని నీవు చూసుకో నాపని నేను చేసుకుంటాను.'' అని అతడు టాంగాలో ఎక్క కుండా కాకాతో వెళ్లకుండా తప్పించుకున్నాడు.

మార్చి (1939) 13వ తేదీన మగర్‌మస్తు అనేవానిని బాబా సాగర్‌లో సాంగత్యం చేసారు. ఇతని శరీరం మీాద పొలుసులు వలె ఉండెడిది. మొసలికి ఉన్నట్లు. అందువలననే అతనిని మగర్ (మకరి) మస్తు అన్నారు. ఇతనిని మొదట్లో సాగర్‌లో సాంగత్యము చేసి బాబా 'జబ్బల్‌పూర్ ఆశ్రమానికి తీసికొని వెళ్లమని అతనిని కాకాకు అప్పగించారు. జబ్బల్‌పూర్ వచ్చిన తరువాత అక్కడ ఆమస్తును వారం రోజులు ఉంచారు. ఆవారం రోజులు బాబా అతని శరీరాన్ని ప్రతిరోజు నూనెరాచి మర్దనచేసి నున్నగా తయారుచేసారు.

మార్చి (1939) 15వ తేదీన మెహెరాబాద్ నుంచి జబ్బల్‌పూర్‌కి మహ మ్మద్‌ను బాబా ఆ ఆశ్రమంలో ఉన్నన్నాళ్లు మే 15వ తేదీవరకూ తమ దగ్గరే

ఉంచుకున్నారు. మిగిలిన మస్తులను ఎవరిని తీసికొని వచ్చినా ఒకటి రెండు రోజుల ఉంచుకొని పంపించేసేవారు బాబా. మహా అయితే పదిరోజుల కన్న ఎవరినీ ఉంచు కొనలేదు.

మార్చిలోనే జబ్బల్‌పూర్ ఆశ్రమానికి ఒక అన్వేషకుడు వచ్చాడు. అతడు కొన్ని నెలలు క్రిందట హరిద్వార్‌లో ఉన్నప్పుడు' బాబా తన వైపుకి నడచివస్తున్నట్లు అతనికొక దృశ్యం కనిపించిందని' చెప్పాడు. 1939 మార్చినెలలోనే కట్నీలో ఉంటూఉన్న ఒక మంచి ఇత్తెఫాకె మస్తును బాబా సాంగత్యం చేసారు. అతడు అయిదవ భూమికలో ఉన్న జలాలీ జమాలీ లక్షణములు కలిగిన మస్తు సన్నగా ఉన్నాడు. కౌపీనం మాత్రం ధరించాడు. అతడు తనతో ఒక కర్ర, కొన్ని మూటలు పెట్టుకొని ఎక్కడికి వెళ్లినా అవి తనతో తీసికొని వెళ్తూంటాడు. కాకా అతనిని జబ్బల్‌పూర్ ఆశ్రమానికి తీసికొని వచ్చాడు. కాకా మొదట్లో అతనివద్దకు వెళ్లి జబ్బల్‌పూర్ రమ్మనమంటే తన చింకిగుడ్డల మూట విప్పి, ఒక గుడ్డ పేలిక కాకాకి యిచ్చి 'వెళ్లమ'న్నాడు. వెళ్లకపోతే కొట్టాడు. మొత్తానికి చివరికెలాగో కాకా అతనిని బాబా ఆశ్రమానికి తీసికొని రాగలిగాడు.

## గులాబ్ బాబా

బాబా కాకాని 'జాల్‌భాయిని, ఎల్లిచ్‌పూర్‌కి సమీపంలోని కరంజ్‌గావ్‌లో ఉన్న గులాబ్ బాబాను జబ్బల్‌పూర్ ఆశ్రమమునకు తీసికొని రమ్మన్నారు. ఆరవ భూమికలో ఉన్న గులాబ్ బాబాను మార్చి (1939) 17వ తేదీన బాబా వద్దకు జబ్బల్‌పూర్ మస్తు ఆశ్రమమునకు జాల్ కాకాలు తీసికొని వచ్చిన తరువాత, ఆ రోజున బాబా ఆమస్తును సాంగత్యం చేసారు.

ఈ గులాబ్ బాబాని తీసికొని వచ్చిన ఉదంతం తెలుసుకోవలసిందే. జాల్ భాయి, కాకా యిద్దరూ జబ్బల్‌పూర్ నుంచి ఎల్లిచ్‌పూర్ వెళ్లి అక్కడికి 8మైళ్ల దూరంలో ఉన్న కరంజ్‌గావ్ అనే గ్రామానికి వెళ్లారు. ఇద్దరూ అక్కడ నివాసం ఉంటూ ఉన్న గులాబ్ బాబా యింటికి వెళ్లారు. అతడు 35—40 సంవత్సరముల వయసున్న వాడిలా కనిపించాడు. లోపలికి వెళ్లేసరికి గులాబ్ బాబా వద్ద పాతిక ముప్పయి మంది కూర్చుని ఉన్నారు. ఆ మస్తు అంటే అక్కడ మిక్కిలి గౌరవం

అందువల్ల ప్రతిరోజూ చాలామంది అతనివద్దకు వచ్చి కూర్చొనిపోతూ ఉంటారు. జాల్, కాకా లిద్దరూ లోపలికి అడుగుపెట్టగానే గులాబ్ బాబా అక్కడ కూర్చుని ఉన్నవారితో — "నిన్న మీాకు చెప్పానే—రేపు నాకోసం యిద్దరు వస్తారు'అని — అదిగో వీళ్లే, వచ్చారు చూడండి" అని జాల్, కాకాలను వారికి చూపించాడు గులాబ్ బాబా. వారిని కూర్చోమని గులాబ్ బాబా "దివ్యంతో కూడిన రంగులు నాకు పులుముదామనుకుంటున్నాడు. నాకవేమీా వద్దు" అన్నాడు. 'ఎవరి సాంగత్యం వలన ఆధ్యాత్మికంగా పురోగమించనున్నాడో ఆ బాబా గురించే యితడంటున్నాడని కాకా గ్రహించాడు. కాకా, గులాబ్ బాబా పాదాల వద్ద చేరి అతని పాదాలు పట్టుతూ 'మెహెర్ బాబా' అని ఉచ్చరించాడు. అప్పుడు గులాబ్ బాబా "ఇడుగో నన్ను పట్టేసుకున్నాడు కానీ నాకు వెళ్లాలని లేదు. నన్ను గొప్ప గృహారామానికి (భగవంతుని వద్దకు) పంపాలని చూస్తున్నాడు. కానీ అక్కడికి నేను వెళ్లదలచుకో లేదు" అన్నాడు. కాకా మళ్లీ 'మెహెర్ బాబా' అని ఉచ్చరించి రెండుచేతులతోను మెల్లగా గులాబ్ బాబాని పట్టుకున్నాడు. గులాబ్ బాబా వెంటనే లేచి నిలబడి బయటకు నడవగానే జాల్‌భాయి, కాకా అతనిని బస్‌స్టాండుకి తీసుకొని వెళ్లారు. అక్కడ ఇటార్సీ వెళ్లే బస్సు ఎక్కి, అక్కడనుంచి జబ్బల్‌పూర్‌కి రైలులో ప్రయాణం చేసి వచ్చారు. బస్సు ప్రయాణం మధ్యలో కాకా ఒక ఊరిలో గులాబ్ బాబాకి లడ్డూ కొనిపెట్టాడు. తరువాత ఇటార్సీ స్టేషన్‌లో జాల్, కాకాలను 'నిద్రపొమ్మని చెప్పాడు గులాబ్ బాబా. వాళ్లు నిద్రపోతే బాబా వద్దకు వెళ్లడం తప్పించు కుందామని అలా అన్నాడు. వాళ్లు 'మాకు నిద్రరాలేదు, మీారే నిద్రపోండి' అన్నారు' అది విని గులాబ్ బాబా "వీళ్లని నావెనకాతలే పంపుతున్నావెందుకు? ఒక్క క్షణ మైనా నన్ను ఒక్కడిని వదలడం లేదు"? అని భగవంతుడితో చెప్పుకున్నాడు. తోటి ప్రయాణికులతో 'ఇతడొక పిచ్చివాడు లెండి' అని కాకా సర్ది చెప్పాడు.

తెల్లవారి 3 గంటలకు రైలు జబల్‌పూర్ చేరుకుంది. జాల్ కాకాలతో బాబా ఆశ్రమం ప్రవేశించగానే 'ఇది ఆయన ఆస్పత్రి" అన్నాడు గులాబ్ బాబా. మర్నాడు ఉదయాన్నే బాబా మస్తును చూడడానికి వస్తూ ఎరుపు, ఆకుపచ్చ, పసుపు పచ్చ రంగుల మిటాయి ఉండలున్ను, గులాబ్ బాబా కూర్చోవడానికి ఒక చాపను పంపించారు. గులాబ్ బాబా ఆ చాపను చూసి "ఆయన పంపించిన

చాప మీద నేను కూర్చోను'' అని 'ఆ మిటాయి కూడా వద్దని' తోసేసాడు. కానీ కాకా నచ్చచెప్పి కొంచెం మిటాయి తినేలా చేశాడు.

కొంచెంసేపట్లో బాబా గులాబ్ బాబా ఉన్న గదిలో ప్రవేశించారు. ఆయనను చూసి కాకాతో "ఆయన స్వయంగా భగవంతుడే, నీవు నన్ను మాయ చేసి తీసికొని వచ్చావు'' అన్నాడు. అప్పుడు ఆచాపమీద బాబా కూర్చొని గులాబ్ బాబాను ఆయన ప్రక్కన కూర్చొనమని సైగచేసారు. "ఆయన ప్రక్కన కూర్చొనడానికి నేను తగను'' అన్నాడు గులాబ్ బాబా. తరువాత బాబా సన్నిధిలో మృదువుగా చెప్పగా అన్నీ విన్నాడు. బాబా అతనికి కేశఖండన చేసి, స్నానం చేయించారు. అన్నం కూడా తినిపించారు. భోజనం చేస్తూ మధ్యలో గులాబ్ బాబా బయటకు వచ్చి నాకు దారి కనబడడం లేదు. నాకు కళ్ళు కనిపించడం లేదు'' అని అరిచాడు. ఉద్రేకంలో ఉన్న గులాబ్ బాబాని, కాకా మెల్లిగా దువ్వి లోపలికి తీసికొని వచ్చాడు. అప్పుడు బాబా అతనికి పూర్తిగా భోజనం పెట్టారు. తరువాత కాకాని పిలిచి 'గులాబ్ బాబాను తిన్నగా కరంజ్‌గావ్ తీసికొని వెళ్లి అక్కడ దిగబెట్టి రమ్మ' న్నారు. కరంజ్‌గావ్‌లో తన యింటికి వెళ్లిన తరువాత గులాబ్ బాబా కాకాని 'అక్కడ తనతో ఉండమని కోరగా' 'నాకు ఉండడానికి బాబా అనుజ్ఞలేదని' చెప్పి కాకా తిరిగి జబల్‌పూర్‌కి వెళ్లిపోయాడు.

మార్చి (1939) 18వ తేదీన జబ్బల్‌పూర్‌లో బాబా యొద్దకు ఒక గొప్ప కాంగ్రెసు కార్యకర్త వచ్చాడు. అతడిది 'కె' అందాము. అతడు ఐ.సి.యస్ పరీక్ష పాసయి పెద్ద ఉద్యోగములు చేసినవాడు. కాంగ్రెస్ ద్వారా దేశానికి సేవ చేయాలని ఉద్యోగం నుండి విరమించుకున్నాడు. ఆ మాట వినగానే బాబా "మంచి పని కోసం చేసిన త్యాగము మధురముగా ఉంటుంది'' అని అన్నారు. అతడు బాబాను చూడవచ్చి ఆయనతో యీ దిగువ విధముగా సంభాషించాడు.

కె:— భగవంతునిలో నమ్మకము అవసరమేనా?

బాబా:— నమ్మకం అంటే నీవు చేసుకున్న అర్థాన్ని బట్టి ఉంటుంది. దేవునిలో నమ్మకం ఉన్నవారు కొందరు తమ శీలాన్ని కాపాడుకోలేక ఆధ్యాత్మికాభివృద్ధి పొందలేదు. కొంతమంది దేవునిలో నమ్మకం లేకపోయినా గొప్ప ఉదాత్తమైన జీవితమును జీవించి దేవునికి సన్నిహితంగా వస్తారు.

కె:— ఈ ప్రపంచానికి లక్ష్యం ఏమిటి?

బాబా:— ఆత్మయే అనంతము, శాశ్వతము అని తెలుసుకొని యీ ఆత్మజ్ఞానం పొందడమే.

కె:— అసలు యీ విశ్వం ఎలా వచ్చింది?

బాబా:— దీనికి చాలా చెప్పవలసి ఉంటుంది. 'విశ్వము సృష్టించబడినది' అని అనుకుంటే, అది మా అభిప్రాయమునకు చాలా విరుద్ధము. 'విశ్వము అసలు లేదనే మా అభిప్రాయం. భగవంతుడే నిజముగా యీ విశ్వరూపంలో కనిపిస్తున్నాడు. సృష్టికి భగవంతుడు, విశ్వము అను ద్వంద్వభావం అవసరము. జాగ్రదవస్థ అర్థం చేసుకోవడానికి స్వప్నావస్థ అనుభవపూర్వకంగా తెలుసుకోవాలి. కలలు మంచివి కావచ్చు చెడ్డవి కావచ్చు. కలలో నీవు బాధపడనూవచ్చు, సుఖించనూ వచ్చు. నీవు మెలకువ తెచ్చుకుంటే అది కలయని నీకు తెలుస్తుంది. కాని యీ కలం (జగన్మాయ) ఉన్నదే దానినుండి నీవు తొందరగా మెలకువ తెచ్చుకోవాలి. యీ జీవితంలో నీవు త్యాగము, మంచి నడవడి, నిస్వార్థ సేవ కలిగియుంటే నీకు త్వరగా మెలకువ వస్తుంది. అంటే త్వరగా జ్ఞానం కలుగుతుంది.

కె:— సత్ప్రవర్తన కంటె చెడ్డనడత కలుగజేసే శక్తులు ఎందుకు బలవత్తరంగా ఉంటాయి?

బాబా:— అదంతా విశ్వధర్మం. అంత ఎక్కువగా కనిపించే బాధ సుఖించడానికి అవసరం. స్వేచ్ఛ అనుభవించి దాని సుఖం తెలుసుకోవడానికి బంధము అవసరమయినట్లే దుష్టశక్తులు తాత్కాలికంగా విజృంభించకపోతే బాధలు అనుభవించడానికి వీలుండదు. ఈవిశ్వం ద్వంద్వము మీద ఆధారపడియున్నది. 'బంధము—స్వేచ్ఛ, చెడ్డ—మంచి' ఇవి అన్యోన్యంగా ఒక దానిమీద ఒకటి ఆధారపడి ఉన్నవి. వీటిలో ఒక్కటే ఉంటే యీ జీవితానికి అర్థం ఉండదు. చివరకు స్వేచ్ఛ పొందాలంటే, సుఖం కలగాలంటే, దుష్టశక్తులకే తాత్కాలికంగా విజయం అవసరము.

కె:— భగవంతుడు అంత దయామయుడయినప్పుడు యింతమందికి యిలా ఎందుకు బాధలు కలుగ జేస్తున్నాడు?

బాబా:— దీనితో భగవంతునికి ఏమీ ప్రమేయం లేదు. భగవంతుడు విడిగా ఉన్నాడు. అయినా జరిగేదంతా కూడా ఆయనప్రేమ వలన ఆయన ఇచ్ఛ వలన జరుగుతుందనే అంతగా సక్తుడై యున్నాడు. నీకు ఒక స్వప్నం వస్తోందనుకో.

నీకు త్వరగా మెలకువ రాకుండా ఉంటే అంత సుఖం ఆ స్వప్నంలో నీవు అనుభవిస్తున్నావనుకో. అలా ఉండగా నీకు ఆకలలో ఒక పాము కనిపించే సరికి వెంటనే నీకు కనిపించేసరికి వెంటనే నీకు మెలకువ వస్తుంది. అది భగవంతుని ధర్మం. నీ మెలకువ స్థితిలో భగవంతుడు దయామయుడూ కాదు క్రూరుడూ కాదు.

కె:— ఆధ్యాత్మిక జ్ఞానం పొందడానికి ప్రపంచం పరిత్యజించవలెనా?

బాబా:— అంతరంగ సన్యాసం అవసరం. కానీ బాహ్యత్యాగం కాదు. ప్రపంచాన్ని వదిలితే నీవు భగవంతుని దగ్గరకు పోజాలవు. ఈ ప్రపంచంలో నీవు జీవించాలి. నీ విధులన్నీ నిర్వర్తించాలి. అయినా నీవు యిన్ని పనులూ చేసుకుంటూనే ఏకాంతంలో ఉన్నట్టుగా అసంగుడవై యుండాలి. అరణ్యాలకి పోయినంత మాత్రాన నీ శరీరాన్ని మనస్సును ఎలా త్యజించగలవు? అంటే ఎలా మరచిపోగలవు?

కె:— ఇండియావంటి బానిస దేశంలో తన దేశ స్వాతంత్ర్యంకోసం పాటుపడడం ప్రతి భారతీయుని యొక్క విధికాదా? (ఈ సంభాషణ 1939లో అంటే మన దేశం స్వతంత్రం కాక ముందు జరిగినది)

బాబా:— అవును. కానీ అది ఆధ్యాత్మికంగా ఉండాలి. నీకు భౌతికంగా స్వేచ్ఛ వచ్చి ఆధ్యాత్మికత్వం లేకుండా యింకా మాయలోనే చిక్కుకుంటే అది నీకు నిజమైన స్వేచ్ఛ కాదే! నీవు హృదయపూర్వకంగా ఇండియాకు స్వేచ్ఛరావాలని ప్రయత్నించాలి కాని ఆ స్వేచ్ఛ నీవు సత్యం వైపుకి, ఆధ్యాత్మికత్వం వైపుకి నడిపించేదిగా ఉండాలి.

కె:— పూర్వం లాగ ఇండియా ప్రపంచాన్ని నడిపించడానికి ముందుకి వస్తుందా?

బాబా:— ప్రపంచాన్ని ఆధ్యాత్మికంగా నడిపించడం ఇండియా యొక్క విధి.

కె:— మీరు ప్రపంచానికి ఎప్పుడు మీరు (మెహెర్ బాబా) అని వ్యక్తం అవుతారు?

బాబా:— సమయం దగ్గరలోనే ఉంది.

కె:— గాంధి చూపించిన మార్గమే ఇండియాకు స్వేచ్ఛను ప్రసాదిస్తుందా?

బాబా:— కొన్ని విధాలుగా అంతే. అది పరిస్థితులపై తప్పక ఆధారపడి ఉంటుంది. ఇప్పుడు యింతగా ఇండియాలో అంతరంగ సంఘీభావం లేకపోవడమనేది ఉండకుండా ఉంటే గాంధి విధానం ప్రకారం కొన్ని నిమిషాల్లోనే స్వేచ్ఛ వస్తుంది. కానీ హిందూ మహమ్మదీయులు ఏకంకావడం ఎంతో కష్టం. గాంధి నన్ను నాలుగు మారులు

చూసాడు. ప్రతిమాటూ యిదే చెప్పాను. హిందూ మహమ్మదీయులు కలిసి ఉండక పోతే యే అభివృద్ధి రాదు. ఇండియాకు నిజంగా స్వేచ్ఛ రావాలని కోరుతూ హృదయం అంతా వెట్టి పని చేయండి. కానీ మీరు చేసే పనికి ఫలితాలను గురించి ఆలోచించవద్దు. లక్షలాది జనులు చేయలేని పని మీబోటివారు చేయగలరు. మీలో హృదయం ఉంది. బుద్ధి ఉంది. నిజాయితీ ఉంది. ఇండియాకి స్వేచ్ఛ కలగాలని చేసే నిస్వార్ధసేవ నిన్ను చివరికి భగవంతుని వద్దకు తీసుకొని పోతుంది.

దానితో యీ సంభాషణ ముగిసింది. ఈపర్యటనలో బాబా తరచుగా యుద్ధం గురించి మాట్లాడేవారు. "ప్రజలు యుద్ధం కావాలంటున్నారు. ఈ యుద్ధంలో అన్ని దేశాలకి ప్రమేయం ఉంటుంది. అమెరికా, పెర్షియా దేశాలకు కూడా. లేకపోతే ఆర్ధిక యుద్ధం. అసలు యుద్ధం కన్నా ఆధ్వాన్నంగా ఉంటుంది. దీనివలన దేశాలలో అంతరంగ విప్లవాలు బయలుదేరుతాయి. జర్మనీ జర్మనీతోనే యుద్ధం సాగిస్తుంది. అందులో హిట్లరు చనిపోతాడు. ఇటలీ ఇటలీతోనే యుద్ధం చేస్తుంది. అందులో ముస్సోలినీ చనిపోతాడు. ఇంతకంటే బహిరంగ యుద్ధమే మంచిది. ఫ్రాన్సులో విప్లవంలో ఏం జరిగిందో మీకు తెలుసునా? అలాగే ప్రతి దేశంలోనూ ఉంటుంది.

'ఇప్పుడు దేవుడు లేడు మతం లేదు' అనే వాదం ప్రబలుతోంది. దైవ పరము మతము పరము అయినవారికి జయం లభించుటలేదు. రష్యా, ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ దేశాలలో ప్రజలు వారికి తెలియకుండానే నాస్తికులవుతున్నారు. అలాగే పెర్షియాలోను, టర్కీలోను, ఇండియాలోను జరుగుతోంది. జర్మనీ హిట్లరుని, ఇటలీ ముస్సోలినీని రక్షపులని అనుకుంటున్నారు. యుద్ధం ప్రారంభం అయితే ఎంత ఘోరంగా ఉంటుందో మీకు తెలుసునా? కొద్ది రోజులలోనే లండన్, పారిస్, బెర్లిన్ నగరాలు ఎడారులూ అయిపోతాయి. ఆడవారు పిల్లలూ అంతా బాధ పడ తారు. అంతా గందరగోళం అయిపోతుంది. ఇక్కడ మనము సురక్షితంగా ఉన్నా నేను అందరి బాధలు వహిస్తున్నాను.

## ముష్టీ మస్తు

బాబా 1939వ సం. మార్చినెలలో జాల్‌భాయిని, కాకా బారియాని బుర్హాన్‌పూర్ వెళ్లి కొందరు మస్తులను జబ్బల్‌పూర్ ఆశ్రమానికి తీసికొని రమ్మని

పంపించారు. అక్కడ వారు మున్షీ అను మస్తాని చూసారు. ఆ మస్తాన్ అంత పొడుగు కాకుండా పొట్టికాకుండా కొంచెం లావుగా ఉంటాడు. మున్షీ లుంగీ మాత్రం కట్టుకున్నాడు. సంతోషయుతమైన వదనంతో ఉన్నాడతడు. పొట్టిగా ఉన్న గడ్డము కలిగియున్నాడు. బుర్హాన్‌పూర్‌లో ఒక హోటలలో జాల్‌తో వెళ్లినప్పుడు కాకా మొదట మున్షీని చూసాడు. మున్షీ వారికి భోజనం పెట్టించి వారిని ఎక్కడ నుంచి వచ్చారని' అడిగాడు. వారు 'జబ్బల్‌పూర్ నుంచి వస్తున్నామని' జవాబు చెప్పారు. 'బాబా జబ్బల్‌పూర్‌లో ఉన్నారుకదా, ఆయనతో ఆధ్యాత్మిక సాంగత్యం చేసాడేమోనని' కాకా అనుకున్నాడు. ప్రతిరోజూ అర్ధరాత్రివేళ బుర్హాన్ పూర్ నుంచి అసిర్‌గర్‌కి మున్షీ వెళ్తూంటాడనీ, దారిలో అడవిలో నుంచి అతనికి తోడుగా రెండు పెద్దపులులు అతని వెంట వెళ్తాయని—అక్కడ చెప్పుకుంటారు. ఇతడొక గౌస్. రాత్రుళ్లు అతని చేతులొక చోట, కాళ్లొక చోట, మొండె మొక చోట—ఉంటాయని ప్రతీతి. గౌస్‌లు అవయవములు విడివిడిగా తీసుకొని మరల అతికించుకోగలరని హిందూ–మహమ్మదీయులు నమ్ముతారు. 'నిజమైన గౌస్ అంటే భగవత్సాక్షాత్కారం పొందినవాడనీ, అతనిని ఖుతుబ్ అనికూడా అంటారని' బాబా చెప్పారు. ఒక ప్రత్యేకమయిన చైతన్య స్థితిలో అతడు కాళ్లు చేతులు విడదీసుకోగలగడం గౌస్ యొక్క లక్షణం అన్నమాట. అలా అవయవములు విడదీసుకొనేటప్పుడు ఎవరయినా చూస్తే వాళ్ల కళ్లుపోతాయి.

మున్షీ రాత్రి 11 గం॥ లకు బయలుదేరి అసిల్‌గర్ వెళ్తూ తనతో కూడా కాకాని రమ్మన్నాడు. ఒక మైలు వెళ్లిన తరువాత మున్షీ కాకాను 'వెనక్కి తిరిగి వెళ్లిపొమ్మ'న్నాడు కాకా అప్రకారమే చేసాడు. మర్నాడు ఉదయం మున్షి కనిపించి కాకాతో "నిన్న పంపినవానితో చెప్పు—నాకు ఏమీ లేకుండా ఒక చొక్కా అయినా లేకుండ నన్ను వదిలిపెట్టాడని చెప్పు. ఇప్పుడు నేను ఒక్కడిని నాయింట్లో హాయిగా కూర్చుంటే నన్ను బాధ పెట్టడానికి నిన్ను ఎందుకు పంపాడు?" అన్నాడు. కాకా జాల్‌భాయిలతో మున్ని రావడానికి నిరాకరించాడు. ఈమాటలనిన తరువాత వారిరువురు అతనిని విడిచి వెళ్లిపోయారు. మున్షీ ఆరవ భూమికలోని మస్తు.

బుర్హాన్‌పూర్‌లోనే రావూజీ అనే యింకొక మస్తు కూడా ఉన్నాడు. అతడు కాకా, జాల్‌భాయి 'జబల్‌పూర్ రమ్మని' పిలుస్తే 'నేను రానన్నాడు' సాధారణంగా రావుజీ స్టేషన్ పరిసరాలలో ఉంటూ ఉంటాడు. కాకా, జాల్‌భాయి అక్కడ

రావుజీని చూసి అతనికి భోజనం పెట్టారు. ఇతడు పొట్టిగా బక్కగా ఉన్న హరిజన్ ముసలివాడు. గుజరాతీ మాట్లాడుతాడు. వారు పెట్టిన భోజనం తిని, కాకాను దగ్గరకు పిలిచి, ఒక్క లెంపకాయ కొట్టాడు. ఇలా కొట్టిన తరువాత వారితో జబల్‌పూర్ వెళ్లడానికి అంగీకరించాడు. కాని తీరా 'బయలుదేరమనే' సరికి 'నేను రాను, మీరుపొండి' అని భీష్మించుకుని కూర్చున్నాడు. ఇతడు కూడా గౌస్ వంటి మస్తు అని ఖ్యాతి గాంచాడు. కానీ నిజంగా యితడు గౌస్ వంటి స్థితిలో లేడు. మున్షీ అంత గొప్ప చైతన్యస్థితి యితనికి లేదు.

## దాదా మహరాజ్

దాదా మహరాజ్ అనే వృద్ధుడు అమరావతిలో ఉండేవాడు. ఇతడు ఆరవ భూమికలోని మజ్జూబ్ వంటి మస్తు. ఇతనిని అమరావతి నుంచి మార్చి (1939) లో జబ్బల్‌పూర్ ఆశ్రమానికి రప్పించి బాబా యితని సాంగత్యము చేసారు. ఇతనికి 80 సంవత్సరముల వయస్సు ఉంటుంది. నడువలేక ఉన్న వృద్ధావస్థలో ఉన్న యీ మస్తును మోసుకొని బాబా వద్దకు తీసికొని వచ్చారు మండలి. దాదా మహరాజ్ ను అమరావతి పౌరులు మిక్కిలి గౌరవంగా చూస్తారు. అతడు ఎప్పుడూ తనతో పాటు ఒక మూట, ఒక టోపీ తీసికొని వెళ్తూంటాడు. ఆరెండింటినీ దాదా మహరాజ్ 'తన తల్లీ తండ్రి' అనేవాడు. ఈమస్తు గంజాయి విపరీతంగా త్రాగే వాడు (పీల్చేవాడు). దాదా మహరాజ్ ఒక చేతిలో పేక ముక్కలు పట్టుకునే వాడు. మధ్యపరగణాలలోని న్యాయపరిపాలన అతని చేతిలో ఉండేదని కొందరి నమ్మకం. అతని ఆధ్యాత్మికోన్నతి అటువంటిది. పోలీసువారు ఎవరిని అదుపులోనికి తీసుకోవాలో, న్యాయమూర్తి ఎవరికి శిక్షవేయాలో ఎవరిని శిక్షలేకుండా వదిలివేయాలో అంటే నిజంగా ఎవరు నేరస్తుడో ఎవరు కాదో దాదా మహరాజ్ మీద ఆధారపడి ఉండే దంటారు. ఈవిశ్వాసం వల్ల నేరస్తులు అతని శరణుజొచ్చి పశ్చాత్తాప పడుతూ క్షమార్పణ వేడుకునేవారు. బాబా యితనిని కొన్ని గంటలు మాత్రం వారి జబ్బల్‌పూర్ ఆశ్రమంలో ఉంచుకొని తరువాత అమరావతి పంపించేసారు.

## ఖాలామాసి

మార్చి (1939) 31వ తేదీన బాబా జబ్బల్‌పూర్‌లో ఉండగా సియోనీ నుంచి ఉన్నతురాలైన ఖాలామాసి అనే మస్తానీని బాబా వద్దకు వగన్ అనే బాబా

శిష్యుడు తీసికొని వచ్చాడు. ఆమె వృద్ధురాలు. అప్పుడు ఆమె బాబాను చూడ గానే ఆయన ఆధ్యాత్మిక వైభవోన్నతి దర్శించి ఆయనను ఆలింగనం చేసుకొని తన చేతులతో తన కణతలు నొక్కుకుంది. బాబా ఆమెను స్నానం చేయించి నూతన వస్త్రములు యిచ్చి 'కట్టుకో'మన్నారు. బాబా ఆమెకు స్వయంగా భోజనం పెట్టారు. ఆమెకు అన్నం తినిపించిన తరువాత ఆమెతో కొంతసేపు ఏకాంతంగా కూర్చున్నారు. యీ ఆధ్యాత్మిక సాంగత్యం అయిన తరువాత ఖాలామాసి బాబాతో — "దర్యామేసే థోడా పానీ హంకో భీ పిలారే" (నీ మహాసముద్రంలో నుండి నాకు కూడా త్రాగేందుకు కొంచెం నీరు యివ్వు) అని అడిగింది.

1939 ఏప్రెల్‌లో మిఠాయి బాబా అని 16, 18 సంవత్సరముల వయసు కలిగిన ఒక యువకుని జబ్బల్‌పూరులో సాంగత్యము చేసి బాబా తమ ఆశ్రమానికి తీసికొని వచ్చారు. అతడొక భగవదున్మత్తుడు. ఎల్లప్పుడూ అటూ యిటూ కదులుతూ ఉంటాడు. ఈ యువక మస్తుకి మిఠాయి అంటే బహు యిష్టం. ఒకమారు జబ్బల్‌పూర్ ఆశ్రమం నుంచి ఎవరికీ చెప్పకుండా ఎక్కడికో వెళ్లిపోయాడు. యీ మస్తు.ప్రజలు చెప్పిన ఆచూకీని బట్టి, వెంటనే అతనిని 60 మైళ్ల దూరంలో వెదకి పట్టుకున్నారు. అతడు వెళ్లిన 24 గంటలకి మరల ఆశ్రమమునకు తీసికొని వచ్చారు.

ఈ నెలలోనే దాదామియా అనే మస్తును అమరావతి నుంచి జబ్బల్‌పూర్ ఆశ్రమానికి తీసికొని రావాలని చగన్ ప్రయత్నించారు. అతడు రానొల్లక "బాబా చక్రవర్తి. ఆయన వద్దకు నేనెలా వస్తాను?" అన్నాడు. బాబా స్థితి ఆ మస్తు తెలుసుకున్నాడు గనుక అతనిని ఆశ్రమానికి తీసికొని వచ్చే ప్రయత్నం విరమించారు.

## విల్-బాకెట్ మేరీ

బాబా యొక్క పాశ్చాత్య ప్రేమికులలో విల్—బాకెట్, అతని భార్య మేరీ— బాబాను చక్కగా అవగాహన చేసుకున్నారు. అతనికి, ఆమెకు ఉన్న ప్రేమించే శక్తి, నెమ్మది, ఓర్పు అనన్యసామాన్యమైనవి. 1939, ఏప్రెల్ మాసంలో విల్‌బాకెట్ వ్రాసాడు—"నాకు అనేకమందితో వరుసగా సంభాషించే అవకాశము కలిగినది. ఈ

వచ్చిన చిన్న, పెద్ద వారందరి మీద, వారి శీలము వారి చైతన్యము మీద బాబా ప్రేమ ప్రభావం అపారంగా ఉంది. వారి కష్టాలు వెళ్లబోసుకునేందుకు వారు వస్తారు. బాబా సాన్నిధ్యం, బాబా శక్తి, బాబా ప్రేమ వీటిని గురించి చెప్తుంటాను. బాబా నాదగ్గర లేకపోయినా ఆయన గొంతుక నాకు వినిపిస్తూనే ఉంటుంది. అది నేను విన్న ధ్వనులన్నిటికంటే కూడా అద్భుతంగా ఉంటుంది. నేను ఆయన సహజమైన అసలు కంటం యీజన్మలో వినకపోయినా.''

విల్ యింకా యిలా వ్రాసాడు. ''వీధులలో కూడా బాబా సన్నిధానం, ఆయన శక్తి, క్రిక్కిరిసి ఉన్న లండన్‌లో ప్రకటన అవుతోంది. ''ఒకమారు నేనూ మేరీ కలిసి చేరింగ్‌క్రాస్ రైలుస్టేషన్ సమీపంలో ఒక రైల్వే పోర్టర్ (కూలీ)ని కలిసాము. ఆ గుంపులో వాడొక్కడే బాగా పొడవుగా ఉండడంచేత, వాని ముఖం మాకు కనిపించింది. వ్యభిచారం చేత ఆ ముఖం మీద సెగసవాయి రోగాల ఆనవాళ్లు బాగా కనిపిస్తున్నాయి. మరుక్షణంలోనే ఆముఖం బాబా ముఖంలా మారిపోయింది. వానిని ప్రేమించకుండా ఉండడం ఎలా? మరి కొంతకాలం అయినతరువాత లీస్టర్‌స్క్వేర్ వద్ద యింకొకణ్ణి చూసాను. అతడు అకస్మాత్తుగా నాకెదరయ్యాడు. వాడి ముఖం మీద దుర్భరమైన జబ్బు కనిపించింది. అది చూడడానికే అసహ్యంగా ఉంది. వాడి కళ్లల్లో నిరాశ ద్యోతకం అవుతోంది. నేను వెంటనే చకితుణ్ణయిపోయాను. ఆ వెంటనే నాలో నుంచి ఒక ప్రేమకిరణం అతనివైపు ప్రసారం అయ్యింది. మానవకోటి కంతకు అది వ్యాపించింది. అది మామూల్ప ప్రేమ కిరణం కాదు. అది బాబా స్వంతంగా నాకిచ్చిన ప్రేమశక్తియొక్క ప్రసారమే. నావల్ల ఏప్రయత్నమూ లేకుండా, ఆదివ్యప్రేమ దానంతటఅదే ప్రవహించింది''— అని విల్ తన లేఖలో వ్రాసాడు.

1939 మే 11వ తేదీన విల్ బాబాకి వ్రాసిన ఉత్తరంలో—''మీకు ఉత్తరం వ్రాయడమంటే అది ఒక అద్భుతమైన సంగతి. ఆ మహాభాగ్యం కోసం నేను ఎదురు చూస్తూ ఉంటాను. ఆ అవకాశం అధికమవుతున్న సంతోషంతో నేను స్వీకరిస్తాను'' అని వ్రాసాడు. ఒకనెల తరువాత విల్ మళ్లీ జూన్ నెల 4వ తేదీన ''మాకు నిన్న మెహెర్ జాబు అందినది. దానిని వెంటనే ఎంతో ఆతురతతో చదివాము. ఎల్లప్పుడూ మిమ్మే మనసులో ఉంచుకొని తృష్ణతో తహతహలాడుతూ జీవించే మా ఆత్మలకు అది అమృతసేచనంలా ఉంది'' అని బాబాకి

వ్రాసాడు. విల్ వ్రాసిన యీ ఉత్తరానికి అతని భార్య మేరీ యీ పంక్తులు కలిపింది—"మా హృదయములు మీవైపుకే ఎల్లప్పుడూ తిరిగి ఉంటున్నాయి. అయినా అవి తిరిగి ఉండవలసిన పనిలేదు. ఎందుకంటే మీ ప్రేమ చేతను, అను గ్రహంచేతను అవి చైతన్యంతో నిండి ఉంటున్నాయి."

ఇంక బాబా పర్యటన విశేషాలు చూద్దాము. తిరుగు ప్రయాణంలో బాబా జబ్బల్‌పూర్ నుంచి మరల నాగపూర్ వెళ్లారు. నాగపూర్‌లో బాబా దర్శనం చేసుకుందామని పంజాబు నుంచి ఒకడు వెయ్యి మైళ్ల ప్రయాణం చేసి వచ్చాడు. అంత శ్రద్ధతో హృదయం తెరచుకొని వచ్చిన వానికి బాబా తప్పకుండా దర్శనం యిచ్చి సహాయం చేస్తారు. అతడు బాబాతో యిలా అన్నాడు. "నేను మామూలు మనిషిని, నాకు బాధలున్నాయి. నాకోరికలకు నావైఖరులకు నేనుదాసుణ్ణి. నా మనస్సు స్థిరంగా లేక నాకు శాంతి ఉండటం లేదు. ధ్యానం చేయాలని ప్రయత్నించాను. లాభం లేకపోయింది. నామనస్సుకి ఏకాగ్రత కుదరటం లేదు. నాకు ఒక భార్య, పిల్లలు, మంచి ఉద్యోగం, సౌఖ్యవంతమయిన ఇల్లు అన్నీ ఉన్నాయి. కానీ, నేను భగవంతునికి నా జీవితమునే అర్పణ చేయడానికి, నాఆస్తులన్నీ అర్పించడా డానికి సిద్ధంగా ఉన్నాను. నాకు మీరు మార్గం బోధించండి. నేను యిక్కడికి రావడానికి త్యాగం చేయలేదు. కానీ ఎప్పటినుండో నాలో ఉన్న కాంక్ష యీ నాటికి తీరింది. మీరు అవతార పురుషులు. నాకు సహాయం చేయండి" హృదయ పూర్వకంగా యిలా అడిగిన వానితో బాబా "సరే నీవు చాలామంది గురువులను చూసావు! చాలా గ్రంథాలు చదివావు. ఇప్పుడు నన్ను చూసావు. గనుక నన్ను తెలుసుకోవడానికి ప్రయత్నించు. నీవు నీఆశయం నెరవేర్చుకోగలవు. రేపటినుంచి రెండురోజులు నీవు ఆహారం తీసుకోవద్దు. ఏమీ తినవద్దు, త్రాగవద్దు, మాట్లాడ వద్దు. ఆ తరువాత నేను నీకు మళ్లీ ఏమి చేయాలో చెప్తాను. నీవు ఉపవాసం ఉండి మౌనంగా ఉన్నందువలన, నేను చెప్పినట్లు చేయడం వలన నీకు అంతరంగంలో అనుభవం కలుగుతుంది. నీవు ఎప్పటినుండియో కావాలనుకుంటున్న అనుభవం కలుగుతుంది. బయటనుంచి నీవుపొందేదిఏమీ లేదు. అంతా యిదివరకే నీలోనే ఉంది. నేను నీ హృదయంలో ఉన్నాను. నీకు కావలసినదల్లా నీహృదయాన్ని తెరవడమే. అది నేను చేస్తాను. నేను చెప్పినది తు.చ. తప్పకుండా పాటిస్తే నీవు సత్యాన్ని చూస్తావు. సత్యాన్ని నీవు ప్రత్యక్షంగా నీయెదుట చూస్తావు. అప్పుడు

దేవుడున్నాడని అనుభవపూర్వకంగా సందేహం లేకుండా తెలుసుకుంటావు'' అన్నారు. చిన్న పిల్లవానిలా 'నేను ఏమి చెప్పేనో చెప్పు' అని బాబా అతని చేత చెప్పినదంతా చెప్పించారు. అంతా అతడు చెప్పి—''బాబా! మీ అనుగ్రహం వలన నా జీవితం సార్థకం అవుతుందని యిప్పుడు నాకు తెలిసినది'' అన్నాడు.

మధ్యాహ్నం 3 గం.లకు బాబా కొంతమంది భక్తుల యిండ్లకు బయలు దేరారు. హిందువులు ఎక్కువగా ఉన్న వీధులగుండా బాబా కారులో వెళ్తూ ఒక ధనికుడు, వ్యాపారస్తుడు అయిన ఒక భక్తుని యింటివద్ద కారు ఆపి, లోపలికి వెళ్ళారు. ఇల్లు పాతదయినా చక్కగా అలంకరింపబడి ఉంది. లోట మధ్యలో ఒక పెద్ద మర్రిచెట్టు ఉంది. ఆయింటిలోని గాలి సుగంధముంతో నిండియుండెను. ఆ గృహస్థు గుమ్మంలో నిలబడి యున్నాడు. బాబా సమీపించగానే ఒక గులాబీ పుష్పమాలతో ఆయనను సత్కరించి బాబా పాదములకు సాష్టాంగ దండప్రణామ మాచరించి బాబా పాదములమీద శిరస్సును ఉంచాడు. వాతావరణం మౌనంగాను, గంభీరంగానూ ఉంది. కొందరు స్నేహితులను కూడా ఆ వర్తకుడు ఆహ్వానించి యుండెను. అందరూ బాబా ఆసీనులయిన తరువాత, వారి చుట్టూ కూర్చున్నారు. ఒక వెండిగిన్నెలో బాదంపప్పు వగైరా ఉంచి ముందు బాబాకు తరువాత మిగిలిన వారికి అందించాడు. కొంచెంసేపు ప్రశాంతంగా కూర్చున్నారు. బాబా వచ్చినపని అయినది. వారు లేవగానే వారితో వచ్చిన మండలి కూడా లేచారు. తరువాత ''అతనికి చాలా జబ్బుగా ఉంది. అతనికి సహాయం చేయడానికి వెళ్ళాను'' అన్నారు బాబా.

తరువాత బాబా దివ్యజ్ఞానసమాజానికి వెళ్ళారు. అది ఒక చిన్న భవనము. లోపల కొంతమంది పురుషులు ఒకవైపున, స్త్రీలు మరియొక వైపున ఆసీనులై యున్నారు. తెల్లటి పొడవైన గడ్డముగల ఒక వృద్ధుడు ఒకామెను 'నాలుగు మాటలు చెప్పమని,' కోరాడు. ఆమె మరాటీ భాషలో చక్కగా ఉద్రేకంతో మాట్లాడింది. తరువాత బాబా వారి అక్షరఫలకం మీద ''మనం ఎక్కువగా, యింకాఎక్కువగా సత్యాన్ని పొందడడం కోసం కాంక్షించాలి. అది మీ జీవితం ద్వారా మీ అనుభవాల ద్వారా జరగాలి. అందుకు మీకు నేను నా ఆశీస్సులిస్తున్నాను అని సందేశం యిచ్చారు.

బాబా తమ విడిదికి తిరిగి వచ్చారు. అక్కడ సుమారు 7,000 మంది వారికోసం వేచి యున్నారు. అందరలా వరుసగా వచ్చి బాబా దర్శనం చేసుకున్నారు. బాబా కొంతమందిని కౌగిలించుకున్నారు. కొంతమంది హృదయాలను పులకింప చేసారు. కొంతమంది చెక్కిళ్లను చేతితో నిమిరారు. కొందరి పిల్లల బుగ్గలను పుణికారు. కొంతమంది కన్నులలోకి తదేకంగా చూసారు. కొంతమందికి ఏదో ఒక కానుక యిచ్చారు. జేబులో నుంచి రుమాలు తీసి వారి చేతిలో కొంతసేపు ఉంచుకొని అది ఎవరికో యిచ్చారు. ఒక చిన్నపిల్లవానిని అందుకొని ఒడిలో కూర్చో పెట్టుకున్నారు. బాబా ఏమీ ప్రవచనం చేయలేదు. ఎవరికీ ఏమీ చెప్పలేదు. కానీ ఎవరూ యివ్వలేని వారి నిరుపమానమైన ప్రేమను అందరికీ యిచ్చారు. అందరూ ఆయన బిడ్డలు. వారందరికోసం ఆయన బాధపడుతున్నారు. ఆబాధ ఆయన సుందరవదనంలో ద్యోతకమవుతూంది.

ఆ రాత్రి 7–30 గం.లకు బయలుదేరి స్టేషన్‌కి వెళ్లారు. అసంఖ్యాక మయిన జనులు బాబాతో స్టేషన్ వరకూ వెళ్లారు. బాబా వెళ్లిపోతున్నారనే విచారం అందరి ముఖాలలోనూ చూడవచ్చు. 'శ్రీ సద్గురు మెహెర్‌బాబా మహారాజ్‌కి జై' అను జయధ్వానాలతో దిక్కులు పిక్కటిల్లాయి. బాబా రైలు ఆ చీకటిలో కలిసి పోయింది. అంతవరకు జయధ్వానాలు వినిపిస్తూనే ఉన్నాయి.

మధ్యస్టేషన్‌లో 'బాబా ఆరైలులో వెళ్తున్నారని తెలిసిన ప్రజలు' స్టేషన్‌కి పరుగెత్తుకొని రైలువద్దకు వచ్చారు. మెరిసిపోతున్న తమ హస్తాన్ని కిటికిలో నుండి వారికి అందించి, వారిని దీవించి పంపారు బాబా. దారిలో ఎవరు వచ్చారో చెప్పడం కష్టం. రాత్రిపూట ఆస్టేషన్‌లలో దీపాలు కూడా అంత ప్రకాశంగా లేవు. వారి శిష్యులను రైలులో వేరొక చోట కూర్చోమని, బాబా నడుం వాల్చారు. నాగపూర్‌లో యిచ్చిన క్రొత్త దుప్పటి ముసుగు పెట్టి పరున్నారు. అది నిద్రపోవడానికి కాదు ఏలోకాలలోనో ఏదో పని అవసరం కలిగింది. బాబా తెల్లవారి 5 గం.లకు లేచి కూర్చున్నారు. తెల్లవారుతోంది. కిటికీలలో నుంచి చూస్తుంటే అరుణోదయ కాంతిలో దూరాన ఉన్న కొండలు, కొండలవరకూ దిగువను ఉన్న పొలాలు, పొలాల ప్రక్కనుంచే వెళ్లే బాటలు, బాటలమీద అంత పెందలకడనే అనేక పనులకై వెళ్లే పల్లెప్రజలు భారతదేశ పవిత్రత అంతా ప్రకృతి ప్రదర్శిస్తోంది.

ఈ భారత భూమివద్ద ఉన్న ఆధ్యాత్మిక సౌందర్యం యింక జగత్తులో మరె క్కడా వెదికినా కనబడదు. ఎందరో యాత్రికులు యీ పవిత్ర భూమిమీద భగవద న్వేషణ మార్గంమీద పయనిస్తున్నారు. ఆమార్గం సుగమంగా లేకపోవచ్చు. భారత దేశంలో పల్లెలనుంచి పట్నాలకు వెళ్లే రోడ్లవలె అది దుమ్ముతో నిండి యుండ వచ్చు. గోతులతో ఉండవచ్చు. వాటిమీద నడిచే యాత్రికుడు మాత్రం పట్టు దలతో మజిలీలు చేసుకుంటూ ప్రయాణం చేస్తూనే ఉంటాడు.

ఒక హిందువు ఉండేవాడు. అతడు యీ జన్మలో ఒక సాధుపురుషుడు కావాలని జన్మించినప్పుడే లలాట లిఖితమై యున్నది కాబోలు. బాగా ఎదిగిన యిద్దరు కుమారులూ, అపాయకరమైన వ్యాధితో యింటినుండి ఎనిమిది మైళ్ల దూరంలో ఉన్న ఆస్పత్రిలో బాధ పడుతున్నాడు. ఒకనాడు అతడు భగవంతుడికి దణ్ణం పెట్టు కున్నాడు. "నా యిద్దరు కుమారులకు ఆరోగ్యం కలుగ చెయ్యి ప్రభూ! నా యింటివద్ద నుంచి నిన్ను తలచుకుంటూ నామోకాళ్లమీద పాకి యింత దూరమూ వచ్చి ఆస్పత్రికి చేరుకుంటాను" అని ప్రార్థించి అలాగే బయలుదేరాడు. అతని వెనుక అతని భార్య, తరువాత పిల్లలు యిద్దరు చిన్నవారు అతనిలాగే పాకుతూ వారుకూడా అతని బాధలో పాలు పంచుకుందామని అతని వెనుక పాకుతూ వెళ్తున్నారు. దూరం ఎనిమిది మైళ్లయినా భౌతికమైన శరీర బాధ అపారంగా కనిపిస్తోంది. ఆ యిల్లాలు ఆ బాధకు తట్టుకోలేక రాత్రింబగళ్లు అలాగే రోడ్డుమీద పీలోస్నాలకు గురియై పాపం! ప్రాణాలు గోల్పోయింది. కొంతదూరం వెళ్లిన తరువాత తల్లిని గోల్పోయిన యిద్దరు చిన్నపిల్లలు కూడా ఆమెను అనుసరించారు. అతడు రోడ్డు మీద ఏకాకి అయ్యాడు. అతనికి దేవుడు పెట్టిన పరీక్షకు నిలిచాడు. ధైర్యంలో పాకి గమ్యస్థానం చేరుకున్నాడు. కానీ దైవోపహతుడు గావున ఆస్పత్రి లోపలికి వెళ్లి చూసేసరికి యిద్దరు కుమారులు కూడా వ్యాధితో యీలోకం విడిచి వెళ్లి పోయారు. ఆహా! భగవల్లీల దురవగాహం కదా!

ఒక ప్రేమికుడు జరిగిన యీ సంగతి బాబాకు చెప్పాడు. అది విని బాబా— బాగుంది. అతడు భగవంతునికి బాగా చేరువ అయ్యాడు. ఆధ్యాత్మిక మార్గంలో చివరికి వెళ్లడానికి అతని పంథా సుగమం అయినది" అన్నారు. ఎవరి మీద భగ వంతునికి అనుగ్రహం కలుగుతుందో అతని భౌతిక సర్వస్వము నాశనము చేస్తా నన్నాడు పరమాత్మ. (యస్యాను—గ్రహ మిచ్ఛామి తస్య సర్వం హరామ్యహం)

బాబా మస్తు ప్రయాణాలు యింకా సాగించారు. అక్కడినుండి ఔరంగాబాద్ వగైరా నగరములు సందర్శించారు.

## మా యి బా ప్

బాబా 1939 మేనెల 18వ తేదీన మాయిబాప్ అనే మస్తును ఔరంగాబాద్ నుంచి ఖుల్దాబాద్‌లో ఆయన మకాముకి రప్పించి అక్కడ మాయిబాప్‌ను సాంగత్యం చేసారు. ఖుల్దాబాద్ ఔరంగాబాద్ నుంచి 15 మైళ్ళు ఉంది.

మాయిబాప్ ఉన్నతశ్రేణికి చెందిన మస్తు. మొదట మే (1939) నెలలో కాకా యితనిని ఔరంగాబాద్‌లో చూసాడు. అప్పుడు ఖుల్దాబాద్‌లో స్టేట్ గెస్ట్ హవుస్‌లో ఉంటున్నారు బాబా. తమ వద్దకు మాయిబాప్‌ను రప్పించారు. మాయి బాప్ అపరి శుభ్రంగా ఉంటాడు. పాతవి చిరిగినవి అయిన గుడ్డలు పాతిక ముప్పై మూటకట్టి తనదగ్గర ఉంచుకునేవాడు. పాడయిపోయిన అన్నం రొట్టెలు కూడా కంపుకొడుతున్నా మూటలో పెట్టుకొనేవాడు. అతనిని పేరు అడిగితే 'మాయి–బాప్' (తల్లి–తండ్రి) అని చెప్పేవాడు. క్రొత్త బట్టలు కట్టుకోమని యిస్తే కొద్దిరోజులు కట్టేవాడు. అవి మాసిన తరువాత వాటినికూడా మూట కట్టేవాడు. మాయిబాప్ మధ్యవయస్కుడు. అతడు ఔరంగాబాద్‌లో ఎవరో బంధువుల యింట్లో ఉండేవాడు. బాబా అతనికి స్నానం చేయించి క్రొత్తబట్టలు కట్టించి అన్నం పెట్టారు. బాబాతో ఒక్కడూ గదిలో ఉండగా అతడు "నేను మాడిపోతున్నాను" అని అరిచాడు. ఆరోజునే తరువాత అతనిని కాకా ఎలిజిబెత్ కారులో ఎక్కించి ఔరంగాబాద్‌లో దింపెయ్యడానికి తీసికొని వెళ్లినప్పుడు 'నీవు భోజనం ఎక్కడ చేసావు?' అని అడుగగా మాయి బాప్ "ఈరోజున నేను భగవంతుని దర్బార్ లోనికి వెళ్లాను. అక్కడ నాకు భోజనం పెట్టారు" అని చెప్పాడు.

తరువాత యింకా కొన్ని రోజులు మస్తు ప్రయాణాలు చేసి బాబా మేనెల 25వ తేదీ ఉదయం 7 గం.లకు మన్మాడ్ స్టేషన్ చేరారు. అక్కడ షెవర్లెట్ కారు సిద్ధంగా ఉంది. బాబా, జాల్‌భాయి, ఆదీ, నారీనా అక్కడ ఆకారులో 12, గంటలు కాకుండానే మెహెరాబాద్ చేరుకున్నారు. అర్థైలులోనే కాకా, చాన్‌జీ రావ్ సాబ్ బొంబాయికి వెళ్లారు.

బాబా కారులో మెహెరాబాద్ వెళ్తూ ఒక పెద్ద మర్రిచెట్టు క్రింద కారు ఆపి "నాకు ఆకలి వేస్తోంది" అన్నారు. ఆదీ నాగపూర్ నుంచి మంచి భోజనం కారియర్‌లో కూడా తీసికొని వచ్చాడు. ఆదీ బాబాకి కావలసిన భోజనం పెట్టాడు తరువాత 'అందరినీ చెట్టుక్రింద విశ్రమించ'మన్నారు బాబా. అందరూ కూర్చున్నారు. బాబా వారితో ఏదో ఆట మొదలు పెట్టేరు. ఇంతలో ఒక బాటసారి వచ్చాడు. పేదవాడిలా ఉన్నాడు. వాడికున్న పాతబట్టలో ఏదో మూటకట్టి భుజాన మోస్తున్నాడు. బాబా అతనిని చూసారు. ఆట ఆపారు. 'అతనికి ఆహారం పెట్టు'మని ఆదీతో చెప్పారు. ఇందాకా బాబా భోజనం చేయగానే అవి అన్నీ సర్ది కారులో పెట్టినది మళ్లీ తీసికొని వచ్చి రొట్టెలు, వెన్న, పండ్లు ఆ వచ్చిన అతనికి పెట్టాడు. అవి పెట్టేటప్పుడు శ్రీ సద్గురు మెహెర్‌బాబా మీకు పెడుతున్నారు" అని ఆదీ అన్నాడు. ఆ మనిషి "ఆయనచే ఆహారం పెట్టించుకోవడానికి నేనెంతో అదృష్టవంతుణ్ణి" అన్నాడు.

కొంతదూరం కారులో మళ్లీ బయలుదేరి వెళ్లిన తరువాత దారిప్రక్కన ఒక దేవాలయం ఉంటే బాబా వారందరికీ చూపించారు. ఆ దగ్గరలోనే ఉపాసనీ మహరాజ్ ఉన్న యిల్లు కూడా చూపారు. 'నారాయణ మహరాజ్ యిల్లు అక్కడికి దగ్గరే'నని బాబా చెప్పారు. విచిత్రమేమిటంటే పూనాలో బాబాజాన్, షిర్డీలో సాయిబాబా, ఖేడ్గావ్‌లో నారాయణ మహరాజ్, నాగపూర్‌లో తాజుద్దీన్ బాబా, సాకోరీలో ఉపాసనీ మహరాజ్ అందరూ నాలుగు వందల మైళ్లమేరలో, అయిదుగురు సద్గురువులు ఉన్నారు. ఈ ఆధ్యాత్మిక మహానాటకంలో ఎవరి పాత్రలు వారు ధరించి చక్కగా నిర్వర్తించారు.

పర్యటన పూర్తిచేసుకుని బాబా మే మాసంలో 25వ తేదీన మెహెరాబాద్‌లో దిగగానే, బాబా సేవకులు వచ్చి సామాను మోసుకొని లోపలికి తీసికొని వెళ్లారు. తరువాత బాబా మెహెరాబాద్‌లోనే ఉంటున్నారు. మండ్లిలో ఒకనాడు విశ్వ ఆధ్యాత్మిక కేంద్రం కోసం బాబాకి ఒక భక్తుడు భూమి వ్రాసి యిచ్చిన సంగతి యిదివరలో తెలియపరచి యున్నాము. ఆ ఆశ్రమ స్థాపన విషయమై బాబా మండలితో ఒకనాడు చర్చించారు. అనేక సంవత్సరముల నుండి బాబా మెహెరాబాద్‌లో ఉంటున్నా, వారిని ప్రతి యేడాది వేలకొలది భక్తులు యిక్కడికి వచ్చి దర్శనం చేసుకుంటున్నా, మండ్లి వంటి కేంద్రస్థానంలో ఆశ్రమం నెలకొల్పినట్లయితే యింకా యితోధిక

మయిన పని జరగడానికి అవకాశం ఉంటుంది. గనుక మండలి అందరూ అది బాగుంటుందని హర్షించరు. మండ్లలో ఆశ్రమస్థాపన జరిగినప్పటికీ మెహరాబాద్ కేంద్రం యిదివరకులాగే పనిచేస్తూ ఉంటుంది. కొండమీద మస్తు ఆశ్రమం అలాగే ఉంటుంది.

బాబా తిరిగి వచ్చిన తరువాత రవికిరణాలు సోకిన తామరపువ్వుల వలె మస్తుల ముఖారవిందాలు వికసించాయి. ఒకరోజున అకస్మాత్తుగా బాబా కొంతమంది ఆగంతకులతోనూ, కొందరు మండలితోనూ మెహెరాబాద్ కొండమీద నున్న మస్తు ఆశ్రమానికి వెళ్ళారు. బాబా వెళ్లగానే మస్తులు అపరిమితానందభరితులై కొంత మంది ఆడారు, కొంతమంది పాడారు, కొంతమంది డోళ్ళు డబ్బాలు వాయించారు. కొంతమంది భజనలు చేసారు, కొంతమంది ''జై జై గురు రాయ్ మెహెర్ బాబా'' అని జయ జయ ధ్వానాలు చేసారు. ఇలా కొన్ని నిమిషాలు సాగింది. ఈవిధంగా తాళ బద్ధంగా చక్కగా ఈ ధ్వనులు మేళవింపబడగా వీరు మస్తులా? పిచ్చివారా? అని చూపరులకు ఆశ్చర్యం గలిపింది. సంతోషంతో పాడుతూ ఆడుతున్నా వీరిని చూసి తీరవలసిందే గానీ వర్ణించడానికి వీలులేదు. చిన్నపిల్లలు కొన్నాళ్ళు ఊరికి వెళ్ళివచ్చిన తమ అమ్మనీ నాన్నని చూడగానే ఎంత సంతోషం కలిగి ఆడతారో, అలాగే యీ ఆశ్రమవాసులు బాబాను చూడగానే వారి ఆనందాన్ని వెలిబుచ్చారు.

బొంబాయి నుంచి ఒక బాబా భక్తుడు బాబా వద్ద కొన్ని రోజులుందామని వచ్చాడు. బాబా అతనిని అజ్మీరు వెళ్లి లఖన్ షా అనే మస్తును తీసికొని రమ్మ'ని పంపించారు. బాబా విధానాలు విపరీతంగా ఉంటాయి. బాబా వద్ద ఉందామని కొన్నాళ్ళు సెలవు తీసికొని వస్తే అతనిని ఎక్కడికో వెళ్ళి, ఎవరినో తీసుకు రమ్మని పంపించారు. అయిదువందల మైళ్ల దూరం నుంచి ఆమస్తుని తీసుకురావడం అంటే మాటలా! అతడు అసలు ఆ మస్తుని చూసి యుండలేదు. ఎక్కడ అతనిని పట్టుకోవాలో తెలియదు. బాబా చెప్పిన ఆనవాళ్లు ప్రకారం వెళ్లి ప్రయత్నం చేయవలసినదే. అయితే బాబా ప్రేమలో ఎంత కష్టమైన కార్యమయినా సులభంగా పరిణమిస్తుంది. తాను చెప్పి పంపిన శిష్యునికి తత్కార్య నిర్వహణలో బాబా అంతరికంగా సాయపడతారు. అజ్మీరులో అతడు అట్టే వెదుకనక్కర్లేకుండానే మస్తుని ఫతేఖాన్ అనే టాంగావాలా తన గుర్రబండిలో కూర్చోబెట్టుకొని తీసుకువచ్చాడు. అంతట అతనిని ఊరిబయటకు బండిలో తీసికొని వెళ్ళారు. లఖన్ షా యిదివరకు

బాబా యిచ్చిన కఫ్నీయే తొడుక్కొని ఉన్నాడు. అతడిప్పుడు గడ్డం పెంచాడు. ఈ మస్తుతో అతడు మెహెరాబాద్ చేరుకున్నాడు. ఆనాడు జూన్ (1939) 2వ తేదీ. బాబా దగ్గరకు తీసికొని రాగానే లఖన్ షా బాబా వైపు తదేకంగా కొన్ని నిమిషాలసేపు చూసి నవ్వుకొని, ఏదో లోపల గొణుగుకున్నాడు. బాబా అతనిని ప్రేమతో ఆలింగనం చేసుకున్నారు. వెంటనే అతనిని స్నానం చేయించి బాబా అతనికి క్రొత్త కఫ్నీ తొడిగించారు. బాబా స్వయంగా అతనికి భోజనం తినిపించారు. మస్తు ఆశ్రమంలో లఖన్ షాకి ప్రత్యేకమైన గది యిచ్చి బస చేయించారు. అతనిని తీసికొని వచ్చిన భక్తుణ్ణి బాబా 'అతని వద్ద ఉండి లఖన్ షాకి ఏమేమి కావాలో చూస్తూ ఉండమ'న్నారు. ఒకనెల యీ విధంగా ఉన్న తరువాత బాబా లఖన్ షాని మరల అజ్మీర్ పంపించేసారు. బాబా అతనితో పని పూర్తి చేసేసారు. అతనిని ఆధ్యాత్మికంగా ఒక మెట్టుపైకి ఎక్కించి పంపించేసారు.

నాగపూర్‌నుంచి బాబా భక్తులయిన దేశ్‌ముక్, అతని భార్య ఇందుమతి దేవి బాబాతో కొద్దిరోజులుండడానికి వచ్చారు. బాబా వద్దకు వచ్చేముందు దేశ్‌ముఖ్ మధ్య పరగణాలలో బాబా గురించి ఉపన్యాస పర్యటన చేసి వచ్చాడు. పూనా, బొంబాయి నగరాలలో బాబా ప్రేమికురాంద్రు నీడిసే టాల్‌స్టాయ్, రాజకుమారి నోరీనా మాచెబెల్లి కూడా దేశ్‌ముక్‌తో కలిసి పర్యటించి ఉపన్యాసాలిచ్చారు. కానీ బాబా ఉపన్యాసాలూ ప్రవచనాలూ యివ్వడానికి యిష్టపడరు. ఆయనకు కావలసినది ఆచరణ. ''ప్రపంచంలో మాటలు ఎక్కువయ్యాయి. ఇప్పుడు ఎక్కువగా కావలసినది సరియయిన ఆచరణ'' అని బాబా చెప్తారు.

మానవుల అజ్ఞానం వలననే బాబాకు ఎక్కువ బాధ కలుగుతోందని ఆయన చాలా సార్లు చెప్పారు. ఏదయినా ఒకరి విషయంలో బాబా బాధపడడం కూడా ఉంది. కానీ బాబా దానికొక దృష్టాంతం యిచ్చారు. 'తేలుకుట్టినప్పుడు బాధ పడుతూండగా ఒకచీమ కూడా కుట్టినట్లయితే ఆచీమ బాధ కనిపించదు. అలాగే ప్రపంచం కోసం తాను పడే బాధముందు ఏఒక్కరి విషయంలోనైనా తాను ప్రత్యేకంగా పడే బాధ అలాంటిదే' అన్నారు.

'భగవంతుని సాక్షాత్కరించుకున్నవారు ఆ ఉన్నతస్థితిలో నుంచి క్రిందికి దిగిరాక నిరంతరము ఆపరమానంద స్థితినే అనుభవిస్తూ ఉంటారు. అలాంటివారికి

బాధ్యతలు విధులు లేవు. ఉన్నతోన్నతస్థితి నుంచి సాధారణ మానవ చైతన్యస్థితికి దిగి, మానవకోటిని ఉద్ధరించుటకు ప్రత్యేకంగా వచ్చినవారు నిరంతరానందము ఒక వైపు అనుభవిస్తూనే, మానవుల యొక్క బాధలన్నీ పైనవేసుకొని బాధపడతారు. పైకి మామూలు మానవుల వలెనే వారు కనబడతారు. అంతరంగంలో వారిని ఎవరూ తెలుసుకోలేరు. వారిని అర్థం చేసుకోలేరు. అలాంటి స్థితిలోనే బాబా ఉన్నారు' అని ఒకమారు మజ్జూబ్‌కి సాలిక్‌కి తారతమ్యం గురించి చెప్తూ బాబా వివరించారు.

యూరప్ నుంచి వచ్చిన తరువాత బాబా ఇండియాలో పర్యటన ప్రారంభించినది మొదలు మెహెరాబాద్‌లో చాలా రోజులుగా అక్కడ లేరు. అక్కడ బాబా శిష్యులు, యింకా అనేకమంది భక్తులు ప్రతిరోజు ఆయన దర్శనం కోసం ఉత్కంఠతో ఎదురుచూస్తున్నారు. ఎన్నో సమస్యలు ఆయన వచ్చిన తరువాత అడగవచ్చులే అని బాబా కోసం ఉంచారు. ఆయనకోసం కొందరు పడే ఆవేదన అనుభవించేవారికి గానీ తెలియదు. 'ఆయన కనబడడం లేదని' వచ్చేదాకా వేచియుండలేక మహారాష్ట్రంలోని ఒక గ్రామంలో ఒక భక్తుడు ప్రాయోపవేశం చేయడానికి సమకట్టాడు. ఆహారం తినడం మానేసాడు. అతని కుటుంబం వారికది ఒక ఉపద్రవంలా తోచింది. అతడు ద్రవపదార్థమయినా తీసికొనుటకు నిరాకరించగా, బాబా ఎక్కడ ఉంటే అక్కడికి టెలిగ్రాములు యిచ్చారు. బాబా కూడా ఏదయినా త్రాగమని జవాబు యిస్తే ఆయన మాటకూడా వినలేదు. మంచినీళ్ళు కూడా తీసుకోవడం లేదు. అలా 18 రోజులు గడిచాయి. ఇంక అతని స్థితి చాలా అపాయకరంగా పరిణమించింది. అతడు ప్రాణం ఉన్న ఎముకల ప్రోగులా ఉన్నాడు. చెయ్యయినా ఎత్తలేడు. శరీరం అంతా బిగుసుకు పోయింది. అప్పుడు బాబా జబ్బల్‌పూర్‌లో ఉన్నారు. పరిస్థితి విషమించింది కనుక ఎలా ఉన్నవి అలా అన్నీ వదిలిపెట్టి ఆ వేసంగిలో (మేనెల) దీర్ఘప్రయాణము చేసి వచ్చారు బాబా. తనకోసం నిరాహార దీక్షలో ఉన్న భక్తుణ్ణి చూసారు. బాబా స్వయంగా అతనికి కొన్ని చుక్కలు పళ్ళ రసం యిచ్చారు. 18 రోజులకి బాబా యిస్తే ఆకొన్ని చుక్కలు గొంతుకలో పోయించుకుని మింగాడు అతడు. ఆకుటుంబం వారికి పెద్ద బెంగ తీరింది. బాబా అక్కడినుండి వెళ్లిన తరువాత ఆహారం తీసుకుంటూ అతడు త్వరగానే కోలుకున్నాడు. బాబా ఎలాగా యింతవరకూ వచ్చారు గనుక, సమీపంలోని

నాసిక్, అహమద్ నగర్, మెహెరాబాద్, పూనా, తలెగావ్, బొంబాయి వెళ్లి, అక్కడ పనులు చూసుకున్నారు. ఆయన తన శిష్యులను కలుసుకున్నారు. ఇంతకాలం నుంచి ఆయా స్థలములలో ఆయన దర్శనంకోసం ఎదురుచూస్తున్న భక్తులను అందరినీ కలుసుకొని వారిని సంతోషపరిచారు. ఇదంతా అయిదురోజులలో ముగించారు. మండ్లలో గానీ, జబల్‌పూర్‌లో గానీ ఒక ఆధ్యాత్మిక కేంద్రం నెలకొల్పాలనే సంగతి యింకా కార్యరూపం దాల్చలేదు.

1939 జూలై నెలలో ఆ నెలాఖరున 'మరల జబల్‌పూర్ వెళ్లుటకు ఏర్పాట్లు చేయమని' బాబా మండలితో చెప్పారు. బాబా ఎక్కడికో వెళ్తున్నారని తెలియగానే బాబా భక్తులకు 'బాబా మళ్లీ ఎప్పటికి తిరిగి వస్తారో, మళ్లీ దర్శనం ఎప్పటికి కలుగుతుందో' అనే ఆదుర్దా ఎక్కువయింది. బాబా వెళ్లేరోజు దగ్గర పడగానే చాలమంది బాబా భక్తులు దర్శనార్థం రావడం ప్రారంభించారు. వచ్చిన వారిలో ఒక విద్యావేత్త ఉన్నాడు. అతడు ఇండియాలో ప్రసిద్ధి చెందిన ఒక రాజకీయనాయకునికి ప్రతినిధి. ఏదో స్వంత పనిమీద ఒకస్నేహితునితో కలిసి వచ్చాడు. అక్షర ఫలకం మీద అసలయిన ఆధ్యాత్మికత్వం అంటే ఏమిటో, నమ్మకము, వాంఛ, ప్రేమ, నిస్వార్థసేవ వీటిని గురించి చాలాసేపు వారికి బాబా తమ ప్రసంగంలో చెప్పారు. వారు మిక్కిలి సంతృప్తితో వెళ్లారు.

బొంబాయి నుంచి పార్సీ యువకులు అందరూ పట్టపరీక్ష అయినవారే కొందరు కాలేజీ విద్యార్థులతో కలిసి బాబా దర్శనార్థం వచ్చేరు. అందరికీ ఆధ్యాత్మిక తృష్ణ ఉంది. వారు భగవన్నామస్మరణ చాలా రోజులనుంచి అభ్యాసం చేస్తున్నారు. వీరంతా జూలై ఆఖరువారంలో వచ్చారు. వారి ఆధ్యాత్మిక అభ్యాసాలలో బాబాని అడిగి సలహా తీసుకుందామని వారి ఉద్దేశ్యం. 'ఆధ్యాత్మిక మార్గంలో పురోగమించాలని' నిజమైన అభిలాషతో వారు వచ్చినందుకు బాబా చాలా సంతోషించారు. ఇటువంటి తృష్ణ ఆధునిక విద్యార్థిలోకంలో ఉండడం అరుదు. వారు ఒక సద్గురు దర్శనం చేసుకోవడం యిదే ప్రథమం. అందుచేత వారి ఆనందానికి అవధి లేదు. అందులోనూ బాబా వారిని ఒక్కొక్కరినే పిలిచి ప్రత్యేకంగా వారితో సంభాషించారు. వారికి బాబా యీ అభ్యాసాలలో సలహాలు కూడా యిచ్చారు. వారందరికీ సంతృప్తి కలిగింది.

జబ్బల్‌పూర్‌కి రమారమి 70 మైళ్లదూరంలో నర్మదానదీ తీరాన ఉన్న మండ్ల అనే పట్టణ సమీపాన నూరు ఎకరాల భూమి అడుగకుండా తనంతట తానే ఒక భక్తుడు బాబాకు ఆధ్యాత్మిక కేంద్ర సంస్థాపన కోసం దానం చేసాడు. ఈ సంగతి పాఠకులకు విదితమే. అక్కడ నివసిస్తున్న ధనిక భూస్వాములలో అతడొకడు. ప్రేమతోను భక్తితోను యిచ్చిన యీ కానుక బాబా స్వీకరించారు. ఆస్థలము నదీతీరాన ఒక పవిత్రప్రదేశంలో ఉంది. అక్కడ పూర్వం ఋషులు మునులు తపస్సు చేసి దానిని పునీతం చేసారు. అక్కడ తపోధనులు వారికాలమున ఒక లక్ష మామిడిచెట్లు పాతిపెంచారని ప్రతీతి. ఈ స్థలములో 2,000 మామిడి వృక్షా లున్నాయి. బాబా అక్కడ తమ కేంద్రం నెలకొల్పనున్నారని ఆచుట్టు ప్రక్కల స్థలముల ధరలు పెంచేసారు. నిజంగా అటువంటి మహానుభావుడు అక్కడ నివాసా నికి రాబోవుతున్నాడని కొంతమంది ఆధ్యాత్మిక చింతరులు చాల సంతోషిస్తున్నారు. కానీ మండ్లయను పట్టణము ఎక్కడో దూరప్రదేశమున ఉంది. రైల్వేస్టేషన్ గానీ జబ్బల్‌పూర్ మొదలయిన ముఖ్యనగరాలుగానీ దానికి సమీపంగా లేవు. అక్కడ బాబా కేంద్రస్థాపన చేయడానికి యిది ప్రధానమయిన ప్రతిబంధకంగా ఉంది. అక్కడ బాబా తమ కేంద్రం ఒకటి స్థాపిస్తే అనేక వందల మంది శిష్యులు పాశ్చా త్యులు కూడా అక్కడ ఉండవలసి వస్తుంది. అటువంటి మారు మూల స్థలమును యింతమందికి నివాసయోగ్యంగా చేయడం ఒక సమస్య. అయినా మరియొక మారు, శిష్యమండలితో జబ్బల్‌పూర్ వెళ్లి యీ పథకము ఎంతవరకు ఆచరణ యోగ్యమో చూసి నిశ్చయించుటకు వెళ్దామని బాబా తీర్మానించుకున్నారు. జూలై నెలాఖరు వరకూ అందరూ జబ్బల్‌పూరే మనసులో పెట్టుకొని ఉన్నారు. అయినా నిజంగా జరిగేవరకూ ఎవరూ ఏమీ చెప్పలేరు.

ఇలా ఉండగా జూలై 30వ తేదీని బాబా ఏకారణంచేతనో ఉత్తరానికి వెళ్లే ప్రయాణాన్ని దక్షిణానికి మార్చి, అందరితోనూ 'మైసూరు వెళ్తున్నా'మని చెప్పారు. అందరిలోనూ ఎక్కడలేని కలకలం బయలుదేరింది. 50 మంది మండలి—స్త్రీలు, పురుషులు, పాశ్చాత్యులు, భారతీయులు అంతా ఉన్నారు. వీరంతా పెద్ద బస్సులోను, కారులోను, రోడ్డుమీద ప్రయాణం చేయాలి. దారిలో వంతెనలు లేని అనేక ఏరులు, నదులు ఉన్నాయి. అవన్నీ దాటాలి. అందులోనూ ప్రయాణం వర్షా కాలంలో.

బాబా అనుకున్నట్లుగా మండలితో మెహెరాబాద్ నుంచి ముందు షోలాపూర్ వెళ్లారు. ఇంతకు రెండురోజుల ముందే యీ దిక్కు ప్రయాణం నిశ్చయించినందున దారిలో ఎక్కడా ఎటువంటి ఏర్పాట్లు ముందుగా చేసుకునేందుకు వ్యవధి లేకపోయింది. మైసూరుకు మాత్రం ముందుగా అక్కడికి వెళ్లడానికి నిశ్చయించగానే ఒక శిష్యుణ్ణి 50 మంది మండలితో బాబా ఉండడానికి తగిన వసతి ఒకటి ఏర్పాటు చేయమని రైలులో పంపించారు బాబా. అక్కడ ఉన్న రోజులలో బాబా శిష్యుడు నగరం అంతా గాలించి చూసాడు. అన్ని విధములా తగిన బంగళా ఎక్కడా కనిపించలేదు. బాబా మెహెరాబాద్ నుండి బయలుదేరి వచ్చేస్తున్నారు. గనుక ఏదో ఒకటి చూడడం తప్పదు. షోలాపూర్ వచ్చి బాబా మైసూరులో బస కుదిరిందనే వార్త అందుకొని బయలుదేరుదామని ఎదురుచూస్తున్నారు. అతడు బాబాకి ఎలాంటి వసతి కావాలో తనకు తెలుసును గనుక, మూడు నాలుగు భవనములు చూసి, ఉంచాడు. అతనికి బాబా మొత్తం 50 మంది మండలితో వస్తున్నానని టెలిగ్రాం యిచ్చారు. మొదట అతనిని పంపినపుడు ముందు కొద్దిమందిని కూడా తీసికొని వెళ్దామని అనుకున్నారు బాబా. దారిలో బెంగుళూరులో ఒకరోజు ఆగడానికి ఏర్పాటు చేయాలి. శిష్యుడు శాయశక్తులా ప్రయత్నించి యీ ఏర్పాటు చేసాడు.

బాబా ఆయన మండలి బెంగుళూరు చేరుకున్నారు. అది ఆగస్టు నెల. వారితో బాటు మహమ్మద్ మస్తుకూడా బాబా వద్దకు బెంగుళూరు వచ్చాడు. ఒక యింటిలో రెండుగదులలో 25, 30 మంది సర్దుకున్నారు. మిగిలిన వారంతా దగ్గరలో ఒక చిన్నహోటలులో దిగారు! మెహెరాబాద్ నుంచి సామానులన్నీ మైసూరుకు బుక్‌చేసారు. తరువాత జబ్బల్‌పూర్ ముందుగా వెళ్లిన కొంతమంది శిష్యులను కూడా బాబా రమ్మన్నాడు మైసూర్‌కి. అందుకని వాళ్ల సామానులు కూడా అక్కడికే బుక్ చేసుకున్నారు.

ఆరోజులలో (1939) సర్ మీర్జా ఇస్మాయిల్ మైసూర్ మహారాజుకి దివాన్‌గా ఉన్నాడు. అతని హయాంలో మైసూరురాష్ట్రం చాలా అభివృద్ధి చెందింది. అతడు మెహెర్‌బాబా గురించి ఆయనకున్న ప్రపంచ ప్రఖ్యాతిని గురించి విన్నాడు. అటువంటి ఆధ్యాత్మిక సద్గురువు మైసూరు రాష్ట్రంలో ఉంటే అది వారందరికీ గౌరవ కారణం కదా! అందుచేత బెంగుళూరులోనే గురువుగారు ఉంటే అన్ని విధముల బాగుంటుందని అతడు తలచాడు. ఇదివరలో 1935వ సం.లో

బాబా మైసూర్‌లో కొన్నాళ్ళున్నారు. అప్పటినుండి సర్‌మిర్జా ఇస్మాయిల్‌కు బాబా తెలుసును.

బాబా యొక్క ఆధ్యాత్మిక విశ్వకేంద్రానికి కొన్ని ప్రదేశములు బాబాకు చూపించే ఉద్దేశంతో దివాన్ కొన్ని స్థలములు ఎన్నిక చేసాడు. మొదటిది చామ రాజేంద్ర వాటర్ వర్క్స్ వద్ద తెప్ప గొండనహళ్లి గ్రామంలో ఉంది. అది బెంగుళూరుకి 20 మైళ్లదూరంలో ఉంది. ఆదర్శవంతంగా ఉంటుంది. చూడగానే మనస్సుకు నచ్చేలా ఉంది. అక్కడ ఉన్న ఇన్‌స్పెక్షన్ బంగళాలో రెండు మూడు రోజులుండి ఆ చుట్టుప్రక్కల ప్రదేశాన్నంతా చూద్దామనుకున్నారు బాబా. తరువాత దీనికంటె అన్నివిధాలా ఉత్తమంగా ఉన్న యీ క్రింద చెప్పబడిన ప్రదేశాన్ని బాబా ఎన్నుకున్నారు.

## బైరమంగళా

పైన చెప్పబడినది చూసిన తరువాత అంతకంటె బాగా నచ్చుతుందని సర్ మిర్జా ఇస్మాయిల్ దీని సంగతి చెప్పాడు. అక్కడకు బాబాను తోడ్కొని వెళ్లి మైసూరు స్టేట్ చీఫ్ ఇంజనీరు యీ ప్రదేశాన్ని చూపించాడు. బైరమంగళా గ్రామంలోనే క్రొత్తగా ఒక పెద్ద చెరువు నిర్మాణమవుతోంది. దానికి సమీపంలో యీ ప్రదేశం ఉన్నది. ఈ గ్రామం బెంగుళూరుకి 22 మైళ్ల మాత్రమే దూరముంది. బీడది అనే రైలుస్టేషన్ బైరమంగళాకి ఒకక్రోసు దూరముంది. పైగా బెంగుళూరు నుంచి మైసూరుకి వెళ్లే పెద్ద రోడ్డుమీద ఉంది. ఇది బాగుందని బాబా తమ అంగీకారమును తెలిపారు. పెద్దరోడ్డు వద్దనుండి యీ ప్రదేశానికి వెళ్ళుటకు ప్రత్యేకంగా ఒక రోడ్డు నిర్మాణం ప్రారంభించారు. అది పది రోజులలో పూర్తి అవుతుంది. అప్పుడు బాబా కారు దీనిమీద వెళ్లే మొదటి బండి అవుతుంది. అలాగే సెప్టెంబరు ఒకటవ తేదీన బాబా కారులో వెళ్ళారు. ఇంజనీర్ల సహాయంతో భవన నిర్మాణాలు ఎక్కడ జరగాలో అంతా నిర్దేశం అయినది. కేంద్ర నిర్మాణం, అందులో వివిధశాఖలు, వాటికి కావలసిన వసతులు—అన్నీ నిర్ణయించుటకు సంప్రతింపులు జరుగుతున్నాయి.

## భగవంతుడు ఎక్కడ ఉన్నాడు ?

ఒకరోజున బెంగుళూరులో బాబా తమ మండలితో ఉండగా హఠాత్తుగా అందరినీ ఒక ప్రశ్న అడిగారు. దానికి జవాబు ఒక్కొక్కరే చెప్పాలి అన్నారు.

ఆ ప్రశ్న ఏమిటంటే "భగవంతుడు ఎక్కడ ఉన్నాడు?" అని. వెంటనే అంతా యిలా జవాబు యిచ్చేరు. ఒకడు "అన్ని చోట్లా" అన్నాడు. ఇంకొకడు "ఆత్మ లో" అన్నాడు. మరియొకడు హృదయాన్ని చూపిస్తూ "ఇక్కడ" అన్నాడు. ఒకడు భగవంతుడంటే తన అభిప్రాయం వివరంగా చెప్దామని ప్రారంభించేడు. ఇంకొకడు "ఇది మనకి ఎప్పుడూ ఉన్న సమస్యే" అన్నాడు. అప్పుడు డాక్టర్ దేశ్‌ముక్ వంతు వచ్చింది ఆఖరున. అతడు చిరునవ్వుతో "బాబాలో" అన్నాడు. అది విని అందరూ ఆశ్చర్యపోయి, బాబా ఏమంటారోనని వినడానికి మిక్కిలి కుతూ హలులై ఉన్నారు. బాబా అన్నారు—"మీరు అంతా బాబాని పరిపూర్ణుడుగాను, అనంతుడయిన భగవంతునితో ఐక్యం పొందినవాడుగాను, నిజంగా నమ్మితే లదే సరి యయిన జవాబు కదా?" ప్రశ్నకు తమ జవాబు చెప్తూ బాబా ఇలా అన్నారు. "భగవంతుడు వ్యక్తిగతంగా 'నీవు' ఎక్కడ లేవో అక్కడ అతడు ఉన్నాడు. అదే సత్యం. 'నీవు' ఎక్కడ (ఫలానా మనిషిని నేను అనే ఊహతో) అహంకారంతో ఉన్నావో అక్కడ దేవుడు లేడు. నీవు వేరు భగవంతుడు వేరు అని అనుకోవడం మాయ. నీయొక్క అహంకారమే నీవని ఎప్పుడు అనుకుంటున్నావో అక్కడ భగ వంతుడు ఉండలేడు. నీయొక్క 'నేను' అనే అహం ఎప్పుడయితే అదృశ్యమై పోతుందో అప్పుడు భగవంతుడు అక్కడ ఉంటాడు."

బాబా యింకా యిలా వివరించారు. "భగవంతుడు అన్నిచోట్లా ఉన్నా డనేది సాధారణంగా అనే మాట. అదేమీ క్రొత్తది కాదు. పండితులందరూ చెప్తారు. వేదాంతం యిదే వివరిస్తోంది. ఊరికే అది నోటితో అన్నంత మాత్రాన ఏమీ ప్రయోజనం లేదు. నీవు అది కనుక్కోవాలి. అది అనుభవించాలి.

'భగవంతుడు హృదయంలో ఉన్నాడనేది' కూడా కొంతవరకూ సత్యమే. భగవంతుడు మీ కందరకూ తెలిసినట్లుగా అన్ని చోట్లా ఉంటే, మరి అతనిని హృదయంలోనే ఎందుకు పరిమితం చేయాలి? తలకాయలో ఎందుకు లేడు? నీ వ్రేలిలో ఎందుకు ఉండకూడదు? బొటన వ్రేలిలో లేడా? ప్రత్యేకంగా ఒక భాగంలోనే ఉన్నాడని యింకో దాంట్లో లేడనీ ఎందుకనుకోవాలి? అదే అందరూ చేసే పొరబాటు. ఉన్నతోన్నతుడు ప్రియతముడు అయిన దేవుని ఎక్కడో పైన ఆకాశంలో ఉన్నాడనీ, శరీరంలో ఉంటే మానవునికి ఎక్కువ యిష్టమయిన హృద యంలోనే ఉన్నాడని, లేకపోతే కంటిలో ఉన్నాడని, యింక ఎక్కడా శరీరంలో ఏ

యితరభాగంలోను అంటే వీపులోను, ఎముకలలోను, గోళ్లలోను, మాంసంలోను లేనట్టుగా అనుకోవడం, అది మానవ దుర్బలత్వం. ఈ విధంగా భగవంతుడు మన కిష్టమయిన చోట ఉన్నాడని, యిష్టం లేని చోట లేడని అనడం అనే యీ దుర్బలత్వాన్ని జయించాలి. భగవంతుడు గులాబీపువ్వులో ఉండి ముల్లులో ఉండడా? పుష్పాలలోనే ఉండి పెంటలో ఉండడా? ఇలా మనకు యిష్టమయినవి, మంచివి అందమయిన వాటిలో ఉన్నాడని, కాని వాటిల్లో లేడని అంటే—అది మన మనసు యొక్క దుర్బలత్వమే అదే జయించాలి. ఈ మంచి చెడ్డల భేదాన్ని గమనించ కుండా అన్నింటిలోను సమానంగా భగవంతుని చూడగలగాలి. అప్పుడే మీకు ఏద యినా కొంత తెలిసినట్టు లేకపోతే అది చిలుకపలుకలే అవుతుంది.

మానవ శరీరంలో అత్యుత్తమ మైనది హృదయం కావచ్చు. దానిని భగ వంతునికి నివాసంగా మనం అర్పించవచ్చు. అయితే అతి స్వచ్ఛమయిన ఆదేవునికి మనం ఎంత ప్రేమతో స్వచ్ఛందంగా అర్పించినా దేవుడు ఆహృదయంలో ఉండా లంటే అది మిక్కిలి పరిశుభ్రంగాను, ఖాళీగాను, అందులో యింక యితర పదార్థ మేదీ లేకుండాను (అంటే దేవునికి తప్ప ఏయితరానికి హృదయం యివ్వకూడదన్న మాట.) ఉంటేగానీ భగవంతుడందులో ఎలా ఉండగలడు? ఎంత మాత్రం అన్యచింతన ఉన్నా, ఆయనకు అందులోనికి ప్రవేశించాలని ఉండదు. ఎంతమాత్రము స్వార్థచింతన ఉండరాదు. కామం (అంటే కోరిక) ఉండకూడదు. ఆశలు ఉంటే ఆయనకి పనికిరాదు.

భగవంతుడంటే మనకి అది ఒక సమస్య అని ఊరుకోకూడదు. అన్వేషణ సాగిస్తూనే ఉండాలి. ప్రయత్నం చేస్తూనే ఉండాలి. బాధలు పడుతూనే ఉండాలి. ఎంతగా అది మనకి కావాలని మనం వాంచిస్తామో అంతగానూ అది మన జీవిత సమస్య కావాలి. భగవంతుని పొందిన గురువును ఆశ్రయించడం-అది అన్నిటికంటే సులభంకాదు. ఎందుచేతననగా దొంగ గురువులు చాలామంది ఉన్నారు. అసలు గురువుని కని పెట్టడం కష్టం. మనం హృదయ పూర్వకంగా అన్వేషణ చేస్తేంటే మనకు గురువు తారసిల్లు తాడు. అతడు గమ్యానికి తీసికొని వెళ్తాడు. అటువంటి గురువుతో సాంగత్యం ఉన్నవారు కూడా 'యింక చాలు, మన జివితం సార్ధకం అయిందని' ఊరుకోరాదు. మీరందరూ మీ గురువును అతని నిజ రూపాన్ని చూడడానికి ప్రయత్నించండి. మీకు పైకి కనిపిస్తున్న అతని రూపం

నిజరూపం కాదు. సర్వవ్యాప్తమయిన అతని అనంతమయిన అస్తిత్వాన్ని చూడడానికి ప్రయత్నించండి' అని బాబా చెప్పారు.

ఇంక బాబా ''భగవంతుడు ఎక్కడ లేడు?'' అని అడిగారు. ఎంతటి మేధావులయినా బాబా యెదుట వారి ఆలోచనాశక్తిని పోగొట్టుకుంటారు. అందరూ యీ ప్రశ్నకు సమాధానం కోసం ఆలోచన మొదలుపెట్టారు. ''ఎక్కడ లేడు'' అని మండలిలో ఒక శిష్యుడు అన్నాడు. భగవంతుడు అన్ని చోట్లా ఉంటే, లేని స్థలం ఎక్కడా లేదు. ఇంక యీ విషయాన్ని ముగిస్తూ బాబా ''ఎక్కడయితే ద్వంద్వస్థితి ఉందో అక్కడ భగవంతుడు ఉండడు'' అని చెప్పారు.

బాబా బెంగుళూరులో మండలితో ఉండుటకు ఒక తోట మధ్యలో విశాలమయిన తెల్లటి బంగళా ఒకటి బాబాకి, వారి శిష్యులాంద్రకు బస నిమిత్తము ఏర్పాటయినది. ఆయిల్లు గోల్ఫ్ ఆట ఆడే స్థలమునకు ఎదురుగా ఉన్నందున 'ది లింక్స్' అని దానికి పేరు పెట్టారు. ఆగస్టు (1939) మొదటివారంలో అందులో ప్రవేశించారు బాబా. ఈ యింటి ఆవరణలో వెనుక గోడకు ఆనుకొని అనేకమయిన గుడిసెలు, పాకలు ఉన్నాయి. ఆ సమీపాన ఒక మూల ఎన్నుకొని బాబా అక్కడ ఒక కుటీరాన్ని 30 చదరపు గజముల ఆవరణలో తడికలతో నిర్మింప చేసారు. దానితో ఆపాకలు వగైరా వేరుపడినవి.

బాబా ఉపయోగంకోసం తడకలతోనే నిర్మించిన ఆకుటీరం చాలా అందంగా ఉంది. అందులో నేలమీాద రాళ్ళు పరిపించారు. ఈకొత్త కుటీరము చల్లగా ఉంది. క్రొత్త తడకలు వాసనవేస్తున్నాయి.' ఇందులో కొంతకాలం ఏకాంతవాసం చేయాలని' బాబా సంకల్పం.

1939 ఆగస్టు 24వ తెదిన ఛద్దర్ బాబా అనే ఆరవ భూమికలో ఉన్న గొప్ప మస్తును బాబా బెంగుళూరులో 'దిలింక్స్' అనే బంగళాలో ఉన్నప్పుడు అక్కడకు మండలి తీసికొని రాగా—అక్కడ అతనితో బాబా సాంగత్యం చేసారు. ఇతడు బెంగుళూరుకి ఆధ్యాత్మిక పాలకుడని చెప్పవచ్చును. ఒక దుప్పటి ఎప్పుడూ మీాద వేసుకొని ఉంటాడు గనుక చద్దర్ బాబా అనేపేరు యితనికి కల్గింది. ఇతని తెల్లనిజుట్టు దగ్గరగా కత్తిరించబడి యుండెను. చిన్నగడ్డము కూడా పెంచు కున్నాడు. చిరిగిపోయిన గుడ్డలు కట్టుకుంటాడు. తన దుప్పటి ఒక కొంగు భుజంమీాద వేసుకొని, రెండవది క్రింద జీరాడుతూ ఉండగా వస్తాడు.

ఛద్దర్ భాబా ఒకరోజున 'బెంగుళూరు సమీప గ్రామమునకు తీసికొని వెళ్ళమని', టాక్సీవానితో చెప్పాడు. టాక్సీవాడు 'పెట్రోలు లేదు' తన దగ్గర ఒకగాలను కయినా డబ్బు కూడా లేదన్నాడు. అతనికి అయిదణాలు యిచ్చి 'ఒక గాలన్ను పోయించుకొని రమ్మన్నాడు' ఛద్దర్‌బాబా. 'ఈ డబ్బులేం చాలుతాయి పావుగాల నయినా రాదు' అని అంటే, 'అదంతా నీకెందుకు పోయించుకోనిరా' అని పంపగా, పెట్రోలు పోయించుకొని టాక్సీవాడు జేబులో చెయ్యిపెడితే, సరిగ్గా కావలసినంత డబ్బు అందులో దొరికిందట. ఇది ఛద్దర్‌బాబా మహాత్యం అని అతడు అంటాడు.

'ఛద్దర్‌బాబాను' 'దిలింక్స్' బంగళాకి తీసికొనిరమ్మని' బాబా కాకాని పంపించారు. కాకా వెళ్ళి ఛద్దర్‌బాబాని ఒక టాక్సీలో ఎక్కించుకొని వచ్చాడు గానీ బంగళా దగ్గరకు వచ్చేసరికి అతడు 'బండి దిగన'న్నాడు. ఆ మరునాడు ఆదీ, కాకా యిద్దరూ వెళ్ళి మళ్ళీ ప్రయత్నించి ఎలాగో తీసికొని వచ్చారు. ఈ మారు టాక్సీ ఆగగానే దిగి తిన్నగా బాబా వద్దకు వెళ్ళాడు ఛద్దర్‌బాబా. బాబా వద్ద వున్న అక్షరఫలకం చేతితో అటుయిటు త్రిప్పి 'యిప్పుడు నా కాతా పూర్తయ్యింది. 'అని, తిన్నగా వంటయింటికి వెళ్ళి మళ్ళీ బాబా గదికి వచ్చాడు. బాబా భోజనం చేయమంటే 'రేపు వచ్చి మీరు పెట్టినది తింటా నన్నాడు. మర్నాడు బాబా కాకాని మరల అతనికోసం పంపించారు. అప్పుడు ఛద్దర్‌బాబా కాకాతో 'రాననడమే' కాకుండా, మీద ఉమ్మి వేసాడు— కూడాను. ఆ సాయంత్రం మరల బాబా కాకాని అతని వద్దకు పంపుతూ 'యీరోజు బాబా పెట్టినది తింటానన్నావు కదా ! రమ్మని జ్ఞాపకం చేయమని' బాబా కాకాతో చెప్పగా, అదికూడా లాభం లేకపోయినది. ఈమారు ఛద్దర్‌బాబా కాకాని కాలితో తన్ని తిట్టేసరికి, కాకా యింక అతని జోలికి పోలేదు. 'ఛద్దర్‌బాబా ఆరవ భూమికలో ఉన్న మస్తు అని, ఆధ్యాత్మికంగా ఆఖరుసారిగా చేయూత తీసుకునేందుకు వచ్చాడని, యింకా కొలది కాలంలో మరణిస్తాడని' బాబా వివరించి చెప్పారు.

18 రోజుల తరువాత ఛద్దర్‌బాబా నగరంలోనికి వచ్చి, మామూలుగా తనకిష్టమయిన హోటలువద్ద టీ తీసుకున్నాడు. ఒక అరగంట అయిన తరువాత నడివీధిలోనికి వెళ్ళి గొంతుకలోనికి వేళ్ళుపెట్టుకొని తాగిన టీ అంతా కక్కేసి

అక్కడున్న ఒక పిల్లవానిచేత ఒక గట్టు శుభ్రం చేయించుకొని, 'స్వర్గానికి వెళ్ళి పోతున్నానని' చెప్పి ఆ గట్టుమీద పరుండి ప్రాణాలు వదిలేసాడు. అధికారులు అందరూ యితనిని మిక్కిలి గౌరవంగా చూసేవారు. 'అతని అంత్యక్రియలు మేము జరుపుతామంటే మేమని— నగరవాసులు, సైనికులు వివాదంపడి' చివరకు బెంగుళూరు నగరానికి సైనికుల నివాసాలకి మధ్యస్థలంలో అతని శరీరాన్ని పాతి పెట్టి అక్కడ ఒక సమాధి కట్టారు.

సెప్టెంబరు (1939) 6వ తేదీన మద్రాసునుంచి బెంగుళూరుకి గఫూర్‌సాహెబ్ అనే మస్తును బాబా మండలి తీసుకొని వచ్చారు. ఇతడు జలాలీ మహబూబీ వైఖరులు కలిసియున్న మంచి మస్తు. అతడు చేతికి గాజులు తొడుగుకొనియుంటాడు. ఇతడొకవృద్ధుడు. ఆడవాళ్ళవలె రవికె ఒకటి తొడుగుకొని యుంటాడు. అందుచేతనే యితనిలో మహబూబీ లక్షణాలున్నాయని చెప్పబడినది. శరీరంమీద నీటితోకలిపి కాల్చిన చల్లని సున్నపునీరు రాచుకుంటాడు. 1939 సెప్టెంబరులో మొదట యితనిని బాబా సాంగత్యం చేసారు. బెంగుళూరు ఆశ్రమంలో బాబా ఉండగా ఆయన ఆజ్ఞప్రకారం ఆదీ, కాకా యిద్దరూ కారులో మద్రాసువెళ్ళి, యితనిని తీసికొని వచ్చారు. అతనికి పువ్వులంటే యిష్టమని (మహబూబీ లక్షణం) తెలిసి, మంచి పువ్వులు చూపించి — కారులో ఎక్కేలా చేశారు. ఒక్కరోజే బెంగుళూరులో ఉంచుకొని, మరునాడు ఆదీని, కాకాని పిలిచి 'మరల యితనిని కారులో మద్రాసుకి అర్జంటుగా తీసికొనివెళ్ళి దిగబెట్టి రమ్మ'న్నారు. 'బాబా యితనిని మద్రాసు వెంటనే తీసికొని వెళ్ళిపొమ్మని' చాలా ఆదుర్దా కనబరిచారు. ఆ ప్రకారం వారు మద్రాసు వెళ్ళగానే, అక్కడ ఆ యింటివానిని 'గఫూర్ మస్తును చూపించి తీసుకువెళ్ళిపోవడానికి సాయపడ్డ వారిని చంపేస్తాం. ఆ మస్తు ఎక్కడ ఉన్నాడో చెప్పు' అని భయపెడుతూ కొందరు పఠాన్లు అతనిమీదకు దాడి చేస్తున్నారు. 'రెండురోజుల్లో అతనిని చూపించకపోతే నీ ప్రాణాలు తీసేస్తాము' అని బెదిరిస్తున్నారు. సమయానికి ఆది, కాకా యిద్దరూ అతనిని తీసుకువెళ్ళి అతనికి అపాయం రాకుండా కాపాడారు. ఏమిచేయాలో తోచక అతడు అఘోరిస్తుంటే గఫూర్‌ని మళ్ళీ మద్రాసు తీసికొనిరాగానే, అతడి ఆనందానికి మేరలేకపోయింది. ఆ పఠానులు కూడా సంగతి తెలుసుకొని వారు చేసిన

పనికి చాలా విచారించారు. బాబా యీ మస్తును తిరిగి 1945వ సం॥ రంలో మద్రాసులోనే సాంగత్యం చేసారు.

## ఫూల్ వాలా

బెంగుళూరు ఆశ్రమంలో బాబావద్ద ఫూల్‌వాలా అనే ఆఠవ భూమికలోని మస్తు ఉండేవాడు. ఇతడు ఏవరు ఏది చెప్పినా వినేవాడు కాదు. ఈ మస్తుని బెత్గావ్‌లో 'విశ్వనాథ్' అనేవాడు కనుగొన్నాడు. కనుగొని బాబాకు వ్రాయగా బాబా నీలూని, పెండూని యిద్దరినీ 'ఫూల్‌వాలాని తీసికొని రమ్మ'ని పంపించారు, వారిద్దరూ అతనిని మాయచేసిఒక టాక్సీలో ఎక్కించుకొని బెంగుళూరుకి ఏకాయెకితీసికొని వెళ్ళారు. ఫూల్‌వాలా అసలయిన జలాలీమస్తు. అతనిని మెచ్చుకొంటూ 'ఫూల్‌వాలాని చూడు. ఒక్క లెంపకాయతో నిన్ను అరవభూమికకు ఎత్తివేయ గలడు'' అన్నారు బాబా. అతని జుట్టు, ఎరుపురంగుతో కూడిన ముదురుగోధుమ వన్నెలో ఉంటుంది. అతని చర్మం కళాయిపెట్టినట్లు గట్టిపడి ఉంటుంది. అతనికళ్ళు భరించలేని అనందతో ఉంటాయి. పరమానందంతో నాటకపాత్రధారిలా ఉంటాడు. పువ్వులంటే అతనికి మహాయిష్టం. అందుకే ఫూల్‌వాలా అనే పేరు వచ్చింది. ప్రతిరోజూ అతనికి యిష్టమని కొందరు మల్లెలు మొల్లలు వగైరా పుష్పాలు తెచ్చి ఇస్తారు. అవి దండలు కట్టి తలకి చుట్టుకుంటాడు పాగాలాగ. సున్నం పంచదారతో కలిపి ఒక గుడ్డముక్కలో చుట్టి నోట్లో పెట్టుకొని గంటలు కొద్దీ నములుతాడు. కనిపించిన వారికి పెద్ద అధికారంతో అజ్ఞలు జారీ చేస్తుంటాడు. ఆతని ఆజ్ఞలు ఉల్లంఘించడానికి వీలులేదు. 'జోహుకుం' అనవలసినదే. మంచి తీవిగల అతని హావభావాలు చూసిఎవరయినా భయపడేవారు ఎవరైనా ఎదురైతే 'వేలుపెట్టికళ్ళల్లోపొడుస్తాడేమో' అన్నంత దగ్గరగావెళ్ళిచూపుడువేలుతో చూపిస్తూ అజ్ఞ యిచ్చేవాడు. అది చూచి భయపడేవారు. చేతులకి, కాళ్ళకి, వేళ్ళకి పాత గుడ్డపీలికలు చుట్టుకునేవాడు. క్షవరం చేయించుకోమంటే' వద్దనేవాడు. కానీ ఒకనాడు విరచ్‌ని బ్లేడు అడిగి తీసికొని, రేజర్ లేకుండానే పట్టి బ్లేడుతో గడ్డం గీసుకున్నాడు. ఎన్నాళ్ళయినా అతని ఔద్ధత్యం తగ్గలేదు.

బాబా బెంగుళూరులో ఉండగా 1939 అక్టోబరు 17వ తెదిన రాంకిషన్ అనే మస్తును బెంగుళూరు నుంచి తను వద్దకు రప్పించారు. అతనిని రాగానే

చూసేసరికి — మెడనుంచి పైభాగం అంతా నల్లని వెంట్రుకలతో నిండిపోయి ఉన్నాడు. తలమీద చాలా ఒత్తుగావున్న జుట్టు ముడివేయబడి వుంది. ముఖమునిండా బొద్దుగా పెరిగిన మీసాలు గడ్డముతోను అతని ఫాలభాగము, ముక్కు, ప్రకాశవంతమయిన కళ్ళు తప్ప యింకేమీ కనబడటంలేదు. అతని శరీరం ఎలాఉన్నది అంత పట్టింపులేదు. బాబా అతనికి జుట్టు తగ్గించి, గడ్డం మీసాలు తీసివేసి క్షౌరం చేస్తే ఏమి అభ్యంతరం పెట్టలేదు. బాబా అతనికి స్నానం చేయించారు. క్రమంగా అతడు ఎక్కడికి వచ్చినదీ పరిసరాలను గుర్తించినట్లు కనిపించింది. అక్కడే ఫూల్‌వాలా అనే మస్తు ఉన్న గదిలోనే రాంశేష్‌ని కూడా ఉంచారు బాబా. ఒక్కొక్కమారు యీ మస్తులుగదిలోపల గడియ వేసుకుంటారు.

ఒకనాటి సాయంకాలం ఫూల్‌వాలా వెలిగించిన ఒక సిగరెట్‌ను తన మంచం మీద పక్కమీద పడవెయ్యగా అది అంటుకుంది. అప్పుడు ఫూల్‌వాలా కేకలు వేయడం మొదలుపెట్టాడు. అంతవరకూ మౌనంగాఉన్న రాంశేష్, అప్పుడు కేకలు వేసాడు. కానీ తలుపు లోపల గడియ వేసుకున్నారు. ఇద్దరూ ఆలోచించుకొని తలుపుతీసారు. అప్పుడు ఎరచ్, యితరమండలివారు లోపలికివెళ్ళి, మంటలు ఆర్పేసారు. ఈ సంఘటన తరువాత రాంశేష్ తరుచుగా మాట్లాడుతుండేవాడు. ఆశ్రమ జీవితంలో పాల్గొని ఆటలు ఆడుతూ, సంగీతం వింటూ, పాడుతూ ఉండేవాడు. అతనికి శ్రావ్యమైన కంఠం ఉంది. నవ్వితే పలువరుస అందంగా కనిపించేది.

బెంగుళూరు ఆశ్రమంలో ఒకనాడు మంచం విరిగి పోయింది, ఫూల్‌వాలా ఏరచ్‌ని వడ్రంగి పనిముట్లు అడిగి తీసుకొని వాటితో ఆ మంచం బాగుచేసాడు. అదిచూసి అందరూ ఆశ్చర్యపోయారు. ఒక్కొక్కప్పుడు ఫూల్‌వాలా అతని స్వంత విషయములు చెప్పేవాడు. అతనికి ప్రేమించే భార్య, పిల్లలు ఉండేవారట. ఒక రోజున కాఫీహోటలులో కూర్చొని ఉండి కాఫీకప్పు చేతితో పుచ్చుకొని కాఫీ త్రాగేక్షణంలో ఏదో జరిగిందని అలాగే చూస్తూ ఉండిపోయానని—చెప్పాడు. ఈ విషయం చెప్పేటప్పుడు కూడా కొంచెంసేపు అలాగే ఉండిపోయాడు. ఫూల్‌వాలా ఆ క్షణంనుంచి అతనికి ప్రపంచస్మృతిపోయి మస్తు అయ్యాడుట. బెంగుళూరు నుంచి బాబా 1940 ఏప్రెల్‌లో మెహెరాబాద్ మస్తు ఆశ్రమానికి ముఖ్య

పూల్‌వాలాని తీసికొని వెళ్ళారు. తరువాత అతనిని జూన్ మాసంలో బెల్గాం్‌కి తిరికి పంపించేసారు.

బెంగుళూరు ఆశ్రమంలో చిన్నస్వామి అనే 3వ భూమికలోవి మస్తు ఉండేవాడు. ఇతడు జలాలీ, జమాలీ లక్షణములు కలిగిఉండేవాడు. షరియత్ ఖాన్ అనే యింకొక మస్తుతో కలిసి తమాషాలు చేస్తుండేవాడు. వీరివల్ల ఆశ్రమం ఆనందమయంగా ఉండేది. చిన్నస్వామిని బాబా మొదట 1940 జనవరి మాసములో తిరువేడంకలుసుకున్నారు. చిన్నస్వామి కొండముచ్చులా నల్లనిముఖం కలిగిఉండే వాడు. బక్కపలచగా ఉండే యీ మునలివానికి తమలపాకులు నమలడం చాలా యిష్టం. ఎప్పుడూ నోటినిండా తాంబూలం నములుతూ ఎర్రగా ఉమ్మివేసేవాడు. ఇతనికి ఎవరూ త్రాగలేనంత వేడిగా టీ త్రాగడం యిష్టం.

సిగరెట్ నిప్పుఉన్న కొస నోటిలోనికి పెట్టిత్రాగేవాడు. తరువాత నిప్పుతోసహా నమిలేసి దాన్ని ఆర్పేసేవాడు. ఇతనిగుడిసె వెనుకవైపు ఒక ఎలక్ట్రిక్ స్తంభం తీగలలో ఏదోలోపం చేత షాక్ తగులుతుందని దానిదరికి వెళ్ళక తప్పు కునేవారందరూ. ఇతడు మాత్రం ఆ స్తంభాన్నే కౌగిలించుకొని ఆనందంగా దానిచుట్టూ నాట్యం చేసేవాడు

## వా నీ గే లీ

1939వ సం॥ అక్టోబరు 14వ తేదీన బాబాకు అత్యంతప్రేమికు రాలయిన వానీగేలీ (రానోతల్లి) మరణించినది. మొదట యీమె బాబాను సెప్టెంబరు 1933లో దర్శించినది. అది లగాయితు ఆమె బాబాకు మిక్కిలి సన్నిహితురాలయింది. బాబాను అతి గాఢంగా ప్రేమించింది. బాబా యీమెకు 'కేమాలీ' అనే పేరు పెట్టారు. అంటే 'గొప్పది' అని అర్థం. 1937వ సం॥లో నాసిక్‌లో పాశ్చాత్యులు బాబా వద్ద అనేకులు శిక్షణ పొందారు. అందులో నానీ ఒకతె. బాబా ఆమెకు ముక్తిని ప్రసాదించారు. మెహెరాబాద్ కొండమీద ఆమె సమాధి చేయబడినది. ఆ సమాధిమీద "బాబా ప్రేమిక రాలు—నానీ" అని బాబా వ్రాయించారు. ఆమె సంవత్సరీకంనాడు బాబా కొంత మంది పేదవారికి అన్నసంతర్పణ చేసారు. ఆ నాడు ఆ పనిలో రానో (నానీ

కువ్వార్స్త్రి)ను బాబా సహాయం చేయమన్నారు ఆమె తల్లికోసం బెంగ పెట్టుకో కుండా ఆనాడు 'మరణం అంటే ఏమిటో, తమ భక్తులు బాబా స్మరణతో మరణిస్తే వారు శాశ్వతంగా బాబాలో ఉండి ఎంత సుఖం అనుభవిస్తారో' వివరించి చెప్పారు వాళ్ళ సుఖం తలచుకొని తనకు కలిగిన వియోగం—నష్టం—మరచిపోవాలని బాబా చెప్పారు. ఈ మాటలు రానో మనసుమీద బాగా పనిచేశాయి.'

బాబా ఆశ్రమంలో ఒక గాయకుని నియమించి, రోజూ రెండుమూడు గంటలసేపు పాడించేవారు. చిన్నస్వామికి సంగీతం అంటే చాలా యిష్టం. తరుచుగా అతడుపాడుతూ నాట్యంచేసేవాడు. అలాంటిసమయంలో ఆధ్యాత్మికపరవశత్వం కలిగి స్పృహాగోల్పోయి పడిపోయేవాడు. అందుచేత అతడు వృద్ధుడు గనుక క్రింద పడిపోతే ఎముకలు విరుగుతాయేమో అని—బాబా మండలిలో ఒకరిని అతనికి రక్షకుడుగా నియమించారు. బాబా యితని తన్మయత్వం చూసి 'అజ్మీర్‌లో ఉండిన ఖ్వాజాసాహెబ్ యిలాగే పరవశుడైపోయేవాడు'అని చెప్పారు. వయసులో వృద్ధుడయినా యితడు చిన్నపిల్లవాడిలా అల్లరిచేస్తుండేవాడు. ఒకనాడు గోడ మీదనుండి గంతులేద్దామని ఉరికేసరికి పెదవి కరచుకున్నాడు. పెదవి బద్దలవగా దానిని కుట్టించారు. డాక్టరు కుడుతూంటే సూదితో గుచ్చినబాధ అతనికి గలిగినట్లే లేదు.

షరియత్‌ఖాన్ అనేవాడు మూడు వైఖరులు కలిగిన మస్తు-జమాలీ, జలాలీ, మహబూబీ, నిరంతరమూ ఉత్సాహంతో పొంగుతూ ఉండేవాడు. మొదట యితనికిమైసూర్‌రాష్ట్రంలోని చిక్‌మగులూరు పట్టణంలో కనుగొన్నారు. అక్కడినుంచి మండలి బెంగుళూరులో బాబా ఆశ్రమమునకు తీసికొని వచ్చారు. ఇతడు చిన్నస్వామితో కలిసి ఆశ్రమం అంతా గలగలా చైతన్యవంతంగా చేసేవాడు. షరియత్‌ఖాన్ నోరు ఎప్పుడూ పాడుతూనో. వాగుతూనో ఉండేదిగానీ మూత బడేదికాదు. పొట్టిగా చక్కగా ఉండే యువకుడు షరియత్‌ఖాన్. ఒక పాతఉలు టోపి చెవులురెండూ బయటికి వచ్చేలా, నెత్తిమీద అదిమి పెట్టుకునేవాడు అస్తమానం 'షరియత్' 'షరియత్' అంటూ ఉంటాడు. అందుకే అతనికా పేరు వచ్చినది. ఇతడు వాగేమాటలు ఎవరికీ అర్థంకావు. వాటికి తలాతోకా

ఉండేవికావు. నీ పేరేమిటంటే 'షరియత్' అనేవాడు. 'తనకి తొమ్మిది లక్షల మంది భార్యలు, తొమ్మిదిలక్షలమంది పిల్లలూ ఉన్నారనేవాడు.' వాళ్ళంతా ఎక్కడున్నారని' అడిగితే, 'షరియత్' అనేవాడు. ఏదో ఒక పాట పల్లవి అందుకొని లేక పోతే అర్థంలేని పాట ఏదోపాడుతూ – అదేమాట అస్తమానం అంటుండేవాడు. నాట్యం చేయడం అంటే షరియత్‌ఖాన్‌కి చాలాయిష్టం. యువకుడేమో కాళ్ళకి గజ్జలు కట్టుకొని ఘల్లుఘల్లుమని ధ్వనిచేస్తూ, గిర్రున తిరుగుతూ నాట్యం చేసేవాడు. పాడుతూ చురుకుగా యెగిరిగంతులేస్తూండేవాడు.

బాబా నియమించిన ఒక గాయకుడు ప్రతిరోజూవచ్చి, ప్రత్యేకమైన ఒక పాకలో పాడేవాడు. అప్పుడు బాబా అక్కడ కూర్చుంటే, ఆయన చుట్టూ అందరు మస్తులూ చేరేవారు. ఆశ్రమంలో మస్తులకి ఒకహోటలు ఉండేది. వారికి కావలసిన టీ, సిగరెట్లు, బీడీలు, తమలపాకుల—అన్నీ అందులో దొరికేవి. ఇక్కడి బెంచీలు బల్లలూ కుంటివి, స్తంభాలు వంకరవి. పైనకప్పు కిందుగా ఉంటుంది. ఇటువంటి టీ దుకాణాలు సర్వసాధరణంగా ఇండియాలో గ్రామాల్లో కనిపిస్తూఉంటాయి. మస్తులకి నిర్బంధాలు లేకుండా కొంత స్వేచ్ఛగా ఉండడానికి ఏర్పడింది— యీహోటలు.

బాబా మస్తులతోనే ఎల్లప్పుడూ పనిచేస్తూ ఉండేవారు. పిచ్చి ఆశ్రమంలో పని దీని తరువాతే. తూర్పు తెల్లవారుతుండగా పక్షుల కలకలారావంతో దినచర్య ప్రారంభమై, రాత్రి 9 గంటలకి మస్తులు పరుండేవరకు అవిచ్ఛిన్నంగా మస్తు ఆశ్రమం పని సాగుతూండేది. మస్తు ఆశ్రమంలో పనిచేయడానికి— ముఖ్యంగా ఓర్పు, శక్తి, సంతోషం ఉండాలి. అప్పుడే ఆ పని సులభం అవుతుంది.

బైరమంగళాలో 560 ఎకరముల భూమి కొనడం పూర్తి అయినది. తొమ్మిది వేరే వేరే భవనములు మొత్తం 350 గదులుండేలా కట్టడానికి ఏర్పాటయింది. దీనికి కావలసిన ప్రణాళికలు వేయడం అయినది. నమూనాలు తయారు చేసారు. ఈ ఆధ్యాత్మిక కేంద్రం గురించి సమస్తమయిన వివరములు తెలియజేసే పుస్తకములు ముద్రించడానికి ఏర్పాట్లు చేస్తున్నారు.

1939 అక్టోబరు 25వ తేదీన శంకుస్థాపన చేయడానికి బాబా నిశ్చయించారు. ఇది బాబా స్వయంగా జరుపుతారు. బాబాకి మట్టుకు — యీ కార్యం

అట్టహాసం లేకుండా మండలి, దగ్గర స్నేహితులు, సర్కారు ఉద్యోగస్తులు— దీనికి సంబంధించిన పని చూసినవారు — వీరిని మాత్రం పిలిచి యీ శంకుస్థాపన చేసేద్దామని — ఉంది. కానీ సర్వమానవులకు ఉద్ధరణకోసం ఏర్పాటు చేయబడే విశ్వకేంద్రం గనుక ముందుగా ఫలానా రోజున యిది జరుగుతుందని అందరికీ తెలిసేట్లుగా ప్రకటిస్తే, అందులో అభిరుచి ఉన్న సాధకులు మొదలైన వాళ్ళంతా వచ్చేవాళ్ళు రావచ్చును. బైరమంగళా గ్రామస్తులే కాకుండా చుట్టుప్రక్కల గ్రామాలవారంతా రావాలని వాంచిస్తారు. బాబాను కన్నులారా చూడడానికి అది వారికి గొప్ప అవకాశము. అందుచేత యీ కార్యక్రమమునకు అందరూ రావడానికి వీలుగా చేయుటకు నిశ్చయింప బడినది.

ఈ కేంద్ర నిర్మాణం కోసం బాబా బెంగుళూరులోనే ఉంటారు గనుక మెహెరాబాద్ నుంచి వారి ఆశ్రమం యావత్తూ బెంగుళూరుకి తరలించడానికి నిర్ణయించారు. అందుకు కావలసిన ఏర్పాట్లు చేసారు. మండలి చాలామంది బయలుదేరి వచ్చినా, యింకా మెహెరాబాద్‌లో మస్తు ఆశ్రమం వగైరా కనిపెట్టు కొని ఉన్నవారు కొంతమంది ఉన్నారు. వారంతా సెప్టెంబరు మధ్యలోనే బెంగు ళూరు రావడానికి మెహెరాబాద్ వదలిపెట్టారు. 20 మంది మస్తులను 600 మైళ్ళదూరం తీసికొని రావడం సామాన్యమైన పనికాదు. కానీ యిలాంటివాటిలో ఆరితేరిన బాబా శిష్యులు యీ కార్యాన్ని సాధించారు. దారిలో మస్తులు ఏమీ అల్లరి చేయకుండా ఉన్నారు. ఈ రెండురోజుల ప్రయాణంలోను వారు మండలికి ఎటువంటి కష్టమూ కలుగచేయలేదు. వారు బెంగుళూరుకి రాగానే బాబాకి వారి సంరక్షరణలోనే వారికి స్నానాలు చేయించడం, దుస్తులు వేయడం, భోజనములు చేయించడం— అన్నీ స్వయంగా చేయడంతో సరిపోతుంది. బెంగుళూరు వచ్చిన తరువాత బాబా 'యింకా మస్తు లెవరయినా దొరుకుతారేమోనని' అన్వేషణ జరి పిస్తూనే ఉన్నారు. ఇద్దరు ముగ్గురు శిష్యులను యీ పనిమీదే ఉంచారు బాబా. కొంతమందిని వెదకి తీసుకురావడం, వారి సాంగత్యంచేసి తిరిగి పంపించడం కూడా అయినది.

సెప్టెంబరు 21వ తేదీనుంచి బాబా పాక్షికమైన ఏకాంతవాసము, ఉప వాసము ఒక నెలరోజులపాటు జరుపుతున్నారు. ఈ నెలరోజులలోను బాహ్య

ప్రపంచంతో పని చేయకుండా, అంతరికమైన ఆధ్యాత్మిక కార్యంలోనే నిమగ్నమై యున్నారు. బాబాయొక్క అంతరంగ కార్యక్రమమునకు ప్రపంచంలో ఆనాడు జరుగుతున్న కొన్ని ప్రధాన సంఘటనలకు సంబంధం ఉండకుండా ఉండదు. ప్రపంచంలో ఎక్కడ చూచినా ధనంకోసం, పదవికోసం ప్రాకులాట ఎక్కువై పోతోంది. ఈ ఆశలూ, ఈ కోరికలూ మానవకోటిని క్రిందికి దిగలాగుతున్నాయి. మానవులు ఈ మాయ అనే ఊబిలోనికి యింకా లోతుగా దిగబడిపోతున్నారు. బాబా 'యింకొక ప్రపంచ మహాయుద్ధం అచిరకాలంలోనే వస్తుందని, యిదివరకు సంగ్రామం కంటె యిది తక్కువ కాలంలో ముగియునని, కానీ అంతకంటె ఎక్కువ వినాశనం జరిగిపోతుందని' చెప్తున్నారు.

## బాబా విధానములు

బాబాకు వారి శిష్యుల జీవితాలలో అన్ని సంగతులు తెలుస్తాయి. ఉదాహరణకు, ఎవరయినా ఒకనికి తిరస్కారం కలుగచేసారనుకో, తిట్టారనుకో, అబద్ధాలకోరు అని అన్నారనుకో — వెంటనే అతని అహం దెబ్బతింటుంది. లోలోపల ఉడుక్కుంటాడు. ఇది గనుక గ్రహించలేకపోతే అది కోపరూపేణాపైకి వస్తుంది. బాబా అటువంటప్పుడు యిరుపక్షాలవారిని పిలుస్తారు. ఆయన వారిని నిగ్రహం లేనందున కోపపడతారు. అయన యిలా అంటారు— "మీరు ఒకరిని ఒకరు ప్రేమించుకోలేకపోతే, మీరు ఆచరణ యోగ్యమైన పనులు చేయండి. మనస్సు సహాయంతో మీ అహంను పోషిస్తూ, దానిని ఎక్కువ బలీయం చేసినట్లయితే కష్టం, మీకు రోషం కలిగినప్పుడు నవ్వడానికి ప్రయత్నించండి, నాట్యం చేయడానికి ప్రయత్నించండి, కొంతసేపు లేచి బయటకు వెళ్ళండి. ఆమనస్సు లొంగుబాటు లోనికి వచ్చేవరకు. కానీ ఎలాగో దానిని నిగ్రహించాలి తప్పదు" అని బాబా చెప్పారు. సాధారణంగా అందరూ ఈ పాఠం నేర్చుకోవడానికి చాలా నెమ్మది కనబరుస్తారు. అందుచేతనే బాబా 'ఆయన చెప్పినట్లు వెంటనే ఆచరించమని' చెప్తారు. ఇలా ఆజ్ఞాపించకపోతే ఆ శిష్యునికి బాధ యింకా చాలా రెట్లు ఎక్కువవుతుంది. ఆఖరున బాబా చూసి "సరేలే, ఇంక లేచివెళ్ళు. జరిగినదేదో మరచిపో. ఇంక దాన్నిగురించి అసలు ఆలోచించకు. ఆ గొడవ వదిలిపెట్టు. నీవు సుఖంగా ఉండు. ఆహ్లాదకరంగా ఉండు. అది నా ఆజ్ఞ" అంటారు. అప్పుడు

నిజంగా మనకి ఆయన చెప్పినట్లు మరచిపోవాలనే ఉంటుంది. ఆయన దేవుడు గనుక మనలను క్షమిస్తారు. దానిని గురించి మరచిపోతారు. అసలు అది జరుగనట్లే మనతో ఆయన వ్యవహరిస్తారు. అలా నేను చెప్పినట్లు చేయలేకపోతే, ఉల్లాసంగా ఉండలేకపోతే — యింకెందుకు నావద్ద ఉండడం? మీరు యింత త్యాగం చేసారు మీ యిల్లు, స్వేచ్ఛ, మీ స్నేహితులు అన్నిటినీ అందరినీ వదలి నాకోసం నా ప్రేమకోసం యింతదూరం వచ్చారు. ఈ కాస్త నిగ్రహం మీరు చూపించలేకపోతే అంతా వృథా అన్నమాటే'' అంటారు బాబా.

బాబా విధానము యిలాగే ఉంటుంది. ఇంకొక సంగతి. ఎవరలయినా బాబా వద్దకు శిష్యుడుగా వచ్చేరనుకుందాము. అతనికి అసూయపడడం అంటే ఏమిటో తెలియదు. అతడు పెరిగిన పరిస్థితులలో అటువంటివేమీ అతనికికలుగలేదు. బాబా అందరి హృదయములు బాగా తెలిసినవారు. ఆ హృదయాంతరాలలో ఏవి బీజాలున్నాయో బాగా తెలుసు ఆయనకి. అంటే వాళ్ళ వాళ్ళ సంస్కారాలనుబట్టి ఎవరికి ఏ దుర్గుణాలున్నాయో, ఏ గుణాల బీజాలున్నాయో, ఏవి పైకి వచ్చాయో— అంటే ఏ బీజాలు మొలకలెత్తాయో, ఏ గుణాలు బీజమాత్రంగానే ఉన్నాయో— ఆయనకే తెలుసును. 'ఇప్పుడు యితని హృదయంలో అసూయబీజం ఉన్నదని' ఆయన కనిపెట్టారు. అది కూడా నిర్మూలమయి పోవాలి. లేకపోతే అది అతనిని ఎప్పటికయినా బోల్తా కొట్టిస్తుంది. అందుకని ఆయన ఏమి చేస్తారు?

మాయని జయించడానికి మాయనే పన్నుతారు. అతడు బాబాని బాగా ప్రేమిస్తున్నాడని అయనకు తెలుసును. 'అతని పనులలో ఆ ప్రేమను కనపరచాలని — అతనికి ఉందని కూడా' తెలుసును. కొన్నాళ్ళవరకు అతనంటే బాబా ఎంతో శ్రద్ధగా అతనిని గురించి ప్రవర్తిస్తారు అంటే బాబాని సేవించడానికి అతనికి అనేక అవకాశములు కల్పిస్తారు. ఇంక చూడండి ఆయన నాటకం. ఇతనిని వదిలేసి యింకొకరికి యిలాంటి అవకాశాలు యిస్తున్నట్లుగా కనిపిస్తారు. ఇతడు మామూలుగా చేసే పనులు యింకొకరి చేత చేయించుకుంటారు. అది యితడుచేసే ప్రత్యక్షమయిన ఒకరకపు పని అయినాసరే. ఏమీ తెలియనట్లుగానే బాబా ఉంటారు. 'తను చేసేపనులు యింకొకడు బాబాకి చేసిపెడుతున్నాడని' యితడు లోలోపల బాధ పడుతుంటాడు. హఠాత్తుగా ఒకరోజున అతడి

వైపు చూసి "ఏం ? అలావున్నావేం ? ఏమిటి సంగతి ? వంట్లో బాగాలేదా?" అని బాబా అడుగుతారు. అతడు "నాకేంతెలియదు" అంటాడు. బాబా యింకా అతడిని వదిలిపెట్టక ఎన్నో ప్రశ్నలు వేసి అసలు సంగతి రాబట్టుతారు. అదే కాబోలు 'అసూయ అంటే ఓర్వలేనితనం అని అతనికి తెలిసేలా చేస్తారు. ఆ ప్రియతముడి కోసం, అన్నీ తనే చేయాలని అనుకుంటాడు. అతడు తనమట్టుకు ఊరుకుని ఆ అవకాశం యింకొకరికి యిస్తే ఎంత అందంగా ఉంటుందో గ్రహించలేడు. 'అయ్యో! తనేకాదు, వాళ్ళు కూడా తనలాంటి వాళ్ళే. బాబాను వాళ్ళుకూడా ప్రేమిస్తున్నారు తనలాగే' అనే ఉదారమయిన బుద్ధి కలుగదు. బాబాను అతడు ప్రేమించడమే కదా కావలసినది. బాబా పని జరగడం, ఆయన సుఖించడం, ఆనందించడం కదా కావలసినది అని అనుకోడు. 'అది తాను చేస్తేనే తనకు ఆనందం కలుగుతుంది'. అంటే అతనికి కావలసినది 'అతని ఆనందమే కానీ బాబా ఆనందం కాదన్న మాట' ఇందులో రెండు దుర్గుణాలు ప్రస్ఫుటమవుతున్నాయి. 'ఇంకొకడు బాబాకు చేసిపెడుతున్నాడని ఓర్వలేకపోవడం' ఒకటి. 'తాను స్వయంగా చేయాలనీ, ఆ ఆనందం తానే పొందాలనే స్వార్థపరత్వం' రెండవది. మనయొక్క ప్రేమ నిస్వార్థమైనదీ, నిర్మలమైనదీ అయితే యీ భావాలు మనలో కలగవు. బాబా అందుకనే 'మీరు నన్ను ఎలా ప్రేమించాలో అలా ప్రేమించలేకుండా ఉన్నారు' అని అంటారు. 'అందరూ ఒకటే—అందరిలోను ఆ బాబా—దేవుడు—ఉన్నాడనే భావం గట్టిగా మనలో పాతుకుపోవ లి. బాబా సేవ చేస్తున్నవారే కాకుండా—అలా ప్రత్యక్షంగా కనిపిస్తున్నవారే కాకుండా-ఏ పనీ చేయకుండా, చేయడానికి అవకాశం లేకుండా అటువంటి అవకాశం కోసం వేచియున్నవారు కూడా బాబా సేవలో పాల్గొంటున్నవారే 'అని వాళ్ళకి తోచాలి. అంటే సహజంగా వాళ్ళుకూడా బాబాను ఈ వ్యవధిలో నిరంతరమూ తలచుకుంటూనే ఉంటారు. బాబా నీలోని ఆ భావాలను ఆ అసూయను స్వార్థాన్ని—రూపుమాపేవరకు ఊరుకోరు. నీకు అనేక పరీక్షలు పెడతారు. బాబా ఒకమారు 'స్థాణువులా ఏ గుణాలు లేకుండా ఉండడం కంటె ఏదో ఒకటి ఉండిదాన్ని నిగ్రహించడానికి ప్రయత్నిస్తుంటేనే మంచిది' అన్నారు. ఆత్మనిగ్రహం చాలా గొప్పది. 'కోపాన్నుంచి, కోరికలనుంచి, ఆశనుంచి నిగ్రహించుకొని మనలను మనం కాపాడుకోవడమే—మనం పశువుల కంటె భిన్నంగా ఉన్నామనడానికి తార్కాణం'. బాబా తమ శిష్యులందరినీ యీ విధంగా ఆత్మనిగ్రహం

చేసుకోమంటారు. బాబా ఎవరినీ ఎంత బాగా ఏ పని చేసినా సాధారణంగా మెచ్చుకోరు. 'నీవు ఏపని చేసినా అది నన్ను సంతోష పెట్టడానికి చేస్తున్నా వనుకో' అంటారు బాబా. ఒక్కొక్కప్పుడు ఆయన 'సంతోషించాను' నీ పనివల్ల' అని ఏమీ చెప్పకుండా ఆ చేసిన భక్తునిమీద దయతో ఒక్కచూపు చూస్తారు. అందులో ప్రేమ, కరుణ, తృప్తి—అన్నీ యిమిడి ఉంటాయి.

బాబా వద్ద ఉన్న శిష్యులు యెలా ఉండాలో బాబా చెప్పారు — అది ఆయన పూర్వావతారాలలో కూడా చెప్పారు. "ఎవరయితే తనకున్నవన్నీ త్యాగం చేయలేడో అతడు బాబా దగ్గర శిష్యుడుగా ఉండలేడు" అన్నారు. "సర్వస్వము—తను మన, ధనాలు అన్నీ ప్రేమకోసం వదిలిననాడే 'భగవంతుని నీవు తెలుసుకో గలవు" అన్నారు.

కొంతమందికి అష్టైశ్వర్యములు ఉంటాయి. భగవంతుడు ఒక్క మాటుగా వారికి అడగకుండానే అన్నీ కలుగజేస్తాడు. కొందరికి కొద్ది కొద్దిగా ఒకటి తరువాత ఒకటి ప్రాప్తింపజేస్తాడు.

బాబాను సన్నిహితంగా చూసిన వారికి, ఆయన జీవితమును గమనించినవారికి ఒక సత్యం ద్యోతకమవుతుంది. ఆయనకోసం ఆయనకి ఏమీ అక్కర్లేదు. ఆయనకు ఏమీలేదు. ఆయన పనినుంచి ఆయనను విడదీయలేము. భగవంతుని పని అనంతమయినది. అందుచేత ఆ పనికోసం కావలసినవి కూడా అనంత మయినవే. అందరినీ పిలిచి ఎక్కడికో దీర్ఘమయిన ప్రయాణం చేయాలి మండ లితో సహా 'అని చెప్పి, 'ఎవరు సహాయం చేస్తారు ?' అని అడుగుతారు. బాబాకి తెలుసును అందులో ఎవరు చేయగలర్లో. కానీ ఆయన చెప్పరు. ఆయనను ప్రేమి స్తున్నామనుకునే వారికి యిలా అవకాశం యిస్తారు. సాధారణంగా బాబా అలా చెప్పినప్పుడు 'యివ్వగలవారు యివ్వకుండా ఉండలేరు' యిస్తారు. అప్పుడు బాబా చిన్నపిల్లవానిలా ఆనందిస్తారు. అంతకంటె నిజంగా యిచ్చినవాడికే ఆనందం ఎక్కువగా కలుగుతుంది. నిజమైన ప్రేమ ఉందంటే దానికి సహజగుణం యివ్వడమే. కానీ, పైన చెప్పినట్లు అష్టైశ్వర్యములు ఉన్నా చాలామందికి యివ్వ బుద్ధి పుట్టదు. భాగ్యం యివ్వడం కూడా భగవంతుడు మనకు కల్పించిన గొప్ప

పరీక్ష. అది వదలలేకుండా, అందులోనుండి ఏది కదసలేకుండా ఉన్నావంటే పూర్వ సంస్కారబంధాలే దానికి కారణం. అవి సడలించుకోవడంలోనే ఉన్నాయి— మన జయాపజయములు.

ఒక్కొక్కమారు బాబా మస్తుల కార్యక్రమం గురించి యిలా అంటుంటారు. "నాకే గనుక ధనం ఉంటే యింకా ఎంత బాగా జరిగేదో మస్తుల పని !" అని. అప్పుడు అది విన్న ధనవంతుడు— అతడు వినాలనే బాబా అలా అన్నది కూడాను— "యిదిగో నేను యింత యివ్వగలను" అంటాడు. బాబాకి యివ్వగలగడం ఆయన అంగీకరించడం, ఆ యిచ్చినది బాబా పనిలో వినియోగ పడడం - యింతకన్న ధనవంతుడయిన బాబా ప్రేమికునికి అదృష్టముంటుందా ? దానితో అతని జన్మ సార్ధకమయినట్లే...

ఒక్కొక్క సమయంలో ఒకడికి బుద్ధిచెప్పేందుకు బాబా తమాషా చేస్తుంటారు. ఒకనివద్ద ధనం పుచ్చుకోవడానికి అంగీకరించి, అది అతని యెదురుగానే యింకొకనికి యిచ్చివేస్తారు. అప్పుడు ఆ ధనం యిచ్చినవాడు కొరకొర చూస్తాడు. 'అలాంటప్పుడు తన దగ్గర ఆ ధనం పుచ్చుకోవడమెందుకు ?' అనుకుంటాడు. తను యిచ్చిన ధనం బాబా తన స్వంతపనికి వినియోగించుకోలేదని బాధపడతాడు. బాబా యిలా చేయడంలో అర్థం లేకపోలేదు. 'అన్నింటికి ప్రతిఫలంమీద దృష్టి లేకుండా ఉండాలనే' దీనివలన తెలుసుకోవలసిన పాఠం. తాను యిచ్చిన ధనం ఎలా వినియోగించుకున్నారు బాబా అనేది తనకు నిజంగా అవసరంలేదు. బాబాకు యివ్వడమే ప్రధానం. యిందులో ప్రతిఫలాపేక్ష, స్వార్థం లేకుండా ఉండాలి.

'మనంచేసే ప్రతిపనీ కూడా సహాయకరంగా ఉందా లేదా చూడమంటారు' బాబా. "మూడు పిల్లులను రక్షించడానికి ఒక కుక్కను చంపవలసి వస్తే పిల్లులను రక్షించడానికే పూనుకో. నీవు అందుకు చంపుతున్నావని నీ పనిమీద ఆసక్తి కలిగి ఉండకు" అన్నారు బాబా. "హింస అనీ అహింస అనీ నీవు దేనిమీదా రాగం కలిగి ఉండకు. అవసరమయితే దెబ్బలాడు. నీ ఉద్దేశం మాత్రం సహాయం చేయడానికే ఉండాలి." అని చెప్తారు బాబా. "నీ వినోదం, నీ సుఖం కోసం భోజనం

చేయకు. భగవంతుడికి సేవ చేయాలని తిను. ఆ విధంగానే కోరికలనుంచి స్వేచ్ఛను పొందగలవు. అలాగే నీవు ప్రేమకు సక్తుడవై యుండగలవు'' అన్నారు బాబా. కర్మ చేయడం గురించి చెప్తూ బాబా— ''నీవు ఏపని చేస్తూ ఉన్నా నన్నే ఎల్లప్పుడూ తలచుకుంటూ ఉండు. క్రమంగా నేనే నీ ద్వారా అన్నీ చేస్తూ ఉంటాను; కర్తను నేను (బాబా) నీవు కాదు. అందుచేత ఫలితంతో నీకేమి పని ?'' అన్నారు.

రాహూరీలో అనేక నెలలు కష్టపడి కట్టించిన భవనములు ఒక్కమారుగా నేలమట్టం చేసేసారు బాబా. రాహూరీలో మస్తులకి ఆశ్రమం నెలకొల్పి అది ఉచ్ఛ స్థితిలో ఉండగా, అక్కడి పని అన్నివిధముల బాగా జరుగుచుండగా— అక్కడ పని బాగా జరుగుతోందని, పనివారు దానియందు ఒక విధమైన ఆసక్తిని, పనిమీద కాదు, ఆశ్రమంమీద కలిగిఉండగా, ఆ భవనములన్నీ బాబా ఒక్కరోజులో కూల ద్రోసి మూడురోజుల్లో మెహెరాబాద్‌కి అంతా తరలించేసారు. రోజుకి 200 మంది వచ్చి ఔషధములు తీసుకునే ఆస్పత్రిని ఒక రోజులో మూసివేసి, సరం జామా అంతా మెహెరాబాద్‌కి చేర్చేసారు. ఆయన నిర్మాణమూ చేస్తారు; విరామాలమూ చేస్తారు. అయితే ఏదో ఒక ప్రయోజనంకోసం అది మనకు— తెలియకపోవచ్చును. ఆధ్యాత్మిక కారణములు దృశ్యం కావుగా— ఆయన దగ్గరవుండే వారిని అనేక రకాలుగా ఆయన పరీక్ష చేస్తారు.

బాబా నిరంతరమూ 'ఆయన చేసే కార్యాలలో ప్రేమయే అన్నిటికంటె ముఖ్యమని, భగవంతుడే సత్యము, తదితరమంతా మిధ్యయని తెలియజెప్పేలా'— చేస్తారు. ఆయనే దివ్యప్రేమ గనుక యితరులలో ఆ ప్రేమను ఉత్పన్నం చేయు గలరు. భగవంతుని దివ్యప్రేమ మామూలు మానవుడికి అర్ధంకాదు. అందుచేతనే ప్రేమావతారుణ్ణి ఎవరూ సరిగ్గా అర్ధం చేసుకోలేరు.

బాబా మనలను ప్రేమ ఎలా వ్యక్తం చేయమంటారు? 'సంతోషంతో ప్రతిపనీ నిస్వార్ధంగా చేయడం ద్వారా మనప్రేమను వ్యక్తం చేయాలన్నారు. 'ఇదే పవిత్రమయిన కర్మ. ఈ కర్మ ద్వారానే నీవు పరిశుద్ధుడవుతావన్నారు. 'భగవంతు డికి అన్నిపనులు అంకితంచేసి చేస్తూఉంటే, ఆ కర్మ బాధ్యత అంతా ఆయనదే అవుతుంది. అది నిన్ను బాధించదు. 'అంటారు. ఇలా చేయడం ద్వారా మనం

బాబాకు మన జీవితాలను ప్రేమతో అంకితం చేయగలం. ఎవరికయినా కష్టం కలిగిస్తే బాబాకి కష్టం కలిగించినట్లే ఎవరికయినా సంతోషం కలిగించి వారిని సుఖపెడితే బాబానుసుఖపెడుతున్నామన్న మాటే. అందులోస్వార్థంలేకుండాఉంటేని సరి. కొంతమందిభక్తులంటారుట— 'నాకు భాగవత్సాక్షాత్కారం కావాలి, నాకు భగవంతునితోఐక్యతకావాలి. అది కలుగజేస్తేనాఆస్తి అంతాయిచ్చేస్తాను. నాకు యింకేమీ అక్కర్లేదు. నా జీవితాంతం నీ దాసుడుగా ఉంటాను.' అని ఏ ప్రేమికుడయినా అన్నప్పుడు, 'అటువంటి మనోభావాలు కలిగి ఉంటే అంతకంటే బాబాని బాధపెట్టే మార్గం యింకొకటి ఉండదు, అంటారు బాబా. ఈ షరతులేవీ లేకుండా ఒక్కడయినా 'నాదంతా నీదే బాబా నాకు ఏమీవద్దు. సాక్షాత్కారమూ వద్దు ఐక్యమూ వద్దు. నాకు నీ ప్రేమ ఒక్కటే కావాలి'' అని అనేవాడికోసం బాబా వేయికళ్ళతో చూస్తారట. వాడు తక్షణమే తరించాడన్నమాట.

బాబా ఎప్పుడూ ప్రపంచం కోసం బాధపడుతుంటారు. బాబా హావభావాలను ఆయనవద్ద వున్నవారు గమనిస్తూ ఉంటారు. ఆయన ముఖ కవళికలలో ఏదో మార్పు వస్తుంది. ఏదో ఒక విధమయిన విసుగు ముఖంలో కనిపిస్తుంది. అది కొంతమందికి యిష్టం ఉండదు. ఉండనివారు అక్కడ కూర్చోలేక వెళ్ళిపోతారు. దానికి కారణం — బాబాయొక్క భావాలను అర్థంచేసుకోలేక పోవుటయే. బాబా అటువంటి భావం ఒకటి వ్యక్తంచేసి ఆయన భారాన్ని తగ్గించుకుంటున్నారేమో! ఆ భారం, ఆ బాధ మనంకూడా యీ విధంగా పంచుకుందామని — ఎవరికీ తోచదు. ఆఖరున ఆయన పరీక్షకు ఆగలేని ఆ మండలివైపు చూసి బాబా జాలిగా ''అవునులే. మీ తప్పులేదు. మీమీద లేశమాత్రము నా భారాన్ని మోపుదామను కున్నాను. అంతే'' అంటారు. ఈ చిన్న పరీక్షలో కూడా గెలవలేకపోవడం దుర దృష్టకరమే. బాబాలో ఎటువంటి భావం కలిగినా, ఆయనలో ఏ మార్పు కలిగినా, విసువు జనించినా, చీదరింపు కలిగినా — అసలు అలాంటిది కలుగనే కలుగదు — ఒకవేళ ఏది కలిగినా అది మన మంచికోసమే - అని భావించి ప్రేమ హృదయంతో స్వీకరించి కృతకృత్యులయిన మండలిది నిజంగా అదృష్టమంటే.

క్రీస్తు తన శిష్యులతో ''నేను త్రాగిన పాత్రలో మీరు త్రాగ గలుగుతున్నారా?'' అని అడిగితే, వారికి సరిగ్గా అర్థంకాలేదు. 'ఆయన బాధలలో ఆయన

శిష్యులు పాలుపంచుకో గలుగుతున్నారా ?' అని దాని భావం. అది ఎప్పుడు సాధ్య మవుతుంది ? శిష్యుని చైతన్యం ప్రభువుయొక్క విశ్వ చైతన్యంలో లీనమైపోవాలి. ప్రతి భక్తుడు ఆయనకి సమర్పణ కావాలి. అప్పుడుగాని అంతటి ఘనమైన అవ కాశం, ఆయన బాధలను పంచుకునే అంత అదృష్టం కలుగదు.

బాబా ఒకమారు 1937వ సం॥ లో తమ విధానాలను గురించి జీన్ ఏడ్రి యుల్‌తో చెప్తూ "నిన్ను నేను నా వద్దకు లాక్కుంటాను. తరువాత నిన్ను దూరంగా తోసేస్తాను. మరల నా వద్దకు యింక దగ్గరగా లాక్కుంటాను. తరు వాత యింకా దూరంగా తోసేస్తాను. ఆఖరున నాతో నీవు ఒకటి అయిపోయేలాగ నా వద్దకు లాక్కుంటాను, అని వివరించారు.

తరువాత మస్తులను కొందరిని సాంగత్యం చేయడానికి బాబా తమిళ దేశం పర్యటనకై వెళ్ళారు సెప్టెంబరు (1939) మాసంలో.

బాబా నాగపట్టణం వెళ్ళి అక్కడ చట్టి బాబా అనే మస్తును సాంగ త్యం చేసారు. మొదట ఎరచ్‌ని, కాకాని దక్షిణ భారతదేశము నుంచి మస్తులను తీసికొని రమ్మని, బయలుదేరిన 11 రోజులలో తిరిగి రావాలని— బాబా చెప్పి పంపారు. వారు యీ పర్యటనలో సూర్యాస్తమయిన తరువాతే రోజుకొక్కపూట మాత్రమే భుజించాలి. వారు తిరుచినాపల్లి మీదుగా నాగపట్టణం వెళ్ళారు. వారు తిరుచినాపల్లిలో యేమి చేసినదీ తరువాత వివరిస్తాము. నాగపట్టణంలో చట్టి బాబాని చూసారు. నిరాడంబరంగా చేతిలో ఒక చట్టి (సిడత), చంక నొక పాతగుడ్డల మూట అతనికున్నాయి. అతడొక వృద్ధుడు. అతని తరహా ఎరచ్, కాకాలు దూరాన్నుంచి గమనించారు. చట్టి బాబాకు దారేపోయేవారు సాష్టాంగ వందనం చేసేవారు. అందుకు బదులు వారికి అతడు నేలమీదనుంచి ఒక చిటి కెడు మట్టితీసి యిచ్చేవాడు. వారు దానిని నుదుటికి రాచుకొని శిరస్సున చల్లు కొనేవారు. వారిని, చట్టి బాబా నవ్వుతూ పలకరించి 'పో అన్నా పో' అనేవాడు. ఎరచ్, కాకాలకి అరవబాషరాదు. కావునవారు తమతో మాట్లాడు గలిగిన సర్దార్ సాహెబ్ అనేతురకవాని నొకనిని తమతో కూడా తిరుచునాపల్లి నుంచి నాగపట్ట ణమున్నకు తీసికొని వెళ్ళారు. అక్కడి జనులు చేసినట్లుగానే చట్టి బాబాకు యీ

ముగ్గురు నేలమీద సాగిలపడి వందనం చేసారు. చేసిన తరువాత చట్టి బాబా యిచ్చిన బూడిదను నుదుటికి రాచుకున్నారు. చట్టి బాబాను బెంగుళూరు రమ్మని పిలువగా అతడు, 'నా బిడ్డలందరితో నాకు యిక్కడ చాలా పని ఉంది. కొన్నాళ్ళు పోయిన తరువాత రాగలనేమో' అన్నాడు.

ఇంక లాభం లేదనివారు అతనిని వదిలిపెట్టివేసి తిరుచినాపల్లి వెళ్ళారు. అక్కడ నుంచి తంజావూరువెళ్ళి అక్కడ మస్తు అన్వేషణ చేసి అబ్దుల్‌ఖాదర్ జిలానీ అనే మస్తును కలిసారు. ఎరచ్‌కాకాలు అతని యెదుటికి వెళ్ళగానే అతడు వీరిరువురిని చూసి 'మెహెర్ బాబా, మెహెర్‌బాబా' అని ఎంతో గౌరవభావముతో ఉచ్చరించాడు. జిలానీనికూడా బెంగుళూరు రమ్మనగా 'తరువాత వస్తానని' మాట యిచ్చాడు.

నాగపట్నంలో ఉన్నప్పుడే ఎరచ్, కాకాలు మోతీబాబా అనే ఆరవభూమిక లోని మస్తును రెండుసార్లు కలిసారు. సాయంకాలం రెండవపర్యాయం అతని కోసం వారు వెళ్ళినపుడు మోతీబాబా ఎక్కడనుంచో వచ్చాడు. అతడు ఏడుకోట్లు ఏడు లాగులు తొడుగుకొని ఉన్నాడు. వారక్కడుండగా ఒక్క జతఉంచుకొని మిగతావి విప్పేసాడు. తరువాత తన నౌకరుచేత భోజనం తయారు చేయించుకొని మోతీబాబా భోజనం చేసాడు. మోతీబాబా వద్దనున్న నౌకరు మొదట కుష్ఠురోగిగా ఉండేవాడు. మోతీబాబాను అతనిరోగం నయం చేయమని ప్రాథేయపడగా, 'ప్రతిదినము మోతీబాబా పాదధూళిని తీసికొనివెళ్ళి అది అతని పుళ్ళమీద రుద్దమని' చెప్పాడు. ఆ సేవకుడు అట్లే చేయగా కొద్దికాలము లోనే అతనికి ఉన్న కుష్ఠురోగము మాయమైపోయింది. అప్పటికి అతడు బాగా ఆరోగ్యవంతుడై మోతీబాబాను వదలక తన జీవితమును అతని సేవకు అంకి తము చేసుకొని అతనిని సేవించుచుండెను.

ఎరచ్, కాకాలు మోతీబాబాను తమతో రమ్మని ప్రార్థించగా బురదతో ఉన్న అతనిపాదాలు చూపించి 'మీరుఎక్కడకి నన్నురమ్మంటున్నారో అక్కడికే నేను వెళ్ళివచ్చాను' అన్నాడు. మోతీబాబా తరువాత 'కాకా ఎరచ్‌లకు టీ తయారుచేసి యిమ్మ'నెను. మోతీబాబా నౌకరు ఎరచ్ కాకాలకు పెద్దగిన్నెతో టీ తీసుకొని వచ్చి యిచ్చాడు. ఆ రాత్రి వారిద్దరినీ తన వద్దనే

పరుండమని చెప్పాడు. కానీ వారు బాబా పెట్టిన గడువు లోపల తిరిగి బెంగుళూరు వెళ్ళవలసియుండుట చేత, ఆ రాత్రికి అక్కడవారు ఆగలేదు. తరువాత వారిరువురు చట్టిబాబా వద్దకు వెళ్ళారు. చట్టీబాబా 'తరువాత వస్తానని' చెప్పగా వీరిద్దరూ సర్దార్‌సాహెబ్‌తో బయలుదేరి తంజావూరు వెళ్ళి అక్కడనుంచి తిరుచినాపల్లికి రైలుమార్గము మీద నడుస్తూ, ఎట్లాగో ఒకరైలు స్టేషన్‌కి చేరారు. అక్కడ మాస్టరు ఎరచ్‌కి చిన్నప్పటి సహాధ్యాయి. వరదలవలన అతడు సామానులన్నీ పోగొట్టుకొని బాధపడుతున్నవారికి టీ యిచ్చి ఆదరించాడు.

వచ్చినవారమెలాగా వచ్చామని ఒకమారు రామేశ్వరం వెళ్ళి, అక్కడినుంచి తిన్నగా బెంగుళూరుకు చేరుకున్నారు ఎరచ్, కాకాలు. ఈ వరదల సమయంలో యీ ప్రయాణాలు చేసేటప్పుడు మస్తులెవరూ లేకుండా ఉండడమే వ రికి ఉపకారమయినది.

ఎరచ్‌కాకాలు వచ్చి బాబాకి అన్నీ విన్నవించుకున్నారు. మస్తులను స్వయంగా వెళ్ళి బెంగుళూరు ఆశ్రమానికి గొనివచ్చుటకు బాబా బయలుదేరి వెళ్ళారు. బాబాతో ఎరచ్—కాకాలు, జాల్‌కేరావాలా, గస్తాద్‌జీలుకూడా ఉన్నారు. వెళ్ళేటప్పుడు తిరుచినాపల్లిలో నవంబరు 27వ తేదీన యూసఫ్ అనే మస్తును సాంగత్యం చేసారు. మోతీబాబానుకూడా కలుసుకొని, బాబా సాంగత్యం చేసారు. బాబా అతని పాదములు కడిగి ఒక హోటలులో అతనికి భోజనము పెట్టి, అక్కడే అతనితో ఏకాంతముగా కొంతసేపు కూర్చున్నారు. ఆ హోటలులోనే బాబా వారికి కావలసిన భోజనం తయారుచేయించుకుని, మండలితో భోజనం చేసారు.

నాగపట్నంలో మండలి ఎంతో ప్రయత్నించి, చట్టిబాబాను బాబా సన్నిధికి టాక్సీలో గొనిరాగా, అతనికి బాబా హోటలులో భోజనం పెట్టించారు. బాబా చెప్పినవి అతడంగీకరించి 'బెంగుళూరు వస్తానని' చెప్పాడు. వెంటనే చట్టి బాబాను తీసుకొని రెండుకార్లలో సాయంత్రానికి తంజావూరు చేరారు. అక్కడ బాబా ఒక ధర్మశాలలో బస చేసారు. ఆ రాత్రి రెండుగంటలకు చట్టిబాబా లేచి 'తనకు ఆకలిగా ఉందని' చెప్పగా బాబా కాకాచేత అప్పటికప్పుడు వంట చేయించి భోజనం పెట్టారు. భోజనంచేసి షికారుపోవాలని చట్టిబాబా బయటకురాగా, బాబా

అతనితోకూడా జాల్‌కేరావాలను పంపించారు. నాలుగుగంటల సేపయినా వారు తిరిగి రాలేదు' చట్టిబాబా నగర వీధులన్నీ విరామం లేకుండా తిరుగుతున్నట్లు, ధర్మశాలకి రమ్మంటే రావడం లేదనీ' జాల్‌కేరావాలా ఒక చీటి వ్రాసి బాబాకి ఎవరి చేతనో పంపాడు. వెంటనేకాకా ఒక టాక్సీ వేసుకొని వెళ్ళి 'రమ్మన్నా' అతడు రావడానికి నిరాకరించాడు. జాల్‌కేరావాలా, కాకా యిద్దరూ చట్టిబాబాతో సందులుగొందులు తిరిగి ఊరి బయటకు ఒక చోటకు వెళ్ళగా అక్కడ చట్టి బాబ 'అంతవరకు తనతో సందుగొందులన్నీ తిరిగినందుకు కూలియిదుగో' అని పదిఅణాలు డబ్బులు జాల్‌కేరావాల్‌కి యిచ్చెను. ఎలాగయితేనేం ఒక టాక్సీలో చట్టిబాబాను బాబా ఉన్నధర్మశాలకు తీసికొని వెళ్ళారు.

ఈలోపుగా అబ్దుల్‌ఖాదర్‌జిలానీ అనే మస్తును బాబా సాంగత్యమ్ము చేసారు. జిలానీకి చుట్టలంటే యిష్టం. మాంసం అమ్ముకునే ఒకని దుకాణానికి ముందు వసారాలో యీ మస్తు నివసించేవాడు. ఆ దుకాణాదారే జిలానీకి కావలసిన వన్నీ జాగ్రత్తగాయిస్తూ, అతనిని కనిపెట్టి చూస్తుండేవాడు. ఈ మస్తు నడక, మిగిలిన గుణాలు అన్నీ గౌస్‌వలె ఉంటాయి. అతని నడక, లేడిగ్గా గంతులూ వేస్తూ నడుస్తూ ఉన్నట్లుంటుంది. నవంబరు 28వ తేదీని బాబా యితనిసాంగత్యం చేసినపుడు, జిలాని పాదాలు కడిగి ప్రణామంచేసి, అతనికి భోజనము పెట్టి ఆ మస్తుతో ఏకాంతంగా కొంతసేపు కూర్చున్నారు బాబా. చట్టి బాబాను అక్కడికి తీసికొని రాగానే, అతనిని బాబా 50 బాల్చీల నీళ్ళతో స్నానం చేయించారు. తంజావూరు నుంచి బాబా శిష్యులతో తిరుచినాపల్లి వెళ్ళి, అక్కడ ఉన్న యూసఫ్ మస్తును తమతో బెంగుళూరుకి తీసికొని వెళ్ళారు. యూసఫ్ పొడవుగా బక్కపలచగా ఉండే మస్తు. ఇతడు మూడవ భూమికలో ఉన్నాడు.

యూసఫ్‌కి శారీరకమైన చైతన్యం చాలా తక్కువ. టీ అన్నా, బీడీ అన్నా అతనికి చాలా యిష్టం. బీడీలు గొలుసు కట్టుగా కాల్చేవాడు. సాధరణంగా నోరు విప్పి మాట్లాడేవాడు కాదు. అప్పుడప్పుడు 'చా, బీడి' అని అడిగేవాడు. అతడు జమాలీ వలె నెమ్మదిగా ఉండి చెప్పినట్లు వినేవాడు.

బెంగుళూరు చేరుకోగానే చట్టి బాబాకు బాబా ప్రత్యేకంగా మస్తు ఆశ్ర

మంలో బస చేయించారు. అతనికి బాబా స్వయంగా స్నానం చేయించేవారు. ప్రతి వారు 100, 50 బాల్చీలకు తక్కువ లేకుండా నీరు వాడుతూ ఉండేవారు.

బెంగుళూరు మస్తు ఆశ్రమంలో బాబా స్వంతంగానే పని చూసుకుంటు న్నారు. బాబా ప్రత్యేకంగా చేప్తేనేగానీ మండలిలో ఎవరూ అక్కడికి వచ్చి ఏ పని లోనూ కలుగచేసుకునేవారు కాదు.

బైరమంగళాలో విశ్వ ఆధ్యాత్మిక కేంద్రానికి పునాది వేయడానికి డిసెంబరు (1939) 17వ తేదీకి వాయిదా పడినది. ఈ గ్రామం బీడలి రైల్వేస్టేషన్‌కి 3 మైళ్ళ దూరం ఉంది. బెంగుళూరుకి బైరమంగళ 20 మైళ్ళు. కారులలోను బస్సులలోను మనుష్యులు రావాలి. బహిరంగ కార్యక్రమం జరుపడానికి ఏర్పాట్లు జరిగాయి. ప్రజలు యీ కార్యక్రమానికి వచ్చేందుకు ప్రత్యేకంగా కొన్ని బస్సులు వేసారు. కావాలసిన వారికి బస్సులలో వెళ్ళడానికి 500 పాసులు యివ్వడం జరిగినది. వీరందరికీ కూర్చొనడానికి కుర్చీలు వేరే చేయించారు. బీడడి రైల్వేస్టేషన్ నుంచి బైరమంగళాకి రానుపోను సౌకర్యముంటే యింకా కొన్నివేలమంది పరిసర ప్రదేశములనుండి యీ కార్యక్రమానికి వచ్చేవారు. అయినప్పటికీ వెయ్యిమందికి పైగా బస్సులలో వచ్చారు. మొత్తం 4000 మంది హాజరయ్యారు. జనం వచ్చిన బస్సులకు "మెహెర్‌బాబా విశ్వ ఆధ్యాత్మిక కేంద్రం, బైరమంగళ" అని అట్టలమీద, గుడ్డలమీద వ్రాయించి కట్టించారు రెండువైపులా. వచ్చిన ప్రజలలో అన్ని మతములవారు– ధనికులు, పేదవారు, భూస్వాములు రైతులు, అన్ని వృత్తుల వారు ఉన్నారు. 'ఆధ్యాత్మికంగా జాతి-మత కులభేదాలు లేకుండా మానవ సౌభ్రాతృత్వం కలిగించాలనీ, జీవితపరమావధి అయిన ఆత్మజ్ఞానం వీలయినంతమందికి కలిగించాలని' యీ కేంద్రముయొక్క ముఖ్యోద్దేశము.

మెహెర్‌బాబా వారి మండలి, శిష్యులు, భక్తులు చాలామంది అక్కడ ఉన్నారు. కొన్నివేలమంది ఆ చిన్నగ్రామంలో వచ్చి చేరారు. ఇదివరకు ఎన్నడూ కనివిని ఎరగని హడావిడి ఆ గ్రామంలో ఆనాడు కనిపించింది. ఈ కార్యక్రమానికి పెద్ద పెద్ద షామియానాలు వేయించారు. గుండ్రంగా వేదిక అమర్చారు. వేదిక మీద మెహెర్‌బాబా మధ్యను కూర్చున్నారు. వారి ఆసనం వద్దకు వారి శిష్యులు బాబాను తీసికొని వచ్చారు. ఒక కీర్తన బృందంవారు గానంచేసి కొంతసేపు

అందరికీ సంగీతం వినిపించారు. దివాన్ సర్ మీర్జా యిస్మాయిల్ వారి అధికారులతో సభలోనికి వచ్చారు. వచ్చి, బాబాకు వారు పూలమాలలు వేసారు. బాబా దివాన్‌కు పుష్పగుచ్ఛాన్ని యిచ్చారు. ఎ. కె. సయ్యద్ రసూల్ అను రిటైర్డు మునిసిపల్ ప్రధానోపాధ్యాయుడు పెర్షియన్ భాషలో రచించిన వినతిపత్రము బాబా గౌరవార్ధము చదువబడినది. మద్రాసు నుంచి వచ్చిన రిటైర్డు సబ్ జడ్జి సి. వి. సంపత్తయ్యంగారు అప్పుడు మెహెర్‌బాబాతో తన పరిచయమును గురించి ప్రసంగించెను. 'ఈ పీడిత ప్రపంచానికి మెహెర్‌బాబాయే ప్రేమ, శాంతి సందేశము నివ్వగలవారనీ, ఆయనను విశ్వ అధ్యాత్మిక కేంద్రానికి పునాదివేయవలసినదిగా' కోరాడు.

పునాది వేయడం కోసం ఏర్పడిన స్థలానికి బాబా వెళ్ళారు. అప్పుడు సప్త లోహాలతో తయారయిన పారలతో కొంత మట్టిని తీసారు. అక్కడే పునాదిరాయి బిగిస్తారు. తరువాత బాబా వారి యథాస్థాన మలంకరించారు. బాబా ఆ సమయమునకు తయారుచేసిన ఒక సందేశం ఆంగ్లములోను, కన్నడంలోను చదివారు. ఆ సందేశం యిలాఉంది.

## బాబా సందేశము

"ప్రపంచంలో యిప్పుడు యుద్ధము జరుగుతోంది, అది జీవితం యొక్క అన్ని శాఖలకి— రాజకీయ, ఆర్థిక, సాంఘిక, మత సంబంధమయిన శాఖలకి— ఆవరించినది. అనేకమయిన మారుపేర్ల రూపంలో భవిష్యత్తు యొక్క అనిశ్చిత పరిస్థితిలో ఎవరికివారు జాగ్రత్తపడాలని—వారిలో భయం ఎక్కువవుతోంది. జాతీయత పేరుతో వేరే ఉండడం జరుగుతోంది. స్వార్ధపరత్వం ఆర్థికరంగంలో కనిపిస్తోంది. మతం పేరుతో దురభిమానం పెరుగుతోంది. దురాచారం. దుర్నీతి 'నైతిక సాంఘిక స్వేచ్ఛ' అనే పేరుతో చెలామణీ అవుతున్నాయి. సంఘాన్ని, ప్రజలను పీడించడం 'రాజకీయం' అనబడుతోంది: పరిణామశ్రేణిలో క్రింది జీవాలలో ఆత్మసంరక్షణం సహజంగాను న్యాయంగానూ ఉంటుంది. కానీ అదే మానవునిలో కనబడినప్పుడు, వానిని మాటలాడే పశువుగా మార్చి వేస్తోంది. 'ఉత్తమమయిన సృష్టి' అని మానవుని గురించి చెప్పడానికి యింకా చాలా ద్వార

ములో మానవుడు ఉంటున్నాడు. క్రమమయిన దారిలో ఉన్నా, అక్రమ మార్గ ములో ఉన్నా— అది ఎవరితప్పు? ఎవరితప్పుకాదు. ప్రతి మానవుడూ సేవ చేసి ఒక ఫలితాన్ని సాధించడానికే వచ్చాడు. అతని పాత్ర అతడు పూర్ణంగా నటించడం వలన—అతడు అతనియొక్క మోక్షమును సాధించగలుగుతున్నాడు.

అయితే యీ భేదముంది: దివ్యప్రణాళికలో వ్యక్తులుగానీ ప్రజలుగానీ ఉన్నత గతికి, పురోగతికి వెళ్ళేబదులు స్వార్థపరత్వం వలన భోగలాలసత్వం వలన పశుత్వానికి దిగజారిపోవడానికి సిద్ధపడుతున్నారు. బాధలు అనుభవించిన కొలదీ వారు యథాస్థితికి రాగలరు.

ఆధ్యాత్మిక గురువులు మానవాళికి యీ పునరుత్థానమే తీసికొనిరాగలరు. ప్రేమయే మొదలూ అంతముగా కలిగియున్నటువంటి వైరాగ్యం వలన, మానవ సోదరత్వం వలన ఆ మాటలు బోధించడం వలననేగాక, అనుష్ఠానంలోనికి తీసికొని వచ్చినందువలన ఎక్కువ సులభంగాను తక్కువ బాధతోను అది వారు సాధించ గలరు.

అటువంటి విశ్వమానవ జాగృతికి సమయము భవిష్యత్తులో ఎంతో దూరంలో లేదు. అందుకోసమే నేడు విశ్వ ఆధ్యాత్మిక కేంద్రంయొక్క శంకుస్థాపన చేయబడినది.

మైసూరు అనేక యితర అభివృద్ధి వైఖరులతోపాటు, యీ విధంగా ప్రపంచానికి ఆధ్యాత్మిక రాజధాని అగుటకు ఎంతో అదృష్టం కలిగి ఉంది.

ప్రపంచం కనివిని యెరుగని విధంగా, మీరు నేడు పునాది వెయ్యగా చూసిన యీ మహా ఆధ్యాత్మిక పునరుజ్జీవన పథకమునందు పాల్గొనినవారిని పాల్గొననివారిని అందరినీ, మీలో ప్రతి ఒక్కరినీ నేను ఆశీర్వదిస్తున్నాను. భూమి మీద దైవ నియోగము యొక్క స్వభావానికి యీ విశ్వ ఆధ్యాత్మిక కేంద్రం చిహ్నంగా ఉంది. మీకు నా ఆశీస్సులు.''

అప్పుడు పలువురు ఉపన్యసించారు. సంపత్త్యయ్యంగారి కుమార్తె అయిన వి. టి. లక్ష్మి 'ఆమెకు బాబాతో కలిగిన పరిచయమును గూర్చి' ముచ్చటించినది. తరువాత ఆచార్య ఎమ్. చక్రవర్తి— ఈతడు నిజముగా ఒక వేదాంత చక్రవర్తియే— ఈ ఆధ్యాత్మిక కేంద్ర పథకమును గురించి వచ్చినవారికి స్వాగతము చెప్తూ మైసూరు రాజ్య ప్రజలకు దానినిగూర్చి తెలియపరచెను.

ఆ తరువాత బాబా పారతో స్పృశించిన మట్టిని కొంచెము తీసుకొనుటకై బొంబాయి నుంచి వచ్చిన అనేకమంది బాబా శిష్యులు ముందుకి వెళ్ళారు. ఈ కార్యక్రమం అయిన తరువాత వచ్చిన అతిథులకు అల్పాహారాలు యిచ్చారు.

బాబా బెంగుళూరు వచ్చినప్పటినుండియు కొద్దిమందికి దర్శనమిచ్చి వారితో సంభాషణ జరిపారు. చాలామంది దర్శనము కోరినప్పటికి యీ కార్యక్రమానంతరం బాబాతో సంభాషించవచ్చునని వాయిదా వేసారు. అందుచేత చాలామంది దర్శనార్థులతో బాబా డిశెంబరు 18వ తేదీ లగాయతు సంభాషణలు చేసారు. ఈ సంభాషణలు డిశెంబరు నెలాఖరు వరకూ సాగాయి. ఈ దర్శనార్థులలో నిజంగా ఆధ్యాత్మిక సహాయంకోసం బాబా ఎద్దకు వచ్చిన వారలు లేకపోలేదు. వారికి ప్రేమతో బాబా సహాయ మొనర్చారు.

బాబా డిశెంబరు (1939) 24వ తేదీన 'పరిశుద్ధమైన ప్రేమ' గురించి బాబా దర్శనార్థం వచ్చిన ఒకరికోసం ప్రసంగం చేసారు. అతడు ఒక ఊరిలో న్యాయవాద వృత్తిలో ఉన్నాడు. అతడు అమాయక హృదయంతో ఉన్నదున్నట్లు మాట్లాడే స్వభావం కలవాడు. అతనికీ బాబాకీ యీ దిగువ విధంగా సంభాషణ జరిగింది.

న్యాయవాది :— బాబా! ప్రేమ గురించి నాతో చాలమంది మాట్లాడగా విన్నాను. నిజంగా ప్రేమ అంటే ఏమిటో మరి. నాకు ఆశ్చర్యంగా ఉంది.

బాబా:— నీకు పెళ్ళి అయ్యిందా ?

న్యాయ:— అయినది.

బాబా :— నీకు పిల్లలున్నారా ?

న్యాయ:— ఉన్నారు.

బాబా :— నీవు వాళ్ళను ప్రేమిస్తున్నావా ?

న్యాయ :— అవును. మామూలుగా. కానీ అది నిజమైన ప్రేమ అని చెప్పలేను. నా ఉద్దేశం అసలైన ప్రేమ నాకుండాలని. మాయతో కూడిన యీ ప్రేమ — అనురాగం కాదు. నేను సాధుపురుషులను సాంగత్యం చేసాను. అసలైన ప్రేమ అనుభవించాలని, కానీ యింతవరకూ అందులో నాకు జయం కలగలేదు.

బాబా అతనికి దివ్యమైన నిజమైన ప్రేమ కావాలనే కాంక్ష ఉండడం చాలా మెచ్చుకున్నారు.

బాబా:- నీవు నిజమైన ప్రేమ అంటే ఏమిటో మొదట తెలుసుకోవాలి. 'ప్రేమ' అని జనులు మామూలుగా అనే దానిలో కూడా స్వార్థయుతమైన అభిప్రాయం సాధారణంగా వాళ్ళని మోసపుచ్చుతుంది. అంతేగాక స్వార్థపూరితమైన కోరికలనే 'ప్రేమ' అని వాళ్ళనుకుంటారు. ఈ సంగతి నీకు ఒక ఉదాహరణతో చెప్తే బాగా తెలుస్తుంది. ప్రేమగురించి మాట్లాడేవాడు అంటాడు— 'నా ప్రియుతముణ్ణి నేను ప్రేమిస్తాను. నా ప్రియతముడు న వద్ద ఉండాలని నేను కోరుకుంటాను' అని యీ విధంగా అనుకుంటాడు. ఈ ప్రేమ గురించి చెప్పే మాటల్లో 'నేను' 'నా' అనే మాటలే ఎక్కువగా ఉంటాయి.

ఇంకొక ఉదాహరణ :— నీ బిడ్డ చిరిగిపోయిన చొక్కా ధరించి ఆడుకుంటున్నాడనుకో. అది వాడికి తెలిస్తే దానివలన వాడికి విచారం కలుగుతుంది. నీవు వెంటనే అది తెలుసుకొని నీవుకూడా విచారిస్తావు. అలాకాక ఎవరయినా పిల్లవాడు వీధిలో అలాంటి బట్టలు ధరించి వెళ్తూంటే, అంటే చిరిగిన బట్టలతో ఉంటే నీవు చూస్తే నీకు అలాంటి భావమే కలుగుతుందా? నీ కొడుకు అలాంటి బట్టలు ధరిస్తే నీవేమి అనుకుంటావో— అలాగే అనుకుంటావా? అలా కాకపోయినట్లయితే నీ పిల్లవానియెడల నీవు చూపించిన భావము నీలో ఉన్న స్వార్థానికి ఫలితమే. నీకు పరిచయములేని పిల్లవానిని చూసినప్పుడు నీకు కలిగిన భావాలూ, నీ కొడుకుని అలాంటి స్థితిలో, చూసినప్పుడు కలిగిన భావాలలాటివే అయితే నీకు నిజమైన ప్రేమ కలదన్నమాటే.

అందుచేత స్వార్థం ఎప్పుడైతే ఉండకుండా సంపూర్ణంగాపోతుందో అదే నిజమైన ప్రేమకు చిహ్నం. పరిశుద్ధమైన ప్రేమకు అదేపరీక్ష.

బాబా అప్పుడు నిర్మలమయిన ప్రేమ లేక దివ్యప్రేమ ఎలాగ అనుభవింప బడగలదో వివరించారు. అది ఒకరిమీద బలవంతంగా వేసేదికాదు. అది ఒకరినుంచి బలవంతంగా తీసికొనబడేదికాదు. సాధకుడు తన స్వార్థం పోగొట్టుకొనిన వెంటనే పొందేది అది. అతని 'అహం' ఎప్పుడైతే నిర్మూలమయిపోతుందో, 'నేను' అనేది ఎప్పుడైతే అతనికి ఉండదో, అప్పుడు ఆ పరిశుద్ధమైన ప్రేమ అతనిలో ఉత్పన్న మవుతుంది.

ఆ నిస్వార్థస్థితి ఎలా కలుగుతుందో వివరిస్తూ బాబా యిలాచెప్పారు. ''అటువంటి స్థితిరావడం చాలా కష్టం అని చెప్పవచ్చు. అదే చాలా సులభంగా వస్తుందనీ-చెప్పవచ్చు. ఈ మాటలు వింతగా కనిపించవచ్చుగానీ అవి నిజంమాత్రం కాకపోవు.

'స్వార్థం పూర్తిగా నాశనమైపోవాలి, నిస్వార్థస్థితి రావాలి' అని సాధకుడు దృఢంగా నిశ్చయించుకోనంతసేపు ఆనిస్వార్థస్థితి కలగడం చాలా కష్టం. నీ మనస్సులో నీవు బలంగా నిశ్చయించుకోకపోతే నీలోని అహంకు సంబంధించిన అనుబంధాలన్నీ అధిగమించడం నీకు కష్టం అవుతుంది. నీ గమ్యం చేరలేవు. అలా కాక నీలో దృఢమైన ఇచ్ఛతో నీ లక్ష్యాన్ని ఎలాగయినాసరే సాధించాలని పట్టుదల కలిగిందో-నీకు అది సులభమై పోతుంది. నీకు చాలా యిష్టమయిన ఒక పాతకోటు ఉందనుకో, దానిని నీవు వదిలించుకోవాలంటే బలవంతాన దానిని తీసిపారేస్తే గాని. నీ మనస్సులో నిశ్చయించుకొని దానిని తీసేయాలని. తీసేస్తేనేగానీ, దానిని నీవు వదిలించుకోలేవు. ధైర్యంగా నీవు చేసుకున్న నిశ్చయంవలన ఆ పని సులభం అవుతుంది. లేకపోతే అ పని చాలా కష్టమవుతుంది''.

బాబా యింకా యిలా వివరించారు. 'పరిశుద్ధ ప్రేమను అనుభవించడానికి ఆత్మత్యాగం చాలా అవసరం. త్యాగం అంటే నీకున్నఐహిక సంబంధాలన్నీ వదులుకో నక్కరలేదు. నీ వ్యవహారాలన్ని వదులుకుని నీవు అడవికి వెళ్ళనక్కరలేదు. నిజంగా దాని అర్థం ఏమిటంటే 'నీవు యీ ప్రపంచములోనే యిక్కడే ఉండి, నీ విధు అన్నీ సక్రమంగా నిర్వర్తిస్తూ, దేనియందూ ఆసక్తిలేకుండా రాగంలేకుండా విరక్తికలిగినా

చరించడ'మన్నమాట. ఇది సాధించలేని ఆదర్శంకాదు. ఇది ఆచరణయోగ్యమైనలక్ష్యం. సులభసాధ్యమైనది అయితే నిశ్చయంతో ధైర్యంగా అది సాధించాలని పూనుకోవాలి'.

ఈ ప్రసంగం ముగిసేక పూర్తిచేస్తూ బాబా యిలా అన్నారు. 'ఆకలి వేసినప్పుడు మానవుడు తాను ఆకలి ఎలా అనుభవిస్తాడో, అలాగే సాధకుడు నిర్మల ప్రేమను అనుభవించాలంటే దానికోసం కాంక్షిస్తాడు. తగిన సమయంలో దాని మార్గాలు అతనికే తెలుస్తాయి. గురువు వల్ల మార్గం చూపబడుతుంది. కోరికలు లేకుండా ఉండేస్థితి కలుగుతుంది. అప్పుడు ఆఖరికి దివ్య ప్రేమానందాలు అనుభవిస్తాడు. ఇవి బుద్ధి విశేషంతో ఊరికే వర్ణిస్తేను, అర్ధంచేసుకుంటేనూ చాలదు. ఇది అనుభవించవలసిన స్థితి.'

బైర్లమంగళలో నిర్మాణం జరుగుతూనే ఉంది. బాబా మండలి కొందరు పర్యవేక్షణ చేస్తూఉన్నారు. ఆ ఆధ్యాత్మిక కేంద్రం మొత్తం ఒక ఉద్యానవనంలా నిర్మించాలని జి. హెచ్. క్రుంబీ గెల్ అనే నిర్మాణ నిపుణునికి ఈ కార్యం అప్పగించారు. మైసూరు రాష్ట్రంలో అనేక అందమైన తోటలు వనములు భవనాలు ఈతడు సృష్టించాడు. బాబా దర్శనార్థం అనేకమంది వచ్చి వెళ్తున్నారు.

బెంగుళూరులో లింక్స్ అనే బంగళాలో ఉండగా, బాబా ఆయన లేలా అని పిలిచే డెలియా ఉత్తర్వం వ్రాయగా ఆమెకు ఇంగ్లండుకు యీ విధంగా జవాబు వ్రాసారు.

'అవును నీవు వ్రాసింది నిజమే. ఈ మధ్య నీకు ఉత్తరాలు వ్రాయలేదు బాధ అనుభవం ద్వారానే నేర్చుకోగలనని వ్రాసినమాట అక్షరాల నిజం. నీవు అది అనుభవంమీద వ్రాసిన మాటే.

హాఫీజ్ వ్రాసినది ఎలా వుందో చూడు. ఇది ఎప్పుడయినా చదివేవా?

'నా మార్గంలో నడచినవాడికి ముళ్ళు గుచ్చుకొని బాధపడతాడు; దుఃఖం చెందుతాడు.

అలాగని భయపడి ఏ యాత్రికుడు తన అన్వేషణ మానేసాడు?

పూర్ణమయిన ప్రేమను పొందినవాడిని, నీవు బాగా ఎరుగుదువు.

అతడెవరంటే, ఎవరయితే తన ఆత్మ యీ దుఃఖంవల్ల ఒక వెలుగుగా ప్రకాశించిందో, అతడే.

తాత్కాలికమైన యీ బాధకి కారణం నీ అహంభావమే. కానీ అదే నీ శాశ్వత సుఖానికి, ఆనందానికి కూడా కారణం. నీకు నిజమైన ఆనందం కలుగ బోతుంది. నామాట నమ్ము. అందుచేత యిప్పుడు నీవు అనుభవిస్తున్న బాధ— సంఘర్షణ మంచివే. నీకు ప్రేమించడానికి శక్తి ఎక్కువయినకొలది ప్రియు తమునితో వియోగంవల్ల విరహబాధ ఎక్కువవుతుంది. ప్రియతమునికి దూరంగా ఉండే వాళ్ళకే గాక దగ్గరగా ఉండేవాళ్ళు కూడా యీ విరహబాధను అనుభవిస్తు న్నారు. నిజంగా యీ విరహబాధ దగ్గరగా ఉన్నవాళ్ళకే ఎక్కువగా ఉంటుంది. వాళ్ళకి ఐక్యత, ఏకత్వం అనే అనుభవం ఉండదు. కావాలని నేను వేసినతెర యీ అనుభవాన్ని మరుగుపరచి నిన్ను ఇతోధికంగా పనిచేసేలా చేస్తుంది. ఇదంతా నా మండలి కోసమే. కానీ మీ మీ పాత్రలు మీరు బాగా నటించాలి. ఒక్కొక్కరు అందుకోసం మీ పనిని తేలిగ్గా తీసుకోకూడదు. మీకు అప్పగించిన పనిని జాగ్ర త్తగా పూర్తి చేయాలి. మీరు— ప్రతీ ఒక్కరూ నన్ను ప్రేమించండి, పనిచేయండి; నాకు విధేయులుగా ఉండండి. మానవోద్ధరణకు నేను చేసే విశ్వకార్యంగాక నాకు బలువైన పని ఉంది. కేంద్రముయొక్క పని. నేను ప్రతీ అంశము ఎంత చిన్న విషయమైనా నేను స్వంతంగా చూసుకోవాలి. నా మండలికి ఒక్కొక్కరికి ఒక్కొక్క పని అప్పగించినా— నేను పర్యవేక్షణ చేస్తూ ఉండాలి. అది భారీయెత్తున జరుగు తోంది. అందులో అనేక శాఖలున్నాయి. కానీ నేను ఒక్కడినే యిలా చెయ్యాలి; అన్ని పనులు చేయించాలి. పత్రికలో మీరు యీ విషయాలన్నీ చదువుతారు...

ఎమ్. ఎస్. ఇరానీ'

1939వ సంవత్సరం డిసెంబరు 30వ తేదీన కాషాయాంబరం ధరించిన ఒక యువక సన్యాసి భవానంద అనే పేరు కలవాడు బాబా దర్శనార్థం వచ్చాడు ఇతనిని భాగ్వా అని అంటారు. ఇతనితోకూడా మరియొక సన్యాసిఉండెను. భాగ్వా తల్లిని—తండ్రిని, తన కుటుంబాన్నీ అందరినీ వదలిపెట్టాడని, భగవదన్వేషణతో ఎంతో తిరిగాడనీ, టిబెట్‌కూడా వెళ్ళివచ్చాడనీ, యిప్పుడు రామేశ్వరంనుంచి వస్తున్నా డని ప్రసంగవశాత్తు తెలిసినది. మెహెర్‌బాబా గురించి బెంగుళూరులో తెలిసిందనీ

చాలావుంది వద్దంటున్నా ఎలాగయినా బాబాదర్శనం చేసుకోవాలని వచ్చానని' అతడ బాబాతో చెప్పాడు. భగవంతుని అన్వేషణలోనే ఉన్నవాడు దర్శనంకోసం వచ్చినందుకు బాబా చాలా సంతోషించారు. అతడుకూడా బాబాను దర్శించుకునే భాగ్యం తనకు కలిగినందుకు చాలా తృప్తిపడ్డాడు. అప్పుడు బాబాకి అతనికి యీ క్రిందివిధంగా సంభాషణ జరిగినది.

బాబా :— తల్లి—తండ్రులను కుటుంబాన్నీ వదలివేయడం చాలా సులభమేకానీ భగవంతుని పొందడం బహుకష్టం.

స్వామి :— నా ప్రాణాల నయినా అర్పించడానికి సిద్ధంగాఉన్నాను. నాకుదైవ సాక్షాత్కారం కావాలి (కలగాలి).

బాబా :- నిజమేకాని గొప్ప ఎక్కడుందంటే బ్రతికి ఉండడంలోనూ బ్రతికిఉండి దేవుణ్ణి ప్రేమించడంలోనే ఉంది అన్నిటికంటెఎక్కువగా. చచ్చిపోవడం సులభమే. నీకున్న యీ కాంక్ష మంచిదే. అది కొనియాడవలసినదే. భగవంతుని పొందడం అనే కోర్కెమాత్రం కలిగి యింకే వాంఛ లేని నీలాంటివారు నాకు కావాలి. అదే జీవితంలో అసలు కావలసినది.

ఈ మాటలు విని స్వామి చాలా ఆనందించాడు. తాను అన్నింటికి సర్వసిద్ధంగా ఉన్నా'నన్నాడు.

బాబా:— అయితే నిన్ను పరీక్ష చేస్తాను. దానికి తట్టుకోవడం అంత సులభం కాదు సుమా. నువ్వు ఆలోచించి తరువాత చెప్పు నాకు.

స్వామి;— ఇంక నేను ఆలోచించవలసింది ఏమీలేదు. ఎప్పటినుంచో ఎంతో ఆలోచించాను. ఈ నిర్ణయానికి వచ్చాను. ఇంక దానిగురించి ఆలోచించటం మానేసాను, నేను అన్నింటికి ఎటువంటి కష్టానికైనా సంసిద్ధుడనే.

బాబా:- (చిరునవ్వుతో) అయితే యిప్పుడు నీవు నావాడవు.

స్వామి అప్పుడు ఎంతో తృప్తితో, బాబా తనను శిష్యుడుగా అంగీకరించినందుకు 'హమ్మయ్యా' అనుకొని హృదయం ఎంతో తేలిక చేసుకున్నాడు.

బాబా :— అయినా యింకా నీవు దీన్నిగురించి నెమ్మదిగా ఆలోచించి నాకు చెప్తే బాగుంటుంది. ఎందుచేతనంటే యిలాగే యితరులు కూడా అప్పటిమట్టుకు ఉత్సాహంతో మాట్లాడి తరువాత పరీక్షకు తట్టుకోలేక పారిపోయారు.

స్వామి :— లేదు బాబా. నేను అన్నీ వదిలి చేతులు కడుక్కున్నాను. నాకింకా ఏ సందేహమూ లేదు. మీరు ఏమి చెబితే అది చేయడానికి సర్వసిద్ధంగా ఉన్నాను.

బాబా :— భేష్! నాకు సంతోషంగా ఉంది. అయితే నేను నీకు నీ యభీష్టం తీరడానికి సహాయం చేస్తాను. నీవు జాగ్రత్తగా విను. మొట్టమొదటగా నీవు చేయవలసినది ఇది—

1) రామేశ్వరానికి కాలినడకను వెళ్ళాలి. II) రోజుకొక్కసారే భోజనం చెయ్యాలి. అదైనా నీవు భిక్షమెత్తి తినాలి. III) డబ్బు స్పృశించడానికి వీలులేదు. IV) ఏ స్త్రీని ముట్టుకోవడానికి వీలులేదు. నీకు ఎవరైనా తారసిల్లితే నీ తల్లిని తలచుకో. V) రామేశ్వరంలో 100 మంది సాధువులను దర్శనం చేయాలి. VI) నీవు యివన్నీ చేసి నా వద్దకి మళ్ళీ 1940 ఫిబ్రవరి 1వ తేదీకి రావాలి.'

బాబా 'ధనం స్పృశించవద్దని' ఎప్పుడైతే చెప్పారో వెంటనే స్వామి తన నడుంకి కట్టినగుడ్డలో ఒకమూల చిన్నమూటను విప్పి, కొంతడబ్బు ఉంటే అది తీసి నేలమీద పారవేసాడు. బాబా ఆజ్ఞానుసారం అది తనవద్ద ఉండకూడదు గనుక అలా చేసాడు. బాబా చెప్పిన మిగతా వాటన్నటికి ఒక్కమాటకూడాబదులు చెప్పలేదు.

బాబా పెట్టిన పరీక్షకఠినమైనదే. బెంగుళూరునుండి యింతదూరం నడచి వెళ్ళి, ఒక్కనెలలో రావడం అసాధ్యమే అవుతుంది. స్వామితోకూడా ఉన్నస్నేహితుడు యీ సంగతి అతనిచెవిలో చెప్పి బాబాను అడగమన్నాడు ఆ విషయములో, బాబాకి వినిపించేలాగే ఆమాట అతడు తన స్నేహితుడితో చెప్పాడు. అప్పుడుబాబా— 'అది అతడు చూసుకుంటాడు. నీకెందుకు విచారం? అతడేమీ యీ విషయంలో ఆందోళన చెందుటలేదే. భగవంతుడికోసం అతడు చావడానికికూడా సిద్ధంగా ఉన్నాడు.' అని చెప్పి 'అవునా మరి' అన్నట్టు బాబా స్వామికేసి చూసారు.

స్వామి మౌనంగా ఉన్నాడు. తాను చేసుకున్న నిశ్చయం దృఢమైనదే అన్నట్లుగా— అతడు బాబాకు కనబడ్డాడు. లతడు బాబా ఆశీర్వాదం పొంది సెలవు తీసుకున్నాడు.

అతనికున్న తీవ్రమైన వాంఛ, ఆతనికున్న దృఢమయిన నిశ్చయం అసాధారణమైనది. మండలివారు అతని తరహా మౌనంగాతిలకించి మెచ్చుకున్నారు. స్వామి, అతని స్నేహితుడయిన యింకొకస్వామి— యిద్దరూ కలిసివెళ్ళారు. గేటు వరకూ వెళ్ళిఉంటారు. బాబా మండలితో 'స్వామిని రమ్మని చెప్పమని' పంపారు. అతడు బాబా పిలిచినట్లు ఒక్కడేవచ్చాడు. రెండవవాడు తనదారిన తానుపోయాడు. ఈ యువకసాధకుడు వచ్చి బాబాకు అభిముఖంగా నిలబడ్డాడు. ఇంకాక్రొత్త పరీక్ష ఎటువంటిదయినా స్వీకరించుటకు సిద్ధంగా ఉన్నాడు.

మొదట బాబా అతనివైపుచూసి నవ్వి, తరువాత అన్నారు,— 'నీవు నేను యిచ్చిన పరీక్షకు 'ఎలాగా' అని సందేహించకుండా, అది తప్పించుకుందామని ప్రయత్నించకుండా, నేను చెప్పినట్లు ఆచరించడానికి సిద్ధమయ్యావు. నీ కాలు బాగాలేనప్పటికీ నీవు అంతదూరం నడిచివెళ్ళడానికి ఉద్యుక్తుడవయ్యావు. (ఒక పాదం మీద కురుపువేసి బాధచేత అతడుకుంటుతున్నాడు.) నీవు భగవంతునికై నీ వాంఛను యిలాగే ఉంచుకుంటే యిలాగే ఎటువంటి పరీక్షకయినా ఒడబడి గట్టిగా నిలబడ్డావంటే—నీవు తప్పక ఆత్మసాక్షాత్కారం పొందగలవు. భగవంతుడు నీలోనేఉన్నాడు. ఎప్పుడూ నీతోనే ఉన్నాడు.

స్వామి :— బాబా యిదివరలో ఒక సాధువుయిలాగే చెప్పాడు. కానీ అలాంటి మాటలవల్ల నాకేమీ మేలుకలుగలేదు. ఆతనిపేరు - (ఫలానా)

బాబా—నీకు ఆ సాధువు చెప్పినది సరియే రామకృష్ణ పరమహంస అదేచెప్పాడు వేదాంతం అదే చెప్తోంది. పండితులంతా అలాగే చెప్తారు. అందరూ ఆ మాటే అంటారు. కానీ అది అనుభవంతో కూడుకున్నది. నీవు ముందయీ సంగతిగ్రహించు. అందుకనే నేను శ్రద్ధ తీసికొని కొన్నిపనులు చేయమని

నీతోచెప్పాను. నేను చెప్పినప్రకారం చేయుము. కానీ నీవురామేశ్వరానికి నడిచి వెళ్ళవద్దు, రైలులోనే వెళ్ళు.

బాబా అలా చెప్పగానే ఆ స్వామి ఏదో చెప్పబోయాడు. కానీసందేహించాడు. అది బాబాకు తెలుసును. ఆమాట ఏమిటో సందేహం లేక చెప్పమన్నారు. స్వామి 'తనవద్ద రైలుటక్కెట్టుకి రానూపోనూడబ్బు లేదని' చెప్పాడు. అప్పుడుబాబా మండలిచేత అతనికి కావలసిన రూపాయలు యిప్పించారు. 'ఎంతమాత్రం సందేహం లేకుండా తానుచెప్పిన ప్రకారం తు-చ-తప్పకుండా ధైర్యంతో ఆచరించిరమ్మని' బాబా చెప్పారు.

బాబా— ఈ డబ్బుతీసుకొని రైలుటిక్కెట్టుకి ఉపయోగించు. మిగతావన్నీ నేను చెప్పినట్లే చేయి. రామేశ్వరం వెళ్ళి నేను రమన్న తేదీకి రా.

స్వామి:— బాబా! నేను యిప్పుడు రామేశ్వరం నుంచీ వస్తున్నాను కదా. (నవ్వుతూ అన్నాడు)

బాబా:— అవును. కానీ యీమాటు నీకు రామేశ్వరం క్రొత్తగా ఉంటుంది. స్వామి కళ్ళు మూసుకుని తన లోపల బాబా మాటలకు చాలా ఆనందించాడు. అది అతని ముఖంలో ద్యోతకమయినది.

బాబా:— నిన్ను వెనక్కి లాగేవారు, వెళ్ళవద్దనేవారు చాలామంది ఉంటారు.

'ఎందుకు యిలా నీ కాలం వృధా చేసుకుంటావు? ఎక్కడికి వెళ్తావు నీకు పిచ్చి ఎక్కిందా, మళ్ళీ అక్కడికి బయలుదేరావు?' అని యీ విధంగా నిన్ను ఆపడానికి ప్రయత్నిస్తారు. కానీ వారు చెప్పినది ఒక చెవితో విని రెండవ చెవితో బయటకు వదిలెయ్యి. వాళ్ళని దీవించి నీ దారిన నీవు పో పట్టుదల కలిగి ఉండు. నీకు భయంలేదు. నీతో నేనున్నానని అనుభవిస్తావు. నా సహాయం పొందుతున్నట్లు కూడా నీకు తెలుస్తుంది. స్వామి మరలా ఆ దయామయుని మాటలువిని కళ్ళు మూసుకొని అంతరంగమున చాలా సంతోషించాడు. స్వామి బాబాకు గౌరవంగా ప్రణమిల్లి 'ఓమ్' అని ఉచ్చరించి, బాబా యిచ్చిన పరీక్షకు నిలబడి ఆ ప్రకారం ఆచరించుటకు బయలుదేరి వెళ్ళాడు.

ఫిబ్రవరి 1వ తేదీకి సరిగ్గా విజయవంతంగా బాబా చెప్పినట్లుగా రామేశ్వరం వెళ్ళి, స్వామి బాబా దర్శనార్థం తిరిగి బెంగుళూరు వచ్చాడు. ఈ సంగతి తరువాత వివరించబడుతుంది.

బాబా జనవరి (1940)లో దక్షిణాదికి పర్యటనకై వెళ్ళవలెనని ఉద్దే శించుటచే వారు వెళ్ళివచ్చిన తరువాత మరల సంబాషణలు సలుపనెంచి ప్రస్తుతం దర్శనార్థులతో సంభాషణలు ఫిబ్రవరి (1940) వరకు వాయిదావేసారు.

బాబా రాహూరీ మస్తు ఆశ్రమం 1936వ సం॥లో పెట్టి, సుమారు రెండేళ్ళు అక్కడ నడిపి దానిని మెహెరాబాద్‌కి 1938వ సం॥లో మార్చారు. తరువాత అక్కడినుండి 1939వ సం॥లో బెంగుళూరుకి మార్చారు. ఇప్పుడు ఆ ఆశ్రమంలో నూరుమందికి పైగా మస్తులున్నారు. బాబా వారిలో కొంతమందితో కొన్ని నెలలు సాంగత్యం చేసి, వారితో పని అయిపోగానే పంపివేస్తున్నారు. అనేక రకముల మస్తులుండుటచేత రకమున కొకరిని మాత్రమే ఉంచుకున్నారు. తన విశ్వకార్యమునకై వారిని ఉపయోగించే ఉద్దేశ్యము బాబాకు కలదు. వారిద్వారా అధ్యాత్మిక కార్యకలాపము సాగించవలెనని బాబా ఆశయము. ఈ దాక్షిణాత్య పర్య టనలో బాబా ఎవరో ఎవరికీ తెలియకుండా ప్రయాణం చేసారు. ఈ ప్రయా ణంలో బాబా ఎవరికీ దర్శనం యివ్వలేదు.

1940 జనవరి 6వ తేదీన తేలిబాబా అనే మంచిమస్తును బాబా తిర వేంద్రంలో సాంగత్యం చేసారు. ఇతనికి నమ్మజాలని ఒక అలవాటు ఉంది. ఒక సీసానిండా కిరసనాయిలు త్రాగేస్తాడు. అతని శరీరము, బట్టలు కిరసనాయిల్‌తో నిండిపోయి ఉంటాయి. నోటివెంట చొంగ ఎక్కువగా కారుతూ వుంటుంది. నోరు అసహ్యంగా అపరిశుభ్రంగా ఉంటుంది. నోటిలో పుండ్లుంటాయి. బాబా అతని సాంగత్యమునకై రహదరి బంగళాకి రప్పించారు. అప్పుడు బాబా అతనికి భోజనంపెట్టి అతనితో ఏకాంతంగా రెండుమూడు గంటలసేపు కూర్చున్నారు. అతడు 40 ఏళ్ళ వయస్సు కలిగి ఉన్నాడు, అప్పుడు. తేలిబాబా మూడవ భూమిక లోని మస్తు.

1940 జనవరి 9వ తేదీన మధురలో ఒక పెద్దమనిషిని బాబా సాంగత్యం చేసారు. ఇతడొక ఉత్తీర్ణుడైన యాత్రికుడు. ఇతడు బాగా ఒడ్డుపొడుగు ఉన్నవాడు. చాలాపొడుగుగా ఉంటాడు. ఇతడొక వృద్ధుడు. నాలుగయిదు కోట్లు తొడగుకొనిఉంటాడు. పాతహూన్‌పైపులతో చేసినచెప్పులు తొడిగి నడుస్తాడు. ఇతనికి

చుట్టలు కాల్చడం యిష్టం. చుట్టనోట్లో పెట్టుకొని కాలుస్తూ ఠీవిగా నడుస్తాడు. మధుర మీనాక్షి ఆలయంలో పరుంటాడు.

బాబా 1940 జనవరిలో మధురలో మకాంచేసారు. అప్పుడితనిని బాబా సాంగత్యం చేయడంకోసం ఆయన బసచేసిఉన్న రహదారీ బంగళాకు తీసికొని వచ్చారు బాబా మండలి. అక్కడ అతనికోట్లన్నీ విప్పి బాబా అతనికి స్నానం చేయించారు. ఆ బంగళాలో కొన్నిగంటలు బాబాతో ఉన్నాడు. బాబా ఆయన శిష్యుడైన జాల్ కేరా వాలాను తన ఓవర్ కోటుతీసి అతనికి యిమ్మన్నారు.

మస్తులు సిగరెట్లు, బీడీలు త్రాగేవాళ్ళున్నారు. కానీచుట్టలు కాల్చేవాళ్ళు ఎక్కడోగానీ ఉండరు. ఇలా చుట్టలు కాల్చేవాళ్ళు నాగపట్నంలోని చట్టిబాబా ఒకడు, తంజావూరులోని అబ్దుల్ ఖాదర్ జిలానీ మరియొకడు. హైదరాబాద్ (దక్కన్) లోని మామా మస్తు; వాళ్ళేమస్తులలో చుట్టలు కాల్చేవారు. మన ప్రస్తుతం మస్తు పేరు ఏమిటోతెలియదు. చట్టి బాబాకు అలవాటులేదు కాని ఎప్పుడయినా చుట్టలు కాలుస్తాడు. బాబా దక్షిణయాత్ర ముగించుకొని బెంగుళూరు వచ్చేసారు జనవరి నెలాఖరుకి.

స్వామి రామేశ్వర యాత్ర చేసుకుని బాబా ఆదేశం ప్రకారం సరిగ్గా ఫిబ్రవరి 1వ తేదీకి బెంగుళూరు చేరి బాబా దర్శనార్థం అక్కడ ఆశ్రమానికి వచ్చేడు.

కొన్నిచోట్ల ఏ సంఘటనా లేకుండా జరిగినా, స్వామిని నిజమైన ఆధ్యాత్మిక గురువుగా భావించి కొంతమంది ఆధ్యాత్మిక విషయాలలో ఆయనని సలహా అడగడం ప్రారంభించారు. కొంతమంది ఉపదేశం కావాలన్నారు. అతడు తోచినట్లు వారికి హితబోధ చేసాడు. ఒక గృహస్థు సంసారం వదిలేసి ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశించాలని వచ్చాడు. స్వామి అతనిని 'సంసారంలోనే ఉండి వైరాగ్యంతో జీవించమని' సలహా యిచ్చాడు. ఒకచోట ఒక స్త్రీ చాలా భక్తురాలనని చెప్పి, యీ స్వామిని తన యింటికి రమ్మని, తనకు ఎవరూ దిక్కులేరనీ, అతడిని తన వద్ద ఉండమని— బలవంతం చేసింది. ఈ పరీక్షలన్నీ బాబాను తలచుకుంటూ నెగ్గాడు. బాబా చెప్పినట్లుగా రామేశ్వరం చేరి అక్కడ నూరుగురు సాధువుల

దర్శనం చేసుకున్నాడు. వెంటనే బెంగుళూరుకి బయలుదేరి వచ్చాడు. 'బాబాయొక్క అంతరంగ సహాయం వలననే అన్నీ జయప్రదంగా కావించుకుని వచ్చానని' చెప్పాడు. బాబాకు యిలా జరుగుతుందని తెలుసును. ఇది విని బాబా చాలా సంతోషించారు.

ఆ మరునాడు బాబా అతనికి ఇంకొక పరీక్ష పెట్టారు. యీ మాటు అతనిని దక్కను పీఠభూమిలోనున్న నలుగురు సద్గురువుల దర్శనం చేసుకొని రమ్మనమని చెప్పారు. అందులో యిద్దరు దేహం చాలించారు. యిద్దరు బాగాఉన్నారు. ఈ యాత్ర అంతా నడిచే చేయమని బాబా ఆదేశించారు. ఇది ముగించడానికి కూడా గడువుపెట్టి ఆలోగా తిరిగి రమ్మని బాబా ఆజ్ఞాపించారు. నవ్వుతూ స్వామి బాబా చెప్పిన దానికి అంగీకరించాడు. 'నీవు యీపని చేయగలవా?' అంటే 'నాకు తెలియదు నా ప్రభువుకే తెలియాలి.' అన్నాడు. అప్పుడు బాబా యిదివరకు చెప్పినట్లే' సరే, రైలులోవెళ్ళు; నడచివెళ్ళక్కరలేదులే, కానీ యీమాటు నా దగ్గర డబ్బులేదు రైలులోనే టిక్కెటులేకుండా వెళ్ళు' అన్నారు.

స్వామి:-- అది మోసం చేసినట్లవుతుంది కదా.

బాబా:— అన్నావూ! అంటావా—అనవా అనుకున్నాను. ఆ మాట నీవనినందుకు నాకు సంతోషంగా ఉంది. అవును. అది మోసం కాదా మరి. నీకు తగిలే ప్రతీ దెబ్బ సంతోషంతో స్వీకరించు, దానికి మనసులో బాధ పడకుండా.

స్వామి:- (వింటూ నిశ్శబ్దంగా నిలబడ్డాడు)

బాబా:— (స్వామికి 15 రూ॥లు యిచ్చి) ఇంతే ఉంది నా దగ్గర. మిగిలినది నీవు తంటాలుపడి సంపాదించుకో.

స్వామి బాబా యిచ్చిన సొమ్మును కృతజ్ఞతతో ప్రసాదంలా స్వీకరించాడు. తాను యీ రెండవ యాత్రకై బయలుదేరాడు.

1940వ సంవత్సర ప్రారంభంలో ఆయన శిష్యులను పిలిచి, 'ఆ సంవత్సరంలో అసాధారణమయిన బాధ ప్రపంచంలో కలుగుతుందనీ, ఆ బాధలో తాను కూడా పాలుపంచుకుంటానని' బాబా చెప్పారు.

ఆ నెలలోనే బాబా తమ శిష్యులను వెంటబెట్టుకొని పెద్ద బస్‌లో బయలు దేరి, మైసూరు రాష్ట్రం పర్యటించారు. ప్రయాణాలలోగానీ ఎప్పుడైనాగానీ శిష్యులకు, బాధలు కలిగితే అవి వారి ఆధ్యాత్మిక ప్రగతికోసమే బాబా కలుగ చేస్తారు. కానీ వారికి ఎప్పుడూ ఆ బాధలతో నైరాశ్యం కలుగచేసి నిస్పృహ వచ్చేలా చేయరు. వారి బాధలో ఆయనకూడా స్వయంగా బాధపడి పంచుకుంటారు. ఆ బాధలలోనే వారిని బాబా సుఖపెడతారు. అవి నిజంగా బాధలు కానేకావు. బాబా ఉన్నచోట ఆనందమే వెల్లివిరుస్తూ ఉంటుంది.

బెంగుళూరుకి మంగుళూరికి మధ్య హస్సన్ అనేపట్నం ఉంది. ఆ ఊర్లో డాక్ బంగళాలో బాబా ఆరురోజులు ఉన్నారు. ప్రతీరోజూకూడా అక్కడినుండి చుట్టుపట్ల ప్రదేశాలకివెళ్ళి చూసివస్తూ ఉండేవారు. మొదటిరోజున శ్రావణ బెళగోలాకివెళ్ళారు. అక్కడ జైన మతస్తులు ఎక్కువుగా ఉండేవారు. ఇప్పటికీకొంత మంది ఉన్నారు. ఆ ఊరిలో బ్రహ్మాండమయిన ఒక రాతి విగ్రహం ఉంది. ఇంతపెద్ద విగ్రహం ఈజిప్టు దేశంలోకూడాలేదు. వెయ్యిసంవత్సరముల క్రిందట జైనమతస్థులు ఒకకొండ మీద దీనినిచెక్కారు. 58 అడుగుల ఎత్తున ఉన్న ఒకే రాతితో చెక్కబడినదీ. యీ జైనదేవుని విగ్రహం. ఆ విగ్రహం దరికి వెళ్ళడానికి మెట్లుకూడా చెక్కారు. అక్కడినుంచి మెట్లుదిగి ఆ కొండమీదే ఉన్న ఒక మడుగుకి వెళ్ళవచ్చును, అందులోని నీరు చాలా పవిత్రంగా భావింపబడేది. ఇటువంటి దృశ్యాలన్నీ పరమ గురువయిన బాబాతో చూడడంలో ఒక విశిష్టత ఉంది. ఇటువంటి స్థలం. భూతకాలానికి వర్తమానానికి భవిష్యత్తుకి ఆధ్యాత్మికంగా ఒక సంబంధం కలుగజేస్తుందన్నారు బాబా. కొద్దిరోజుల తరువాత ఆ స్థలంలో అయిదులక్షలమంది సమావేశమయే గొప్పతీర్థం జరుగబోతుంది. ఎన్నో సంవత్సరాలకి గానీ అది జరుగదు. అప్పుడు ఆ విగ్రహాన్ని పవిత్రమైన పదార్థములతో పూజిస్తారు. అక్కడ తపస్సుచేసిన ఒక గొప్పఋషి జ్ఞాపకార్థం అలా అక్కడ తీర్థం జరుగుతోంది. పాశ్చాత్యులకి యిది కేవలం విగ్రహంలాగే కనిపిస్తుంది. కానీ దానికి చేసే పూజాదుల వెనుక గొప్ప ఆధ్యాత్మికభావం ఉందనిగ్రహించడం వారికి సాధారణంగా తెలియదు. ఈ విగ్రహం ఆరాధనకి ఒక బాహ్యచిహ్నం మాత్రమే— అని వారు తెలుసుకోలేరు.

ఒకమాటు కాశీ వెళ్ళినప్పుడు బాబా వారి శిష్యులకు యిలా వివరించారు. 'అటువంటి పుణ్యక్షేత్రాలు ఎలా పవిత్రమైనవి అనగా అక్కడ ఉన్న ఆధ్యాత్మిక ఘనత వలన, గొప్ప గొప్ప ఆత్మలు, పుణ్యపురుషులు అలాంటి స్థలములలో ఉండి వాటిని పవిత్రీభూతం చేసారు. ఎన్నో శతాబ్దాలు గతించినా ఎన్ని తుఫానులకు వాటికి తట్టుకొని యిసుమంతయినా చెడకుండా, అందంలో ఒక్క వాసి అయినా తరగకుండా— ఆనాటి భక్తులు దీన్ని యింత బ్రహ్మాండమయిన ఆకారంలో ఏ అవ యవం ఎంత ఉండాలో ఆ ఆకారానికి తగినట్లు పరిమాణంపెట్టి తయారుచేసా రంటే— అది సామాన్యమైన సంగతి కాదన్నారు బాబా. నాస్తికుడైనా యీ విగ్రహ వదనంలోని గాంభీర్యత, దానిలోని ప్రశాంతత మొదలయిన దైవలక్షణములు ఉన్నాయని ఒప్పుకొని తీరాలి.

అక్కడ ఉన్న ఒక శిలాశాసనం ప్రకారం — అది గోమటేశ్వరుడిదని క్రీ॥శ॥ 1180వ సంవత్సరంలో అ విగ్రహం తయారుచేసారని అతడు పురు దేవుడనీ మొదటి జైన తీర్థంకరుని కుమారుడనీ— తెలుస్తోంది. భరతుని సోదరుడు యితడు — యితడినే బాహుబలి అనికూడా అనేవారట. రాజ్యంకోసం అన్నగారితో పోట్లాటవస్తే, అన్నగారికి యితడు అంతా త్యాగంచేసి, ఓడిపోయిన సోదరుడికి యిచ్చేవాడు. రాజ్యానికి అన్నగారిని రాజునిచేసి, అతడు అధ్యాత్మిక సామ్రాజ్యానికి పట్టభద్రుడయ్యాడు. యుద్ధంలో జయించిన రాజు 'యిలా అంతా త్యాగంచేయడం' చాలా అరుదు. అతనిది మహత్తరమయిన చరిత్ర అని బాబా శిష్యులకు చెప్పారు.

కొండమీదకు మెట్లు ఎక్కేటప్పుడు బాబా ప్రక్కనుంచి క్రిందకి ఒక సన్నని సందులోనికి చూసారు. అలా ఎందుకు చూస్తున్నారో ఆయనతో ఉన్న నోరీనా మాచెబెల్లీ మొదలయిన శిష్యులకు ఏమీ అర్థంకాలేదు. కొండ దిగిన తరువాత బాబా క్రింద ఉన్న సన్నటి సందులోనికి మండలిని పంపేరు. అక్కడ ఒక పాడుపడిన యింటి అరుగుమీద ఆచ్ఛాదన లేకుండా ఒక దిగంబరి కూర్చుని ఉన్నాడు. అతడు ఎండలో ఎండి వానలో తడుస్తూ అన్ని కాలాలూ అక్కడే ఉంటాడు. ఆ దిగంబర సాధువు బాబా వస్తున్నట్లు తెలుసుకున్నాడో యేమో— బాబా వచ్చేవైపుకే చూస్తున్నాడు. అతని చూపు బాబా చూపులో కలిసింది. బాబా అతనితో చేసిన యీ అంతరంగ సాంగత్యం మూలంగా ఏదో ఆధ్యాత్మిక కార్యం

నెరవేర్చారు. అక్కడి జనులంతా 'యీ దిగంబరుడు ప్రస్తుతపు జైనులకి గురవని' అంటారు.

'ఇతడు యిలా విచిత్రంగా ఉన్నప్పటికి అతడు మస్తుకాడని' బాబా చెప్పారు. కానీ సంపూర్ణ చైతన్యంతో ఉన్నత ఆధ్యాత్మిక పథంలో ఉన్నాడని – అన్నారు. ఇట్టి ఉన్నతాత్మ అక్కడ ఉండబట్టే బాబాను యీ స్థలానికి ఆకర్షించి యుండ వచ్చును.

పార్సీపంచాంగం ప్రకారం యీ సంవత్సరం బాబాయొక్క 46వ జన్మదినం ఫిబ్రవరి (1940) 15వ తేదీన అయినది. బాబా ఆదేశాను సారం యీ సంవత్సరం ఎవరూ ఉత్సవం చేయలేదు. అయినప్పటికీ బాబాకు ఎన్నో శుభా కాంక్ష సందేశాలు అందాయి. 21552

కొందరు మస్తులను మదరాసునుంచి. కొందరిని మైసూరునుంచి, మరి కొందరిని మంగుళూరునుంచి, బెల్గాంనుంచి రప్పించారు— బాబా. కొంతమందికి బాబా స్నానం చేయించారు. ఆ మస్తులకి భోజనం పెట్టించారు. వారిని సాంగత్యం చేసాక కొంధరిని పంపించివేసి, కొందరిని మాత్రం బాబావద్దనే ఉంచుకున్నారు. కొద్దిమంది మస్తులు ఆరవ భూమికలో ఉన్నారని – బాబా చెప్పారు. ఈ మస్తుల సంగతి వివరంగా డా॥ విలియం డాంకిన్‌చే రచింపబడిన (దివేఫేరర్స్) అనే గ్రంథంలోచెప్పబడిఉంది. మస్తులకోసం బాబా ఎక్కడెక్కడికి ప్రయాణాలుచేసారో. వారి సాంగత్యం కోసం బాబా ఎంత కష్టపడ్డారో, వారికొరకు ఎక్కడెక్కడ ఆశ్రమాలుపెట్టి అవి ఎలా నిర్వహించారో— ఈ విషయాలన్నీ ఆ గ్రంథంలో విపులంగా వర్ణించబడ్డాయి, దానికి తెలుగు అనువాదం 'బాటసారులు' అనే పేరుతో ప్రచురించ బడినది.

ఫిబ్రవరి (1940) 10వ తేదీన డెలియాకు వ్రాసిన ఉత్తరంలో బాబా యిలా అంటారు.

"...నీకు వ్రాయాలని ఎప్పుడయితే ఉంటుందో అప్పుడు వ్రాసెయ్యి అలాచేస్తే నీ ఆలోచనలు బాగా ప్రవహించి వాటికి ఒక లోతయిన అవగాహన కలుగుతుంది. తరుచుగా లోపల ఉన్న పరిస్థితి అస్తవ్యస్తంగా ఉంటుంది. ఒక అభిప్రాయం యింకొకదాని నుంచి విడదీసి అర్థం చేసుకోవడం కష్టం.

నీతో ప్రతి అంగుళం నాకు తెలుసును. నిన్ను నీవు ఎరిగున్న దానికంటె నేను బాగా ఎరుగుదును. నీ నిజమయిన ఆత్మను గురించి అన్ని విషయాలు నా యిష్టం వచ్చినట్లు నీకు బోధపరచగలను. నీ ప్రియతముడనయిన నన్ను తెలుసుకోవాలని ప్రయత్నించు. అప్పుడు కొంచెం కొంచెంగా నన్ను తెలుసుకుంటావు. నీ నిజమయిన ఆత్మను తెలుసుకుంటావు. నేను నీ నిజమైన ఆత్మనే కదా.

నన్ను నీవు తెలుకన్నట్లయితే భగవంతుని తెలుసుకుంటావు. నీవు నీ ప్రియతముణ్ణి కలుసుకుంటే ఇంక దేనినీ అన్వేషించనక్కరలేదు. సర్వమూ ఆ ప్రియతముడి చుట్టూ ఉంటుంది. అందమంతా ఆయనలోనే చూస్తావు. అది కవిత్వం ద్వారాగానీ, కళ ద్వారాగానీ, సంగీతం ద్వారాగాని లేక జీవితం ద్వారాగానీ నీవు ఆ అందాన్ని చూస్తావు. నీవు నీ చేతులతో చేసినా ఎలా చేసినా నీకున్న మమకారమల్లా నీ ప్రియతముడే. నీ స్నేహితునికోసం చేసినా, నీ కుటుంబంకోసం చేసినా నీతో పరిచయంలేని యింకొకడి కోసం చేసినా, నీవు చేసిన సేవ నిస్వార్ధంగా ఉంటుంది. అంతా ఒకటే. ఆ ఏకేశ్వరుడికోసం చేసే పనంతా ఆయనను సంతోషపెట్టడానికే అని తెలుసుకుంటే చాలు. అంతకన్న తెలియవలసిందిలేదు. నన్ను సంతోషపెట్టడం అంటే పని చేయడం అన్నమాట. అయితే ఏం పని చేయాలి? నీ ప్రియతముడు నిన్ను చేయమని ఆజ్ఞాపించినది. ఇది నా విధానం. నామార్గం. 'నా కాడి మోయడం సులభమే. నా బరువు తేలికగాఉంది'. మీ అందరితోను నేను చేసేపనియొక్క విధానం ఐక్యానికి చాలాదగ్గరదారి, ఆ ఏకత్వం ఎప్పటికయినా మీరు పొందాలని కోరేకంటే, నేనే ఎక్కువగా వాంచిస్తున్నాను. ఆ ఆటకి నేనే కారకుడనయినా అది అనుభవించి సంతోషించడానికి బాధపడాలి, ఆదే సృష్టి అంతటిలోను తెలివితోనన్ను తెలుసుకోవడం— అనే ఆట. నా ప్రేమికులయిన మీరు ఎవరూ తెలుసుకోనంతగా నన్ను యీ మానవ శరీరంలో చూసి తెలుసుకొని యీ బాధను తగ్గించుకోగలరు. మీకు చేతనయినంత సుఖాన్ని నాకు కలుగజేయండి. అలా నా కోసం చేస్తారా? మనోవాక్కాయ కర్మణా నాకు సహాయం చేయండి. మీ ఆలోచనలన్నీ నన్ను గురించే ఉండనీయండి. ప్రియతమ అయిన లేలాయొక్క హృదయంలో ప్రియతముని సంతోషపెట్టడానికి ఏపని చేసినా ప్రేమలోనుంచే ఉద్భవిస్తుంది. ఈ ఆలోచనే నీకు శాశ్వతసుఖాన్నిస్తుంది. ప్రపంచం యిప్పుడు పడుతున్న దుఃఖమయమయిన యీ సమయంలో అదే మీకు ఆనందాన్ని

కలుగజేస్తుంది. అందరియొక్క బాధ చాలా ఘోరంగా తీవ్రంగా ఉంటుంది, అయితే అంతరంగంలో మాత్రం మీరు నమ్మకంతో సుఖంగా ఉండండి. చిట్ట చివరివరకు నన్ను ప్రేమించండి. మిమ్మల్ని ఎన్నడూ నేను వదిలిపెట్టను. మీాక్కు ఆశాభంగం కలుగనీయను'

—ఎమ్, ఎస్. ఇరానీ.

ఈ యుద్ధపు రోజులలో ఇంగ్లండులోని బాబా ప్రేమికులందరికీ యీా లేఖ ఉపశమనం కలుగజేసింది.

ఈ ఉత్తరం వ్రాసాక బాబా మూడు వారాల తరువాత డెలియాకి 'ది లింక్స్' అనే బంగళానుంచి మార్చి (1940) 14వ తేదీన ఇంకొక ఉత్తరం వ్రాసారు. అందులో గోవాకి గెర్సొప్ప జలపాతం చూడడానికి వెళ్తున్నామని వ్రాసారు. వెళ్ళి మళ్ళీ 14వ తేదీ నాటికి మెహెరాబాద్ చేరుకుంటామన్నారు. ఈ పర్యటనలో చిన్న గ్రామాలకి సముద్రతీరానికి, కొండలమీాదకి వెళ్తున్నట్లు, నగరాలలో ఉండడంలేదని తెలియపరిచారు. క్రిందటి పర్యటన అంతా నగరాలలోనే జరిగినది. బాబాతో కూడా మార్గరెట్‌ను తీసికొని వెళ్తామని అన్నారు. జూన్ నెల తరువాత ఆమె ఆస్ట్రేలియాకు వెళ్తుందన్నారు.

బాబా యిచ్చిన కేబిల్ చూసుకుని డెలియా లండన్ వచ్చింది. యుద్ధం తీవ్రంగా జరుగుతోంది. డెలియా హైండ్‌హెడ్ అనే ఊళ్ళో అప్పటివరకూ ఉండేది. బాంబులు వేసినందువలన యిళ్ళు కూలిపోయి నిరాశ్రయులైన వారికి ఒక హాస్టల్ పెట్టారు. అందులో సూపర్‌వైజర్‌గా డెలియాకు ఉద్యోగం దొరికింది. ఈ సేవ చేయటం కోసమే బాబా ఆమెను లండన్ రప్పించారని తెలుసుకుంది. ఈపని చేస్తూనే అమె బాబా సమావేశాలు ఏర్పాటు చేస్తోంది. ఆ సమావేశాలలో ఆమె క్రిస్టమస్ హంఫ్రీస్, చార్లెస్ పర్డమ్, విల్ బాకెట్ — అను ప్రముఖ బాబా భక్తులను ప్రతివారమూ కలిసేది. టామ్‌షార్ప్లీ— అనే బాబా ప్రేమికుడు ఆమెకు సహాయం చేసేవాడు.

బాబా ఆజ్ఞ ప్రకారం మార్గరెట్ బాబాయొక్క కార్యక్రమాల గురించి డెలియాకి ఉత్తరాలు వ్రాస్తుండేది. ఆ యుద్ధపు రోజుల్లోనే బాబా కార్యదర్శి

ఉయిన చాన్జీ కాశ్మీర్ వెళ్ళి చనిపోయాడు. ఇంగ్లండులో బాబా ప్రేమికులలో క్రిస్టైన్ అనే యువతి ఏమాత్రం చనిపోయింది.

మార్గరెట్ బాబా వద్ద ఉన్నవారిలో ఒకామె. ఆమె అమెరికన్ బాలెట్ నృత్యకళాకారిణిగా అమెరికాకు వెళ్ళింది. ఇంక ఆమె జీవితశేషమంతా అమెరికాలోనే గడిపింది.

డెలియా యొక్క పినతల్లి ఒకామె పనామాలో ఉండి, అక్కడికి ఆమెను రమ్మని పిలిచింది. ఈ సంగతి బాబాకు డెలియా తెలియపరచగా బాబా ఆమెను పనామా వెళ్ళడానికి అనుమతించారు. పనామాలో ఆమె బాబా పని అద్భుతంగా నిర్వహించినది.

ఇంక బాబా పర్యటన విశేషాలు చూద్దాం. శ్రావణ బెలగోలా దర్శించిన తరువాత, బాబా ఆయన మండలితో హస్సన్ జిల్లాలో హళేబిద్ అనే గ్రామానికి వెళ్ళారు. ఇది భేలూరుకి పదిమైళ్ళ దూరంలో ఉంది. ఇక్కడికి సమీపంలో ఉన్న అడవిలో పెద్దపులులు, అడవిపందులు స్వేచ్ఛగా విహరిస్తాయి. హళేబిద్ అనే ఊరు పూర్వం హోయసలా చక్రవర్తుల కాలంలో వారిరాజ్యానికి ముఖ్యపట్నంగా ఉండేది. హళేబిద్ అనే పదానికి పాతపట్నం అని అర్ధము. విజయనగర సామ్రాజ్యకాలం నాటికి ఆ సామ్రాజ్యాధిపతులు ఇక్కడికి సమీపంలోని భేలూరికి వారి రాజధానిని మార్చుకున్నారు.

ఒక సత్పురుషుడు నడిచినచోట పుష్పాలు చక్కగా పూస్తాయంటారు. ధర్మరాజువంటి మహానుభావుడు ఉన్నదేశం సుభిక్షంగా ఉంటుందని మహాభారతంలో వేదవ్యాసుడు వ్రాసాడు. ఒక సద్గురువే నడచినచోట మానవహృదయ పద్మాలు ఎంతగా వికసిస్తాయో మరి. విశిష్టాద్వైతవాది సద్గురు రామానుజాచార్యులు ఆ కాలంలో రాజ్యం చేస్తున్న విష్ణువర్ధనుని అతని మతంలోనికి మార్చాడని ప్రతీతి. చోళరాజులమీద విజయం పొంది విష్ణువర్ధనుడు తన రాజ్యంలో చాలాచోట్ల దేవాలయాలు కట్టించాడు. బేలూరులో కట్టించినది చాలా పెద్దమందిరం. అందులో గర్భగుడి నక్షత్రాకారంలోను. దానిముందు మండపం శిలువఆకారంలోను ఉన్నవి. ఇప్పుడు బాబా హళేబిద్ కి ఏతెంచి 'దక్షిణ భారతంలో ఇవ్వానాడుముగ్గురు సాధుపురుషులు ఉన్నారని' చెప్పారు. ఒకడు బాబాతోనే బెంగుళూరు మను





ప్రేమ భావముతో తప్పక నాకై యర్పించు వారందరు
నా రూపమునకు అధిష్ఠానమైన తత్త్వమును
దర్శించి, స్పృశించి
సాక్షాత్కరించుకొందురు.

ఆశ్రమంలో ఉన్నాడు. బాబా నిర్మించబోయే విశ్వఆధ్యాత్మిక కేంద్రంలో బైరమంగ ళాలో యిలాంటివారు అనేకరకాలమంది ఉంటారు. భారతదేశంలో అన్ని మూలల నుంచి వారు వస్తారు. వారంతా బాబాయొక్క ఆధ్యాత్మిక కార్యకలాపంలో పాల్గొం టారు - అని బాబా చెప్పారు. హలెబిడ్‌లోని దేవాలయము అన్నిటికంటె ఎక్కువగా ఆధ్యాత్మిక వాతావరణం కలిగి ఉందన్నారు బాబా. బాబాతో వెళ్ళిన మండలివారు యిది చూచేటప్పటికి రోమ్‌లో చర్చిలో లోపల మైకేల్ ఏంజలో చేసిన అలంకార శిల్పము జ్ఞాపకానికి వచ్చింది. రోమ్ వెళ్ళినప్పుడు బాబా అది చూసి మెచ్చు కున్నారు. మరల బాబా హలేబిడ్ మందిరంలోని శిల్ప చాతుర్యానికి మెప్పుతోకూడిన ఆశీస్సు లందించారు.

హాసన్ డాక్ బంగళాలో ఒకనాటి ఉదయం బాబా మానవులు పడే బాధలు వాటి ఆధ్యాత్మిక పర్యవసానము, యుద్ధము- అధ్యాత్మికంగా ప్రపంచంమీద దాని ముద్ర, వీటిగురించి ప్రసంగించారు. ఆఖరురోజున బాబా బుడాన్‌రేంజి అను పర్వతశ్రేణికి వెళ్ళి చూసారు. అవి బేలూరునుంచి కనిపిస్తూ ఉంటాయి. దారిలో వారికి చిక్మాగలూరు అనే పట్నం తగిలింది. అక్కడ బాబా మండలితో కొంచెం సేపు ఆగారు. అక్కడ మండలిలో ఇద్దరిని ఆ ఊరిలో ఒక మస్తును తీసికొని రమ్మని అతనిని ఎక్కడ కనుగొనవచ్చునో చెప్పి— పంపించారు.

బాబా చెప్పినట్లుగా వెళ్ళి ఆ యిద్దరు శిష్యులు ఆ మస్తును బాబా వద్దకు తీసికొని వచ్చారు. ఈ మస్తును బెంగుళూరు వెళ్ళేటప్పుడు కూడా తీసికొనివెళ్ళి అక్కడ మస్తు ఆశ్రమంలో చేర్చారు.

బాబా బుడాన్‌రేంజి సముద్ర మట్టానికి 6,000 అడుగులు ఎత్తున ఉన్నది. హిందూ పురాణాలలో చంద్రద్రోణ అనే గుహ వర్ణింపబడి ఉంది. అది యీ పర్వతాలలోనే ఉంది. మహమ్మదీయులు — అక్కడ బాబా బుడాన్‌యొక్క సమాధి ఉందని అంటారు. అక్కడ బాబా బుడాన్‌యొక్క శిష్యులు సమాధి పొందారనీ; బాబా బుడాన్ అదృశ్యుడయాడని - ఒక కథ ఉంది. హిందువులు 'అక్కడ దత్తాత్రేయుని సింహాసనం ఉందని'— చెప్తారు. బాబా రెండూ కూడా నిజమే అన్నారు. హిందువులు చెప్పినది బహు పురాతనమైనది. తరువాత మహమ్మ ద్దీయ సాధువు బాబా బుడాన్ అను నతనిని దాదాహెయాత్ ఖలందర్ అని

పిలిచేవారు. అతడు మహమ్మద్దీయు ఖాలందర్ — అనగా సద్గురువు. ఆ స్థితికి వచ్చినవాడు అతని మతాచారములు పాటింపడు. అతనికి మతభేదం లేదు. అటు వంటివారు సంత్ తుకారామ్ వలె బొందితో స్వర్గానికి వెళ్తారంటే ఆశ్చర్యంలేదు. క్రైస్తవులలో ఎలిజా అనే ప్రవక్త అట్లే శరీరముతో అదృశ్యమయ్యాడు. ఈ సంగతులన్నీ బాబా చెప్పారు.

మార్చి (1940)లో బాబా ఏకాంతవాసంలో ఉన్నారు. బాబా యిదివరకు ఏర్పాటు చేసుకున్న వారితో తప్ప ఎవరితోనూ మాట్లాడేవారు కాదు.

ఆరు వారాలపాటు తిరిగి వద్దామని ఒక వెయ్యిమైళ్ళ ప్రయాణానికి అన్నీ సంసిద్ధం చేయించారు బాబా. వారితోపాటు 40 మంది మండలిని తీసుకుని వెళ్ళ డానికి ఏర్పాటు జరిగినది. ఒక పెద్ద బస్సు, కారుల్లోను అంతా వెళ్ళాలి. ఎక్క డెక్కడ దారిలో ఆగాలో అక్కడక్కడ జరగవలసిన ఏర్పాట్లు ముందుగానే అన్నీ ఆలోచించుకొని, దాని ప్రకారం ప్రయాణం సాగాలి. దీనికి సంబంధించిన పనులు ఎవరికి ఏపని అప్పగించాలో — వారికది చెప్పారు బాబా.

ఏకాంతవాసం ఉన్న మార్చి (1940) నెలలో బాబా 21 రోజులు ఉప వాసం ఉన్నారు. మొదటివారం ద్రవపదార్థాలు త్రాగుతూ ఉండేవారు. రెండవ వారం పాలు లేకుండా టీ పుచ్చుకునేవారు. మూడవ వారంలో కేవలం మంచినీరు త్రాగుతూ ఉపవాసం చేసారు. ఉపవాసం ఆఖరు రోజున (మార్చి 21న తేదీన) స్త్రీ పురుష మండలి అందరూ కూడా ఉపవాసం ఉన్నారు— బాబా ఆదేశాను సారంగా. మార్చి 21 నాడు జామ్‌షెడ్జీ నవరోజ్ పండుగ అనగా పార్సీవారి సంవత్సరాది.

22వ తేదీన బెంగుళూరులో తమయొక్క ఒక పాత శిష్యుని మనవడికి బాబా స్వయంగా ఉపదేశం చేసి, అతనిని దీవించారు. అది హిందువుల ఉపనయనం లాంటి ఒక సంస్కారం.

బైరమంగళాలో బాబాయొక్క శిష్యుల పర్యవేక్షణలో నిర్మాణం జరుగు చిత్తోం. మండ్లితో కూడా బాబాకు యిచ్చిన స్థలమునందు కేంద్ర నిర్మాణం

ప్రారంభమయినది. బాబా ప్రత్యేకంగా అక్కడికి యిద్దరు శిష్యులను పంపించి ఆ పనిమీద నియోగించారు.

అప్పుడు జరుగుతూ ఉన్న యుద్ధంలో ఒక ముఖ్యమయినది జరుగుననీ, బాబా మెహెరాబాద్‌లో ఉన్న మండలి నందరిని మార్చి 11వ తేదీనుంచి మార్చి 20 తేదీవరకు ఉపవాసం ఉండమనీ — అదేశించారు. ఆ సమయంలో జర్మనీ విజృంభించి ఫ్రాన్సును, నెదర్లాండ్సును, బెల్జియంను జయించింది. డన్కర్క్ నుంచి బ్రిటిష్‌వారి సేనలు ఇంగ్లండుకి 'జయప్రదంగా' ఉపసంహరింపబడ్డాయి.

బెంగుళూరులో బాబా లింక్స్ అనే బంగళాలో ఉన్న సమయంలో ఒకరు బాబా దర్శనార్థం వచ్చి, వారిని అడిగిన ప్రశ్నలకు బాబా యీ క్రింది విధంగా జవాబులు చెప్పారు.

ప్రశ్న:— నిజమైన ఆధ్మాత్మికత్వం అంటే యేమిటి ?

బాబా:— ఆధ్యాత్మికత్వం అంటే నిజంగా ఆత్మయొక్క జీవనం — అన్నమాట. అది జీవించి అనుభవించాలి. అది నిన్ను ఒక శిలవలె సుస్థిరంగా చేస్తుంది. ప్రాపంచికమైన సుఖదుఃఖాలచే నీవు ఏమీ చలించవు. నీవు అసలు కోరికలు లేని స్థితికి వచ్చి, నీవు యింకేవీ కావాలని కోరకుండా ఉంటావు. నీకు ఎప్పుడయితే ఏదీ అక్కరలేదో నీకు అప్పుడు అన్నీ ఉంటాయి. (చట్టిబాబా వైపు చూపిస్తూ) యీ మస్తువైపు చూడండి. ఇతడు ఎంతో అమాయకుడు. ఎప్పుడూ అనందంతో ఉంటాడు. అతనిలో ప్రేమ ఉట్టిపడుతూ ఉంటుంది. సుఖము, తృప్తి, ఆనంద, శాశ్వత మనశ్శాంతి అన్నీ ఉంటాయి. ఏ కోరిక లేకుండా ఉండడం, అందరిలోను ఉండే ఒక గుణం. అది మీలో ఉంది. దానిని కనుక్కోవాలి మీరు. దానిని నేను కనుగొన్నాను. నేను అనుభవించాను. అందరిలోను యీ గుణం ఉంది. కానీ అది నిద్రాణమై ఉంది. మీకూ నాకూ అదే తేడా. నేను దానిని అనుభవించాను. మీకు అది యింకా అనుభవంలోనికి రావాలి. ఈ భౌతికమయిన వస్తువులన్నీ మీరు ఎలా మీ కళ్ళతో చూడగలుగుతున్నారో— మీ అందరిలోనూ ఉన్న నన్ను నేను అలా చూడగలుగుతున్నాను. నా మట్టుకు నాకు అది సత్యమే.

మీ కళ్ళతో మీరు బాహ్య విషయాలన్నిటిని చూస్తున్నారు. దాని వెనకాల ఉన్నదీ ఖాళీయే. అది ఏమీలేని స్థితి. మీలో సర్వమూ ఉంది. అందులో నుండియే యీ యేమీలేని స్థితి వచ్చింది. ఈ అనుభూతి కలిగిందంటే ఏదీ అక్కరలేకపోవడం అనేది తెలుస్తుంది.

ప్రశ్న:— మహాపాపి అయినవాడికి మోక్షం ఎలా కలుగుతుంది?

బాబా;— నన్నడిగితే మంచిగా అవలేనంత చెడ్డవాడెవడూ ఉండడని అంటాను. ఎంత చెడిపోయినప్పటికీ బాగుపడగలడు. వాడు చివరికి 'ఇంత మంచివాడు లేడు' అనేలా కూడా కాగలడు. అందరికీ బాగుపడడానికి అవకాశం ఉంది.

ప్రశ్న :— గురువులు అప్పుడప్పుడు కఠినంగానూ క్రూరంగాను కనిపిస్తారు ఎందుచేత ?

బాబా :— ఈ సంసార సముద్రంలో మునిగిపోతున్న వారిని గురువులు ఉద్ధరించాలి. అందుకని సముద్రంలో పడి మునిగిపోయే వాడిని రక్షించడానికి ఉన్న సాధనాలన్నీ ఉపయోగిస్తారు. మునిగి పోయేవాడు ఏది చేతికి దొరికినా అది పట్టుకొని వేళ్ళాడుతాడు కదా. వాడినిరక్షించుదామని వెళ్ళేవాడు అందుకని చాలా జాగ్రత్తగా ఉండాలి. లేకపోతే వాణ్ణికూడా ముంచేస్తాడు వాడు. ఇద్దరూ ప్రాణాలు పోగొట్టుకొనే అపాయం ఉంది. ఈత వచ్చిన ఆ రక్షకుడు మునిగిపోయే వాడిని గట్టిగా నెత్తిమీద కొట్టవలసివస్తుంది తరుచుగా, అప్పుడాతడు స్పృహగోల్పోయి- వీనితోకూడా సులభంగా పైకి లాగితే వాణ్ణి దిగలాగకుండా పైకి వచ్చేస్తాడు, పైనుంచి చూసేవాళ్ళకి యిలా కొట్టటమిటి పాపం అనిపిస్తుంది. అలా కఠినంగా ఉంటేనే రక్షించడం సులభం అవుతుంది. అలాగే అప్పుడప్పుడు అసలు సంగతి తెలియనివాళ్ళు నన్నుకూడా చాలా కఠినంగా ఉంటున్నానని అనుకుంటారు. ఈ మాయలోపడ మునిగిపోతున్న వాళ్ళని నేను ఉద్ధరించడానికి, వారి ప్రాణం కాపాడటానికి, వారి మంచి కోసమే. వారి ఆధ్యాత్మిక ముక్తి కోసమే నేను అలా చేయవలసివస్తుంది. కఠినంగా ఉండవలసి వస్తుంది.

ప్రశ్న :— అవతార పురుషుల బోధనలలో ఒకదానికి యింకొక దానికి భేదాలెందు కుంటున్నాయి?

బాబా :- వివిధములైన కాలాలలో ఒకే భగవంతుడు వేరువేరుగా అవతారాలెత్తి వ్యక్తమౌతుంటాడు. వారి కాలానుసారంగా అప్పటి ప్రజలమానసిక స్థితిని బట్టి ఆ బోధలు చేయబడుతూంటాయి. ఒక్కొక్కమారు అవతారుడు సగుణారాధన గురించి చెప్తాడు. ఇంకొకమారు సద్గుణాన్ని గురించి ఎవ రిస్తాడు. ఒకమాటు పందిమాంసము తినవద్దు. మద్యము త్రాగవద్దు అంటాడు. ఇంకొకమారు గోమాంసం తినవద్దు అంటాడు. ఆస్పత్రిలో రోగులు దాహం వేస్తోందంటే ఉదయం టీగానీ కాఫీగానీ పుచ్చుకోమంటాడు డాక్టరు. మంచినీళ్లు ఒకరికి చెప్తాడు. పండ్లరసం యింకొకరికి చెప్తాడు ఇంకొకమారు. మజ్జిగ తీసుకోమంటాడు. పరుండేముందు ఒకరిని వేడిపాలు త్రాగమంటాడు వైద్యుడు. ప్రజల యొక్క దాహాన్ని అనేక విధాలుగా తీరుస్తాడు అవతారుడు. మానవులంతా తెలిసియో తెలియకయో సత్యం కోసం ఒకే దాహాన్ని కలిగి ఉన్నారు.

ప్రశ్న :— మరణానంతర జీవితం గురించి మీ అభిప్రాయం ఏమిటి?

బాబా :- స్థూల ప్రపంచానికీ సూక్ష్మలోకానికీ మధ్య రెండిటికీ గొలుసులా సంబంధపరిచే లోకం ఒకటి ఉంది. మామూలుగా మనకివచ్చే స్వప్నాలలో మనము మన సూక్ష్మశరీరాన్ని ఉపయోగిస్తాము. ఒక విధమయిన అసంపూర్తి చైతన్యముతో యీ స్థూలప్రపంచానికి సంబంధించిన ఇంద్రియజ్ఞానాలను మనము పొందుతున్నాము. అ అర్ధసూక్ష్మలోకంతో సంబంధం ఏర్పరచుకొనేలా మనకు యీ భౌతిక ఇంద్రియాలను తెలిసి ఉపయోగించుట కొన్ని పరిస్థితులలో సాధ్యమవుతుంది. అందుమూలంగా చనిపోయినవారి ఆత్మలతో సంబంధం ఏర్పాటుచేసుకోవచ్చును. శరీరము వీడినవారితో సంభాషించుటకును ఆధ్యాత్మికలోకానికి ఏమీ సంబంధము లేదు. సూక్ష్మలోకానికి అర్ధసూక్ష్మలోకానికి చాలా బేదముంది.

మరణానంతరం మానవుల ఆత్మలు—నాలుగవ భూమిక దాటే ఆధ్యాత్మిక ప్రగతిపొందిన వారు తప్ప—యీ అర్ధ సూక్ష్మలోకాప్తి చేరుతారు. వారి

సంస్కారములను బట్టి వారు 'స్వర్గము'నకు గానీ 'నరకము'నకు గానీ పోవుదురు. వారు పొందవలసిన స్థితి పొందిన తరువాత అనగా వాటి అనుభవాల అనంతరం క్రొత్తశరీరము నందువారు పునర్జన్మ పొందుతారు. లేకపోతే అ అర్ధసూక్ష్మలోకంలో కొంతకాలముంటారు. వారు యీ లోకంలో ఒక ప్రక్కగదిలో ఉన్నట్లుంటారు. ఆత్మలతో సంభాషించు సాధనల ద్వారా ఎవరయినా వీరితో సంభాషించగలుగుతారు. ఆ ఆత్మలు వారి అనందమునుగాని దుఃఖమునుగాని అనుభవించినా లేక మరల జన్మకొరకు వేచియున్నా లేక 'స్వర్గము'నకుగాని 'నరకము'నకుగాని పోవుటకు సిద్ధముగా ఉన్నాను—యిది సాధ్యమవుతుంది. ఈ అర్ధసూక్ష్మలోకము (నరకము—స్వర్గము) దానికి సంబంధించిన అనుభవములు నిజమైనవి కావు. అవి కొన్ని సుఖాలు బాధలు ఇంద్రియముల ద్వారా సూక్ష్మదేహము అనుభవించినవి మాత్రమే. ఎంత సరిగా వర్ణించినా మరణానంతర జీవితానికి కొంతవరకే ప్రాధాన్యత యివ్వడం మంచిది. అధ్యాత్మికంగా పరిణామం చెందినవాడు ఉన్నతాత్మలతో సంభాషించ గలడు. కానీ అట్లు చేయకుండుట మంచిది. మానవుల సూక్ష్మమానసిక ఆధ్యాత్మిక లోకాలలోని ఉన్నతాత్మలతో సంబాషించు సంబంధమును ఎప్పటికీ ఏర్పరచుకొనలేరు. ఎందుచేతననగా వారు మరల జన్మించవలసి యున్నప్పటికి వారు అర్ధసూక్ష్మలోకం లోని ఆ 'ప్రక్కగది' లోనికి పోరు.

బెంగుళూరు ఆశ్రమంలోని కొందరు మస్తులను మెహెరాబాద్ పంపించారు. అందులో చట్టిబాబా ఫూల్‌వాలా, మహమ్మద్ షరియత్‌ఖాన్, ఇరావ్‌శిష్ కూడా ఉన్నారు. వీరిని మెహెరాబాద్ పంపించి బాబా పశ్చిమ భారతదేశ పర్యటనకై బయలుదేరారు.

## పశ్చిమ భారత పర్యటన

ఏప్రెల్ 1వ తేదీన బాబా పరివారంతో బెంగుళూరు వదలి వెళ్ళారు. మొదట వారు అర్సికేరే అనుచోట ఆగారు. అది బెంగుళూరుకి 84 మైళ్ళ దూరంలో ఉంది. అక్కడినుంచి మర్నాడు షిమోగాకు బయలుదేరారు. అది అరిసికెరెకు 100 మైళ్ళ దూరంఉంది. ఇక్కడ పేరుగాంచిన జమిందారు సోదరులగు సయ్యద్‌అమీర్ అహెమద్, సయ్యద్ మహమూద్‌ల అతిథులుగా

ఉన్నారు. ఈ జమీందారులు కొన్ని సంవత్సరాలుగా షిమోగాలో స్థిరపడి ఉన్నారు. వారికి షిమోగాలోను బెంగుళూరులోను చాలా పలుకుబడిఉంది. బెంగుళూరులో బాబా ఉన్నప్పుడు వారి పేరువిని యీ సోదరులు బాబాను షిమోగావచ్చి వారి గృహం పావనం చేయవలసిందని కోరారు. ఇప్పుడు బాబా రాక ఆ అహ్వానాన్ని పురస్కరించుకునే, రెండురోజులు బాబాకు షిమోగా జమీందారు దివ్యమైన ఆతిథ్యం యిచ్చారు. ఒకరోజున బాబా మండలితో గెర్సొప్ప జలపాతం చూడ డానికి వెళ్ళి అక్కడ ఆ రోజు గడిపారు. ఒకపూర్ణ పురుషుణ్ణి ఆయన ప్రాచ్య పాశ్చాత్య శిష్యమండలితో తమ యింట అతిథులుగా ఉంచుకునే మహాభాగ్యం సయ్యద్ అమీర్అహమద్, సయ్యద్ మహమూద్ల పూర్వపుణ్యం వలననే కలిగింది. ఇప్పుడు బాబా గావించే పర్యటన బహిరంగం కాకపోయినప్పటికీ, కరుణా మయుడైన బాబా వారికే యీ భాగ్యం కలిగించారు.

ఈ పర్యటనలో బాబా షిమోగా, జోగ్ కలపాతం, కార్వార్. గోవా (పంజాబ్) అంబోలీ. బెల్గావ్, నఖర్వా, మహాబలేశ్వర్. పంచాగ్ని మొదలయిన స్థలములు దర్శించారు. ఆయా స్థలములో ఉన్న మస్తులను సాంగత్యం చేయుట అందమయిన యీ ప్రదేశాలలో ఎక్కడయినా బాబావని కోసం కేంద్రాలు స్థాపించ డానికి అనువైన స్థలములు అన్వేషించుట' యివి యీ పర్యటనయొక్క ముఖ్యోద్దేశములు.

ఈ ప్రయాణాలలో బాబా సుందరమయిన ప్రకృతిగల స్థలముల శిష్యు లండరికీ చూపించడం మరువలేదు. గొప్పసాధువుల దర్గాలకు తీసికొని వెళ్ళి చూపించారు. వీటితోబాటు బాబావారి అంతరికమయిన ఆధ్యాత్మిక విశ్వకార్యం నిర్వహిస్తూనే ఉన్నారు.

మండలితో బాబా అంచోరీ వెళ్ళి అక్కడ కొద్ది రోజులున్నారు. ఈ ఊరు సావంత్వాడీ అనేరాజ్యంలో ఒక కొండమీద బెల్గావ్కి అనతిదూరంలో ఉంది. అంచోలీకి రాజులు అధికారులు వేసవికాలంలో చల్లగాలికోసం వచ్చి, యిక్కడ కొన్నాళ్ళుంటారు. ప్రశాంత నిలయమయిన యీ స్థలం సముద్రమట్టానికి 2,500 అడుగుల ఎత్తున ఉన్నది. సావంతవాడి నుంచి కోనలలోను కొండలలోను వెళ్ళే యీదారి చాలా రమ్యమయిన ప్రకృతి దృశ్యాలతో కూడియుంటుంది. వెన్నెల

రాత్రులలో యిచ్చట రామణీయకము వర్ణనాతీతము. ఇక్కడికి బెల్గాం 40 మైళ్ళు మాత్రమే ఉంది. అంబోలీ నివాసులకు అవసర వస్తువులన్నీ బెల్గాంనుంచి రావలసినదే. ఇక్కడ సుప్రసిద్ధ వ్యాపారి అయిన విశ్వనాథ్ హల్దన్కర్ బాబాకు ఆతిధ్యమునిచ్చెను. అతనికి యిదివరలో అనేకులు అతిథులుగా నుండిరి. గాసీ బాబా వంటివారు ఆయనతో వచ్చిన 40–50 మంది మండలి వంటివారు యిదివర కెన్నడూ తటస్థపడలేదు. ఈతని పూర్వపుణ్యావశమున యిటువంటి మహాపురుష సేవ లభ్యమయినది.

ఆతడు గావించిన ఏర్పాట్లు ఎల్లరకు మక్కుటమగు ఆనందము కలిగించాయి. మొదటరోజుననే విశ్వనాథ్‌కి అపూర్వమయిన ఆధ్యాత్మికానందము కలిగినది.

అంబోలికి వెళ్ళేదారిలోనే బాబా ఒక మస్తును రోడ్డు ప్రక్కను కలుసు కున్నారు. అతడు చూడడానికి ఒక బిచ్చగాడులాగ చింకిగుడ్డలు కట్టుకొని ఉన్నా, అతని ఆధ్యాత్మికస్థాయి బాబాకే అవగతమయినది. ఆ మస్తు బాబా కారుకి ఎదురు వచ్చి 'ఆ కారు ఆపమని' కోరాడు. కారు ఆపించి బాబా క్రిందకు దిగగానే ఆ మస్తువచ్చి బాబాకు సాష్టాంగప్రణామం చేసాడు. బాబాను సంపూర్ణ సద్గురువుగా అతడుముందే గ్రహించి కారు ఆపించాడు. 'బాబా కోసం ఎంతకాలం నుండియో యిక్కడ వేచియుంటినని' చెప్పాడు. బాబా అతనిని కారుతో ఎక్కించుకొని అంబోలికి తీసికొని వెళ్ళి, అక్కడ వారు ఉన్నంతకాలము వారితోనే ఉంచు కున్నారు.

అంబోలీ సమీపంలోఉన్న సర్సోభావడి అనే గ్రామానికి వెళ్ళి, బాబా మండలి నారాయణ్ భట్ అనే బ్రాహ్మణుని బాబా వద్దకు అంబోలీ తీసుకువచ్చాడు. నారాయణ్ భట్ మంచి మాటకారి. ఇంగ్లీషుబాషలో చక్కగా మాట్లాడుతాడు. అదేగాక యింకా సంస్కృతం; హిందీ, మరాటీ బాషలు కూడా బాగా నేర్చినవాడు. ఇతడు భగవదున్మత్తు డయాడు. బాబా మండలితో యితడు సఖర్సా వచ్చాడు. అంబోలీడాక్ బంగళాలో అర్థరాత్రివేళ నారాయణ్ భట్ ఒకచెట్టు ఎక్కికూర్చున్నాడు. గుస్తాద్‌జీ అదిచూసి అతనిని క్రిందకి దిగమన్నాడు. ఈ దైవోన్మత్తుని అదుపులో ఉంచడం మండలికి కష్టమైనది. అందుచేత బాబా యితనిని వరోభానసికి పంపించేశారు.

బాబా అంబోలీకి వెళ్ళిన మరునాడు అప్పుడు సావంత్‌వాడీ పరిపాలించే రాణి సాహెబ్ 'బాబా దర్శనం చేసుకునేందుకు వీలున్నదా ?' అని అడిగిరమ్మని ఒకరిని పంపించింది. ఆమె యొక్క భర్త జీవించి యున్నప్పుడు అతడు బాబా గురించి ఆమెకు చెప్పి యుండెను. పంచాగ్నిలో బెబ్బులి లోయలో బాబా కొరకు అతడు ఒక గుహను నిర్మాణము చేసియుండెను. బాబా గురించి ఆమె విన్నదేగాని యింత వరకు బాబాను దర్శించి యుండలేదు. తన రాజ్యమునకు వచ్చినా తన అధికారము చూపక చాలా వినయంతో బాబా దర్శనం కోరుతూ ఆమె కబురుచేయగా ఆమె యొక్క అధ్యాత్మిక సంపత్తిని బాబా ఎరిగి యుండుటచేత, యిది బహిరంగ పర్యటన కాకపోయినను 'ఆమెకు బాబా దర్శనం యిస్తాను' రమ్మన్నారు. ఆమె కుమారుడు మైనరు అయినందున యింకా విద్యాభ్యాసము చేస్తున్నాడు. బరోడా మహారాజా గాయక్వాడ్ ఆమె సోదరుడే.

చెప్పిన ప్రకారము మరునాడు మహారాణి ఆమె ముగ్గురి కుమార్తెలతోను, పరివారంతోను బాబా దర్శనార్థము వచ్చినది. ఆమె బాబా యెదుట కొద్ది నిమిష ములే ఉన్నను అట్టి భాగ్యం కలుగజేసినందులకు బాబాకు మిగుల కృతజ్ఞురాలై యుండెను. ఆమె బాబా పాదములయందు కొన్ని నారికేళఫలముల నుంచెను. అందులో బాబా ఒక కొబ్బరికాయను తీసి ఆమె కుమార్తెలలో నొకామెకు యిచ్చి ఆమెను 'అది జాగ్రత్తగా పెట్టుకోమని, యేమియు వ్యాకులవడవద్దని' చెప్పారు. బాబా రాణిని కుమార్తెలను ఆశీర్వదించారు.

ఆ మరునాడు బాబాను శిష్య సమేతంగా వచ్చి ఫలహారము చేయుటకు రాణి సాహెబ్ ఆహ్వానించెను. ఆమె బంగళా ఒక కొండపైన అంచున ఉండెను. అక్కడనుంచి చూచిన ఆ దృశ్యము కడురమ్యముగా నుండెను.

బాబా అంబోలీ నుండి బెల్గాన్ వెళ్ళారు. అక్కడ రాణీసాహేబా తన బంగళా బాబాకు విడిదిగా యిచ్చినది. అది ఊరి వెలుపల 3 మైళ్ళ దూరంలో ఒక విజన ప్రదేశంలో ఉంది. ఆ స్థలము ఏకాంతముగా నుండుటచే ఆయనకు నచ్చినది. బాబా ఆ బంగళాలో రెండు రోజులున్నారు. అక్కడకు కూడా రాణీ వచ్చి బాబా దర్శనము చేసుకొని, తనకు వారి యెడలఉన్న గౌరవ భక్తిభావములు వెల్లడిచేసినది.

తరువాత ఏప్రెల్ 11వ తేదీకి బాబా గోవా వెళ్ళారు. ఆ రోజున బాబా వారి పరివారంతో గోవా పాత పరిసరాలలో ఆ పట్టణపు పూర్వవైభవాన్ని తిలకిస్తూ వెళ్తున్నారు. పూర్వం లిస్బన్ కంటె పెద్దదిగా ఎక్కువ ఐశ్వర్యంతో తులతూగే దిగా గోవా ఉండేదట. ఈనాడు పాడుపడిన భవనాలు, మొండిగోడలు, గడ్డి మొలచిన పాత యిళ్ళతో నిండివుంది ఆ పట్టణం. కొబ్బరి తోటలలో ఉన్నందువలన అవి యింకా సరిగా కనబడడంలేదు.

బాబా కారు ఎలిజబెత్ పాటర్సన్ నడుపుతోంది. గోవాలోని పెద్ద చర్చి వద్దకు రాగానే బాబా 'కారు ఆపమ'న్నారు. కారు ఆపగానె ఎలిజబెత్‌ను దిగి 'ఆ చర్చి ప్రక్కనున్న ఒక కాఫీ హోటలు లోనికి వెళ్ళ'మన్నారు బాబా. ఆమె ఆ హోటలు వద్దకు వెళ్ళగానే ఒక ముసలివానిని చూసింది. అతనికి కోలముఖము, నిర్మలమయిన గోధుమరంగు నేత్రాలు యూదులను బోలిన నాసిక, మెడక్రిందికి ఉన్న పొడవైన తెల్లటి గడ్డము ఉన్నాయి. బట్టతల కూడా ఉంది. చూడగానే చాలా గౌరవనీయమైన వ్యక్తిలా ఉన్నాడు. చక్కని ఇంగ్లీషు మాట్లాడుతాడు. నెరసిన అతని తలవెంట్రుకలు భుజాలమీద పడుతున్నాయి. పాతటోపీ (హాట్), పాత సూట్ ధరించి ఉన్నాడతడు. అతనిని చూడగానే మోసెస్ జ్ఞాపకం వచ్చేలా ఉన్నాడు. హోటలులోనికి ప్రవేశించేదారి అడుగగానే అతడామెకు చక్కగా వివరించి చెప్పాడు.

ఆ సాయంకాలమే బాబా తమ బృందంతో యీ చర్చి చూడడానికి వచ్చారు. ఆ చర్చిలో సెయింట్ ఫ్రాన్సిస్ జేవియర్ సమాధి ఉంది. ఈ సెయింట్ ఫ్రాన్సిస్ క్రీస్తుయొక్క సందేశాన్ని మొదట భారతదేశానికి అందించాడు. ఆ సాయంకాలం వారు దానిని చూసి వెళ్ళబోతూ ఉంటే, పైన చెప్పిన వృద్ధుడు మళ్ళీ వారికి తారసిల్లాడు. ఎలిజబెత్‌తో ఉదయం మాట్లాడిన పరిచయం పురస్కరించుకుని ఆమెను సమీపించబోయాడు. ఇంతలో జాల్‌బాయి, కాకా, కిట్టి బాబా దగ్గరకు వచ్చి అతనిచుట్టూ మూగారు. అంతకుముందే బాబా 'అతనికేదయినా కావాలేమో అడగ'మని జాల్‌భాయితో చెప్పి ఉంచారు. ఆ ప్రకారం జాల్ కనుక్కోగా అతడు ''థాంక్స్, అక్కరలేదు'' అన్నాడు. అతడు 60 ఏళ్ళ మనిషిలా కనిపించాడు. వారితో అతడు చిత్రమైన సంభాషణ మొదలుపెట్టాడు. 'తానొక

కాథలిక్కునని, కరాచీనుంచి అక్కడకు వచ్చానని, తాను అనేక నాటకాలు రచించిన గ్రంథకర్తనని, ఒక పుస్తకం వ్రాసే ఉద్దేశంతో గోవా వచ్చాననీ, ఇంకా ఆరు నెలలు తాను గోవాలో ఉండదలిచాననీ' బాబాతో చెప్పాడు. ఇంకా అనేకమంది గురించి అనేక విషయాల గురించి, బెర్నార్డ్‌షా గురించి, ఒకటేమిటి ఎన్నో సంగతులు వారితో సంభాషించాడు. ఆ మాటలలో ఏదో ఒక వింత గోచరించింది. అనేక మారులు బాబావైపు అర్ధవంతంగా చూసేవాడు. చూసేవారికి మాత్రం ఏమీ అనుమానం కలుగకుండా ఉండేది. బాబా మండలి ద్వారా 'అతనికేమైనా డబ్బు కావాలా' అని అడిగించారు. 'అవసరంలేదని' అతడు జవాబు చెప్పాడు.

ఇలా ఒక పావుగంట మాట్లాడి అతడు వెళ్ళిపోయాడు. వెళ్ళేముందు ఎంతో గౌరవంగా అందరివద్ద సెలవు తీసికొని వెళ్ళాడు. తరువాత 'అతని గురించి మీ అభిప్రాయమేమిటి' అని మండలిని బాబా అడిగారు.

అనేకులు అనేక విధాలుగా చెప్పారు. 'మీరంతా గ్రుడ్డివారే, అతడు చాలా ముఖ్యమయిన ఆధ్యాత్మిక ప్రతినిధి నాకు. అతడు నాకొక సందేశ మివ్వడానికి వచ్చాడు. ఇచ్చి ఆందుగురించి నాయొక్క ఆజ్ఞలు తెలుసుకుందామని వచ్చాడు. నాటకాలు వగైరా గురించి అతడు మాట్లాడినదంతా ఆతడు తన సందేశాన్ని మీకు తెలియకుండా నాకు అందజేయడమే. తన పని పూర్తికాగానే రేపే అతడు గోవా వదిలి వెళ్ళిపోతానని చెప్పాడు. అతడు పైకి మాత్రం ఇంకా ఆరువెలలు ఉంటానన్నాడు.)' అని బాబా వారి శిష్యులకు వివరించి చెప్పారు. బాబా కోసమే అతడు గోవా వచ్చాడన్నమాట.

మరునాడు ఎలిజబెత్ ఈ ముసలి వానిని పంజిమ్‌లో కలుసుకుంది. పంజిమ్ అనగా గోవాయొక్క ఆధునిక నగరభాగం. గౌరవసూచకంగా ఏదో మొదట ఒకటి రెండు వాక్యాలు చెప్పి ఎలిజబెత్‌కి 'ఆ రాత్రే తాను గోవా వదలి ఉత్తర భారతానికి వెళ్ళిపోతున్నానని' చెప్పాడు. అది బాబా ఆదేశమై యుండవచ్చును. అందుకు సాకుగా 'బహుశా నా గడ్డం వల్ల కాబోలు ఇక్కడ నేను ఎక్కువ వేడివల్ల ఉండలేక పోతున్నాను. ఎందుకో గాని కొన్ని నెలలుందా మనుకున్నా నాకు వెంటనే వెళ్ళిపోవాలని బుద్ధిపుట్టింది,' అన్నాడు ఆమెతో.

బాబా తన పరివారంతో వివరించి చెప్పినట్లుగా అతడు గోవా నుంచి ప్రయాణమయి వెళ్తున్నాడు. ఆమెకు ఇతర శిష్యులకు యితని ప్రవర్తన ఆశ్చర్యం కలుగజేసింది.

బాబా మండలితో గోవా నుంచి వెళ్ళినరోజున అతడుకూడా గోవా వదలి వెళ్ళిపోయాడు 'ఎలిజబెత్ అతనిని ముందు చూసింది గావున, ఆఖరున కూడా ఆమెయే అతనిని చూసిందని' బాబా అన్నారు.

మస్తానీమాయి అనుసామె చేతిలో గోవా యొక్క అధ్యాత్మిక వ్యవహారాలన్నీ యిమిడిఉన్నాయి. ఒక రోజున కాకాను 'నోరీనాను యీ మస్తానీని తీసికొని రమ్మని' పంపించారు. కొంత దర్యాప్తు చేసిన తరువాత వారు ఒక మస్తానీని కనుగొన్నారు. ఈమె రోడ్డువెంబడి నడచి వెళ్తోంది. ఈ మస్తానీ పొడుగుగా ఉండిన బలమయిన మనిషి 40 సంవత్సరముల నడివయస్కురాలు. ఆమె క్రైస్తవ స్త్రీ. జుట్టు గరిజాలలా కత్తిరించుకుని ఉంది. నల్లని సిల్కు రవికే తొడిగింది. పెద్దలంగా కట్టినది. అది సన్ననిగుడ్డతో కుట్టబడినది. పెద్ద అంగిలు వేసుకుంటూ వెళ్తుంది. 'స్వాతంత్ర్యం కలిగిన ఆధునిక స్త్రీలా ఆమె కనిపిస్తోందని' నోరీనా అనుకున్నది. లేక మగవాళ్ళని లెక్కచేయని గయ్యాళిగంపలా ఉంది. నోరీనాకు పోర్చుగీస్ భాషరాదు. కనుక ఇటాలియన్ భాషలో ఆమెతో మాట్లాడింది. ఆమెను 'మమ్మినా' అని ఏదో చెప్పుంటే ఆ మస్తానీ చేతితో వెళ్ళమని సంజ్ఞచేస్తూ ముందుకు సాగిపోయింది. నోరీనా 'కారులోనికి రమ్మంటే' కారు ఎక్కనంది'. కానీ ఆ మస్తానీ తిన్నగా బాబా బసచేసిన హోటలుకే నడచి వెళ్ళిందీ. బాబా అప్పుడు మేడమీద వసారాలో నిలబడియున్నారు. ఆహోటలువద్ద ఆమె కొంచెంసేపు ఆగి, పైకి బాబా వైపు కొంచెంసేపు చూసి– ఆమె వెళ్ళిపోయింది.

ఏప్రిల్ 13వ తేదీన బాబా మండలివారు బాబా దిగువ హోటలులోనికి. పేరు తెలియని ఒక మస్తుని తీసికొని వచ్చారు. బాబా అ మస్తుని స్నానం చేయించారు. ఆ హోటలులోనే బాబా ఆ మస్తుతో ఏకాంతంగా కొంతసేపు కూర్చున్నారు.

గోవాలో బాబా తన మండలితో సుమారు ఒక వెలరోజులు ఉన్నారు. ఒకనాడు బాబా సముద్రతీరాన్ని కూర్చుని ఉండగా, సముద్రంలో ఒక ద్వీపం కనిపించింది. అది ఆధ్యాత్మికంగా విశిష్టమైనదని అది కొనడం కోసం గవర్నరుతో మాట్లాడడానికి బాబా నొరీనా మాచె ల్లీని పంపించారు. గవర్నరు దయతో ఆమెను రమ్మని మాట్లాడాడు. 'ఆ ద్వీపం అమ్మదలచుకోలేదని, అది ప్రభుత్వంవారి క్రిందఉండాలని' గవర్నరు చెప్పాడు. తరువాత నీలిరంగు బస్సులో బాబా శిష్యులతో గోవా వదలివెళ్ళారు.

బాబా ఆజ్ఞప్రకారం బెంగుళూరు నుంచి బయలుదేరి, భవానందస్వామి మొదట అహమద్‌నగర్ జిల్లాలోని సాకోరికి వెళ్ళాడు. అక్కడ ఉపాసనీ మహరాజ్ దర్శనం చేసుకున్నాడు. వెంటనే బాబా ఆదేశానుసారం అక్కడినుంచి బయలుదేరి కొలది దూరంలోనే ఉన్న షిర్డీకి వెళ్ళాడు. అక్కడ సద్గురు సాయిబాబా సమాధిని దర్శించాడు. అక్కడినుంచి ఖేడ్‌గావ్ వెళ్ళి సద్గురు నారాయణ మహరాజ్‌ను దర్శనం చేసుకున్నాడు. అక్కడినుంచి పూనావెళ్ళి అక్కడ హజరత్ బాబాజాన్ సమాధిని దర్శించాడు. పూనా నుంచి పండరీపురం వచ్చి విఠోబాస్వామిని దర్శించాడు. అక్కడ బాబా భక్తుడయిన బాబాదాస్‌ను కలుసుకున్నాడు. బాబాదాస్ అక్కడ బాబాను గురించి ఉపన్యాసాలిస్తూ ఆయన వాఙ్మయం పంచిపెడుతున్నాడు. బాబా పనిని చేస్తున్న బాబాదాస్‌ను కలుసుకోవడం స్వామికి చాలా సంతసం కలిగించింది. ఒకే ప్రభువుకు శిష్యులయిన యిరువురు కలుసుకొని చాలా ఆనందం పొందారు. అక్కడే బాబా భక్తుడగు ఆర్. కె. గడేకార్ అని డిప్యూటీ ఎడ్యుకేషనల్ ఇనస్పెక్టరుగా షోలాపూర్ జిల్లాలో ఉద్యోగం చేస్తున్నాడు. అతడు వీరిరువురిని కలుసుకున్నాడు. వాళ్ళిద్దరూ బాబా గురించి ఎన్నో సంగతులు మాట్లాడుకున్నారు. బాబాదాస్, స్వామి యిద్దరూ అక్కడ ఉన్నందున గడేకార్ ఒక బహిరంగ సమావేశం ఏర్పాటు చేసాడు. బాబా గురించిన ఉపన్యాసాలివ్వడానికి బాబా గురించి, బాబా జీవితచరిత్ర చెప్పి—ఆయన సందేశము అందరికీ యివ్వడానికి.

ఆసభలో స్వామి తన స్వానుభవం గురించి చెప్పాడు. అక్కడ షోలాపూర్ సాహిత్యసేవామండలి వారు ఏర్పాటు చేసిన యింకొక బహిరంగసభలో స్వామి భవానంద్ మానవధర్మం గురించి ఉపన్యసించాడు. ఆ సభకు ఎమ్. ఎస్. సర్దార్

అనే బారిష్టరు అధ్యక్షత వహించాడు. గడేకార్ బాబా జీవితం గురించి చెప్పాడు. పి. ఎన్. లిమ్కర్ అనే అధ్యాపకుడు భవానంద, బాబాదాస్ వగైరాల సాంగత్యంలో తనకు కలిగిన అనుభవాల గురించి చెప్పాడు. భవానంద యిచ్చిన ఉపన్యాసము విశ్వప్రేమను గురించి. అది శ్రోతల హృదయాలలో చెరగని ముద్రవేసింది. బాబా దర్శనం చేసుకున్న 'గురు' అనే హిందీ ఉపాధ్యాయుడు తన అనుభవం గురించి మాట్లాడాడు.

తరువాత బాబా మైసూరు ఇంజినీరింగు కంపెనీతో సమకూర్చుకున్న బైరమంగళా నిర్మాణం గురించిన ఖరారునమా రద్దుపరచి, బాబా ఆయనశిష్యులకే కట్టుబడిపని వప్పగించారు. ఈ మార్పు వలన భవన నిర్మాణపుపని నెమ్మదిగా సాగుతోంది. బాబాతో వచ్చినవారుగాక మిగిలిన మండలివారు, వారికి అప్పగించిన పనులుచేస్తూ బెంగుళూరులో ఉన్నారు. కొంతమంది బైరమంగళాలో కేంద్ర నిర్మాణం, కొందరు మెహెర్బాబా జర్నల్ప్రచురణపని, మిగిలిన కొద్దిమంది బాబాకు వచ్చిన ఉత్తరాలకి జవాబులు వ్రాయడం, గ్రంథప్రచురణ మొదలయిన పనుల్ని నిర్వహిస్తున్నారు.

బెంగుళూరు నుంచి అంబోలీ మీదుగా మెహెరాబాద్ వస్తుండగా, బెల్గావ్ వద్ద రోడ్డు ప్రక్కన బాబా 'జంప్లా' అనే మస్తుని చూసి తమతో కూడా మెహెరాబాద్ తీసికొని వచ్చారు. అల్లరిచేసే కోతిపిల్లలా ఉంది ఆ మస్తు వైఖరి. ఎవ్వరయినా అన్నం తింటుంటే వాని ప్రక్కన చేరి కూర్చునేవాడు. వాళ్ళ కంచం నుండి వారి దృష్టి మరల్చి గభాలున పట్టెడన్నంలేక ఏది తింటుంటే అదే చేతి నిండా పట్టుబట్టి, వెంటనే నోటిలో కుక్కుకొని, సాధ్యమయినంత త్వరలో మింగేసేవాడు. కిటికీలోనుండి కాలిజోళ్ళు విసిరేసేవాడు. గోడలలోని మేకులు పీకే వాడు. విడిగావున్న వస్తువులు అటూ యిటూ గదిలో విసిరేవాడు. రాత్రింబగళ్ళు ఊరికే ఉండకుండా ఏదో పని చేస్తుండేవాడు. ఎత్తుగా ఉన్న గూళ్ళలోను అల మారులలోను ఉన్న వస్తువులు అందకపోతే పైకెక్కి తోసేవాడు. అక్కడే క్రింద చతికిలబడి కూర్చువేవాడు. జంప్లా యింకా ఎవరూ సహించలేని పనులు కూడా చేసేవాడు. తన మలమూత్రాలు తీసి, పైకి గాలిలోకి విసిరి, దాని క్రింద నిలబడే వాడు. అవి తన నెత్తిమీద పడేవి. ఇతని చేష్టలు చూసేవారిని పిచ్చివాళ్ళని చేసేవి.

మెహెరాబాద్‌లో ఉన్న కొద్దిరోజులు యీ విధంగా అల్లరి చేసేవాడు. కొద్దిరోజులు మాత్రమే ఉంచుకొని బాబా యితనిని బెల్గామ్ పంపించేసారు. అతడు చెప్పే మాటలలో ఒకటి కూడా అర్థమయేది కాదు.

బాబా సఖర్పా అను రత్నగిరి జిల్లాలోని ఒక గ్రామమునందు రెండు రోజులుండి, అక్కడనుంచి మహాబలేశ్వర్‌లో ఒక రోజు ఉన్నారు. అక్కడినుండి పంచాగ్నికి వెళ్ళారు. సతారా జిల్లాలో యిది ఒక అందమయిన కొండప్రదేశం. బాబాతో వారి పాశ్చాత్య శిష్యురాండ్రంతా ఉన్నారు. ఆడవారు ఉన్నారుగనుక బాబా అన్నివిధాలా జాగ్రత్త తీసుకుంటూనే ఉంటారు. బాబాతోపాటు మాయకూడా పనిచేస్తూ ఉంటుంది. అయన మస్తు పనిమీద వెళ్తూ డా॥ నీలాని 24 గంటలూ ఆస్పత్రి మందులతో సిద్ధంగా ఉండమన్నారు. శిష్యులను వంతులవారీగా రాత్రింబగళ్ళు కావలి ఉండమంటారు, రాత్రి ఏమయినా మృగాలు కనిపిస్తే 'బాబా, బాబా' అని కేకవేస్తే అవి పారిపోతాయని—బాబా చెప్పారు.

ఆ రోజు మధ్యాహ్నం 16 గు:రు స్త్రీలు కొండల మీదికి షికారుబయులు దేరారు. వెళ్తూంటే బాబా 'పళ్ళూ, కాయలూ ఏవీకూడా చెట్లనుండి కోసి తినకూడదు' అని హెచ్చరించారు. కొండమీద ఒకచోట విశ్రాంతి కోసం అందరూ కూర్చున్నారు, ఒకామె ఏదో దుంప తీసికొనివచ్చి 'ఇదిగో! అరో రూట్ చూసారా? యిది తెల్లగా ఉంది'. అని వారికి యిచ్చింది. అది అందుకొని ఒకామె 'ఏదీ చూద్దామని' నోటిలో పెట్టుకొని. కొరికి ఉమ్మేసింది. ఇంకొకామె కొరకడమే కాక కొంచెంతింది. కొంచెం సేపట్లోనే ఆమెకు కడుపునొప్పి ముఖం ఎర్రబడడం, కొంచెం వాపు కనబడడం, తీవ్రమయిన జ్వరం వచ్చాయి. ఇది, ముదరకుండానే బసలోకి వచ్చేసారు. రాగానే బాబాకి చూపించారు. వెంటనే డా॥ నీలకంఠ్‌కి కబురంపారు. అతడు పరీక్ష చేసాడు. ఆ దుంప సంగతి నీలుకి చెప్పారు. ఆది తినిన ఆమెచావు బ్రతుకుల మధ్య అల్లాడుతూ ఉంది. మొత్తానికి డా॥ నీలూ ఏవో మందులు వేసి బ్రతికించాడు. బాబా చెప్పినట్లు వింటే యిటువంటి ఉపద్రవములు రావు.

బాబా జరిగినవంతా విన్నారు. ఆమె తిన్నదుంపనుచూసి' అది 'ఆరోరూట్' కాదనియు, దున్నపోతులు, ఆటువంటి మోటు జంతువులు జబ్బుచేసి అమితమైన

బాధపడుతూంటే, 'అవి చచ్చిపోతేనే మంచిది యీ బాధపడడం కంటే' అని అనుకున్నప్పుడు, యీ దుంప వాటిచేత తినిపిస్తే త్వరలో ప్రాణాలు వదిలేస్తాయి. అదృష్టవశాత్తూ ఆమె కొంచెమే రుచి చూసింది. అందుకే జీవించింది' అని బాబా చెప్పారు. ఇది మొదట్లో బాబాచేసిన హెచ్చరిక అతిక్రమించినందున కలిగినది.

బాబా వారి పరివారంతో బయలుదేరి ఏప్రెల్ 29వ తేదీనాడు అహమద్ నగర్‌కి వచ్చి చేరారు. వచ్చి అక్కడ బాబా పాతశిష్యులగు 'సతౌ' కుటుంబం వారి గృహమందు ఆరోజు మధ్యాహ్నం గడపి, సాయంకాలం అక్కడికి 11 మైళ్ళ దూరంలోఉన్న హాపీవాల్ (ఆనందలోయ)కి తమబృందం సహితంగా వెళ్ళారు. 'శ్రీరాముడు వనవాసం చేసినప్పుడు యీలోయలో కొన్నాళ్ళు గడిపాడని' అంటారు. అక్కడ బాబా మండలితో 4 రోజులుండి మెహెరాబాద్‌కి మేనెల 3వ తేదీన చేరుకున్నారు. పదినెలలుగా లేని బాబా, పరివారంతో మెహెరాబాద్ రాగానే అక్కడ ఉన్న వారందరి హృదయాలు ఆనందంతో పొంగాయి.

## బువా సాహెబ్ మరణం

మేనెల 1టవ పూనానుండి మెహెరాబాద్‌కి ఒక టెలిగ్రాం వచ్చింది. అందులో బాబా యొక్క శిష్యుడు, చిన్నప్పటినుండి బాబాకు స్నేహితుడు అయిన బెహ్రెంజీ ఫరెదూన్ ఇరానీ మరణించెనని— వార్త తెలుపబడినది. బెహ్రెంజీని బాబా మండలి 'బువాసాహెబ్' అని పిలిచేవారు. ఇతడు పూనాలో ఒక మోటారు సైకిల్ ప్రమాదంలో మరణించాడు.

బాబా 3వ తేదీని వచ్చిన తరువాత ఆ టెలిగ్రాం చూసుకొని మండలి వారికి యీ లేఖ పంపించారు.

'ఈ యుద్ధ సమయమునందు బాబా మండలిలో యిద్దరు మరణింతురని బాబా బెంగుళూరు వదలక పూర్వమే మండలికి చెప్పియున్నారు. ఆ యిరువురు పురుషులయినా స్త్రీలయినా కావచ్చును. ఒక పురుషుడు ఒక స్త్రీ అయినా కావచ్చును.' అని వివరించి యున్నారు. ఈ నెల 1వ తేదీన బువాసాహెబ్ తన శరీరమును వదలి బాబాతో ఐక్యమయ్యెను.

'ఈ యుద్ధము అంతము నొందుటకు పూర్వము శిష్యులలో వారియొకరు అట్టి ఐక్యతే బాబాతో పొందగలరు' అని బాబా చెప్పారు. "బువాసాహెబ్ జ్ఞాప కార్థము అతనికి చిన్నప్పటి నుంచీ బాబాతో ఉన్నటువంటి గాఢమైన మైత్రిని, ఆధ్యాత్మిక సంబంధమును పురస్కరించుకొని మే 8వ తేదీ బుధవారం రోజున, బాబాయే కాకుండా వారి మండలి అందరూ కూడా పగలంతా ఉపవాసముంటారు. ఆ రోజున ఉదయం టీ తీసుకొనవచ్చును. సాయంకాలం సూర్యాస్తమైన తరువాత భోజనము చేయవచ్చును. మంచినీరు యథేచ్ఛగా త్రాగవచ్చును. ఈ లేఖాంశములు కావలసినవారందరికీ చెప్పవచ్చును."

పైన చెప్పిన విధంగా బాబా శిష్యులు అన్ని స్థలాలలోను మెహెరాబాద్‌లోని మండలి, వారితో సహా మే 8వ తేదీ బుధవారం నాడు బాబా ఆదేశానుసారం ఉపవాసం ఉన్నారు. బాబా కూడా ఆ రోజు ఉపవాస మున్నారు. మెహెరాబాద్‌లో ఆ రోజున నూరుమంది పేదవారికి సంతర్పణచేసి, వారికి బాబా మిఠాయి పంచి పెట్టారు. ఆ సంతర్పణలో పేదవారికి స్వయంగా వడ్డించారు.

బాబా మౌన విరమణ చేసేముందు ఇండియాలో 12 కేంద్రాలు నెల కొల్పాలని అభిలషిస్తున్నారు. అందులో 6 యిప్పటికే నిశ్చయించారు— మెహెరా బాద్, టోకా, నాసిక్, మద్రాస్, బైరమంగళ, మండ్ల. ఇవిగాక మిగిలిన ఆరింటికి స్థలములు చూడవలసి ఉంది. కార్వార్‌లోను బెల్గామ్‌లోను ఆశ్రమాలుంటే బాగుం టుందని— బాబా అభిప్రాయపడుతున్నారు. కార్వార్ కేంద్రానికి స్థల నిర్దేశం జరిగిందని చెప్పారు. బెల్గామ్‌లో స్థలం గురించి మాట్లాడవలసి యున్నది.

జబ్బల్‌పూర్ సమీపాన మండ్లలో కేంద్రనిర్మాణ పథకం వాయిదా పడినది. బైరమంగళలో పని చురుకుగానే సాగుతోంది. జూన్ నెలాఖరుకి ఒక భవనం సిద్ధను కావచ్చును. రెండవది యింకను రెండునెలలలో తయారగును.

జూన్ నెలారంభమునందు బాబా 'రెండు నెలల పాటు మెహెరాబాద్‌లో గానీ, లేక యింకెక్కడయినా గానీ, ఒక కొండమీద గానీ, ఒక గుహలో గానీ, ఏకాంతవాసం చేయాలని సంకల్పముందని' చెప్పారు.

బాబా మెహెరాబాద్ వచ్చినప్పటినుండి, బాబా యిదివరకు అనుకున్నట్లుగా

కొన్నిమార్పులు చేయించే పనిలో ఉన్నారు. పదినెలలుగా యిక్కడలేక, యిప్పుడు బాబా రావడం అనేక దర్శనార్థులకు సంతోషకారణం అయినది. ముందుగానే బాబా అనుమతి తీసికొని వారంతా వస్తామన్నారు. బాబా అంగీకరించారు కానీ, దర్శనం కాగానే-వెంటనే వారి యిళ్ళకు వెళ్ళిపోవాలని బాబా షరతుపెట్టారు.

ఆ ప్రకారంగానే బొంబాయి నుంచి నలభైమంది మే 15వ తేదీన బాబా దర్శనార్థం వచ్చారు. సామూహికంగాను ప్రత్యేకంగాను ఎవరికి ఎలా కావాలో అలా దర్శనం యిచ్చి బాబా వారందరినీ పంపించేసారు. ఈ కార్యక్రమం 3 గంటల కాలం పట్టింది. బాబా పనికోసం రమ్మన్నా వారుతప్ప, బాబా ఆ నెలలో యింకె వరినీ చూడలేదు. బైరమంగళ, నాసిక్ మొదలయిన ఆశ్రమములను సక్రమంగా ఉంచడం కోసం బాబా వారిశిష్యులను కొందరిని ఆయా ఆశ్రమములకు పంపిస్తూ ఉండేవారు. ఆధ్యాత్మికమయిన పనిలో బాబా వట్టిమాటలు గొప్పలు చెప్పనీయరు. పనిచేసి చూపించమంటారు. తోడి మానవులకు ప్రేమతో నిస్వార్థంగా సేవ చేయమంటారు. అలాంటి జీవనం అయన స్వయంగా జీవిస్తారు.

ఉదయం అయిదు గంటలకు ముందేలేచి కాలకృత్యాలు తీర్చుకొని, సన్నిహితులగు శిష్యులకు చెప్పవలసినవి చెప్పి, కావలసిన పనులు పురమాయించి, బయటకు ఎక్కడికైనా వెళ్ళవలసిన వారికి పనులు చెప్పి, ఉత్తరాలకి జవాబులు వ్రాయించి, అందులో అవసరమయిన వారికి సలహాలు హితవులు చెప్పి వ్రాయించి ఆ తరువాత బాబా బయలుదేరి మస్తు ఆశ్రమానికి మెహెరాబాద్ కొండమీదకు వెళ్ళేవారు. అక్కడ కొందరు మస్తులకు స్నానం చేయించడం 7 గంటలు మొదలు 8–30 వరకు అయ్యేది. ఆ తరువాత కొండదిగి, మండలి దగ్గరకు వచ్చి, మధ్యాహ్నం 12 గంటల వరకు ఉండేవారు. ఆ సమయంలో బాబా మట్టుకు ఆయన కేబిన్‌లో ఉండేవారు. అహమద్‌నగర్ నుంచి వచ్చిన శిష్యులను చూసి, వారికి చెప్పవలసినది చెప్పేవారు. మధ్యాహ్నం మరల మస్తు ఆశ్రమానికి వెళ్ళేవారు. కొంతమంది మస్తుతో ఏకాంతంగా గడిపేవారు. అక్కడ ఏంచేసేవారో ఆ మస్తుకీ బాబాకీ తప్ప యింకెవరికీ తెలియదు. భగవంతుని పిచ్చిలో నిజంగా పడ్డవారు యీ మస్తులు. వారి చైతన్యం మీద బాబా పనిచేస్తూ ఉన్నారు.

అప్పుడప్పుడు బాబా వారి పాశ్చాత్య శిష్యులను అక్కడి మండలి వారిని

సమావేశపరచి వారితో సరదాగా మాట్లాడడమో, ఏదయినా ఆధ్యాత్మిక ప్రవచనం చేయడమో జరుగుతూండేది.

ప్రతిరోజూ వచ్చే ఉత్తరాలు చదివించుకొని వాటికి జవాబులు వ్రాయించడమే ఒక పెద్దపని. ప్రపంచం నలుమూలల నుంచి వారియొక్క సలహాకోసం అనేకమంది వ్రాస్తారు. ఆ వ్రాసిన వారి మనస్సులను కుదుటపరచడానికి వారిని తృప్తి పరచడానికి ప్రతివారికి జవాబు అవశ్యంగా వెళ్ళేది. అనేకమందికి బాబా చెప్పిన ప్రకారం చేసినందువలన ఆపదలు తప్పాయి. అవి వారు ప్రకటించడానికి యిష్టపడనందున అవన్నీ రహస్యంగానే ఉంచబడ్డాయి. చాలా మట్టుకు అవి — వ్యక్తుల స్వంత విషయాలు. వారికి ఎటువంటి శాంతి, ఉపశమనము, లాభము కలిగినదీ వారు వ్రాసిన ఉత్తరాలను బట్టి తెలుస్తుంది. కొన్ని ఉత్తరాలు . బాబా అనుజ్ఞ తీసుకొని, ఆయనకు కార్యదర్శిగా ఉన్న దాదాబాన్‌జీ ప్రకటించాడు.

భగవంతుడు తప్ప యింకేదీ కావాలని కోరని వారినీ, దివ్య ప్రియతమునితో ఐక్యత తప్ప యింకేదీ కాంక్షించనివారి సహవాసం అంటే — బాబాకు చాలా యిష్టము. బాబా అటువంటి వారందరికీ తప్పక దర్శనం కలుగచేస్తారు. కొన్ని సమయాలలో వారివద్ద ఉండే మండలికే బాబాను కొన్ని రోజుల తరబడి చూడడానికి వీలుకాదు. మస్తు ఆశ్రమంలోని ఆధ్యాత్మికాభివృద్ధి చెందిన మస్తులకు సేవ చేయడంలో, బాబా ఎంత కాలమయినా ఉపయోగించారు.

జూన్ 1టవ తేదీ లగాయతు బాబా రెండునెలల పాటు ఏకాంతవాసం చేస్తానని చెప్పారు. మస్తు ఆశ్రమంలోనే ఒక గదిలో బాబా ఉండటానికి ఏర్పాటు చేసుకున్నారు. ఈ రెండు మాసాలూ బాబా ఎవరినీ చూడరు అక్కడ. వారితో నివసిస్తున్న శిష్యులతో కూడా మాట్లాడరు. అవసరమయినప్పుడు ప్రత్యేకంగా పని ఏదయినాఉంటే ఒకరిద్దరిని మాత్రం బాబా పిలుస్తారు. ఎక్కడికయినా దూర ప్రదేశానికీయిద్దరు ముగ్గురుశిష్యులను తీసికొని వెళ్తేవెళ్తానని కూడా బాబా చెప్పారు. బాబా రెండు నెలలు చేద్దామనుకున్నా ఏకాంతవాసం జూన్ మాసంలో పదిరోజుల్లో ముగించేసారు.

జూన్ నెల 3వ తేదీన బాబా యీ విధంగా సందేశం యిచ్చారు.

'ఈ నా పదిరోజుల ఏకాంతవాసంలో యీ యుద్ధం ఎంతకాలం ఉండాలో అది సరిగ్గా ఎప్పుడు అంతమవ్వాలో నిర్ణయిస్తాను. శాంతిరాజ్యం చేసేముందు నేను మాట్లాడేముందు, అసలయిన ప్రపంచయుద్ధం జరగాలి. అందులో నూటికి నూరుపాళ్ళు ఇండియా పాల్గొనాలి. మహమ్మదీయ రాజ్యాలయిన ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్, టర్కీ, ఈజిప్టు యివికూడా యుద్ధంలోనికి వస్తాయి. ఇటలీ, రష్యా, అమెరికాలు ముఖ్యమయిన పాత్ర వహిస్తాయి. పైన చెప్పినరీతి యుద్ధం కొనసాగితే నేను 1941 అగష్టులోనే మాట్లాడుతాను. అలాగయితే నేను కొందరు శిష్యులతో (స్త్రీలు, పురుషులు) రష్యా ఇండియా దేశాల సరిహద్దులో ఉన్న ఒక స్థలంలో ఒక సంవత్సరంపాటు ఉంటాను. లేకపోతే సముద్రంలోని ఒక ద్వీపంలో ఉంటాను. యుద్ధం కొనసాగకపోతే నేను సరిహద్దుకి వెళ్ళాలో, మరొకచోటుకి వెళ్ళి ఉండాలో ఆలోచించి నిశ్చయిస్తాను.

ప్రపంచయుద్ధం మీద, శాంతిమీద నేను మాట్లాడడం ఆధారపడి ఉంటుంది. 'శాంతి' అంటే సంధి కాదు. సంధి అవసరంగా జరుగవలసినది కాదు. సంధి నన్ను మాట్లాడేలాగ చేయదు. ఈ ప్రపంచయుద్ధం అయిపోయి శాంతి వచ్చేముందు నేను మాట్లాడుతాను. శాశ్వత శాంతి నెలకొనే ముందే నేను మాట్లాడుతాను.'

మండ్లలో నర్మదానదీ తీరాన్ని ఉన్న స్థలమునందు ఒక ప్రత్యేకమయిన ఆకారంలో ఒక నిర్మాణం జరిగినది.

నాగపట్నానికి చెందిన ఆరవ భూమికలోని మస్తు చట్టిబాబా యీ జూన్ మాసంలో ఒకనాడు— 'ప్రపంచంలో ఎంతోకష్టం, ఎన్నోక్లేశాలు కలుగుతాయి. చాలామంది అన్నంలేక చనిపోతారు. బాబా యీ ప్రపంచ బాధను తగ్గిస్తారు' అన్నాడు.

కృష్ణ అనే పరిచారకుడొకడు ఆ రోజులలో చట్టిబాబా వద్ద ఉండేవాడు అతనితో ఆ మస్తు ఒకనాడు— 'కృష్ణా ! ఏం? నన్ను వదిలి వెళ్ళిపోదామనుకుంటున్నావు కదూ? దానివల్ల నీకేం లాభం? ప్రపంచం అంతా బాబా శక్తికి లోబడి ఉంది. ఎక్కడికి పోగలవు? ఆయనను యిప్పుడే సేవించు. బాబా మహా సముద్రం వంటివాడు. ప్రజలంతా ఆయన దర్శనంకోసం ఎగబడినప్పుడు

నీవు ఆయనను కలుసుకునే అవకాశం అసలే పొందలేవు. అందుచేత యిప్పుడున్న 'అవకాశం పోగొట్టుకోకు.' అన్నాడు.

బాబా తమ మండలితో కూర్చుని ఒకనాడు యిలా ప్రసంగం చేసారు. 'తెలిసిగానీ, తెలియకుండా గానీ, నన్నుగుర్తించని వారిని, నా వద్దకు వచ్చి నా దర్శనం చేసుకోవడానికి యిష్టపడని వారిని, నిందించకండి. మీరు నిస్వార్థంగా పనిచేయండి. — పనియొక్క ఫలితము ఎలాఉన్నా మీరు చికాకు పొందకండి. పని మాత్రం యితోధికంగా చేయండి. దానివలన మంచి కలిగిందా అన్న బేరీజు మీరు వేయవద్దు. నా విధానాలు మీరు అర్థంచేసుకోలేరు. అది మీరు తెలుసుకోలేనంత నిగూఢంగానూ, మీకు అవగాహన కానంత అగాధంగానూ ఉంటాయి. అయితే ఆది ఎవరికీ అర్థం కానంత నిస్వార్థంగా ఉంటాయి. నా జీవితంలో కరుణలో అంతంలేదు. అనుగ్రహంలో అంతంలేదు. మంచి చేయటంలో పరిమితిలేదు. అయితే మీ పని సాగనివ్వండి. ఒక పెద్ద పథకంవేసి నేను పనిచేస్తున్నాను. అది ఒక్కటే ఉన్న అస్తిత్వాని కోసం, భగవంతుని కోసం, ఆత్మసాక్షాత్కారం కోసం ప్రజలను మేలుకొల్పుటయే.'

ఈ జూన్ నెలలో మస్తుపూల్‌వాలాను బెల్గాంకి, రాంశీష్ మస్తును మెంగుళూరుకి పంపించి వేసారు బాబా.

'బాబా మండలిలో ఒక రిటైర్డ్ గవర్నమెంటు ఆఫీసరు ఉంటే, అతనిని బెల్గాంకి రత్నగిరికి మెహెర్‌కేంద్రాలు నెలకొల్పడానికి అక్కడ కొన్నిస్థలాలుంటే అవి యెలాఉన్నాయో చూసి రమ్మని పంపించారు బాబా.

ఒక హిందూభక్తుడు బాబాను గురించి చెప్పాలని, బాబాయొక్క సత్యప్రేమ సందేశాలు వ్యాప్తిచేయాలని, అనుకున్న స్థలములన్నీ తిరిగిన తరువాత బాబాకు ఆ సంగతులు నివేదించడానికి మెహెరాబాద్ వచ్చాడు. ఆ సందర్భంలో నిజమైన నిస్వార్థసేవ అంటే ఎలా ఉండాలో బాబా వారి ప్రసంగంలో చెప్పారు.

బాబా మస్తు ఆశ్రమంలోని ఒక గదిలో ఏకాంతవాసం చేస్తూనే, బయటి వారి కెవరికీ తెలియకుండా జూన్ (1940) 12వ తేదీన మెహెరాబాద్ వదిలి పెట్టి నలుగురు శిష్యులతో తూర్పుదిశగా పయనమై వెళ్ళారు. ఎక్కడికి వెళ్తున్నదీ

కూడా బాబా తనతోవచ్చే శిష్యులకు తెలుపలేదు. తరువాత జరిగినదానిని బట్టి ఆధ్యాత్మికంగా గొప్ప అభివృద్ధిపొందిన యిద్దరు వ్యక్తులను సాంగత్యము చేయుటకై కలకత్తా వెళ్ళారు. బాబా— అని తెలిసినది. కలకత్తా వెళ్ళగానే వారిని కనుగొని వారి సాంగత్యం చేసారు. వారిలో ఒకరు స్త్రీ. ఈమెను మస్తానీమాయి అంటారు. ఈమె లావుగా ఉంటుంది. ఈమె ముఖం ముడతలుపడి ఉంది. 'ఆ ప్రాంతమున కంతటకు ఆమె వెలుగు చూపిస్తోంది, అన్నారు బాబా. పూనాలోఉన్న హజరత్ బాబా జాన్‌వలె యీమెకు కూడా జుట్టు తెల్లబడినది. ఆమె ఎడమ కంటితో బాగా చూడ లేదు. ఆమె ఒక రోడ్డుప్రక్కన మనుష్యులు నడిచే గట్టు మీద కూర్చునిఉంది. ఆమె మాటలు బాగా మాట్లాడుతుంది. మామూలు దుస్తులే ధరించింది. ఈమెను బాబా రెండుసార్లు కలుసుకున్నారు. బాబా ఆమెకు టీ, బిస్కట్లుకూడా యిచ్చారు. బాబా ఆమెకు డబ్బుయిస్తే అది ఆయనకు తిరిగి యిచ్చివేసింది. తరువాత కొన్నాళ్ళకు ఆమె మరణించినది.

## కరీం బాబా

రెండవ వ్యక్తికూడా ఒకరోడ్డు ప్రక్కన తన భక్తులతో కూడా ఉండగా కనిపించాడు. ఇతడు ఆధ్యాత్మికాభివృద్ధి చెందినవాడు. పదేళ్ళనుండి తన నివాస స్థలం వదలి బయటకుపోలేదు. ఒక్కమాటయినా యిన్ని సంవత్సరాలలో పలుకగా ఎవరూ వినలేదు. వీరుకాక యింకా కొంతమంది మస్తులను ఆ నగరంలో సాంగత్యం చేసారు బాబా. కానీ వీరిరువురే ప్రధానులు. ఈ మస్తుపేరు కరీం బాబా. కలకత్తా నుంచి బాబా రాంచీ చేరుకొని, 'అక్కడ వారు నెలకొల్పిన మస్తు ఆశ్రమానికి కరీమ్‌బాబాను తీసికొని రమ్మని' కాకాని కలకత్తా పంపించారు. బాబా మొదట కలకత్తాలో కరీమ్ బాబాని సాంగత్యం చేసినప్పుడు కాకా ఆయనతో ఉన్నాడు.

కలకత్తాలో కరీమ్ బాబా ఒక రోడ్డు ప్రక్కన గట్టుమీద గోడకి జేర్లబడి కూర్చుని ఉన్నాడు. అతడుకుళ్ళు బట్టలు ధరించి పాతడబ్బాలు, చెత్త, దగ్గర

కూడబెట్టుకుని ఉన్నాడు. ఇతడు ఒడ్డూ పొడుగూ ఉన్న ఆరవ భూమికలోని జలాలీ మస్తు. అతని మెడలో యినుప తీగలు వేసుకున్నాడు. (ఇత్తేఫాకే లక్షణం). అతడు కాళ్ళకి మణికట్టులకి, కాలిబొటన వ్రేళ్ళకు గుడ్డముక్కలు చుట్టుకొని ఉన్నాడు. గోళ్ళు కత్తిరించుకోకుండా పెంచుకున్నాడు. అతని జుట్టు యేమీ సంస్కారంలేక ఒత్తుగా నల్లగా చిక్కులు పడిపోయి జడలుగట్టి తలనిండా మకిలితో కూడుకొని ఉంది. అలాగే ఒత్తుగా నల్లని గెడ్డం కూడా పెంచాడు. శరీరము, శిరము ఎంత కుళ్ళుగా ఉన్నా, ముఖము నందు అసాధారణమయిన తేజస్సు వెలుగుతోంది. అతని నేత్రాలు నిశితమయిన దృక్కులతో ఎంతో ప్రకాశవంతంగా ఉన్నాయి. అందుచేత అతనిని చూసే వారెవరికయినా తమ కళ్ళు త్రిప్పుకోలేక అలాగే చూడాలని-అనిపిస్తుంది. అంత ఆకర్షణీయంగా ఉంటుంది అతని ముఖం. అదే స్థలంలో అనేక సంవత్సరాలనుంచి కూర్చుని ఉన్నాడు కరీమ్ బాబా మస్తు. కాకా వెళ్ళినప్పటికీ యిగా స్థితిలో ఉన్నాడు ఆ మస్తు. 'తనతో రమ్మనగా,' కరీమ్ బాబా ఊరికే నవ్వడం తప్ప 'వస్తాను, రాను' అని ఏమీ చెప్పలేదు. కాకా తన సామానులు పెట్టిన చోటుకివెళ్ళి, ఒకక్రొత్త కఫ్నీ, లుంగీ తీసికొనివచ్చి, సమీపంలోని హోటలులో ఉండే యిద్దరు మహమ్మదీయులను తనకు సహాయం చేయమని అడిగి , తనతో తీసుకొని మరల కరీమ్‌బాబా వద్దకు వచ్చాడు. కాకా ఒక టాంగాతెచ్చి సిద్ధంగా పిలవగానే తనవద్దకు రమ్మని టాంగావాలాతో చెప్పికొంచెం దూరంలో బండిని నిలిపాడు. కాకా వెళ్ళగానే కరీమ్ బాబా లేచినిలబడి అతడు తెచ్చిన లుంగీ కఫ్నీ యివ్వగా స్వీకరించి, వాటిని ధరింపజేస్తూంటే మాట్లాడకుండా ఆ బట్టలు కట్టుకున్నాడు. అప్పటికే దారేపోయేవాళ్ళు పదిమంది యేమి జరుగుతుందో చూద్దామని అక్కడ పోగయ్యారు. అనేక సంవత్సరాలనుంచి యిక్కడ ఉన్న యీ 'పిచ్చివానిని' యీ రోజున ఎవరో వచ్చి తీసుకు పోతున్నట్లుందే-అని వింతగా చూస్తున్నారు. క్రమంగా పాతికమంది మనుష్యులు పోగయ్యారు. టాంగాని పిలిచి అది దగ్గరగా వచ్చాక 'అందులో ఎక్కమని' కాకా కరీమ్ బాబాని అడిగాడు. కరీమ్ బాబా లేచి వెళ్ళి, బండిలోనికి ఎక్కడానికి కాళ్ళుపెట్టి బండిలోనికి ఎక్కేమెట్టుమీద కూర్చున్నాడు. కాకా, కూడావచ్చిన జనం యీ మస్తుని తీసికొని వెళ్ళడానికి ఏమయినా అభ్యంతరం పెడతారేమోనని భయపడ్డాడు గానీ వాళ్ళు చూస్తూ ఊరుకున్నారు. అంతే తరువాత పైకి ఎక్కి బండిలో క్రింద కూర్చున్నాడు. సీటుమీద కూర్చోలేదు. టాంగా రైల్వేస్టేషన్‌కి

తీసికొనివెళ్ళి అక్కడరైలు ఎక్కించాడు కాకా. బండితో కూడా వచ్చిన మహమ్మద్దీయ సహాయకులు టిక్కెట్టు కొని పెట్టారు. రైలు బయలుదేరగానే 'టికెట్ నికల్‌గయా ఔర్ గాడీ ఛుట్టీ' అన్నాడు ఎప్పుడూ మాట్లాడని కరీంబాబా.

ఇంతలో కరీంబాబా ఏమీ తోచనట్టు కనిపించాడు. అతడు లేచి గుమ్మం దగ్గరకు వెళ్ళాడు. అతడు దొడ్లోకి వెళ్ళాలని గ్రహించి అతనిని తీసికొనివెళ్ళి లోపల కూర్చోబెట్టాడు. కాకా అక్కడే గుమ్మం బయట నిలబడి ఉన్నాడు. కరీంబాబా కూర్చున్న చోటుపైన మలవిసర్జనచేసి, అందులోనుంచి మూడు నాలుగు అణా కాసులు యితరనాణాలు తీసి అవి శుభ్రంగా నీళ్ళుపోసి కడిగి, అ నాణాలను మరల నోట్లో వేసుకుని మింగివేసాడు. అందులో ఒకటి రెండు ఠాగినాణాలు కూడా ఉన్నాయి. ఇది అతని అలవాటని తరువాత తెలిసింది. రాంచీలో దిగి కాకా కరీంబాబాను తిన్నగా బాబావద్దకు తీసికొని వెళ్ళారు. జలాలీమస్తు అయిన యీ కరీంబాబాను కలకత్తానుంచి తీసికొని వెళ్ళడంలో కాకా ఒక గొప్ప పని సాధించాడని చెప్పాలి. మండలి యీ మస్తుని 'పెద్దపులి మనిషి' అనేవారు.

రాంచీ ఆశ్రమంలో ప్రత్యేకంగా ఒక చిన్న గదిలో కరీంబాబాను బస చేయించారు బాబా. అనేకమార్లు బాబా ప్రతిరోజూ అతని వద్దకువెళ్ళి కూర్చునేవారు. కరీంబాబా ఎప్పుడూ అసలు మాట్లాడేవాడు కాదు. ఇప్పుడు హఠాత్తుగా ఒక్కొక్క మాట ఉచ్చరిస్తున్నాడు. బాబా అతనివద్ద కూర్చున్నప్పుడు సంతోషంతో నవ్వుతూ ఉండేవాడు. పాటలు కూడా పాడేవారు. అర్ధరాత్రి వేళకూడా ఎప్పుడయినా ఎవరయినా లేస్తే, కరీంబాబా హాయిగా తనలో తాను పాడుకోవడం వినిపిస్తుంది. అతని కంఠం చాలా శ్రావ్యంగా కూడా ఉంటుంది.

బాబా రాంచీనుండి మెహెరాబాద్ వెళ్ళేటప్పుడు కరీంబాబాతో కూడా అక్కడ ఉన్న మస్తులందరినీ మెహెరాబాద్ తీసికొని వెళ్ళారు. మెహెరాబాద్ కొండ మీద వారందరికీ వసతి కల్పించారు.

1940, జూన్ 22వ తేదీన బాబా రెండు ముఖ్యమయిన సందేశాలను యిచ్చారు. అవి వారు పర్యటన ముగించి మెహెరాబాద్ రాగానే పంపించారు. మొద

టిది వారి శిష్యులకి, సన్నిహిత మండలికి ఉద్దేశించినది. రెండవది అందరికీ చెందుతుంది.

## మొదటి సందేశము

"ప్రస్తుతము ప్రపంచము నందున్న అవ్యక్తస్థితి విశ్వవ్యాప్తంగా ఉన్న బాధ, రాబోవు విశ్వవ్యాప్తమైన ఆధ్యాత్మిక అభ్యుదయము, శాంతి, ప్రేమ క్రొత్త ప్రపంచములో నెలకొనుటకు చాలా అవసరము. ఆధ్యాత్మికమైన సత్యముయొక్క దృక్పథమును బట్టి ఆలోచిస్తే జాతీయత, విదేశీయత, చంపబడినవాడు,చంపువాడు యుద్ధము, శాంతి, జయము అపజయము యీ మాటలకు అర్థంలేదు. ఎందుచేతనంటే రూపయుక్తమైనట్టి ద్వంద్వాలతో నిండియున్న యీ ప్రపంచమునకు ఉనికి లేదు. ఇదంతా ఊహ జనితము. ఒక స్వప్నము లాంటిది. ఇప్పటి యీ విశ్వవ్యాప్తమయిన అవ్యక్తస్థితి ఒక విధమయిన సంకట పరిస్థితి. ఇది నిజముగా విశ్వవ్యాప్తమయిన జాగృతికి అవసరము.

శరీర రూపాలు మనస్సులు అసంఖ్యాకముగా ఉన్నాయి. అవి అనంత విధాలుగా ఉన్నాయి. కానీ ఆత్మలు అన్నీ మొదటినుంచి ఎప్పటికినీ ఒకటే. నిజముగా అనంతమైన సత్యమే ఉన్నది. అదే భగవంతుడు. పైకి కనిపిస్తున్న యీ ప్రపంచం మహా విపత్తు దైవేచ్ఛ ప్రకారం అచిరకాలంలోనే కాబోవు దివ్యప్రకటీకరణ కొరకు అవసరమే. ప్రేమను నిజమైన శాంతిని ఆ ప్రకటీకరణలో కలుగజేయుటకు నేను ముఖ్యపాత్ర వహిస్తాను. నా పాత్రను నిర్వహించుటలో నా స్త్రీ పురుష శిష్యమండలి వారు, వారి వారి పాత్రలు నిర్వహించి నాకు సహాయం చేయాలని కోరుతున్నాను.

నా ప్రస్తుత విశ్వాత్మకమయిన భారమును మోయుటలో ఎవరయితే పాలు పంచుకొనుటకు యిష్టపడి సంసిద్ధులయి ఉంటారో, వారు నా యీ క్రింది ఆజ్ఞను అక్షరముల పాటించాలి.

యుద్ధము యీ సంవత్సరం అంతమయినా వచ్చే సంవత్సరం అంతమయినా దైవేచ్ఛ ప్రకారం అన్నీ జరుగును. గనుక శాంతి యిప్పుడు లభించినా, పై సంవత్సరం లభించినా ఆగష్టు 1టవ తేదీ మొదల్లు 31 జూలై 194 వరకు1

నేనెక్కడికి పంపితే అక్కడికి వెళ్ళి, ప్రాణత్యాగానికైనా సిద్ధపడి నేను చెప్పినట్లు పని చేయాలి...''

## రెండవ సందేశము

ఇందులో మొదటి సందేశంలోని కొన్ని భాగాలు తిరిగి వచించారు బాబా.

''రాబోయే ఆధ్యాత్మికోద్ధరణకు శాంతి, ప్రేమ, దివ్యమైన ఆశలతో వెలిసే నూతన ప్రపంచానికి ప్రస్తుత ప్రపంచములోని సంకులస్థితి, సందిగ్ధావస్థయును అవసరమై ఉన్నాయి. అందుచేత తప్పక వచ్చే ప్రకాశవంతమయిన భవిష్యత్తును మనసులో పెట్టుకొని ప్రస్తుత స్థితిని చూచి ఎవరూ బెదిరిపోకూడదు ఎవరూ దిగులు చెందకూడదు.

ఆధ్యాత్మిక మయిన సత్యము యొక్క దృక్పథమును బట్టి జాతీయత, విదేశీయత, హత్య చేయబడినవాడు, హంతకుడు, సంగ్రామం, శాంతి, జయము— అపజయము— అనేవి లేనేలేవు. ఇవి ఊహాజనితమయిన కలలు మాత్రమే. ఇప్పటి యీ సంకులస్థితి లోకము జాగృతి కావడానికి అవసరమయిన సంకటమే. శరీర రూపములు మనసులు అసంఖ్యాకముగా ఉన్నాయి. అవి అనంత విధాలుగా ఉన్నాయి. కానీ ఆత్మలన్నీ మొదటి నుండి శాశ్వతంగా ఒకటే అయిఉన్నాయి. నిజంగా అనంత మయిన సత్యము ఒక్కటే ఉంది. అదే భగవంతుడు. కావున పైకి కనిపించే ప్రపంచ మహా విపత్తిస్థితి సన్నిహిత భవిష్యత్తులో జరుగబోవునది. నేను ముఖ్యపాత్ర వహించెడి ప్రేమ నిజమైన శాంతి కలిగించెడు దివ్యప్రకటీకరణకి అవసరమే.

ప్రపంచమందలి స్త్రీ పురుషులు నా పనిలో పాల్గొనదలచినట్లయితే, ఏ రూపంలోను శతృత్వ భావాన్ని చూపక, కామప్రేరితమయిన భావాలనుండి పరిశుద్ధ మయిన శీలసంపదను కాపాడుకుంటూ, మంచి నడవడి కలిగి ఉండడానికి శాయ శక్తులా ప్రయత్నించెదరు. భయాలకి లొంగిపోక, అసత్యము పరోక్షమందు నిందా రోపణము అను బలహీనతలకి తావివ్వక స్వంత పోట్లాటలలో ఎవరిమీదా (బలహీనులను రక్షించుటకు తప్ప) పడకుండా ఉండడం— అందులోనూ ద్వేషం లేకుండా ఉండటం, దివ్య ప్రేమమీద ప్రతిరోజూ మనస్సులను కొంతసేపు లగ్నం చేయడం, వ్యక్తుల పరిస్థితులను బట్టి పాలు— నీళ్ళమీదగానీ, ఒంటిపూట భోజనం చేసి

గానీ– వారానికొకసారి ఉపవాసం చేయడం, యీ విధంగా 12 మాసాలు– 1940 ఆగస్టు 1టవ తేదీ మొదలు 31 జూలై 1941 వరకు జరపాలి. ఈ సంవత్సర కాలం నేను ఏకాంతవాసం చేస్తాను. మిక్కిలి అవసరమయిన తీవ్ర విషయాలలో టెలిగ్రాంలు తప్ప ఉత్తరాలు ఏవీ చూడబడవు.

ఈ రెండవ సందేశం జాతి కులమత భేదాలు లేకుండా ప్రపంచమందు అందరికి ఉద్దేశింపబడినది.

రెండు సందేశాలలోను కూడా క్రొత్తయుగం ప్రారంభించడానికి ప్రపంచ మందు నిజమైన శాంతి స్థాపన చేయాలంటే యిప్పటి సంకట పరిస్థితి చాలా అవసరం. ప్రతీ కొన్ని వందల సంవత్సరాల కాలంలోను ఒక ఆధ్యాత్మిక విప్లవం చెలరేగుతుంది. పాతపద్ధతి మారిపోతుంది. విశ్వాత్మకమయిన ఆధ్యాత్మికపునరుద్ధరణ ప్రారంభమై నూతన యుగస్థాపన జరుగుతుంది. ప్రస్తుతం ప్రపంచం క్లిష్ట మయిన అవతార యుగంలో ఉంది. ఈ నవయుగ స్థాపనకు పూర్వం ఎల్లప్పుడూ అసాధారణము, వినాశకరము అయిన సంఘటనలు ప్రపంచమునందెల్ల యెడల జరుగగలవు. శక్తివంతములయిన పెద్దపెద్ద భూకంపాలు, జనబాహుళ్యాన్ని పీడించే రోగాలు,ఈతిబాధలు,ప్రపంచవ్యాప్తంగా అనేకలక్షల మానవుల ప్రాణాలుపోయే బ్రహ్మాండ మయిన వినాశన హేతువులయిన యుద్ధాలు సంప్రాప్తమవుతాయి. ఈ పరిస్థితులలో శరీరానికి శస్త్ర చికిత్స అవసరమయే ఒక జబ్బుతో చాలాకాలం బాధ పడుతూన్న ఒకరోగితో ప్రపంచాన్ని పోల్చవచ్చును. ఆ రోగికి ఆ చికిత్స ఎంత బాధకరమయినా అది అయిన తరువాత ఎంత ఉపశమనం కలుగుతుందో అంత బాధా ఆ చికిత్సకు ముందు అనుభవించాలిసిందే కదా– అని బాబా చెప్పారు.

బాబా ఏకాంతవాసం చేస్తున్నారంటే ఆయన విశ్రాంతి గైకొనడానికి ఎంత మాత్రమూ కాదు. ఆయన మాటలాడే కంటే ఆయన మౌనము ఎంతో శక్తి వంతమయినది. ఆయన ఏకాంతవాసంలో అయనచేసే ఆధ్యాత్మికపు పనులు ఎంతో తీవ్రంగా, ఎంతో ఒత్తిడి కలిగించేవిగా ఉంటాయి,

మండలికి బాబా శిష్యులకు యిచ్చిన సందేశం బాబా 240 మందికి పంపించారు. అందులో ప్రతి ఒక్కరూ కూడా బాబాకు విధేయత తెలుపుతూ

'వారు చేయమన్నట్లుగా చేస్తామని ఆయన చేసే మహత్కార్యంలో పాల్గొంటామని' వ్రాతమూలకంగా తెలియపర్చారు.

మొదటి నుండియు బాబా చెప్పిన ప్రకారం ఉపవాసాలు మౌనాలు చేసిన ఆయన శిష్యులు ప్రపంచోద్ధరణ కార్యంలో పాల్గొనడంకోసం తయారవడంలో ఒనర్చిన కృత్యాలు, ఇట్లువారు తయారయి ప్రాణాలనయినా బాబా చెప్పినవెంటనే వదలి వేయడానికి సంసిద్ధులయారు. వారి వారి కార్యాలలో బాబా అంతరంగంగా వారికి తగిన బలాన్ని ప్రోత్సాహాన్ని యిస్తుంటారు. 'మతము అంతమవడానికి దేవుడు రావడానికి యిది సమయం' అని బాబా ఒకమారు అన్నారు.

కలకత్తాలో పని ముగించుకొని బాబా రాంచీకి బయలుదేరి వెళ్ళారు. అక్కడ ఒకరోజు మాత్రం ఉండి బాబా మెహెరాబాద్‌కి వస్తూ వారు తిరిగి వచ్చేవరకు ఉండమని యిద్దరు శిష్యులను రాంచీలో ఉంచారు. బాబా మెహెరాబాద్‌కి జూన్ **22**వ తేదీకి చేరుకున్నారు.

1940 జూన్ 23వ తేదీన ఉపాసనీమహరాజ్ యొక్క 70వ జన్మదినం. ఆ రోజున బాబా ఒక ప్రత్యేక కార్యక్రమం జరిపించమని ఆదేశించారు. ఇటు వంటిది మెహెరాబాదులో జరిపించి 12 సంవత్సరాలయినది. ఈ సారి బాబా విఠోభా మందిరంలో సప్తాహం చేయించమన్నారు. ఈ మందిరం మెహెరాబాద్ వద్దనే ఆరంగావ్‌లో ఉంది. అది కాకుండా మహరాజ్ పుట్టినరోజు నాడు (23వ తేదీన) ఒక భండారా (విందు) ఏర్పాటు చేయించారు బాబా. అందులో ఆరంగావ్ గ్రామీణులంతా పాల్గొన్నారు. ఆ గ్రామీణులలో పేదవారు 'అంటరాని' వారు అంతాఉన్నారు. వీరిని మాత్రం బాబా ఎప్పుడూ మరువరు. 'ఇంకొక పుట్టినరోజు మహరాజ్ యింకచూడ రన్నారు' బాబా. అందుకే యిది యింత ఘనంగా చేసారేమో. 'వచ్చే మే మాసం 29వ తేదీన ఉపాసనీ మహరాజ్ పరమ పదం చెందుతారని' బాబా చెప్పారు.

డా. దేశ్‌ముక్ వేసవికాలం సెలవులకి నాగపూర్ నుంచి మెహెరాబాద్ వచ్చాడు. అతనికి బాబా ఒక ఉపన్యాస పర్యటన కార్యక్రమం ఏర్పాటుచేసి 'దక్షిణ మహారాష్ట్రంలో తిరగమని, పని చేయమని' బాబా పంపారు.

మెహెరాబాద్ నుంచి మరల 45 గురు శిష్యుల మండలితో బయలుదేరి పర్యటన చేయడానికి బాబా ఏర్పాట్లు ప్రారంభించారు. వారిలో పాశ్చాత్యులు కూడా ఉన్నారు. ముగ్గురు మస్తులు ఉన్నారు. తూర్పు దేశాలకి యీ మధ్య వెళ్ళలేదు గనుక, ఒకే నెలలో రెండుసార్లు అటు పయనమై వెళ్ళారు.

బాబా జూలై 3వ తేదీన యీ బృందంతో బయలుదేరారు. వేయి మైళ్ళు మూడవ క్లాసు రైలుపెట్టెలో ఎంతో ప్రయాసతో ప్రయాణంచేసి జూలై 5వ తేదీకి రాంచీ చేరుకున్నారు బాబా. రాంచీ బీహార్ రాష్ట్ర ప్రభుత్వంవారి వేసంగి రాజధాని. బాబా అక్కడికి వెళ్ళినది లగాయతు వర్షం కురుస్తూనే ఉంది. చలి ఎక్కువుగా వేస్తోంది. బాబాకు మస్తులతో పని చాలా ఎక్కువగా ఉంది.

బాబా బెంగుళూరు వెళ్ళినప్పటినుండి మస్తు ఆశ్రమం రెండు భాగాలుగా విభజించారు. రాహూరిలో ఉన్న పాతవారి కొకటి క్రొత్తవాళ్ళ కొకటి. క్రొత్తగా వచ్చిన వారితో పని అయిన వెంటనే బాబా వారికి ఆధ్యాత్మికంగా ఒక మెట్టు పైకి ఎక్కించి వదిలేవారు. మిగిలిన వారితో ఆధ్యత్మికమైన పని గాఢంగా చేయ వలసి దగ్గర ఉంచుకున్నారు.

దక్షిణదేశం నుంచి తీసికొనివచ్చిన మస్తులలో కొందరిని— చట్టిబాబాలాంటి వారిని ఎన్నుకొని బాబాతో చాలాకాలం ఉంచుకున్నారు. అందులోఫూల్‌వాలా అనేవాడొక డున్నాడు. ఇతడు పువ్వులతో కిరీటంలా తయారుచేసి తలమీద పెట్టుకునే వాడు. అందుచేతనే అతనికా పేరు వచ్చినది. రాజఠీవితో యితడు మెలగేవాడు. చుట్టుప్రక్కల ఉండేవారికి చక్కెర పంచి యివ్వమని ఆదేశించగానే— అక్కడి మండలి అలాగే చేసేవాళ్ళు. అతనితో పని అయిపోగానే బాబా ఫూల్‌వాలాని జూన్ నెలలో పంపించి వేసారు.

చట్టి బాబా అనే మస్తు యింకా బాబా వద్దనే ఉన్నాడు. అతడెప్పుడూ శాంతంగాను, నవ్వుతూ ఉంటాడు. చట్టిబాబా ఎవరయినా క్రొత్తవారు వస్తే సిగ్గుతో ఒక మూలకి వెళ్ళి దాక్కునేవాడు. అతనికి ఏకాంతముగా ఉండడమే యిష్టం. అతని అనందంలో అతడు ఏదో అనుకుంటూ ఉండేవాడు. అతని శాంతికి

ఎవరయినా భంగం కలిగించిన యెడల యింక కొన్ని గంటలవరకూ చెప్పినమాట వినేవాడు కాదు.

షరియత్ అని యింకొకడుండేవాడు. గంటలకొద్దీ వాగుతుండడమే అతనిపని. ఆ వాగేదాంట్లో ఒక్కొక్కప్పుడు ఎంతో అర్థం ఉంటుంది. ఆ మాటలు వింటే ఒక్కొక్కమారు తమాషాగా ఉంటాయి. మహామ్మద్ మస్తు బాబా ఎక్కడికి వెళ్ళినా కూడా ఉండేవాడు. ఈ పర్యటనలో యీ ముగ్గురూ కూడా—చట్టిబాబా. షరియత్ ఖాన్, మహమ్మద్-బాబాతో ఉన్నారు. ఇంకొకడు కరీంబాబా. ఇతడు చాలా అరుదయిన రకం. కరీంబాబా ఆధ్యాత్మికంగా ఎక్కువుగా అభివృద్ధిచెందినవాడు. ఇతని గురించి యిదివరకే పాఠకులకు తెలియజేశాం. కొన్ని సంవత్సరములుగా యితడు మాట్లాడేవాడేకాదు. బాబా సాంగత్యం కలిగిన నాలుగురోజులకే యితడు మాట్లాడడం ప్రారంభించాడు. 'బాలోన్మత్త పిశాచవత్' అని వర్ణించినట్లుగా ఉండేవాడు. రామకృష్ణ పరమహంసకి ఆత్మసాక్షాత్కారం కలిగే ముందు యిలాగే ఉండేవాడని వివేకానందుడు వర్ణించాడు. ఈ మస్తులందరినీ బాబా నిరంతరము కనిపెడుతూ తన పర్యవేక్షణలో ఉంచేవారు. బాబా స్వయంగా వారికి భోజనం తినిపించేవారు. వారిని అంతరంగ సాంగత్యం చేసేవారు. బాబా వారితో ఉన్నప్పుడు పైవాళ్ళని ఎవరినీ రానిచ్చేవారు కాదు. రాంచీలో ఉన్నప్పుడు చట్టిబాబా, కరీం బాబాలను జాగ్రత్తగా ఎప్పుడు ఏంకావాలో కనిపెట్టి చూసేవారు బాబా. ఆరవ భూమికలోని జిలాలీమస్తు అయిన కరీంబాబాతో సాంగత్యంవలన బాబా తూర్పు దేశాలతోనే సాంగత్యం స్థాపించారు

రాంచీ వచ్చిన మరునాడే బాబా తమ మండలికి సన్నిహిత శిష్యులకు కొన్ని ఆదేశాలు యిచ్చారు. ''అందులో 31 అంశాలున్నాయనీ, అవన్నీ తు— చ— తప్పకుండా శిష్యులు ఆచరిస్తే ప్రపంచ కార్యంలో పాల్గొన్నవారవుతారని'' బాబా అన్నారు. వీటిలో ఉపవాసము, ఏకాంతవాసము, మౌనము, మత్తు కలిగించే పదార్థాలను, పుగాకును— ఏ రూపంలోను కూడా— ఉపయోగించకుండా ఉండడము బహిరంగ వినోదాల్లో పాల్గొనకుండడం ఉన్నాయి. కొంతమందికి మాత్రమే చదువన, వ్రాయను కూడా బాబా వద్దన్నారు. స్త్రీలతో సాంగత్యం విషయంలో కఠినమైన నియమాలు విధించారు బాబా. వివాహమయిన దంపతులు కూడా వాటిని వర్తింప

చేసారు, ఇటువంటి కఠిన నియమాలు సాధారణంగా బాబా విధించారు. ఇవి ప్రపంచానికి దూరంగా ఆశ్రమాలలో ఉన్నవారికే గాక, ప్రపంచంలో ఉండి వారి కుటుంబాలతో కాపురం ఉన్నవారికి కూడా వర్తించేటట్లు— బాబా విధించారు. ఈ ప్రకారంగా ఒక నెలరోజులు కఠినంగా ఆచరించాలి. బాబా శిష్యులు కానివారు కూడా చాలామంది ఐచ్ఛికంగా 'యీ ప్రకారంగా ఉంటామనీ, యీ నియమాలలో వీలయినన్ని ఆచరిస్తామని' ఒడబడ్డారు. అందులకు బాబా అంగీకరించారు. బాబా రాంచీ నుంచి జూలై 19వ తేదీన మెహెరాబాద్‌కి వచ్చారు.

మస్తు ఆశ్రమం అరంగావ్ గ్రామ పొలిమేరలో ఉండేది. బాబా ఏకాంత వాసంలో ఆగస్టు మాసం నుంచి మెహెరాబాదు కొండమీద ఉంటున్నారు. గనుక ఆ ఆశ్రమం అక్కడినుండి కొండమీదకు ఆయనకు దగ్గరగా పెట్టించారు. అందుకొరకు బాబా యిదివరలో కరీంబాబా ఉన్న గదిలోనికి మారవలసి వచ్చింది. పిచ్చివారు, మస్తులు మొత్తం యిరవైమందికి కొండమీద బసలు ఏర్పాటు చేసారు. ఇప్పుడు బాబా ఉన్నది 12 అడుగుల పొడవు 6 అడుగుల వెడల్పు మాత్రం ఉన్నచిన్న గది.

ఈ గది చాలా చిన్నది గనుక యిబ్బందిగా ఉంటుందేమో అంటే 'నాకు మస్తులు దగ్గరగా ఉండాలి అందుచేత యీ చిన్నగదిలోనే ఉంటానన్నారు బాబా. మస్తులతోచేస్తున్నపని ఆఖరికి వచ్చింది. నేను యిప్పుడు వారి దగ్గర ఉండడం చాలా ముఖ్యం. ఈ సెప్టెంబరు మధ్యలో కొంతమందిని వారిపని అయిపోగానే పంపేయ దలచు కున్నాను. తరువాత అలాగే మిగిలిన వారిని పంపేస్తాను. సెప్టెంబరు నెలాఖరుకి మస్తులెవరూ ఉండక్కరలేదు. ఒక్క మహమ్మదు, చట్టిబాబా యింకా ఒకరిద్దరు తప్ప, ఆ ప్రకారం గానే బాబా మస్తులతోపని అయిపోయిన వెంటనే సెప్టెంబరు నెలలోనే రెండుమూడు మార్లుగా వారందరినీ ఆశ్రమం నుంచి పంపించేసారు. ఒక్కొక్క బృందంతోనూ మండలిలో ఒకరు కూడా వెళ్ళారు. బాబా, వారికి కావలసిన ఆహారము వగైరా ఏర్పాట్లు ఎలా చేయాలో, అతనికి అన్నీచెప్పి వారిని అప్పగించారు. ఒకబృందం నాసిక్‌కి, ఒక బృందం బొంబాయికి వెళ్ళారు. వారిని కూడా తీసికొని వెళ్ళిన బాబా శిష్యులు వృద్ధులే. ఇద్దరూ కూడా బాబా ఆజ్ఞ ప్రకారం మౌనం వహించి యున్నారు. వారిద్దరిలో ఒకడు మాజీ. బాబా మేనమామ. అతనికి 70 సంవత్సరాలుంటాయి. రెండవవాడు కాలేమామా అని 60

సంవత్సరములు వయస్సుగల ఒక రిటైర్డ్ సివిల్ ఇంజనీరు. బాబా వద్ద చాలా సంవత్సరముల నుంచి ఉన్నాడు. ఇద్దరికీ బాబా అంటే అమితమయిన భక్తిశ్రద్ధ లున్నాయి. ఈ ఆశ్రమం ఎత్తివేయడంతో బాబా కార్యాచరణలో ఒక ప్రధాన ఘట్టం ముగిసింది. ఈ ఆశ్రమం నాలుగు సంవత్సరములు నడిచింది,

మన్మాడ్ వద్ద అంకాయి కొండల్లో తమ ఆదేశానుసారం కొంతమంది శిష్యులు ఏకాంతంగా ఉండగా, వారిని యిప్పుడు మెహెరాబాద్ రప్పించారు బాబా. వారిని మస్తులు ఖాళీచేసిన స్థలాల్లో అరంగావ్ గ్రామ పొలిమేరల్లో ఉన్న పాకలలో ఉండమన్నారు. అంకాయి కొండలమీద ఉన్నట్లుగానే మౌనము, ఉపవాసము, ఏకాంత వాసము వారికి విధించారు బాబా. మెహెరాబాద్ నుంచి బాబా వేరే పనిమీద వెళ్ళినా వీరిని మాత్రం అక్కడే ఉండమని ఆదేశించారు. ఎటువంటి పరిస్థితుల లోను కూడా వారిని ఆ ఆవరణ విడిచి బయటకు రావద్దని బాబా అజ్ఞాపించారు. రత్నగిరి (రాజపుతానా) తరువాత సిలోనుకి బాబా తమ పనిమీద వెళ్ళాలని చెప్పారు. అక్కడ ఆరునెలలు ఉండవలసి వస్తుందన్నారు. అందుచేత ఆయా స్థలములలో బాబాకు ఉండదగిన బసలకోసం ఉత్తరాలు వ్రాయడం ప్రారంభమయినది. బాబాతో పాశ్చాత్యులు కూడా కలిసి 35, 40 మంది మండలి వారుంటారు. వారందరి భోజనాలకు వసతులకు ఏర్పాట్లు చేయాలి. వీరంతా ఎక్కడ ఉన్నా, బాబా ఎక్కడ ఉన్నా ఏకాంతం సాగుతూనే ఉంటుంది. ప్రయాణంలో గానీ, వెళ్ళిన చోటగానీ బాబా ఎవరినీ చూడరు. ఉత్తరాలు కూడా చూడరు. మిక్కిలి అవసరమయిన టెలిగ్రాంలు మాత్రం చూస్తారు. శిష్యులతో పాటు నియ మాలను పాటిస్తున్న యితరులను కూడా అట్లే సాగించమని చెప్పారు. 'ఈ క్లిష్ట పరిస్థితిలో తాము కావింపబోయే ఆధ్యాత్మిక కార్యమునకు మీరందరు యీ మాదిరి నియమాలను పాటిస్తూఉంటే సహాయకారిగా ఉంటుందని' బాబా చెప్పారు. 'ఈ ఆదేశాలను తేలికగా తీసుకోవద్దని మిక్కిలి కఠినంగా పాటించాలని' బాబా తెలిపారు. ఏకాంతవాసంలో మొదటి నెల శాంతంగానే గడిచింది. బాబా బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా ఉంటున్నారు. టెలిగ్రాము లేవో కొద్దిగా వస్తే వాటికి జవాబులివ్వడం తప్ప బయటప్రపంచంతో యింక ఏపనీ పెట్టుకోలేదు బాబా. ఈ తంతులు వచ్చినప్పుడు ఫలానా సమయంలో తీసుకురావాలని ఒక శిష్యుని నియమించారు. ఆ శిష్యునితప్ప యింకెవరినీ బాబా చూసేవారు కాదు. ఈ శిష్యుని

పేరు విష్ణుమాస్టర్, ఇతడు చాలాకాలం నుండి బాబా మండలిలో ఉంటున్నాడు. బాబాకు యితడొక అంతరంగిక కార్యదర్శి. ఇదిగాక యితడు బజారు పనులుకూడా చూస్తుంటాడు.

బాబా వద్ద యిప్పుడున్న నలుగురు మస్తులతోను వారి ఆవరణలోనే వారితో పని జరుగుతూ ఉంది. వీరితో చేసే ఆధ్యాత్మికపు పనికోసమే బాబా వారికి స్నానం చేయించడానికి, భోజనం తినిపించడానికి వారితో ఒక్కొక్కరితోను ప్రత్యేకమైన అంతరంగిక కార్యము నిర్వహించడానికి తప్ప, బాబా వారిగదివిడిచి బయటకు రావడం లేదు. ఈ నలుగురిలోను ఒకడయిన కరీంబాబాను ఆగష్టు 18వ తేదీన కలకత్తాకు పంపించేసారు.

నియమబద్ధమైన జీవితం బాబా ఆదేశం ప్రకారం జరిపే వారికి బాబా అంతరంగంగా సహాయం చేస్తుంటారు. బాబా వద్ద ఉండే శిష్యుల అనుభవాలు వినడానికి ఎంతో ఆశ్చర్యజనకంగానూ అద్భుతంగానూ ఉంటాయి. ఇప్పుడయితే వారు అంతా తీవ్రమయిన శిక్షణలో ఉన్నారు.

వారు ఆగస్టు 1, 1940 నుండియు ఏకాంతంగా ఉంటూ, వారితో పాటు ముగ్గురు శిష్యులను కూడా ఏకాంతంగా ఉండమని- ఆజ్ఞాపించారు. వారిని అంకాయి కొండల్లో ఒక గుహలో ఉండమన్నారు. అవి డోండ్ నుంచి మన్మాడ్ వెళ్ళే రైలు మార్గంలో మన్మాడ్ జంక్షన్‌కి పదిమైళ్ళ దూరంలో ఉన్నాయి. ఈ స్థలం ఆధ్యాత్మిక వాతావరణంతో నిండిఉందని బాబా చెప్పారు. 'పూర్వం అగస్త్య మహాముని అక్కడ తపస్సు చేసినందువలన యిప్పటికీ అధ్యాత్మిక తరంగాలు ఆ స్థలం అంతా నిండి ఉన్నాయని' బాబా చెప్పారు. కొంతకాలం పాటు ఉపాసనీ మహారాజ్ యీ కొండమీదే ఉన్నాడు.

బాబా అక్కడ ఉండమన్న ముగ్గురు శిష్యులు శీతవాతా తపాలకు జడవకుండా మౌనంగా ఉండమనీ— బాబా ఆదేశం. ఈ ముగ్గురిలోనూ పెద్దవాడు చాలాకాలం నుండి బాబా వద్ద ఉన్నవాడు గుస్తాద్‌జీ. ఇప్పటికి అతడు బాబా విధించిన ప్రకారం 14 సంవత్సరాల నుంచి మౌనం వహించి ఉన్నాడు. గుస్తాద్‌జీ యింత వరకు ముగ్గురు గురువుల దగ్గర ఉన్నాడు. షిర్డీసాయిబాబా వద్ద, అక్కడి నుంచి

వచ్చి ఉపాసనీ మహరాజ్ వద్ద, అక్కడి నుంచి వచ్చి యిప్పుడు మెహెర్ బాబా వద్ద ఉంటున్నాడు. ఆ గురువులే రెండవ వారి వద్దకు వెళ్ళమని అతడిని పంపించారు. వారివద్ద ఉన్న కాలంలో ఎంతో కఠినమయిన యమ నియమాది విధులు వారి ఆజ్ఞ ప్రకారం పాటించాడు.

రెండవ వాడు ప్లీడరు. ఇతడిని కొన్ని సంవత్సరముగా బాబా ఎన్నో కఠిన పరీక్షలకు గురి చేసారు. మౌనవ ఏకాంతము వహించి చాలాకాలం ఉన్నాడు. ఒక మారు ప్లీడరుని ఒక గదిలో పెట్టి తాళం వేసేసారు బాబా. అందులో ఉన్న ప్లీడరు చదవకూడదు. వ్రాయకూడదు. తరువాత ఇండియా అంతా తిరిగి యాత్ర చేయమన్నారు. తన ఆహారం కోసం భిక్షమెత్తమని చెప్పారు. ఇలా భిక్షమెత్తుకుని తింటూ కొంతమంది సాధువులను దర్శనం చేయమని బాబా ఆదేశించారు. బాబా యొక్క సహకారము చేత, ఆయన కటాక్షము చేత, యీ యాత్ర పూర్తి చేయాలి, కానీ సాధారణంగా అటువంటిది సాధ్యంకాదు.

మూడవ శిష్యుడు ఒక బెంగాలీ యువకుడు స్వామి భవానంద్. ఇతడు క్రిందటి సంవత్సరమే బెంగుళూరులో మెహెర్ బాబాను సాంగత్యం చేసాడు. ఆయన ఆదేశానుసారం యీ స్వామియే రామేశ్వర యాత్ర చేసుకొని వచ్చాడు. ఇంకొక యిద్దరు శిష్యులు ప్రాపంచిక జీవితానికి స్వస్తిచెప్పి బాబా ఆశ్రమంలో చేరారు. వారిని కూడా యీ ముగ్గురు శిష్యులతోను అంకాయి కొండల గుహల్లో ఏకాంతంగా ఉండమన్నారు. ఈ యిద్దరిలోనూ ఒకణ్ణి ఒక్క సంవత్సరం మౌనంగా ఉండమన్నారు బాబా.

ఇప్పుడు, సాగుతున్న యుద్ధానికి సంబంధించిగానీ, ప్రపంచ రాజకీయాలకి సంబంధించి గానీ — బాబా యొక్క ఉద్యమం ఎంతమాత్రమూ కాకపోయినా, యీ యుద్ధములో గానీ యితరత్రా కానీ మానవాళి పడే బాధలలో పాలు పంచుకునేందుకు, బాబా తాము స్వంతముగా మౌనము, ఉపవాసము, ఏకాంతవాసము చేసి, ఆయన శిష్యులచేతకూడా చేయించి, వారికి చిరకాలంగా కొన్ని అవసరాలమీద ఆధారపడే జీవితాన్ని మార్పుచేసి, ఆ అవసరాలు లేకుండా కొన్ని త్యాగాలుచేసి, జీవితాన్ని మార్చుకొని బాధలుపడుతున్నారు.

ఈ శిష్యులకు బాబా విధించిన తీవ్రనిబంధనాయుత జీవనం చూస్తే, మెహెర్‌బాబా ఒక ఆచార్యుడుకాదు. ఆయన ఆధ్యాత్మికంగా కఠినంగా నియమాలను విధించి జీవింపచేసే నియంత-అని అనిపిస్తోంది. ఎలాంటి కష్టమైనా సహించి ఆత్మగుణాలను పోగొట్టుకొని ఆ జీవితాన్ని జీవించాలని ఉంటుంది. ఎందుచేత? ఇందులో రహస్యం ఏమిటంటే, ఆయన స్వంతంగా అన్ని కష్టములూ పడి అన్ని నియమములూ అవలంభించి జీవిత విధానాన్ని ఆచరించి చూపుతారు. ఆయన దర్శనంచేసి ఆయన మాటలు వింటుంటే 'యీ మాత్రం మనం కష్టపడకపోతే ఎందుకీ జన్మ?' అనిపిస్తుంది ఏ శిష్యుడికైనా. రాబోయే శిక్షణ గురించి చూచాయగా బాబా ముందు సూచిస్తారు. అ సూచన చేసినప్పటినుంచీ, అ విధానం అమలు లోనికి రాకముందే, బాబా శిష్యులు గ్రహించి, అది వారు అభ్యాసం చేయడానికి ప్రయత్నిస్తారు. అప్పుడు అది అమలులోనికి వచ్చిన తరువాత వారికి సులభంగా కనిపిస్తుంది.

బాబా మండలితో కూడా అహమ్మద్‌నగర్ సమీపంలో ఉన్న బెబ్బలి లోయకి వెళ్ళినప్పుడు అక్కడ త్రికోణాకారంగా పది అడుగులు ఒకవైపున ఎనిమిది అడుగులు పరిమాణం ఉన్న గుడారం వేయించారు. అందులోనికి పదిమంది వరకు నేలమీదనుంచి పాకి లోపలికి వెళ్ళి ఉండవలసి వచ్చింది. అందులోనూ అది మండు వేసవికాలం. నేల చూస్తే గట్టిగా గరగర మంటూ ఉంది. లోపల ఒక జంబుఖానా అయినాలేదు. క్రిందవేసుకొనడానికి. బయటకు వచ్చి వేసంగికదా గాలిలో పడుకుందా మంటే అనుకోకుండా వర్షం ఒకటి తరుముకు వచ్చింది. లోపలికి హడావిడిగా దూరి పడకలన్నీ దగ్గరగా లాక్కొని పరున్నారు శిష్యులు. ఇంతలోకే వర్షం ఆగి పోయింది కదా అనుకుంటే, గుడారంలోనుండి యువతలకు రావడానికి నేల తడిసి ఉంది. ఇంక ఎక్కడ పరుంటారు? అదిగాక వర్షం నిలిచిపోగానే గాలి బంధించింది. లోపల పాపం అందరికీ చెప్పలేనంత ఉక్కగా ఉంది. కొద్దిస్థలంలో ఎక్కువమంది ఉండటం వలన మరీకష్టంగా ఉంది. గత సాయంకాలమే బాబా భక్తుడొకడు ఎక్కడనుంచో వచ్చినందు వలన అతనికి పడుకోవడానికి చాలినంత చోటు వదల వలసి వచ్చింది కూడాను. దీనిని అందరూ సౌఖ్యపులోయ అనికూడా అంటారు. కానీ వాళ్ళు పడే బాధలు బాబాకు తప్ప ప్రపంచానికి కేం తెలుస్తాయి? అయినా యిది ఒక పరీక్ష అని మండలి వారంతా సుఖంగా భరిస్తున్నారు. వీరిలో ఒకడు

లుక్కడి ఇబ్బంది కాటం. ఉక్క భరించలేక దగ్గరలోనే ఉన్న ఒక దేవాలయ మండపంలో పరున్నాడు. కానీ అతడికి నిద్రపట్టలేదు. మేలుకొనీ ఉండలేకపోయాడు. వీరందరి కంటే అతని స్థితి ఇంకా అధ్వాన్నంగానే ఉన్నదని చెప్పాడు. అతడు శాంతంగా ఉండలేక పోయాడు. పురుగులు, తేళ్ళు, పాములుకూడా తిరుగుతుంటాయని వాటినుంచి భయపడుతూ రాత్రి గడిపాడు. బాబా విధించిన పరిస్థితి నుండి తప్పించుకుందామని ప్రయత్నిస్తే, ఇలా జరుగదా మరి? ఒకసారి అతనికి నిద్రపడుతూంటే బుస్సుమని చప్పుడు అయ్యిందట. అది పామేమో అనుకుని హడలిపోయాడు. అదృష్టవశాత్తు అతని వద్ద టార్చిలైటు ఉంది. అది వెలిగించేసరికి ఆరడుగుల దూరంలో నున్న ఒక పాముమీద పడింది ఆ వెలుగు. ఈ వెలుగులో పాముని చూసి భయపడి పోయాడు. వెలుగు చూసి ఆ పామూ అస్సలు కదలలేకపోయింది. ఆ అదను చూసుకొని ధైర్యం వహించి 'పాము పాము' అని కేకవేస్తూ మండలి గుడారం వైపు పరుగెత్తాడు. మండలిలో ఇద్దరు లేచి కర్రలు పట్టుకొని పరుగెత్తుకుని వచ్చి ఆ పాముని ఎలాగంటేనేం చంపేసారు. ఇంక ఆ దేవాలయంలో ఇంత వరకూ పడుకున్న శిష్యుడు తన పక్క చుట్టుకొని వచ్చి, ఈ గుడారంలోనే ఒక మూల పరుండి, ఆ రాత్రి శేషం గడిపాడు. పాపం, పరుండగానే అతనికి నిద్రపట్టి గుర్రుపెట్టాడు కూడాను. దీనినిబట్టి తెలుసుకోవలసింది ఏమిటనగా— వచ్చిన పరిస్థితులను ఎదుర్కోవాలి గానీ తప్పించుకోవాలని పారిపోకూడదు. 'మన గురువు మనకు కావాలని కల్పించిన పరిస్థితులు మన బాగు కోసమే' అని విశ్వసించాలి. నీ ఆధ్యాత్మిక భవిష్యత్తును మలచి నిన్ను బాగుచేయడానికి అతడు సమకట్టినప్పుడు, భారం అంతా అతనిమీదే వేసి ఆ గురువు చెప్పినట్లు నడచుకోవాలి.

డీష్ రాంచీలో ఉన్నప్పుడు ఒకనాడు మహమ్మద్ ఆరుబయట నిలబడి, దేనివైపో తదేక దీక్షగా చూస్తున్నాడు. అతడు అలా చూడడం మొదలుపెడితే కొన్నిగంటల వరకూ అలాగే నిలబడి చూస్తుంటాడు. అప్పుడెవరయినా 'ఏమిటి అలా నిలబడ్డావు? ఏం చేస్తున్నావు?' అనిఅడిగితే 'డీష్ చూస్తున్నాను అంటాడు. అలాగే ఇప్పుడు డీష్ చూస్తున్నాడు. అది ఒక గడ్డిపరక కావచ్చు ఒక చిత్తు కాగితం ముక్క కావచ్చు లేక ఒకరాయి కావచ్చు, ఏదీలేకపోతే ఒక మంటిబెడ్డ అయినా కావచ్చు. అతడందులో దేవుని చూస్తున్నాడేమో మరి, ఆ రోజున అలా నిలబడి మహమ్మదు 'డీష్' చూస్తుంటే వర్షం వచ్చింది. వర్షంలో తడుస్తున్నా అతడు

లోపలికి రాలేదు. వర్షం కొంచెం ఎక్కువగానే కురుస్తోంది. మహమ్మదు వర్షంలో అలాగే నిలబడడం చూసి మస్తుల సంరక్షణ కార్యం అంతా చూస్తున్న ఖైదుల్ మహమ్మదు వద్దకు వెళ్ళి 'లోపలికి రమ్మంటే వినవేం? లోపలికి రా, తడిసిపోతే జబ్బు చేయదూ' అని చేయిపుచ్చుకొని లోపలికి లాక్కొని వచ్చాడు. ఖైదుల్ గొడుగు వేసుకొని వెళ్ళి మహమ్మదుని గొడుగులో తీసుకొని వచ్చినా, వర్షం చాలా ఎక్కువగా కురుస్తున్నందున వాళ్ళిద్దరూ కూడా తడిసారు. ఇంతలో బాబా అవతల వైపు నుంచి బంగళాముందుకు వచ్చి 'ఏమిటి? ఏం జరిగింది?' అని సౌంజ్ఞచేసి అడిగారు. మహమ్మదు చిన్నపిల్లవానిలా ఏడుస్తూ 'నేను డిష్ చూసుకుంటుంటే యిదిగో యితను చూడండి లోపలికి లాక్కు వచ్చాడు' అని చెప్పాడు. ఖైదుల్ అప్పుడు 'అవును బాబా! లోపలికి రమ్మంటే అతడు రాలేదు. వర్షంలో తడుస్తూ అలాగే నిలబడ్డాడు. ఊరుకుంటే ఎలాగరీ. అతడికి జలుబు చేస్తుందేమోనని లోపలికి చేయిపట్టుకొని లాక్కునివచ్చేను'- అని చెప్పాడు. మహమ్మదును ఎందుకు అతని పనిలోనుంచి తప్పించకూడదో బాబాకే తెలుసును. అందుకని యిద్దరూ రైటుగానే చేసారు. అప్పుడు బాబా మస్తులను వారి పనినుండి మనమూ ఎందుకు బలవంతాన తప్పించకూడదో చెప్పారు. బాబా యింకా యిలా వివరించారు. ''మీరు మస్తులకు ఆహారం పెడుతున్నామనీ బట్టలు యిస్తున్నామనీ అనుకుంటున్నారు. కానీ ఆ కారణం చేత వారు మీకు ఋణపడి ఉండనక్కరలేదు. ఎందుచేతనంటే వారికి లవేమీ నిజంగా అవసరంలేదు. వారికి తిండీ అక్కరలేదు. బట్టా అక్కరలేదు. పైగా యిదంతా వారికి అయిష్టంగా కూడా ఉంటుంది. వారికి యీ సేవ చేసే అవకాశం మీకు యిచ్చినందుకు మీరే వారికి ఋణపడి ఉండాలి. వారు సాధారణ మానవులు కారు. వారు నిజంగా భగవంతుని యెడల ప్రేమలో వారిని వారే మరచి పోయారు. వారు వలీల స్థితికి (సాధు పురుషుల స్థితికి) వచ్చారు. వారి వివిధ అధ్యాత్మిక పరిణామ దశలలో భగవంతునికోసం పరితపిస్తూ ఆయన దివ్యత్వాన్ని వారు రుచి చూసి దానితో విభ్రాంతులైపోయారు. వారికి ఒక సద్గురువుయొక్క ఆధ్యాత్మిక సహాయం కావాలి. అతడే వారిని పైమెట్టు ఎక్కించగలడు. అందుచేతనే నేను వారిని నా వద్దకు తీసికొని వచ్చాను. అందుకే నేను వారికి సేవ చేస్తున్నాను. మీకు కూడా వారిసేవ చేసే అవకాశం యిచ్చాను. కానీ, వారు స్వేచ్ఛాపురుషు లయినందు వలన యిక్కడ ఉండడమంటేనే వారికి ఒక బంధనం. వా కోసమే

వారు యీ బంధాన్ని స్వీకరించారు. నేను లేకపోతే ఒక్క నిమిషం కూడా వారిక్కడ ఉండరు. వారు ఏపని చేస్తుంటే సుఖంగా ఉంటుందో అది చేస్తున్నప్పుడు వారిని అందులో నుండి తప్పిస్తే, వారికి మట్టుకు అది అమితమయిన బాధను కలిగిస్తుంది. వారికి దుమ్ములోను, బురదలోను, మట్టిలోను ఆడుకోవడం యిష్టం. అదే వారికి ఆనందం. వారు అందులో భగవంతుని దైవత్వాన్ని తిలకిస్తారు. అటువంటప్పుడు వారిని అందులోనుండి బలవంతంగా తప్పిస్తే వారికి కోపంవచ్చి మిమ్మల్ని ఏదయినా వాళ్ళు అంటే, మీరు యావజ్జీవం బాధపడవలసి వస్తుంది. బాగా అభివృద్ధి చెందిన వలీలవంటి మస్తుల కోపం చాలా అపాయకరం. కానీ వారంతట వారు మిమ్మల్ని తిడితే అది మీకు చాలా మంచి కలుగజేస్తుంది.

సంత్ తుకారామ్ తాను రచించిన ఒకఅభంగంలో 'సాధువులతో సాంగత్యము చేయుట నిప్పతో ఆటవంటిదనియు, వారిలోని మంచిగానీ, చెడ్డగానీ నీకు అంటుకోకుండా జాగ్రత్త వహించాలనియు, నీలోని మంచి సంస్కారాలుకూడా అది తొలగించగలదనియు, నీకు వారి దర్శనము చేయవలెనను అభిలాష ఉంటే, దూరము నుండియే వారికి జోహారొనర్చుట మేలనియు' చెప్పాడు.

ఒక మహమ్మదీయ సాధువుకు ఒక తమాషా గుణముండెడిది. రోడ్డుమీద నడుస్తూ నడుస్తూ హఠాత్తుగా (ట్రాములైను మీద) నిలబడేవాడు. కొన్ని నిమిషాల వరకూ ఎన్ని బండ్లు నిలిచిపోయినా అతడు కదిలేవాడు కాదు. అతని సంగతి తెలిసిన వారవడంచేత ప్రజలు అతనిని ఏమీ చేయక ఊర కుండెడివారు. అతనంతట అతడే దారికడ్డము తొలగువరకు వేచియుండెడి వారు.

బాబా మహమ్మదును గురించి చెప్తూ 'అతడు కోపమున శపించినచో అతనిని భంగపరచువారి జీవితము నందు, వారికి గొప్పఅపకారము సంభవించగలదు.' బాబాయే 'అట్లు అతడు శపించకుండ రక్షిస్తున్నానని చెప్పారు.' అందువలన బలవంతం చేయకుండా, ప్రేమతో నెమ్మదిగా అతనిని బతిమాలి ఏదయినా కార్యము చేయించాలి.' అని బాబా హితవు చెప్పారు. 'భగవంతుని యందు ప్రేమలో పరవశమయిన మహమ్మదువంటి మస్తులను ప్రేమతో ఏపని నయినను గావించువట్లు చేయువచ్చును గానీ బలవంతముగా చేయించ జాలము.'

'అందుచేత మస్తుల విషయంలో చాలా జాగ్రత్తగా ప్రేమతో వ్యవహ రించండి. వాళ్ళని లాలించి బుజ్జగించండి. అంతేగాని వాళ్ళని కసరవద్దు. వాళ్ళని బలవంత పెట్టవద్దు. నా మూలాన మిమ్మల్ని వారేమీ చేయలేకపోయినా వాళ్ళు బాధపడుతూ ఉంటే నాకు బాధ కలుగుతుంది. వాళ్ళని బాధపెడితే నన్ను పెట్టినట్లే వాళ్ళకీ అయిష్టమయిన పని చేయమనడం వాళ్ళని బాధ పెట్టడమన్నమాటే. నా నిజస్వరూపం వాళ్ళు చూసినట్లు మీరెవరూ చూడలేరు. వాళ్ళు ప్రేమించినట్లు నన్ను మీరు ప్రేమించనూ లేరు.' అని బాబా తమ శిష్యులకు చెప్పారు. బాబా జూలై అఖరుకి రాంచీతో ఆశ్రమం ఎత్తేసి అక్కడి మస్తులను మెహెరాబాద్ తీసికొనివచ్చారు.

బొంబాయి నుంచి సాంగత్యం కోసం బాబా అగష్టు (1940) మాసంలో ఒక మస్తుని రప్పించారు. కానీ అతడు బాబా పనికి తగినవాడుగా బాబాకు కనిపించలేదు. అందుచేత ఆ మస్తును మెహెరాబాదులో ఒక్కరోజే ఉంచుకొని మర్నాడు తిరిగి బొంబాయి పంపించేసారు.

ఆగష్టు మాసంలోనే పండరీపురం నుంచి కబీరు అనే మస్తును తీసికొని వచ్చాడు మాసాజీ. ఆ మస్తును ఒక్కరోజే మెహెరాబాద్‌లో ఉంచుకున్నారు. బాబా. అప్పుడే కబీరును తొలిసారిగా బాబా సాంగత్యం చేసారు అక్టోబరు మాసంలో బాబామహమ్మదు మస్తుని మెహెరాబాద్ నుంచిబొంబాయిలో ఆలీఅస్గర్ అనేమస్తుతో కొన్ని రోజులుండమని పంపించారు. అక్టోబరు 26వ తేదీన మెహెరాబాద్ నుంచి బాబా షెరియత్‌ఖాన్‌ని అతని స్వస్థానమయిన చిక్మాగులూర్‌కి పంపించేసారు. అక్టోబరు 30వ తేదీన మహమ్మద్‌ని బాబా సిలోన్ యాత్రకు తమతో తీసికొని వెళ్ళుటకు వీలుగా బొంబాయి నుంచి రప్పించారు.

## సింహళ (సిలోన్) యాత్ర

1940 అక్టోబరు మొదటి వారంలో సిలోన్‌కి బయలుదేరడానికి ఒక నెల ముందు తమ శిష్యుడి నొకనిని, సిలోన్‌లో బాబా, వారి మండలి ఉండడానికి వసతి భోజన సదుపాయములు ఏర్పాటు చేయడానికి సిలోన్ పంపించారు. అక్కడ ప్రశాంత వాతావరణం గల స్థలంలో ఏకాంతవాసం చేస్తారు బాబా. బాబా పంపిన

శిష్యుడు మొదట సముద్ర తీరమున బసలు దొరుకుతాయేమోనని చూసాడు. బాబా వారి శిష్యులతో ఉండడానికి తగిన భవనం ఎక్కడా దొరకలేదు.

రతన్‌లాల్ రుస్తుంజి అను సిలోన్ నివాసి యొకడు కూడా చాలా ప్రయత్నం చేసాడు. అతడు లంకలో ప్రసిద్ధమైన వ్యాపారస్తుడు. 40 సంవత్సరములుగా అక్కడ ఉంటున్నాడు. చాలా పలుకుబడి కలవాడు. రతన్‌లాల్ అక్కడా యిక్కడా ఎందుకని కొలంబోకి పాతికమైళ్ళ దూరంలో వేయన్‌గొండా వద్ద పాక్‌గలాలో తనకున్న పెద్ద కొబ్బరితోటలోని క్రొత్త బంగళా బాబాకు ఆయన శిష్యులకు విడిదిగా ఏర్పాటు చేసాడు. సముద్రపు వొడ్డున లేకపోయినా చాలా ఏకాంతమయిన ప్రదేశంలో ఉంది ఆ బంగళా. మెహెర్‌బాబా లాంటి మహా పురుషుడు తన శిష్యగణంతో వచ్చి తన నూతన గృహమును పావనము చేయబోతున్నారని రతన్‌లాల్ ఎంతో ఆనందించాడు. ఈ సంగతి ఇండియాలో బాబాకు తెలియ వరచగా ఆయన ఎంతో ఆనందించారు. 1200 మైళ్ళ ఈ ప్రయాణానికి బాబా ఏర్పాట్లు చేస్తున్నారు. పరిస్థితులు అనుకూలంగా లేకపోయినా ఎన్ని ఇబ్బందులు ఉన్నా బాబా సిలోన్‌కి బయలుదేరడానికి నవంబరు 1టవ తేదీ నిశ్చయించారు. అక్కడ ఆయన ఆధ్యాత్మికంగా చేయవలసిన పనులు ఉన్నాయి. వ్యవధి లేకపోయినా అన్ని సర్దుబాట్లు, ప్రయాణానికి కావలసిన అన్ని ఏర్పాట్లు జరిగిపోయాయి.

అమెరికా నుంచి వచ్చిన అయిదుగురు శిష్యురాండ్రు— నానీగేలీ ఆమె కుమార్తె రానోగేలీ, నఢీనె టాల్‌స్టాయి, ఎలిజబెత్ పాటర్సన్, నొరీనా మాచిబెల్లీ, మరియు ఇంగ్లండు నుంచి వచ్చిన బాబా ఆశ్రమంలో ఉంటూన్న కిట్టీడేవీ, మార్గరెట్ క్రాస్కీ, స్విజ్జర్లాండు నుంచి వచ్చిన ఐరీన్‌బిల్లో అనే ఆమె యీ యెనమండుగురు పాశ్చాత్య స్త్రీలు, కొందరు భారతీయ స్త్రీలు, కొందరు పురుష మండలి అందరూ బాబాతో నీలి బస్సులలో ప్రయాణం చేశారు.

అక్టోబరు మాసం (1940), 27వ తేదీ ఆదివారమయినది. 29, 30, 31 తేదీలు దీపావళి సెలవులు అయినవి. అందుచేత కచేరీలు మూసివేసారు. ఆ కారణంగా ప్రయాణం గురించిన కొన్ని పనులు నెరవేరడం ఆలస్యం అయినది. అయినా బాబా అనుకున్న ప్రకారం జరిగితీరవలసిందే. అందుచేత నవంబరు 1టవ తేదీన ప్రయాణం ఖాయమయినది. దారిలో అనేకచోట్ల బాబా శిష్యులు భక్తులు

బాబా దర్శనం చేసుకోవాలని కోరారు. కానీ యీ సంవత్సరం అంతా ఏకాంతవాసం గనుక బాబా ఎవరినీ చూడడానికి అంగీకరించలేదు. మెహెరాబాద్‌లో నివసిస్తున్న సన్నిహితశిష్యులుకూడా బాబాకు వీడ్కోలు యివ్వడానికి బాబా అనుమతించలేదు. దూరాన్నుంచే బాబాను చూచుటతో వారుతృప్తిపొందవలసిన వారయ్యారు. బెంగుళూరు ఆశ్రమవాసులయిన శిష్యులుకూడా బాబా దర్శనం పొందలేక పోయారు. దారిలో అనేకచోట్ల బాబా భక్తులు చాలామంది బాబా బృందాన్ని చూడడానికి వచ్చారు. అయినా వారికి బాబా ప్రేమతో ఆశీస్సులను పంపించారు. కానీ వారికి దర్శనం యివ్వలేదు. మెహెరాబాద్‌లో నవంబరు 1టవ తేదీన బాబా మండలితో బయలు దేరినప్పుడు వారితో బాబా, చట్టిబాబాను కూడా సింహళానికి తీసికొని వెళ్ళారు. దారిలో ఎవరికీ దర్శనమివ్వకపోయినా బాబా ప్రభుత్వలాంఛనాల ప్రకారం అధికారుల ప్రశ్నలకు లోబడవలసి వచ్చినది. మామూలు ప్రయాణీకుని వలెనే బాబా అన్నిటికి ఒప్పుకొని యధావిధిగా ప్రభుత్వం వారినిబంధనలను పాటించారు. మానవకోటియొక్క శ్రేయస్సు కొరకు పనిచేస్తున్న మహాపురుషులు సద్గురువులుకూడా సాధారణ నియమాలకు కట్టుబడి ఉంటారు.

తలైమన్నార్‌లో బాబా దిగేసరికి ప్రకృతి ఆయనకి పెద్ద వర్షంతో స్వాగతం పలికింది. బాబా ఆయన శిష్యబృందము, సామానులు సహితంగా బాగా తడిసారు. స్టీమరులో నుంచి దిగి రైలు ఎక్కేలోపల వర్షంలో తడవవలసి వచ్చింది. వేయన్ గొండా స్టేషన్‌లో బాబా నవంబరు 5వ తేదీన రైలు దిగేసరికి, రతన్‌లాల్ రుస్తుంజీ కుటుంబ సహితంగా బాబాకు ఆయన బృందానికి స్వాగతం యిచ్చాడు. బాబా అతని బంగళాలో అందరితోనూ దిగారు. ఆయన యొక్క అధ్యాత్మిక కార్యమునకు అది తగిన స్థానము కాదని బాబాకు వెంటనే తెలిసింది. అందువలన మరియొక స్థలమునకై వెంటనే వెదకుట ప్రారంభమయింది. 'సముద్రతీరము నందు వీలయిన స్థలము దొరకకపోతే ఏకొండమీద నయినా మంచినీటి సదు పాయంగల స్థలము నన్వేషించమని' బాబా చెప్పారు.

కాండీ పురాతనమగు యాత్రాస్థలము. గావున ఆ నగరము సహజమయిన సౌందర్యముతో కూడి యున్నది గనుక బాబాకు అది బాగానచ్చినది. అయినక్క ఆయన పనికి తగిన వాతావరణము కలిగియున్న తేయాకు తోటలతో నిండియున్న

ప్రిమ్‌రోజ్‌హిల్ అనే ఒక కొండప్రదేశం ఎన్నికచేసారు. ఆ కొండమీద నుంచి దగువనున్న లోయ చక్కని దృశ్యమునిస్తోంది. కొండశిఖరమున నొక చక్కని బంగళా బాబా ఉండుటకు అన్నివిధములా తగియున్నది. వేయన్‌గొండా నుంచి బాబా నవంబరు 16వ తేదీన కాండీవెళ్ళారు. కాండీకి బాబా శిష్యబృందముతో వచ్చారన్న వార్త నలువైపుల ప్రసరించినందు వలన బాబా దర్శనార్థం అనేకమంది రాసాగేరు. వారందరికీ 'బాబా దర్శనము దుర్లభము అనియు, వారు ఏకాంతవాసము నందున్నా రనియు' మండలి వివరించి చెప్పారు. వారు అంతటితో వెళ్ళిపోక 'ఒక్కసారి వారిని చూడడానికి ఎన్నిగంటలయినా వేచి ఉంటామని' జనులు చెప్పసాగారు. అందువలన 'డెయిలీ న్యూస్' పత్రికలో బాబా ఆధ్యాత్మికమయిన పనిమీదవచ్చి ఏకాంతవాసంలో కాండీలో ఉన్నారని' ఒక ప్రకటన వెలువడినది.

'ప్రిమ్‌రోజ్' కొండ మీద బాబా ఉన్న బంగళాకు సమీపంలో ఒక చిన్న కుటీరం వేయించి చట్టిబాబాను అందులో బస చేయించారు బాబా. బాబా ఉన్న న్నాళ్ళు అంటే డిశంబరు 4వ తేదీ వరకు చట్టిబాబాను అక్కడే ఉంచారు బాబా. ఈ లోపుగా ఒకరోజున బాబా కొద్దిమంది శిష్యులతో వెళ్ళి అనురాధపురంలో ఒక గొప్ప బౌద్ధ స్తూపంలో ఒక వృద్ధుడు కూర్చునిఉంటే అతనిని కలుసుకున్నారు.

'కాండీలో ప్రతి రోజూ బాబా నన్ను స్నానం చేయిస్తున్నారు. యీ రోజునుంచి నేను బాబాని స్నానం చేయిస్తాను.' అని చట్టిబాబా ఒకవారం రోజులపాటు బాబాకి ప్రతి ఉదయం 10, 12 బకెట్ల నీటితోస్నానం చేయించే వాడు. డిశెంబరు 1టవ తేదీన బాబా, సింహళంలో ఆయన చేయవలసిన పని ముగిసిందని వెంటనే ఇండియాకి తిరుగు ప్రయాణానికి ఏర్పాటు చేయమని మండలితో చెప్పారు. కాండీ వచ్చిన తరువాత బాబాపని శీఘ్రంగా సాగిందని అక్కడ ఆయనకు కావలసిన ఆదర్శవంతమయిన శాంతియుత వాతావరణం, సంపూర్ణమయిన ఏకాంతం లభించాయని బాబా సంతోషించారు. ఇండియాకి వెళ్ళి బాబా మలబారు తీరంలో పనిఉండడంచేత అక్కడ కొంతకాలం ఉండాలని చెప్పారు. అందువలన ముందు ఒక శిష్యుణ్ణి ఆ పనిమీద మలబారు తీరంలో బాబావసతికి ఏర్పాటు చేయమని పంపించారు. అక్కడ బస కుదిందని కబురు తెలిసాక డిశెంబరు 4వ తేదీన శిష్యసమేతంగా ఇండియాకు బయలుదేరి వచ్చారు.

ఇండియాాకు ముందు పంపించిన బాబా శిష్యుడు ఇండియా పశ్చిమతీర మందున్న కొచ్చిన్, ఎర్నాకులం, కాలికట్, తెల్లిచేరి, కన్ననూరు మొదలయిన రేవు పట్నాలకు వెళ్ళిచూసాడు. కాలికట్‌లో సముద్రతీరానికి మూడుమైళ్ళ లోపల ఎరన్‌హి పాలెం అనే ఒకస్థలం ఎన్నికచేసాడు. కొన్ని మాసములు బాబా లంకలో ఉంటా రని ఆశించడం వలన బాబా తిరుగు ప్రయాణం బాబా శిష్యులకే ఆశ్చర్యం కలిగించింది. బాబా బయలుదేరి వెళ్ళిన తరువాతగానీ సిలోన్ ప్రజలకి ఆ వార్త తెలియలేదు. ఆయన దర్శన భాగ్యం కోసం వేచియున్న వారికి తీవ్రమయిన ఆశా భంగం కల్గినది. హృదయంలో అటువంటి ప్రేమగనుక ఉంటే బాబా వారి అంత రంగంలో ఆధ్యాత్మికంగా పనిచేస్తారు. వారి హృదయంలో భక్తి, ఆధ్యాత్మిక వికాసం కలిగేలా ఆయన చేస్తారు. ఇటువంటి సందర్భాల్లో 'బాబా ఏకాంతంగా ఉంటూ ఎవరికీ దర్శన మీయనప్పుడు, ఎవరితోనూ బాహ్యంగా ఏవిధమయిన సంబంధమూ పెట్టుకోనప్పుడు, యింతమంది శిష్యులతో యిన్నివేలమైళ్ళు ప్రయాణం ఎందుకు చేయాలి? చేసి కొద్దివారాలలోనే తిరుగుప్రయాణం ఎందుకు చేయాలి?' అనే ప్రశ్న అడుగుతారు. దీనికి ఒకటే జవాబు. బాబా యొక్క ముఖ్య మయిన పని మానవాళిని ఆధ్యాత్మికంగా మేలుకొల్పడమే. ఆ పనికానీ, దానియొక్క ఫలితంగానీ అది పైకి ఎవరికీ కనిపించదు. ఏ స్థలానికి ఏదేశానికి తగినట్లుగా ఆయా స్థలములలో ఎంతకాలముండి ఏ పనిచేయాలో ఆయనకే తెలియును. బాబాకు కావలసిన వ్యక్తులతోను ప్రజాసమూహాలతోను అంతరికమైన కార్యాచరణ ద్వారా బాబా పని చేస్తుంటారు, బాహ్యప్రపంచ వాసులు, వారు కేవలము మనస్సు తోను వారి బుద్ధితోను ఆలోచించి బాబానుగానీ వారి కార్యవిధానాన్ని గానీ అర్థంచేసుకోవడానికి ప్రయత్నించడంలో విఫలులౌతారు. అందులో ఆశ్చర్యంలేదు. అది, బాబాతో వ్యక్తిసంబంధమేర్పరచుకొని ఆధ్యాత్మిక అవగాహనకు ప్రయత్నించేస్తే బాబా యొక్క పనిలోని విశిష్టత వారికి కొంచెం అర్థం కాగలదు.

ఇంక, బాబా ఒక్కరే ఆపని చూసుకోక యింతమంది శిష్యులతో యిన్ని యిబ్బందులతో యింతదూరం ప్రయాణాలు ఎందుకు చేయాలి?అన్న ప్రశ్నకి బాబా ఏమంటారంటే–బాబాయొక్క శిష్యులందరూ వారి ఆధ్యాత్మిక కార్యాలలో పాల్గొన డానికి, వారితో నుండి ప్రేమపూర్వకంగా పరిస్థితుల నంగీకరించి వారి ఆధ్యాత్మిక రంగంలో పాల్గొనడానికి, వారికి అవకాశం యివ్వడానికే-బాబా వారితో శిష్యబృందాన్ని తీసికొని వస్తుంటారు.

బాబా యొక్క ఆంతరికమైన యీ అధ్యాత్మిక కార్యంచేత దాని ఫలితం బాహ్యంగా కనిపించకపోయినా మానవులందు ఆధ్యాత్మిక చైతన్యాన్ని మేల్కొలుప గలదు-అని బాబా వివరించారు.

ఇండియా వచ్చి బాబా మలబారు తీరంలో కొన్నాళ్ళు పర్యటించారు. బస్సులలో కాలికట్‌కు మండలి అందరితోను చట్టిబాబాను కూడా తీసుకొని వెళ్ళారు. వారితో పరివారం అందరూ వారి సామానులతో సహా వెళ్ళారు.

## పల్లుకొల్లా బాబా

దారిలో రామనాధపురం జిల్లాలో కిలక్కెరై అనే గ్రామం వెళ్ళారు. పల్లు కొల్లా బాబా ఆరవ భూమికకి ఏడవభూమికకి మధ్యస్థితిలో ఉన్న గొప్ప మస్తు. బాబా యితనిని ఒకసారి మస్తులకందరికీ రాజు అనిఅన్నారు. దక్షిణభారతదేశంలో ఉండే అతడొక మహమ్మదీయుడు. అతడు అరవభాష మాట్లాడుతాడు. బాబా మండలిలో ఎవరికీ అరవంరాదు. అందుచేత అతనితో సులభంగా మాట్లాడలేక పోయారు. జనవరి 1940 లోనే అతనిని కలుసుకునేందుకు బాబా ప్రయత్నించారు. ఆ ప్రయత్నంలో కన్యాకుమారి అగ్రం వరకు బాబా ప్రయాణం చేసారు. 1940 నవంబరులో బాబా తమ మండలితో యిప్పుడు మరల సాంగత్యానికి అతని గ్రామానికి వెళ్లారు. ఇతని కబురు కాకాకి తెలిసింది. అప్పుడతడు ఇండియాకు వెళ్ళి కిలక్కెరై అనేగ్రామానికి ఆ మస్తుల మహారాజు కోసం వెళ్ళాడు. ఇతనికి 115, 120 ఏళ్ళ వయస్సు ఉంటుంది. కిలక్కెరైలో అతనిని కదలలేని స్థితిలో కనుగొన్నాడ. వృద్ధాప్యం వలన శారీరక శక్తులన్నీ ఉడిగి పోయాయి. నడువలేడు. ఒకచోటునుండి ఇంకొక చోటుకి వెళ్ళాలంటే ఎవరయినా మోసుకొనిగానీ ఎత్తుకొని గానీ తీసుకొని వెళ్ళాలి. అందుచేత మొదట అనుకున్నట్లు బాబా వద్దకు సింహాళానికి యితనిని తీసికొని వెళ్ళాలన్న అభిప్రాయం కాకా మార్చుకున్నాడు. అందుచేత కాకా ఆ రాత్రి కిలక్కెరైలోనే ఉన్నాడు.

ఆ సాయంత్రం అక్కడివాళ్ళు పల్లుకొల్లా బాబా గొప్పతనం గురించి— అతడు నదులు ఈతకుండా దాటగలడని—యిత్యాది విషయాలు కాకాకి అనేక కధలుగా

చెప్పారు. కిలక్కర్రై సమీపంలో ఒక నదిఉంది. నెలకి రెండుమూరులు ఒక మహా మ్మదీయుడయిన పడవవాడు తన పడవలో యీ మస్తాను దాటిస్తూ ఉండేవాడు. అప్పుడు అవతల ఒడ్డు దగ్గరగా ఒక గ్రామానికి వెళ్తుండేవాడతడు. ఒకనాడు పల్లికొల్లా బాబా ఆ పడవవానిని తనపడవమీద ఆవల ఒడ్డుకి దాటఅక్కడ ఒక గ్రామంలో తన స్నేహితుడొకడున్నాడని అతని వద్దకు వెళ్ళమని' చెప్పాడు. అ ప్రకారంగా అతడు చెప్పిన స్నేహితుని యింటికి వెళ్ళాడు. వెళ్ళి చూసేసరికి పల్లికొల్లా బాబా అతడు వెళ్ళిన చోటనే ఆస్నేహితునితో మాట్లాడుతూ కూర్చుని ఉన్నాడు. అప్పుడే, తన పడవలో తనతో రాకుండ అవతల ఒడ్డున ఉన్నవాడు యిక్కడికి ఎలావచ్చాడని అ పడవవాడు ఎంతో ఆశ్చర్యపోయాడు. నదికి అక్కడ వంతెన లేదు. ఇంత ముసలి వాడు ఈదలేడు. ఇంక కనుచూపు మేరలో వేరే పడవలు ఎక్కడా లేవు. ఆ పడవవానికి పల్లికొల్లా బాబా చేసినది ఒక అద్భుతం అని స్పష్టంగా తెలిసిపోయింది. ఇంకా యిటువంటి అద్భుతాల వలన ఆ మస్తు చాలా మహిమగలవాడని అప్పటి నుంచి ఆ చుట్టుపట్ల ప్రజలకు తెలిసిపోయింది.

బాబా ఒకరిద్దరు శిష్యులతో వచ్చి డిశెంబరు (1940) 6, 7 తేదీలలో పల్లికొల్లా బాబా సాంగత్యం చేసారు. అప్పుడు బాబా మండలి దారిలో రామనాథ పురంలో ఒకటి రెండురోజులున్నారు. బాబా యీ మస్తుతో ఒక అరగంట ఏకాంతంగా కూర్చున్నారు. తరువాత బాబా అక్కడనుంచి బయలుదేరి రామనాథ పురంలోని శిష్యులను తీసికొని ఎరన్‌హిపాలెం వెళ్ళారు. అది కాలికట్‌కి 3 మైళ్ళే ఉంది గనుక కాలికట్‌లో ఉన్నట్లే.

బాబాదాస్ బాబా శిష్యులలో ఒకడు. అతనిని బాబా మండలిలో అందరూ బాగా ఎరుగుదురు. అతడు భారతదేశం అంతా పర్యటిస్తూ బాబా నామం వ్యాప్తం చేస్తున్నాడు. నెరిసిన తల, పొడుగాటి బవిరి గడ్డం కలవాడు. పొడుగయిన కఫ్నీ ధరిస్తుంటాడు. పాదరక్షలు లేకుండానే తిరుగుతూంటాడు. బాబా కాలికట్ వచ్చినట్లు బాబాదాస్‌కి తెలియదు.

బాబా ఆజ్ఞానుసారంగా కాకా మస్తుల, అన్వేషణకై బయలుదేరి కాలికట్‌పట్నంలో తిరుగుతున్నాడు. ఒక టాంగావాలా కాకాతో 'అయ్యా! అద్భుతమయిన మస్తు ఒకడు వచ్చాడయ్యా క్రొత్తగా యీ ఊరికి. చూపిస్తాను ఎక్కండి' అని కాకాని ఎక్కించు

కొని టాంగాలో కొన్ని వీధులు త్రిప్పి ఒక చోట ఆపి 'అడుగోనయ్యా అతడే' అని ఒక వ్యక్తిని చూపించాడు. అతనిని తీరా దగ్గరికి వెళ్ళిచూస్తే అతడు బాబా దాసే, కాకా యిట్లే పోల్చుకున్నాడు. కాకా నవ్వుకొని మంచి మస్తునే చూపించావులే అని బాబాదాస్‌తో కొంతసేపు మాట్లాడి తన దారిన తాను వెళ్ళాడు. ఇలాంటి దానినే 'కామెడీ అఫ్ ఎర్రర్స్' అంటారు ఇంగ్లీషులో. బాబా పనిమీద పర్యటిస్తూ బాబాదాస్ కాలికట్ వచ్చాడు.

కాలికట్‌లో బాబా పంపించగా 'కాకా' మస్తు అన్వేషణచేస్తూ డిశెంబరు 11వ తేదీన ఒక మస్తును బాబా ఉన్న బంగళాకు తీసికొని వచ్చాడు. అతనితో సాంగత్యం చేసిన తరువాత బాబా వారి పాశ్చాత్య శిష్యురాండ్రకు ఆ మస్తును చూపిస్తూ, 'అతని నేత్రాలు చూడండి. భగవంతుని తేజస్సు ఎలా ఉట్టిపడుతుందో' అన్నారు.

కాలికట్‌లో బాబా డిశెంబరు 23వరకూ ఉన్నారు. బాబా మలబారు నుంచి ఉత్తరహిందూస్తానం వెళ్దామని అనుకుంటున్నారు. తమ ఆధ్యాత్మిక కార్యానికి జయపురం (రాజస్థాన్) తగిన స్థలమని బాబా చెప్పారు. దాని తరువాత బాబా, జోధ్‌పూరు, ఉదయపూరు బూండీ అనే నగరాలు కూడా ఆయన ఆధ్యాత్మిక మయిన పనిమీద వెళ్ళవలసి ఉంటుందని చెప్పారు. అందువలన మండలిలో ముందు ఒక్కనిని జయపూర్‌కి పంపి, 'అక్కడ వారికి తగిన బస ఏర్పాటుచేయమని' చెప్పారు బాబా. ఇంకొక శిష్యుని జోధ్‌పూరుకి ఉదయపూర్‌కి వెళ్ళి చూడమని బాబా పంపించారు. జయపురంలో నాలుగురోజులు వెదకినా బాబాకొరకు తగిన బస దొరకలేదు. ఆఖరురోజున ఆ శిష్యుడు విసుగెత్తి జోధపురానికి వెళ్దామనుకుంటుంటే ఎవరో అతనిని తీసికొని వెళ్ళి బాబా ఉండడానికి తగిన చక్కని తావును చూపించాడు. వెంటనే అది నిశ్చయింపబడినది. బాబాకు అక్కడ తగిన ఏకాంతం లభిస్తుంది. రెండవవాడు ఉదయపురంలో తగిన స్థలం దొరకక జోధపురానికి వెళ్ళాడు. జయపురంలో దొరికిన సమయంలోనే మూడు రోజులు వెదకిన తరువాత జోధపురంలో కూడా ఒక బంగళా దొరికింది. బాబా కాలికట్టు నుంచి 23వ తేదీన (డిశెంబరు, 1940) జైపూరు (రాజస్థాన్) ప్రయాణమైనారు. ఇది యొక దీర్ఘప్రయాణము. దారిలో గుజరాత్ రాష్ట్రంలో అనేక పట్టణాలు పర్యటించి అనేకమంది మస్తులతో సాంగత్యం చేసారు. ఈ ప్రయాణములు చేసి

నప్పుడు బాబా బృందంలో చట్టిబాబా ఉండేవాడు. అతడు తరుచుగా 'నేను ఉండను. వెళ్ళిపోతాను. నేను మునిగిపోతున్నాను. నేను వెళ్ళాలి తప్పదు అనేవాడు.

బాబా శిష్యులందరితోను, వారి సామానులతోను, బస్సులో జయపురమునకు వెళ్తున్నారు. కాలికట్టు నుండి రెండువేలమైళ్ళు 9 రోజులు పైగా ప్రయాణం చేసారు. ఈ ప్రయాణానికి సంబంధించిన ఏర్పాట్లు బాబా మండలిలోని డా॥ డాన్‌కిన్, ఇంకొకడు చేసారు. వారిద్దరూ బాబా ఆజ్ఞ ప్రకారం ఆ యా ఏకాంతవాస సంవత్సరములో ఒక పూట మాత్రమే భుజించి ఉంటున్నారు. పగటిపూట పస్తుండి బస్సులో ప్రయాణంచేసి బట్టలు వొళ్ళు దుమ్ముతో నిండిపోయి, సాయంత్రానికో రాత్రికో ఎక్కడో ఏ హోటలులోనో దిగి, చల్లారిపోయిన అన్నాలు, వారికి కావలసిన శాకాహారాలు యేమి మిగులుతే అవి తినడం అంటే- ఎలా ఉంటుందో పదువరులు ఊహించగలరు.

ఈ ప్రయాణంలో గుజరాత్‌లో అనేక నగరములు పర్యటించి బాబా అనేక మంది మస్తులను సాంగత్యం చేసారు. బాబా బస్సులో ప్రయాణం చేస్తున్నారు. అది క్రిస్టమస్ రోజు. మండలి అందరూ ఒకరికొకరు గ్రీటింగ్సు— శుభాకాంక్షలు- చెప్పుకున్నారు. బస్సు ఒక కొండదాటింది. ఎదర యింకొక కొండ వస్తుంది. ఇంత బరువుతోను బస్సు కుంటడం మొదలు పెట్టింది. అదృష్టవశాత్తు బస్సు వెంటనే ఆపగలిగారు. డాక్టర్లిద్దరూ క్రిందకి దిగారు. దిగి చూసేసరికి వెనుక వైపున ఒక ప్రక్కఉన్న చక్రాలు రెండూ కనిపించలేదు. బస్సు వెనుక ఒకవైపు రెండు, మరియొక వైపు రెండుచక్రాలు ఉండాలి. కానీ ఒక వైపునేఉన్నాయి. రెండవ వైపు రెండు చక్రాలు లేవు. వారి నోటివెంట మాట రాలేదు. వెర్రి చూపులు చూస్తున్నారు. ఆ సమయంలో రోడ్డు వెంటవెళ్ళే మనిషి ఒకడు ఆ చక్రాలు ఎక్కడికి దొర్లిపోయాయో చూపించాడు. రెండు చక్రాలు రోడ్డుకి రెండు ప్రక్కలకి దొర్లిపోయాయి. రెండూకూడా ప్రక్కనఉన్న కొండల వైపుకి వెళ్ళిపోయాయి. ఇది అందరికీ చాలాఆశ్చర్యము గొలిపింది. వారిద్దరూ—(డా. నీలు, డా. డాన్‌కిన్) మనుష్యులకి డాక్టర్లు గానీ బస్సులకు కాదు. మెకానిక్కులు కారు. చక్రాలంటే తెచ్చారు గానీ అవి బిగించడానికి నట్లు బోల్టులు ఎలా వస్తాయి. దారిలో

అవి ఎక్కడ జారిపోయాయో? అరమె లు వెనక్కి వెళ్ళివెదకితే ఒక్కటి దొరికింది. ఎలాగో ఒక ఎధంగా చక్రాలు తగిలించి బిగించారు.

అహమ్మదాబాద్‌లో బాబా అబ్బాజాన్ అనే అభివృద్ధి చెందిన ఒక మస్తును కలుసుకున్నారు. అతడు ఒక ధర్మశాలలో ఉంటాడు. చిలుము గొట్టం పీలుస్తాడు. ఎవరయినా వస్తే, వారికి కూడా ఆ గొట్టం లందిస్తాడు. అతడు యిప్పుడు లేడు. గతించాడు.

బాద్‌షాబాపు అనే వానిని కూడా బాబా సాంగత్యం చేసారు. ఇతడొక ప్రక్క వీధిలో ప్రక్కన ఉండే ఒక గుంటలో ఒక డబ్బాను దగ్గర పెట్టుకొని ఉన్నందున వలన, యితనిని 'టిన్‌పాట్‌వాలా' అని బాబా అనేవారు. నర్సో బావడీలోని వజీర్ బాబాతో యితనిని పోల్చారు బాబా. ఇతడు మంచి మస్తు అని చెప్పారు బాబా. ఈ మస్తు పొట్టిగా, బొద్దుగా ఉంటాడు. ఇతడు కూడా యిప్పుడు లేడు. కాలం చేసాడు.

పైన చెప్పిన యిద్దరినీ యీ సంవత్సరంలో జూలై మాసంలో బాబా మరల సాంగత్యం చేసారు. హస్నిబాద్‌షా అనే మస్తును కూడా బాబా అహమ్మదాబాద్‌లో కలిసారు. ఇతడు లావుగావున్న ఒక వృద్ధుడు. ఈ మస్తులో జమాలీ జలాలీ లక్షణాలు రెండు రకాలు ఉన్నవి. ఇతడొక మంచి మస్తు. కొందరు గృహస్థులు యితనిని పోషిస్తున్నారు.

అహమ్మదాబాదు నుండి జామ్ నగర్ వెళ్ళి అక్కడ ఒక ఉన్నతుడయిన మస్తును బాబా సాంగత్యం చేసారు. ఇతడు జామ్‌నగర్‌కి అధ్యాత్మిక పాలకుడని బాబా చెప్పారు. ఇతర మస్తులకి యితనికి చాలా తేడా వుందని—బాబా అన్నారు. అతడొక గోరీల దొడ్డిలో నివసిస్తుంటాడు. అతడు బట్టలు యెప్పుడూ విప్పడు. క్రొత్త బట్టలెవరైనా యిస్తే, ఆ తొడుక్కున్న వాటి మీదే అవి కూడా తొడుగుతాడు. ఎన్ని చొక్కాలయినా అలా ధరిస్తున్నందువలన మోచేతి వద్ద చేయి ముడవడానికి యీతనికి వీలులేక పోయేది. ఆఖరికి చేతులు చాపడం కదపడం కూడా కష్టమయి పోయేది. అందుచేత బాబా ఏదో డబ్బు అతనికి యిచ్చినప్పుడు దానివి నోటితో అందుకున్నాడు.

అతడు చేతితో అన్నం తినలేడు కనుక ఇక్కడి ప్రజలు అతనికి అన్నం తినిపించేవారు. ఒక రోజున పగలు బాబా అతనిని ఒక హోటలులో సాంగత్యం చేసారు. రెండవ మారు బాబా ఒకరాత్రి ఊరికి బయట అతనిని కలుసుకున్నారు. ఈ రెండవ మారు మస్తు పెద్దగా ఏడ్చాడు ఆ యేడ్పులోనే, ఒక అడవిలో అతడు అప్పుడు ఉండబట్టి 'ఖుదా జంగల్ మే మిల్‌గయా' అని గట్టిగా అరిచాడు

మఖ్ఖీవాలా బాబా అనే మంచి మస్తును రాజ్‌కోట్‌లో ఒకచోట బాబా సాంగత్యం చేసారు అతని శరీరం మీద అనేక లక్షల ఈగలు వాలి ఉండేవి, తేనెపట్టు మీద తేనెటీగలు లాగ. అందుచేతనే బాబా యితనికి మఖ్ఖీవాలా అనే పేరు పెట్టారు ఇతడు సరిగ్గా సగం జమాలీ లక్షణాలు కలిగి ఉన్న మస్తు అనీ, అటువంటివాడు యితడొక్కడే అనీ, — బాబా చెప్పారు.

## గోఖలే బాబా

ఇస్మాయిల్‌పూరు అనే గ్రామంలో గోఖలే బాబా అనే ఆరవభూమికలోని మస్తు ఉన్నాడు. ఈ ఉన్నతోడయిన మస్తు జమాలీ రకానికి చెందినవాడు. గోఖలేబాబాకు వయస్సు నూరేళ్ళు నిండినట్లు కనిపిస్తాడు. ఒకప్పుడు యితడు పెళ్ళిచేసుకొని పెళ్ళాం పిల్లలతో కాపురంచేస్తూ యిల్లూ వాకిలీ సంసారం అన్నీ ఉన్నవాడే. మనుగడ కోసం యితడొక దుకాణం పెట్టుకొని వ్యాపారం కూడా చేసేవాడు. బాబా యితనిని ఇస్మాయిల్‌పూరులో సాంగత్యం చేసారు. ఇతడు ఒక రోజున ఒకగురువును సాంగత్యం చేసాడు. దానివలన అతడు మస్తు అయిపోయాడు. ఇస్మాయిల్‌పూరులో ఉన్న యీ మస్తు ఊరి బయటఉన్న ఒక గుడిలో ఉండేవాడు. ఇతనివద్ద 5, 6, కుక్కలుండేవి. ఈ కుక్కలు అతని మీదికి ఎక్కుతూ ఉండేవి. అతనిమీద పరుండేవి. వాటి తలలు అతని చేతిమీదనో కాళ్ళమీదనో ఉంచుకునేవి. ఎప్పుడూ అతని దగ్గరగానే పడుకునేవి

గోఖలేబాబాని అందరూ గౌరవించేవారు. గ్రామస్థులు అతనిని ఎక్కువగా ప్రేమించేవారు. కొన్ని మైళ్ళ చుట్టు ప్రక్కల ఉన్న ఊళ్ళనుంచి అతని దర్శనం కోసం ప్రజలు వస్తూవుండేవారు. ప్రాప్యమైన కంఠం గల భక్తులు అతని యెదుట

కూర్చుని గానం చేసేవారు. అతని దర్శనం చేసుకుంటే ప్రజల కోర్కెలు తీరుతాయి—అనే నమ్మకం ఉండేది. అతనికి ఆహారం పెడితే మొదట కుక్కలకి అన్నం పెట్టి తరువాత అతడు ఆ కంచంలోనే తినేవాడు.

బాబా ఒకసారు యితని సాంగత్యంకోసం వెళ్ళినప్పుడు వర్షం వచ్చింది. బాబా మండలిని ఖైర్తాలో ఉంచి ఒకరిద్దరితో ఒక యెద్దు బండిలో ఇస్మాయిల్‌పూర్ వెళ్ళారు. ఆ బండిలో పొయ్యిలో పెట్టుకునే కట్టెపుల్లలు కూడా ఉన్నాయి. ఖైర్తాల్‌కి ఇస్మాయిల్ పూర్ 11 మైళ్ళుంది. బాబాకి మండలికి వర్షంవలన బట్టలన్నీ తడిసిపోయాయి. ఎద్దుబండి కుదుపువల్ల, ఇరుకుగా కూర్చుని వెళ్ళిన యీ 11 మైళ్ళ ప్రయాణం వలన కీళ్ళన్నీ నొప్పులు పెట్టాయి. ఖైర్తాల్ వదిలే ముందు వారు మళ్ళీ వచ్చేసరికి భోజనం తయారుచేయమని మండలితో చెప్పి, ఇస్మాయిల్ పూర్‌కి బాబా బయలుదేరారు ఖైర్తాల్ తిరిగి వచ్చేసరికి చాలా ప్రొద్దుపోయింది. ఎప్పుడో వండిన అన్నం రాత్రి అంత ఆలస్యంగా తినడానికి వారికి మనస్కరించలేదు. వంట చేసినవాడు తన యిష్టంవచ్చినంత కారం వేసేసాడు. బాబా శిష్యులు తడిసిపోయి, అలసిపోయి, మంచి తిండి కూడా లేక ఎలాగో ఆ రాత్రి గడిపారు. మరునాడు మరల ఇస్మాయిల్‌పూర్ వెళ్ళారు. ఇంతక్రితం వచ్చినప్పుడు గోఖలేబాబా బంధువులకు, అంటే అతని మీద ఆధార పడిన వారికి బాబా కొంత డబ్బు ఇచ్చారు. అప్పుడు గోఖలేబాబా, బాబా రాగానే 'భగవాన్ ఆ గయే' అన్నాడు.

ఓఖా అనే గ్రామంలో ఆరడుగుల పొడవుండి మస్తాన్ అనే అసలు జలాలీ మస్తును బాబా 1941 జనవరిలో సాంగత్యం చేసారు. 'ఇతడు ఆధ్యాత్మికంగా చాలా అభివృద్ధి చెందాడని' బాబా చెప్పారు. ఈ మస్తు ఒక గొడ్డలిని తనతో తీసికొని వెళ్తుంటాడు. దానితో కొడతాడేమో అనే భయంతో యీ మస్తును ఎవరూ సమీపించేవారు కాదు. అసలే అజానుబాహువు. అందులో జలాలీమస్తు. అందుచేత భయం ఉండడం సహజమే. కానీ బాబా యెడల మండలి యెడల యితడు జలాలీ అయినా నెమ్మదిగానే వర్తించాడు. మేకపిల్లలా మసిలాడు వాళ్ళ దగ్గర. ఆ మస్తు బాబా యొక్క హస్తాన్ని ముద్దు పెట్టుకున్నాడు. ఆయన మండలి వారి చేతులను కూడా ముద్దు గొన్నాడు. మస్తును, బాబా వారి రహదారీ బంగళాకు తరువాత తీసుకొని వెళ్ళి అక్కడ బాబా అతనికి స్నానం చేయించి

క్రొత్త బట్టలు కట్టించి, ఆతనికి అన్నం పెట్టి పంపించారు. జూనగడ్‌లో బాబా ఒక యోగిని సాంగత్యం చేసారు.

గుజరాత్ నుంచి బాబా ఇందూర్ మీదుగా తిన్నగా మధుర వెళ్ళారుకి దారిలో బస్సు అనేకమార్లు మరమ్మత్తుకి వచ్చింది. డాక్టర్లిద్దరూ-(డా.డాన్‌కిన్, డా:నీం)ఎలాగో దాన్ని బాగు చేసారు. బాబా మీద వారికున్న భక్తి నమ్మకాలు యీ పనులు చేయించాయి. వారివద్ద సరి యయిన పనిముట్లు కూడాలేవు. వారు పట్టుదలతో బాబాను తలుచుకుంటూ పనిచేసారు. ఆ సమయానికే ఆ దారిన గణపతి రావు కె.పచోర్కర్ అనే షరాబు తన కారులో వెళ్తూ వీరికి చాలా సహాయం చేసాడు. తన దగ్గర ఉన్న పనిముట్లను యిచ్చి పనిచేయించాడు. చక్రాలు తగిలించిన తరువాత కారు నెమ్మదిగా పోనిచ్చి బాబా బస్సుతో కూడా ఉండి ఇందూరు చేరేవరకూ వెళ్ళ. తోడుగా ఉన్నాడు. నూరు మైళ్ళదూరం వారితో ప్రయాణం చేయడమే గాక, ఇందూరుపట్నం రాగానే తనకు తెలిసినచోట బస్సు రిపేరు కూడా చేయించి పెట్టాడు.

తరువాత ఇందూరు నుండి బయలుదేరి వెళ్ళినప్పుడు రోడ్డు చాలా చెడ్డగా ఉన్నందువలన ఇంజన్‌పైనున్న మూత (బానెట్) ఊడిపోయింది. తరువాత రెండు స్ప్రింగ్గులు పాడయాయి. ఆ తరువాత డైనమో సరిగా పనిచేయలేదు. అంతేగాక రేడియేటరులో నీళ్ళు నిలువక కారిపోవడం ప్రారంభించాయి. ఇవన్నీ చాలవన్నట్లు ఫేన్ బెల్ట్ తెగిపోయింది. ఇలా ఒకదాని తరువాత ఒకటి ప్రయాణంలో పాడ యాయి. ఇన్ని పోయినాసరే అసలు బస్సు యింతదూరం ఎలా రాగలిగిందో ఆశ్చర్యమే. డాక్టర్లిద్దరూ పుస్తకం చూసి ఏమి చేయాలో ఆ పనులుచేసి ఒక్కొక్కటే చేతనయిన రిపేర్లు చేసుకుంటూ వచ్చారు. ఈ సంఘటనలన్నిటి ద్వారా అవి బాగుచేయడానికి కల్పించిన ఆదుర్దా ద్వారా బాబా వారి ఆధ్యాత్మికమైన పని వారుచేస్తూ వీరికి అదృశ్యంగా సహాయం కూడా చేసేవారు అంతరికంగా. ఒక పర్యాయం బాబా తమ మౌన విరమణ చేసేముందు దేశంలో ఉన్న మస్తులను సాధు సన్యాసులను 70 శాతం మందిని సాంగత్యం చేయాలని చెప్పారు. అందుకనే వారు ఎంతదూరంలో ఉన్నా. ఏమూల ఉన్నా, ఎన్నికష్టాలకయినా ఓర్చి వారిని వెతుక్కుంటూ ప్రయాణాలు చేసి వెళ్ళేవారు.

కొన్ని రోజులు ముందుగా జయపురం వెళ్ళిన బాబా శిష్యుడు అక్కడకు వెళ్ళి ఆయనను రెండు రోజులలో కలిసి వెంటనే జయపురం వైపే ఏర్పాట్లు చేయాలి. క్రిస్టమస్ సెలవుల వలనను, యీ ఏర్పాట్లు రైల్వే అధికారుల ద్వారా కావలెను గనుక కొంచెం కష్టమయ్యెను. అచ్నేరా జంక్షన్ స్టేషన్ అసిస్టెంటు స్టేషను మాస్టరు ద్వారా ఒక మూడవక్లాసు పెట్టె వెంటనే ప్రత్యేకంగా మధుర నుంచి జయపూర్‌కి ఏర్పాటు చేయబడెను. ఆ ప్రయాణంలో మధుర, అచ్నేరా, బండికూయి జంక్షన్‌లవద్ద బళ్ళుమారారు. ప్రత్యేకమయిన రైలుపెట్టె ఏర్పాటు లేకపోతే యీ యాభైమంది శిష్యులతో బాబా ప్రయాణం చాలా కష్టమై ఉండేది. జయపురానికి తిన్నగా అప్పుడు బాబా బృందంతో వెళ్ళిపోయారు.

జయపురం నుంచి బాబా 1941 జనవరి 7వ తేదీన జోధపురం వెళ్ళి, అక్కడ ఉన్నతమయిన ఒక మస్తానీని కలుసుకున్నారు. ఈ మస్తానీమాయి రాజపుతానా మొత్తంలో చాలా పేరుకెక్కింది. ఆమె చాలా వృద్ధురాలు. తన దగ్గర చాలా మూటలు పెట్టుకుంది. ఆమె వంటి మీద బంగారం వెండి నగలు చాలా ధరించింది. ఇంకా కొందరు స్త్రీలు ఆమెకు బహూకరించిన ఎన్నో ధరించినది. వారికి ఆమె వలన ఉపకారం జరిగిందని నమ్మకం కొలదీ ఎంతోమంది యిచ్చారు వస్తువులు. అమె వద్దకు అనేక మంది గొడ్రాలు స్త్రీలు వచ్చి ఆమె ఆశీర్వాదం వలన సంతానం బడసినారు ఎన్నో కానుకలు యిచ్చారు. ఆమె అనేక మహత్యాలు చూపించి ప్రసిద్ధి బడసింది. ఆమె ఒక వసారాలో నివసిస్తూ వుండేది. జోధపురంలో ఆమెకు భోజనం ఏర్పాట్లు కూడా జరిగాయి. బాబా ఆమెను తిరిగి 1942 ఫిబ్రవరిలో సాంగత్యం చేసారు.

జనవరి (1941) 7వతేదీనే బాబా నంగాసాధు అనే ఆరవ భూమికలోని మంచి మస్తుని సాంగత్యం చేసారు. అతడు మజ్జూబ్ వంటి స్థితిలో ఉండేవాడు. అతడు నడివయస్కుడైన ఒక దిగంబరి. బవిరి గడ్డం, చింపిరి తల కలిగిఉండేవాడు. అతడు పాడుబడిన ఒక గుర్రపుసాలకి బయట ఒక ఇసుక దిబ్బ మీద కూర్చునే వాడు. అతడు తన ముఖాన్ని చేతులతో మూసుకొనేవాడు. చేతుల వ్రేళ్ళ సందులలో నుండి అతని వద్దకు వచ్చిన వారివైపు చూసేవాడు. బాబా యితనిని కూడ

1942 ఫిబ్రవరిలో రెండవసారు సాంగత్యం చేసారు. ఈ రెండవ సారు సాంగత్యం చేసినప్పుడు నంగాసాధు ఒక సైనికాధికారి యింటిలో ఒక గదిలో ఉండేవాడు. అతడు ఇతని సంరక్షణ అంతా చూసుకునేవాడు. నంగాసాధు తరవాత మరణించాడు. (1941)జనవరి 7వ తేదీనే నంగా సాధువుకి సమీపంలోని ఉన్న ఇంకొక ముసలి మస్తును బాబా సాంగత్యం చేసారు. అప్పుడతడొక పెంటకుప్ప మీద కూర్చున్నాడు. ఇతడు కూడా దరిమిలాను పరివాసం పొందాడు.

జయపురం చేరుకొని బాబా ఫిబ్రవరి (1941) 25 వరకు అక్కడే ఉన్నారు. జయపురంలో ఉన్నప్పుడు చట్టిబాబా విపరీతమైన చలిరోజుల్లో చొక్కా లేకుండా ఒక్క లుంగీతో రాత్రుళ్ళు ఆరుబయట పరుండేవాడు. అప్పుడు 'చలిగా ఉంది! చలిగా ఉంది!' అనేవాడే గాని కప్పుకునేందుకు గానీ లోపలికి వచ్చి పరుండేందుకు గానీ ప్రయత్నించలేదు. జయపురం వెళ్ళాక బాబా తమ శిష్యుల నిద్దరిని ఆ నగరమందలి ప్రముఖులను కలుసుకోమని, బాబా గురించి బహిరంగ సభలలో చెప్పమని ఆజ్ఞాపించారు జయపురంలో అటువంటి బహిరంగసభ జనవరి 19వ తేది ఆదివారంనాడు జరిగింది.

బాబా ఆ సంవత్సరం ఏకాంతవాసంలో గడుపుతున్నారు గనుక, తమ శిష్యులు కొద్దిమంది దగ్గర ఉన్న, చాలామంది భక్తులకు దూరంగా ఉండుటచేత మెహెరాబాద్‌లో గాని, బెంగుళూరులో గానీ, జయపురంలోగానీ బాబా జన్మదినోత్సవల చేయడానికి— బాబా అనుమతించ లేదు.

బాబా ఆజ్ఞప్రకారం రాజకుమారి నోరీనామా చెబెల్లీ బాబా జీవితము, ఆయన సత్యప్రేమ సందేశాలు గురించి 1941 ఫిబ్రవరి 12వ తేదీని రెండు బహిరంగ సభలలో ఉపన్యాసాలిచ్చినది. ఆ సభలకు నగరం లోని ప్రముఖులు విద్యాధికులు చాలా మంది వచ్చి బాబాను గురించి తెలుసు కున్నారు. వారందరికీ బాబాను గురించి యింకా తెలుసుకోవాలని కాంక్ష కలిగినది. మొదటి ఉపన్యాసము విన్న తరువాత అగ్రవాల్, వాయర్ అనువారు ఒక మహమ్మద్దీయుని సహకారంతో రెండవ ఉపన్యాసమునకు సభ ఏర్పాటుచేసారు. ఇది రామ్‌నివాస్ తోటలో మ్యూజియమ్ పార్కులో జరిగినది. సుమారు వెయ్యి మంది జయపూర్‌వాసులు ఆ సభకుహాజరై ఉపన్యాసం శ్రద్ధగావిన్నారు. అగ్రవాల్ జయపురంలో అడ్వకేటుగా ఉన్నాడు. అతడు మొదట రాజకుమారిని సభాసదులకు

పరిచయం చేశాడు. నోరీనా మాచెబెల్లి ఉపన్యాసమును షా ఆలీముద్దీన్ అహమ్మద్ అను మహమ్మదీయ అడ్వకేటు హిందీ భాషలో అనువదించి చెప్పాడు. పాశ్చాత్యనాగరికతకు నిలయమయిన అమెరికాలో సకలభోగాలకు ఆలవాలముగా వున్న దేశములో నివసిస్తున్న రాజకుమారి నోరీనా మాచెబెల్లి అన్నిటిని త్యాగంచేసి దివ్యప్రేమ కొరకు నిస్వార్ధసేవకొరకు పాటుపడుచుండుట — జయపుర వాసులకు ఆశ్చర్యము కలిగించెను. ఆ సభలో 'మెహెర్ బాబా జీవితము గురించి' ఆయన బోధల గురించి' అచ్చువేసిన కాగితములను పంచి పెట్టారు. నాగపూరు నగరము నందు కూడా రాజకుమారి బాబా జీవితసందేశములను వ్యాప్తము గావించెను. నాగపూరు విశ్వవిద్యాలయం వారి ఆహ్వానముపై డా. ఓ కే. దర్, వైస్ ఛాన్సలర్ అధ్యక్షత వహించిన సభలో డా.సి.డి. దేశ్‌ముక్ సభవారికి ఆమెను పరిచయం చేసిన తరువాత, బాబా గురించి గంభీరముగా ఉపన్యసించెను. జయపురము నందు ఆమె ఉపన్యాసమును విన్న తరువాత రాజకుమారి నోరీనా మాచెబెల్లిని అక్కడ యింకా ఒకరోజు ఉండమని జయపురం పౌరులు పట్టుపట్టారు ఆమెను మెహెర్‌బాబా దర్శనము చేయించ మని ప్రతిమాలారు. కాని, బాబా అప్పుడు ఏకాంతవాసంలో ఉన్నారు గనుక ఆయనను ఎవరూ చూడటానికి వీలుకలుగలేదు.

మరల 1941 వ సంవత్సరం జనవరిలో బాబా జైపూర్ వెళ్ళినప్పుడు నంగా బాబా అనే మస్తును తీసికొని రమ్మని ఏరచ్‌ని పంపించారు. ఇతనిని ఫిబ్రవరి (1939) 8వ మొదట బాబా సాంగత్యం చేసారు. అతడు సంపూర్ణ దిగంబరుడు. చేతిలో కర్రకి చివర త్రిశూలంలా ఉంటుంది. ఆ కర్రకి గుడ్డ పీలికలు చుట్టి పెట్టి చేతితో పట్టుకొని నడిచేవాడు. అంబర్ కోటకు ఎదురుగా ఉన్న పర్వతం మీద యితని నివాసం. ప్రతి ఉదయం కొండదిగి అంబర్ గ్రామానికివచ్చి ఏ దుకాణం లోనో కొన్ని మిఠాయి తీసుకుని ఎవరితోనూ మాట్లాడకుండా మళ్ళీ తన కొండ మీదికి వెళ్ళిపోతాడు. అతడు తింటేనే చాలన్నట్లుగా ఎవరినడిగినా, వారు మిఠాయి సంతోషంగా యిస్తారు. ఆ కొండకి వెళ్ళే దారిలో ఒకచోట చిన్న దేవుడి గుడి ఉంది. అక్కడ ఒక ఊటగడ్డ ఉంది. అక్కడ నీటితో చేతులూ కాళ్ళూ ముఖము కడుగుకొని ఆ మిఠాయితిని మంచినీళ్ళు త్రాగి వెళ్తారు. అప్పుడు 'మట్టితో ఉండలు ఎందుకు'? అని అడిగితే యివి నిప్పు బంతులు, ప్రపంచంలో యితర దేశాలలో ఉన్న పెద్ద నగరాలమీద వాటిని విసరమన్నారు! నన్ను. అందుచేత నాకు

చాలా పనివుంది. నీతో మాట్లాడడానికి నాకు తీరికలేదు' అన్నాడు. 'ఈ కర్ర ఎందుకంటే'? 'యిది ఆ నగరములవైపు గురి చూడడానికి నాకు సహాయం చేస్తుంది.'' ''బాబా వద్దకు జైపూర్‌కి రమ్మంటే'' ''అలాగే ఒక రోజున వస్తానులే'' అన్నాడు. కొన్ని రోజులయిన తరువాత బాబా బంగళా దాటి నడుస్తుంటే' ఎరచ్ 'అక్కడ తెరచివున్న మోటారు షెడ్డులోకి రమ్మంటే' వచ్చాడు. అక్కడే బాబా అతనిని సాంగత్యం చేసారు. సాధారణంగా జైపూర్‌కి అతడు రాడు. తాను వస్తానన్నాడు గనుక తనమాట నిలబెట్టుకున్నాడు.

బాబా 1941 జనవరి మాసంలో జైపూరులో పొంబాకువాలా అనే మంచి మస్తును సాంగత్యం చేసారు ఇతడు పొడుగరి అయిన మధ్యవయస్కుడు. ఇతనికి ఎప్పుడూ పొగాకు నమలడం అలవాటు—పొగాకు చేతినిండా తీసుకొని నోట్లోవేసుకొని నమలడమే. అతనిని బాబా వద్దకు తీసికొని వచ్చాక, బాబా మామూలుగా మస్తున్ని స్నానం చేయించి, క్రొత్తబట్టలు కట్టించి, భోజనం పెట్టారు. బాబా వద్దనుండి 'ఆనవాలుకి ఏదయినా కావాలన్నాడు' మస్తు. బాబా మిఠాయి యిచ్చారు. తరువాత యీ మస్తు మరణించాడు.

జైపూరులో బాబా 50 మంది వికలాంగులను, గుడ్డి వారిని బస్సులలో తీసికొని వచ్చి వారిని స్నానము చేయించి, బట్టలు పెట్టి, వారికి మిఠాయిలు యిచ్చారు. ఆ మాసంలోనే చుట్కాన్ షా అనే ఉన్నతుడయిన మస్తును బాబా జైపూరులో సాంగత్యం చేసారు. షా అపరిశుభ్రంగా ఉంటాడు. ఇతనిని భోగస్త్రీలు గౌరవిస్తారు. తరువాత మాంసం అమ్ముకునేవారు కూడా చుట్కాన్‌షాని గౌరవిస్తారు. అతనిని జైపూరులో చాలామంది బాగా ఎరుగుదురు. చట్కాన్‌షాకి 50 ఏళ్ళలోపుగా ఉంటాయి, మాసిపోయిన ఒక పొడుగయిన కఫ్నీ ధరిస్తాడు. చుట్కాన్ షా పొట్టిగా ఉండేవాడు. అతనికి తల ఆడించడం ఒక అలవాటు. అతనిని బాబా వద్దకు ఎలిజబెత్ కారులో ఎక్కించి తీసికొని వెళ్ళారు. కారులో ఎక్కడానికి అతనిని బ్రతిమిలాడ వలసి వచ్చింది. తీరా అతడు ఎక్కిన తరువాత కారు బయలు దేర లేదు. ఇదివరకెప్పుడూ కారుతో ఏ పేచీలేదు. అటువంటిది యిప్పుడు కదలలేదు. మస్తును తీసుకుపోతున్నారు గనుక కారు బయులుదేర లేదని అక్కడి నోమరులు కొందరన్నారు. కార్బురేటర్ శుభ్ర పరిచేసరికి కారు పోగానే పని చేసింది. చుట్కాన్‌షాను బాబా వద్దకు తీసికొని వచ్చారు. స్నానం చేయించడానికి, అన్నం పెట్టడానికి, బాబా సాంగత్యం కోసం బాబా వద్దకు తీసుకువచ్చారు మస్తును.

బాబా యింటిలో అతనిని ఒకటి రెండు రోజులు ఉంచుకున్నారు. రాత్రి పూట మండలిలోని వారు పంతులు వరీగా మస్తుతో కూర్చున్నారు. చుట్టాన్‌షాకి చాలా కోపం. ఆ కోపంలో ఏ పనయినా చేసేస్తాడేమోనని భయం. ఒక మారు అతడు రాయి మీద పడేసి ఒకడిని చంపాడని అంటారు. అతడు ముసలివాడు. కొన్నాళ్ళ తరువాత చుట్టాన్ షా మరణించాడు.

ముగ్గురు శిష్యులను మాత్రం వెంటబెట్టుకొని బాబా 15 రోజులు రైలు మీద పర్యటించి వచ్చారు. ఈ పర్యటనలో ఢిల్లీ, లక్నో, వారణాసి, కలకత్తా, పూరీ—జగన్నాథం, రామనాడ్, చొందా మొదలగు నగరాలు దర్శించి మొత్తం 500 మైళ్ళు 15 రోజులలో తిరిగి వచ్చారు. ఆయా నగరాలన్నిటిలోను పేద వారికి స్నానం చేయించి వారికి క్రొత్తబట్టలిచ్చి భోజనాలు పెట్టారు. రాత్రిళ్ళు క్రిక్కిరిసిన మూడవ తరగతి రైళ్ళలో ప్రయాణాలు చేస్తూ పగలు యీ పనంతా చేస్తూ వచ్చారని—తలచుకుంటే ఒక పక్షం రోజులలో యిన్ని పట్టణాలు తిరిగి రావడం ఒక అసాధారణమైన సంగతని-- చెప్పక తప్పదు. ప్రతిరోజూ ఒక్కపూట మాత్రము భోజనం చేస్తూండేవారు. కొన్నిచోట్ల అదికూడా వీలయేదికాదు

1941 ఫిబ్రవరిలో పూరీ--జగన్నాథ్‌లో బాబా కొందరు పేరు తెలియని మస్తులను సాంగత్యం చేసారు. మొదటివాడు 35 ఏళ్ళ వయసు గల మంచి మస్తు. ఇతనికి జమాలీ లక్షణాలున్నాయి చినిగిన గుడ్డలు కట్టుకునే యీ ముస్లిమ్‌ను అక్కడ ప్రజలు చాలా గౌరవిస్తారు. మండలిని పంపించి బాబా ఆ వస్తును నారు దిగిన రాధారీ బంగాళాకు రావించి మస్తుకు స్నానం చేయించి బాబా అతని సాంగత్యం చేసారు ఆ రోజునే బాబా 50 మంది పేదవారిని రప్పించి వారి పాదాలు కడిగి భోజనం పెట్టారు. అందులో కొందరు కుష్ఠురోగులున్నారు. అక్కడినుండి దక్షిణానికి వెళ్తూ వాల్తేరులో ఒక పేరు తెలియని మస్తును బాబా సాంగత్యం చేసారు.

'ఫిబ్రవరి 12వ తేదీ వస్తున్నామని' రామ్‌నాడ్‌లో ఒక శిష్యునికి టెలిగ్రాం యిచ్చి, మద్రాసుకు దగ్గరలో ఒకచోట కలియమన్నారు. 'అతని వాక్సహాలు కారుతో రమ్మనమని' బాబా ఆ టెలిగ్రాంలో వ్రాసారు. ఆ ప్రకారంగా అతనికి బాబా దర్శనం పదినిమిషముల్ల పాటు కలిగినది. బాబాకు ఏకాంతవాస నియమముండుట

చేత పాదాలకు నమస్కారం చేయడానికి పిలుకాలేదు. బెంగుళూరునుండి తెప్పించిన పళ్ళబుట్ట బాబాకు అ శిష్యుడు సమర్పించు కున్నాడు. ఆ పళ్ళుకొన్ని మందలికిచ్చి, 'రామ్‌నాడ్ నగరానికి బయలుదేరేముందు భోజనాలు చేసిరమ్మని' చెప్పారు. బాబా యీ ప్రయాణంలో పళ్ళు మాత్రమే తిన్నారు.

రామ్‌నాడ్‌కి బయలుదేరేసరికి మధ్యాహ్నం ఒంటిగంట అయినది. 'కారునడిపే టప్పుడు మామూలుకంటె జాగ్రత్త ఎక్కువ వహించమని' బాబా 'అనేకమారులు హెచ్చరించారు. అందుకని అతడు కారు చాలా జాగ్రత్తగా నడుపుతూ వచ్చాడు. చాలా రోజుల తరువాత అతని క్రొత్తకారులో బాబాను కూర్చోబెట్టుకొని తీసికొని వెళ్ళుటకు అతడు చాలా సంతోషించాడు. విల్లుపురం వరకు హాయిగా వెళ్ళారు. అక్కడ కారు ఆపి బాబా అతనికి టీ యిచ్చారు. కావలసినన్ని కప్పులు అతనికిచ్చి తాగమన్నారు. అందువలన అతనికి కొంత శక్తివచ్చింది. అయినా బాబా తనకారులో ఉన్నారన్న సంతోషం అంతకంటె ఎక్కువ బలాన్నిచ్చింది. బాబా అతనితో అక్షర ఫలకం మీద చూపిస్తూ' నా పుట్టినరోజునాడు (ఫిబ్రవరి 15వ తేదీన పార్శీ పంచాంగం ప్రకారం బాబా పుట్టిన రోజయినది) నీవు నన్ను కారులో తీసికొని వెళుతున్నందుకు నీవు చాలా అదృష్టవంతుడవు. నేను యిప్పుడు ఇండియాలో ఉన్న మస్తులందరికీ మహారాజువంటి అతి ప్రధానమైన మస్తు దగ్గరకు వెళ్తున్నాను. అతనిని స్పృశించి సాంగత్యం చేస్తే నా మస్తు కార్యక్రమంలో ఒక ఘట్టంపూర్తి అవుతుంది' అని బాబా చెప్పారు.

పల్లకొల్లా బాబా మహమ్మదీయ మస్తు. హిందూ మహమ్మదీయులు సమంగా అనేక వేల మందిచేత అతడు గౌరవింపబడుతున్నాడు. అతడు అప్పుడప్పుడు సిలోన్‌కి వెళ్ళి వస్తుంటాడు. ఆతడు ముందు సంవత్సరం సిలోన్ వెళ్ళి వచ్చి నప్పుడు అతని రైలు దగ్గర కూడిన ప్రజా సమూహం చాలా ఎక్కువగా ఉండు టచే ఆ సమ్మర్దంలో కొంతమంది నలిగిపోయారు పాపం.

రాత్రి తొమ్మిది గంటలకు కారు ఎక్కడా ఆగకుండా వెళ్ళినందున తిరుచినాపల్లి చేరుకున్నారు. అక్కడ కారు ఆపి అందులో పెట్రోలు వేయించాడు బాబా— శిష్యుడు. వారివద్ద రోడ్డు మార్గాల మ్యాప్‌ఉన్నను, దిండిగల్ మీదుగా మధురై వెళ్ళడానికి కొంత తికమక పడ్డారు. మధురై చేరేసరికి అర్ధరాత్రయినది.

అర్ధరాత్రి అవడమే కాకుండా, కొద్దిరోజుల క్రిందట హిందూ మహమ్మదీయుల కొట్లాటలు జరిగినందున పట్టణమంతా నిర్మానుష్యంగా ఉంది. మధురై నుంచి ఎలా వెళ్ళాలో చూపించేందుకు ఒకడిని కారులో తమకూడా పదిమైళ్ళ వరక్కు తీసికొని వెళ్ళి, అక్కడ ఒక రైలుస్టేషన్‌లో అతనిని దింపి, తిరిగి రైలులో వెళ్ళ మన్నారు. రోడ్డు అంత బాగాలేదు. వాతావరణం చల్లగా ఉంది. అందులోనూ వెన్నెల రాత్రి గనుక హాయిగా నిద్రవచ్చేట్టుగా ఉంది. కానీ బాబా దగ్గర ఉండుటచే కారు నడుపుతున్న బాబా శిష్యునికి నిద్రరావడం లేదు. బాబా సౌంజ్ఞలతో అతనితో ఏదో మాట్లాడుతూనే ఉన్నారు. రోడ్డుమీద గోతులు ఉన్నా ఖాతరు చేయకుండా కారు నడుపుతూనే ఉన్నాడు. రాత్రి పన్నెండు గంటలు దాటింది. ఒక గ్రామం తరువాత ఇంకొక గ్రామము వెనక్కి పోతోంది. రామనాథపురం సమీపిస్తోందని అ దీపాలు చెప్తున్నాయి. రామనాథపురానికి ముందుగా ఒక పాతికమైళ్ళ దూరంలో ఒక చిన్నపట్టణం వచ్చింది. అక్కడ రహదారీ బంగళాలో దిగి రాత్రి శేషం గడుపుదామన్నారు బాబా. బంగళా ఆవరణలోనికి వెళ్ళేసరికి దాని వాచ్‌మన్ లేడు తలుపులు తాళాలు వేసి ఉన్నాయి. బాబా వరండాలో ప్రక్క వేసుకొని ఒక శిష్యుని కూడా అక్కడ ఉండమని 3–30 గంటలకు పరున్నారు. తెల్లవారి 6 గంటలకే బయలుదేరారు. రామనాథపురం వెళ్ళి, అక్కడి నుండి కిలక్కైరై కు వెళ్ళారు తిన్నగా. ఆ ఊరికి రోడ్డు సన్నగా ఉంది. అంతా గొప్పులు గోతులు. దారిలో ఒక పాత వంతెన ఉంది. అది పడిపోతూండటబట్టి బాబా కారులోనుండి క్రిందికి దిగవలసి వచ్చింది. శిష్యుడు ఎలాగో వంతెన దాటించాడు కారుని. గ్రామం లోనికి వెళ్ళిన తరువాత బాబా ఒక్కశిష్యుని (రాత్రి వరండాలో ఉన్నవానిని) మాత్రం తీసికొనివెళ్ళారు మస్తుదగ్గరకు. మస్తు దగ్గర చాలామంది జనంచేరి ఉన్నారు. చాలా మంది పిల్లలుకూడా ఉన్నారు. శిష్యుడు చాకచక్యంతో వాళ్ళందరినీ దూరంగా పంపేసాడు. బాబా ఒక్కరూ మస్తు దగ్గర ఒక గంట కూర్చున్నారు. అ సమయంలోనే అతనికి కొన్ని ముద్దలు అన్నం తినిపించారు. అంతవరకూ బాబావారి శిష్యులు బాబా ఆజ్ఞప్రకారం ఉపవాసం ఉన్నారు. తరువాత బాబా స్థానిక రహదారీ బంగళాకి వెళ్ళారు. అప్పుడు అందరూ వారి ఉపవాస విరమణ చేసారు. ఇదే అతనితో అఖరి సాంగత్యం తరువాత పల్లుకొల్లా బాబా దేహం చాలించాడు. మరణాత్పూర్వం అవతారుని సాంగత్యం కలిగినందుకు ఆ మస్తు ఎంత అదృష్టవంతుడో.

కిలక్కేరైలో యీ వృద్ధమస్తును సాంగత్యం చేసినపుడు బాబా యీ విధంగా నిశ్చయించు కున్నారు. ం

1) 1941 ఆగష్టు 1వ తేదీన నాకు నేను మాట్లాడుకోవడం ప్రారంభం కావాలి.

2) నా యొక్క ప్రపంచ వ్యక్తీకరణ సంపూర్ణ ప్రకటన 1942 ఫిబ్రవరి 15వ తేదీన జరగాలి. నా యొక్క ప్రస్తుత ఏకాంత పద్ధతి ఏప్రిల్ 15వ తేదీ వరకూ సాగుతుంది. 1941 ఏప్రిల్ 15 నుండి, 1942 ఫిబ్రవరి 15 వరకు నా ఏకాంతము సంపూర్ణంగా ఉంటుంది. నా శిష్యులకు కూడా నేను కనబడను. నేను ఎవరినీ చూడను. ఈ కాలము నందు ప్రపంచ వ్యవహారాలు, 1942లో జరుగబోవు నా ప్రకటీకరణం పరాకాష్ఠను పొందేలా నేను తీసికొని వెళ్తాను. అది లగాయతు ప్రపంచంలో కావలసిన సర్దుబాట్లు మార్పులు జరగడానికి ప్రారంభం అవుతుంది. తరువాత ఆధ్యాత్మిక పునరుద్ధరణ కలుగ చేస్తాను. నొరినా, నరీనె, ఎలిజబెత్ లను అమెరికాకు, మార్గరెట్, ఐరీన్ లను యూరప్‌కు నాయొక్క సందేశవ్యాప్తికై, పంపుటకు నిశ్చయించుకున్నాను. ఏప్రిల్ అంతమునకు యీ ప్రకటన ప్రపంచం అంతటికీ తెలిసేలా బహిరంగ పరుస్తాను. నా శిష్యులు నేను చెప్పిన స్థలములలో నా సందేశాన్ని స్వయంగా యిస్తారు.

నా యొక్క ప్రత్యేకాజ్ఞలను పాటిస్తున్నవారు యీ ఆజ్ఞలను పాటించడంలో ఆగస్టు 1వ తేదీనుండియు స్వేచ్ఛ పొందుతారు. నాతో సంబంధము పెట్టుకున్నంత కాలము పాటించిన ఆజ్ఞలను మాత్రము వారు పాటిస్తారు. కానీ 1942 జనవరి 1వ తేదీ లగాయతు ఫిబ్రవరి 15వ తేదీ వరకు వారందరు మరియు ఆధ్యాత్మిక అభివృద్ధిగాని, ఆధ్యాత్మికపు వెలుగుగాని, ఆత్మజ్ఞానముగాని, భగవత్సాక్షాత్కారముగాని వాగ్దానము చేయబడిన వారంతా రోజుకి 1 1/2 శేర్లు అచ్చంగా పాలుగాని టీ, కాఫీలుగానీ, లేక మజ్జిగగానీ రోజులో ఎన్నిసార్లయినా ఎప్పుడయినా కావలసినప్పుడు తీసుకొంటూ ఉపవాసం చేయాలి. టీ గాని, కాఫీగాని, పాలతోగాని నీళ్ళతో గాని లేక పాలునీళ్ళతో గాని త్రాగవచ్చును. మొత్తం రోజులోతీసుకున్న పాలు 1 1/2 శేర్లకు మించకూడదు. మొత్తం 8 చెంచాల పంచదార కన్న ఎక్కువ వాడకూడదు.

నీరుగాని సోడా గానీ ఎంతకావలసివస్తే అంతత్రాగవచ్చును. 1941 ఆగస్టు 1టవతేదీ నుండి 1942 ఫిబ్రవరి 15వ తేదీ వరకు గుస్తాద్ జీ హంసోటియా, కె.జె. ప్లీడర్, స్వామిభవానంద, సావక్ కొత్వాల్ - వీరు నేను చెప్పే ప్రకారం కొండలలో ఏకాంత వాసంచేస్తారు".

బాబా మార్చి (1941) మాసంలో చేసిన క్వెట్టా ప్రయాణంలో గాని యీ నిశ్చయాన్ని మండలికి కూడా బహిరంగపరచ లేదు. దక్షిణభారతం నుంచి బాబా తిరిగి జయపురం వెళ్ళారు.

జయపురం నుండి ప్రియతమ బాబా జన్మదినం అయిన ఫిబ్రవరి 25 వ తేదీ వేకువ జామున బాబా ఎలిజబెత్ పాటర్సన్ స్వంత బ్యూక్ కారులో కూర్చున్నారు. ఆమెయే ఆ కారు నడుపుతోంది. మండలి అందరూ (ఎరచ్, నీలు, వగైరాలు) షెవర్లెట్ బస్‌లో బయలుదేరారు. ఈబస్ ఏరచ్ నడుపు తున్నాడు. బస్సు చాలా పాతదయింది. దానిమీద మండలి తాలూకు సామానులు, పరుపు చుట్టలు మొదలైనవి వేసారు. ఇంకా మిగిలిన సామానులు లోపల వేసారు. బస్సుకి తగిలించిన చక్రాలు కాక ఇంకా రెండు చక్రాలున్నాయి. కాని వాటికిఉన్న టైర్లు పాతవి అరిగి పోయాయి. ఇలా ఆగ్రాకు బయలుదేరారు. బాబా కూర్చున్న బ్యూక్ కారు ముందు పోతోంది, తెల్లగా తెల్లవారింది. వాతావరణం చాలా ఆహ్లాదకరంగా ఉంది ప్రొద్దెక్కిన కొద్దీ వేడి ఎక్కువవుతున్నందున ప్రయాణంలోని ఆనందం కూడా తగ్గుతోంది.

ఆగ్రా చేరే సరికి మధ్యాహ్నం 12 గంటలు దాటింది. అందరూ విశ్రాంతి గృహంలో దిగారు. దిగగానే బాబా ఎరచ్‌ని, నీలుని బస్సుమీద ఉన్న పరుపు చుట్టలు దింపమన్నారు. అలసిపోయి ఉన్నా బాబా ఆజ్ఞ వెంటనే పాలించారు. అన్నీ దింపేసి, బట్టలు ఒళ్ళు దుమ్ముతో నిండి ఉండగా శుభ్రంగా దులుపుకుని, ఒళ్ళు కడుక్కొని అందరూ భోజనాలు చేసారు. మధ్యాహ్నం విశ్రమించాక, టీ కూడా తీసుకున్న తరువాత బాబా 'మస్తులను వెదకి తీసికొని రమ్మని' ఎరచ్‌ని పంపించారు. జాల్‌భాయిని, నీలూని బజారుకి పంపారు. సాయంకాలం బాబా అందరితోను తాజ్‌మహల్ చూడడానికి బయలుదేరారు. తాజ్ చూసి, ఆగ్రాకోట, ఫతేపూర్‌సిక్రీకి వెళ్ళి అన్నీచూసి వచ్చారు. ఆగ్రా అందరికీ నచ్చింది. ఎక్కడచూసినా అక్బర్ రాజ్య

చిహ్నాలు కనిపించాయి. అందుచేతనే దీనిని అక్బర్ యొక్క నగరం అన్నారు. సప్త ప్రపంచ మహాద్భుతాలలో ఒకటయిన అమరమైన తాజమహల్ ఉన్న నగరం ఆగ్రా. ఆ రాత్రి పరుండేసరికి ఆలస్యం అయినది.

మరునాడు బాబా మస్తుల సాంగత్యం చేసారు. ఎరచ్ కి నీలుకి పని చాలా ఉండుటచే బస్సు పని చేయడానికి సమయం చాలలేదు వారికి. ఆగ్రా పట్టణంలో బాబా తాజ్ మహల్ కి 2 ఫర్లాంగుల దూరంలో ఘస్తానీమాయి అనే మస్తానీని సాంగత్యం చేసారు. ఆమె ఒక ఉపయోగంలో లేని గుర్రపుశాలలో ఒక్కరై ఉంటూ ఉండేది. ఆ గుర్రపుశాలవద్దకు బాబా అయన శిష్యునితో సమీపించేసరికి, ఒక పెద్దపులి యొక్క గర్జనవలె వారికి ధ్వని వినిపించింది. దగ్గరకు వచ్చి చూస్తే యీ వృద్ధురాలు కనిపించింది. ఈమె ముసలిది అయినా అజానుబాహువయిన బలమయిన మనిషి ఆమె ముఖం ప్రకాశంగా ఆకర్షణీయంగా ఉండేది. ఇలా గర్జిస్తూ అమె పచార్లు చేస్తూంటుంది. బాబా దగ్గరకు వచ్చేసరికి, ఆమె ఆ ధ్వని చేయడం మాని, అయనకు గౌరవంతో నమస్కరించింది. ఆయునను కలిసినందుకు ఆమె ఎంతో అనందించింది. బాబా, ఎరచ్‌ను అమెను అడగమంటే 'బాబాను చూడడం వలన ఆతను చాలా ఆనందించానని' బాబాకుకూడా ఆమె జవాబు చెప్పింది. బాబా కూడా ఆమెను కలుసు కున్నందుకు చాలా సంతోషించారు. ఆమె ఉన్నత మయిన మస్తానీ—అని బాబా అన్నారు. తరువాత కొన్నాళ్ళకు ఆమె చనిపోయింది. బాబాతో యీ సాంగత్యం కోసమే ఆ వృద్ధురాలు జీవించిఉంది కాబోలు.

ఆ మరునాడు 27వ తేదీన తెల్లవారు ఝామున 3-30 గంటలకే బాబా అందరినీ లేపేసారు. వెంటనే ఎరచ్ మొదలయిన బాబా శిష్యులందరు వారివారి పరుపుచుట్టలన్నీ బస్సుమీద సర్దేసి, త్రాళ్ళతో బిగించారు క్రిందపడిపోకుండా. బస్సు ఎంత వేగంగా వెళ్ళినా యింక క్రిందపడదు. ఈ త్రాళ్ళ కడుతూంటే వారికి చేతులు తిమ్మిరిలెక్కాయి. కొయ్యబారినట్లు అయినవి. చీకటి ఉండగానే బాబా ముందు కారులో వెళ్ళగా, వెనుకనే బస్సుకూడా వెంటనే బయలుదేరింది.

ఆగ్రానుంచి ఢిల్లీ 127 మైళ్ళు ఉంది. కొంత దూరం వెళ్ళిన తరువాత సూర్యోదయమయ్యేసరికి అందరికీ సంతోషం కలిగింది. బాబా కూర్చున్న బ్యూక్ కారును ఎలిజబెత్ గంటకి 60 మైళ్ళ వేగంతో నడుపుతూంది. ఎరచ్ బస్సును గంటకి 40 మైళ్ళ వేగంతో పోనిస్తున్నాడు. బాబా వెంట ఎలిజబెత్ తో అయిదు

గురు స్త్రీలున్నారు. బస్సు 60 మైళ్ళదూరం వచ్చింది. అక్కడ రైల్వే మార్గం దాటారు. వెంటనే ఏదో పేలినట్లు పెద్ద చప్పుడయింది. టైరుకి ఏదో గుచ్చుకుంది కాబోలు రంధ్రం పడినది. చక్రం మార్చి యింకొకటి ఎక్కించి అంతా సిద్ధం చేసేసరికి ఎరచ్‌కి నీలూకి .ఒక గంట పట్టింది. ఇంకా కొంచెం దూరం వెళ్ళిన తరువాత యిలాగే యింకొక చక్రం మార్చవలసి వచ్చింది. బ్యూక్ కారు బాబాతో చాలా ముందుకి వేగంగా వెళ్ళింది. బాబా రోడ్డు ప్రక్కన కారు ఆపించి బస్సు వచ్చేవరకు వేచియున్నారు. ఇలా జరిగిందని చెప్పినా బాబా ఎరచ్‌తో 'బస్సు యింకా వేగంగా నడుపుకొని రమ్మని' చెప్పారు. పాతబస్సు, దాని నిండా అంతమంది జనం సామానులతో యింకా వేగంగా పోనివ్వడానికి ఎరచ్‌కి భయంగా ఉంది. టైర్లన్నీ అరిగిపోయి ఉండడం చేత మళ్ళీ యింకొకటైరుకి, పంచర్ పడితే బాగుచేయవలసి వచ్చింది. బాబా ఢిల్లీకి వెళ్ళి బస్ యింకా ర లేదని తిరిగి రోడ్డుమీద వెనక్కి వచ్చారు సంగతి కనుక్కుందామని. చాలా అలిసిపోయి బస్సుని ఢిల్లీలో రీగల్ హోటల్‌కి చేర్చాడు ఎరచ్. చేరగానే అందరూ సామానులు హోటలులోనికి తీసికొని వెళ్ళారు. అ హోటలులో 3 రోజులుండాలి. ఆలస్యమయితే భోజనం దొరకదేమోనని, స్నానాలు చేయకుండానే భోజనాలు చేసారు. మళ్ళీ అక్కడ మస్తులకోసం బయలుదేరి ఎరచ్ వెళ్ళాడు. మరి కొందరు బజారు పనులకు వెళ్ళారు.

ఢిల్లీలో జుమ్మా మసీద్‌వద్ద ఒక్కడు తప్ప ఎరచ్‌కి యింక మస్తులెవరూ దొరకలేదు. క్వెట్టా వెళ్ళేదారిలో ఎక్కడ ఎవరెవరు మస్తులున్నారో అది మాత్రం తెలుసుకొని వ్రాసుకున్నాడు ఎరచ్.

సాయంకాలం బాబా మండలిని ఢిల్లీలోని చాందినీచౌక్‌కి, జుమ్మామసీద్ తీసుకొని వెళ్ళారు. మసీద్ వద్ద బాబా మస్తుని కలుసుకున్నారు. తరువాత, రెండు రోజులుకూడా, యీ మస్తుతో సాంగత్యం చేసారు బాబా. రెండవరోజు ఉదయం బాబా దగ్గరఉండి అందరకు కుతుబ్ మీనార్, హుమాయూన్ గోరీ చూపించారు. అ సాయంకాలం క్రొత్త ఢిల్లీ నగరం చూసారు.

బాబా ఢిల్లీలో హాఫీజ్‌జీ అనే మస్తును (1941) ఫిబ్రవరి నెలలో సాంగత్యం చేసారు. ఇతడు అసలు హఫీజ్‌జీ నబీనా అని ప్రసిద్ధికెక్కిన మస్తుకి

యొక్క శిష్యుడు. ఇతడు మౌల్వీలాగ ఉంటాడు. ముసలివాడు. జపమాల త్రిప్పుతూ ఉంటాడు. ప్రార్థనలు చదువుతూ ఉంటాడు. బాబా యితనితో సాంగత్యం సరిగ్గా ఏ తేదీన జరిపారో తెలియదు. ఫిబ్రవరి నెలలో మాత్రం అతనిని కలుసుకున్నారు. అది 28వ తేదీ అయి ఉండవచ్చును.

1941 మార్చి 2వ తేదీన బాబా తమ మండలితో డిల్లీ నుంచి క్వెట్టాకు మోటారుకారులో లాహోరు ముల్తాన్ నగరాల మీదుగా ప్రయాణం చేసారు. ఈ దీర్ఘప్రయాణం పదిరోజులు పట్టింది. ఈ ప్రయాణమున యీ దారిన వెళ్ళాలని 15 రోజులు ముందుగా బాబాయే నిర్ణయించారు. దీనికి సంబంధించిన యావత్తు ఖంజాయింపు బాబాయే చేసారు. అయినా యీ ప్రయాణము నందు, అనేక కష్టములను అపాయములను ఎదుర్కొనవలసి వచ్చింది. ఈ ప్రయాణంలో ముఖ్యంగా ఎలిజబెత్, కిట్టి, రానో, ఎరచ్, చాలా కష్టపడ్డారు. చాలా ధైర్యంతోను సాహసంతోను, సహనంతోను చివరివరకు వ్యవహరించారు. మొదటి నుండి చివరి వరకు బాబా వారితో ఉండబట్టి ఆయన దయ వలననే ఎన్నికష్టాలు వచ్చినా జయప్రదంగా సంతోషంగా ప్రయాణం ముగిసింది. ఎరచ్, నీలు యిద్దరూ బాబాని 'క్రొత్త టైర్లు ట్యూబులు కొనమని' అడిగారు. కానీ బాబా అందుకు అంగీకరించలేదు. కొంతసేపు బస్సుని పరిశుభ్రం చేయించడానికి కూడా వ్యవధి యివ్వలేదు. పాడయిన టైర్లు మాత్రం బాగుచేయించారు బాబా. బస్‌ను 45 మైళ్ళ వేగంతో తీసుకురావాలని బాబా ఎరచ్‌తో చెప్పి, 250 మైళ్ళ దూరంలో ఉన్న జలంధర్‌కి బాగా చీకటి ఉండగా తెల్లవారగట్ల బయులుదేరారు. సూర్యోదయం కాగానే రోడ్డు కిరుప్రక్కలా పచ్చని గోధుమచేలు కంటికింపుగా కనిపించాయి. అవి అలా మైళ్ళ కొద్దీ ఉన్నాయి. సూర్యరశ్మి పచ్చని గోధుమచేల మీదపడి వింతకాంతుల నిస్తోంది. హఠాత్తుగా బస్సు కీచుమని ఆగింది. ఒక టైరుకి మళ్ళీ బెజ్జం పడింది. చక్రం తీయడం పెట్టడం అరగంట పట్టింది. బాబా కారుని ఆపించి, బస్ వచ్చేవరకు ఉండి, మళ్ళీ ఎరచ్‌తో 'యింకా వేగంగా రావాలని' హెచ్చరించారు.

అంబాలా డాక్ బంగళాలో దిగేసరికి మిట్ట మధ్యాహ్నం అయినది. అక్కడ రెండు గంటలు ఆగి భోజనాధికాలు ముగించారు. ఈ రెండుగంటలు ఊరికే

ఎందుకు పోవాలని ఎరచ్‌ని మస్తుల కోసం ఊళ్ళోకి పంపించారు. ఒక గంటసేపు తిరిగి వచ్చి ఎవ్వరూ కనపడ లేదన్నాడు. బాబాకి దీనివలన సంతోషమేమి కలుగలేదు.

2 గంటలకి మరల అంబాలాలో బయలు దేరారు. 20 మైళ్ళు వెళ్ళగా అక్కడ బస్సుకి ఉన్న మరో టైరు బుస్ మంది. మళ్ళీ ఒక అరగంట ఆలస్యం అయ్యింది. సర్హింద్ దాసి రైలుస్టేషన్ అక్కడికి యింక 80 మైళ్ళుంది. బాబా కారులో ముందు అక్కడకు చేరుకుందామనుకున్నారు. అక్కడ ఒక మస్తు ఉన్నాడు. ఇంక ఆరు మైళ్ళుందనగా దేనికోసమో ఆగవలసి వచ్చింది. ఈ ఆలస్యం వలన ఆ మస్తు దొరకలేదు. 'పోనీలే' అని ప్రయాణం సాగించారు. 40 మైళ్ళు వెళ్ళిన తరువాత బస్సుకి యింకొక టైరు తీసేయవలసి వచ్చింది. తరువాత బస్సు మరమ్మత్తు కోసం లూధియానాలో డాక్ బంగళాలో ఆగవలసి వచ్చింది. ఇంక బస్సుకి తగిలించడానికి స్పేరుచక్రాలు లేవు. ఈ పని కాకుండానే బాబా ఒక టాంగాలో ఎరచ్‌ని మస్తులకోసం తీసికొని పోయారు. ఆ రోజున ఊరంతా ఏదో ఏమ్మో మూలాన దుకాణాలన్నీ మూసేసారు. అందుచేత టైర్లలోని ట్యూబులు బాగుచేయిండానికి వీలయింది కాదు. ఎరచ్ ఊరంతా తిరిగి ఒక్కచోట మాత్రం వాటిని బాగుచేసే వాడిని ఒకణ్ణి పట్టుకున్నాడు. వాడు ట్యూబ్‌లు బాగు చేస్తుంటే ఎరచ్ మస్తుల కోసం వెళ్ళాడు. బాబా వద్దకు ఒక మస్తుని తీసికొనిరాగా, ఆయన సంతోషించి అతనికి భోజనం పెట్టి కొంత సేపట్లో పంపించేసారు. అలాగే యింకొక పేరు తెలియని మస్తునుకూడా బాబా సాంగత్యం చేసారు.

లూధియానా వదిలేసరికి సాయంకాలం పొద్దు పోయింది. అక్కడ నుంచి 50 మైళ్ళ దూరంలో ఉన్న జలంధర్ చేరుకునే సరికి బాగా రాత్రి అయింది. ఇప్పుడింక పరుపులు విప్పుకోవడం కష్టం అని ఆ చలిలో అలాగే పరున్నారు అందరూ. మర్నాడు తెల్లవారు జామున —మార్చి 3వ తేదీన— జలంధర్‌కి 87 మైళ్ళదూరంలో ఉన్న లాహోరు నగరానికి వెళ్ళారు. బస్సుకి చక్రాల టైర్ల తనిఖీ చేసారు. ఒక టైర్‌లో ట్యూబుకి పంచర్ పడింది. ఇంకొక చక్రం వేయడానికి వీలుకాలేదు. ఆ చక్రం మాత్రం తీసేసారు. వెనుక వైపున, ఒక వైపున రెండు, ఇంకొక వైపున ఒకటి మాత్రం చక్రం ఉంది. అలాగే బస్సు నడుపవలసి వచ్చింది.

దారిలో అమృతసర్ వద్ద రెండు గంటలు రోడ్డుమీద బస్సు ఆపవలసి వచ్చింది. రెండు టైర్లకి పంచర్లు అయ్యాయి. డా. నీలూకి యీ పని అప్పజెప్పి అమృతసర్ ఊళ్ళోకి ఎరచ్‌ని తీసుకొని బాబా మస్తులకోసం వెళ్ళారు. అమృతసర్‌లో బాబా ఒక వంతెన మీద ఒకమస్తును కలిసారు. అతనిని చూడగానే బాబా బండి ఆపి క్రిందకు దిగారు. అతడు చూడడానికి చట్టిబాబాలా ఉంటాడు. పచ్చని శరీరం. బాబా దిగి అతనిని కలిసినప్పుడు సంతోషం వ్యక్తం చేసాడు. ఆమస్తు యొక్క ముజావర్ (పరిచారకుడు) 'అతడు ఉదయం నుంచి ఎవరో వస్తారని చూస్తున్నాడు. వస్తారని చెప్పి తన గుడిసె శుభ్రంగా తుడిపించి ఉంచాడు'' అని బాబాయొక్క శిష్యులతో చెప్పాడు.

లాహోరులో మస్తాసిమాయి అనే చాలా మంచి మస్తానీ రైలుస్టేషన్‌కి ఎదురుగా ఒక స్థలంలో పాతికేళ్ళు కూర్చున్నది. అక్కడ ఉన్నవాళ్ళు ఆ చుట్టు ప్రక్కల దుకాణాలు కట్టక ముందునుంచీ ఆమె అక్కడే ఉందని చెప్పారు. 1941వ సంవత్సరంలో ఆమె కూర్చున్న చోటుకి వెనుక ఒక మోటారు బండి పెట్టె గది ఉంది. ఆమె తలమీద ఒక శాలువా ముసుగు వేసుకుంది. అది బురదతోను, ధూళితోను గట్టిపడిపోయింది. ఒక అట్టలా తయారయింది, 1941వ సంవత్సరం మార్చి నెలలో బాబా జైపూర్ (రాజస్థాన్) నుంచి క్వెట్టా వెళ్తూ లాహోర్ వెళ్ళారు. ఒకనాటి సాయంకాలం నోరీనా మాచెబెల్లిని ఆయనతో ఆమె వద్దకు తీసికొని వెళ్ళారు. ఆమె దగ్గరకు వెళ్ళి ఆమె ముఖం కప్పుతూ ఉన్న శాలువా ముసుగును నోరీనా చేత తొలగించారు. ఆమె ముఖం నల్లగా ఉంది. విచిత్రమైన ఆమె కళ్ళు లేత నీలిరంగుగా ఉన్నాయి. ఆమె బాబా వైపు పూజ్యభావంతో చూసి రెండు చేతులూ జోడించి ''అల్లా'' అంది. ఆమెకు తినడానికి ఏదైనా యిస్తే ఆమె ప్రక్కన బూడిదలో కప్పెడుతుంది. బాబా ఆమెకు ఒక కంచంలో అన్నం పట్టుకొచ్చి యిస్తే అలాగే చేసింది. తరువాత కొన్నాళ్ళకి ఆమె కాలం చేసింది.

లాహోరు వెళ్ళేలోగా టైర్లపని యింకొకమారు తగిలింది. లాహోరు వెళ్ళి బ్రాగంజా హోటలులో దిగారు. అక్కడ రెండురోజులుండాలి. పరుపులు దింపుకొని త్వరగా భోజనం ముగించుకున్నారు. తరువాత వెంటనే ఎరచ్‌ని మస్తు అన్వేషణకి పంపించారు బాబా. బజారుకి యింకొకర్ని పంపారు. ఊరంతా గాలించి ఎరచ్, ఒక

మస్తానీ వృద్ధురాలిని, యింకొక మస్తానీ తీసికొని వచ్చాడు. లాహోరులో బాబా యింకొక పేరు తెలియని మస్తుని కూడా సాంగత్యం చేసారు.

ఎరచ్‌ని, నీలు మరల బాబాను ప్రార్థిస్తే 'సరే' అని ఒక క్రొత్త టైరు ట్యూబ్ కొన్నారు. బస్సుకి వాటిని అమర్చారు. మార్చి 5వ తేదీ ఉదయం చీకటి తోనే 104 మైళ్ళ దూరాన ఉన్న మాంట్‌గామరీ అనే పట్టణానికి బయలు దేరారు. మాంట్గామరీలో బాబా ఒక మస్తానీని సాంగత్యం చేసారు. ఈ మస్తానీ 18 ఏళ్ళ బాలిక. ఈమె ఒక ఉన్నతురాలైన మస్తానీ. ఈమె ఒక నదీతీరాన కూర్చుని ఉంది. ఒక పందిట్లో ఆమె ఒక పాత పరికిణీ కట్టుకొని అర్ధనగ్నంగా కూర్చుని ఉంది. ఆమెవద్ద కొంత చెత్త, కొన్ని పాత ఎముకలు పోగుచేయబడి ఉన్నవి. చాలా సంవత్సరముగా ఆమె అక్కడ కూర్చుందని చెప్తారు. బాహ్యంగా అపరిశుభ్రంగా ఉన్నా, అంతరంగములో ఆమె అభివృద్ధి చెందిన ఆత్మ. ఆమె ముఖము మనోహరంగాను, నేత్రాలు చాలా ప్రకాశవంతముగాను ఉన్నాయి. ఆమె చూపు పెద్దపులి చూపులా ఉంటుంది. బాబాతో ప్రయాణం చేస్తున్న శిష్యు లందరను 'ఆమె వద్దకు వెళ్ళి చూడమని' పంపించారు బాబా. ఒక్కొక్కరే వచ్చి వంగుని ఆమెను చూడబోతే బలంగా చెయ్యి విసిరి "ఆగే" (ముందుకు వెళ్ళు) అని అరిచేది. తరువాత, 1946లో యీమె అకాలంగా చనిపోయింది.

మాంట్గామరీ నుంచి బయలుదేరి వెళ్ళిన తరువాత ఒక పంచర్ పడితే బస్సు ఆపవలసి వచ్చింది. ఇది బాగాలేదని నీలుని తన బ్యూక్ కారులో కూర్చో బెట్టుకొని, 70 మైళ్ళ వేగంతో వెళ్ళమన్నారు ఎలిజబెత్‌ని. పాక్‌పట్టాన్‌లో ఒక మస్తుని చూడాలని తొందరపడుతున్నారు బాబా. మాంట్గామరీకి 29 మైళ్ళ దూరం ఉంది. పాక్పట్టాన్, బ్యూక్ కారులో బాబా కాక ఏడుగురు అయ్యారు. వెనుక బస్ ఎరచ్ నడుపుతూ వస్తున్నాడు. మార్చి 5వ తేదీన 11 గంటలకు కారు పాక్పట్టాన్ చేరింది. బాబా, నీలూ ఎలిజబెత్‌తో కూడా ఫరీద్ (షక్కర్ గంజ్) దర్గాకి వెళ్ళారు. అక్కడ బాబాకు కావలసిన మస్తు కనిపించాడు. ఈ మస్తుకి చాలా పెద్ద బుడ్డ ఉందని తెలుస్తోంది. భోజనాలు అయిన తరువాత మరల మస్తుల అన్వేషణ సాగించారు. కానీ ఏమీ ప్రయోజనం లేకపోయింది.

సాయంకాలం మాత్రం 12 ఏళ్ళనుంచి ఒక సావిట్లో ఉన్న ఒక మస్తానీ యువతిని కనుగొన్నారు. అక్కడ చెత్తా చెదారం మధ్యనే కూర్చుని ఉంది ఆమె. వెంటనే యీ విషయం బాబాకు తెలుపబడినది. అంతట బాబా ముగ్గురు పాశ్చాత్య శిష్యులతో బయలుదేరి ఆ మస్తానీని చూసారు. ఆ రాత్రి నీలు, ఎరచ్‌లు బస్సు గురించి—అందులో ప్రయాణం ఎంత కష్టంగా ఉందో దానిని నడపడానికి ఎంత అవస్థ పడుతున్నారో— బాబాకు వివరంగా విన్నవించారు. ఇంకా నాలుగు టైర్లు నాలుగు ట్యూబ్‌లు కొనమన్నారు. అందుకు బాబా నిరాకరించారు. ఆశాభంగంతో వెళ్ళి అందరూ పరున్నారు. మార్చి 6వ తేదీన మాంట్గొమరీకి 108 మైళ్ళ దూరంలో ఉన్న ముల్తాన్‌కి బయలుదేరారు. బాబా ఎరచ్‌తో 45 మైళ్ళ వేగంతో బస్ నడపాలని మరల చెప్పారు. ఏమయినా సరే అంతకు తగ్గడానికి వీలు లేదన్నారు.

ఆ ఉదయం చల్లనిగాలిలో 40 మైళ్ళు తీసికొని వెళ్ళిన తరువాత బస్సుకి మరల చక్రం మార్చవలసి వచ్చింది. ఈ ఆలస్యాల వలన బస్ వెనకబడిపోతోంది. బాబా వాళ్ళకోసం ఆగవలసి వస్తోంది. ముల్తాన్ వెళ్ళి అక్కడ ఒక మస్తును సాంగత్యం చేద్దామని బాబా తొందర పడుతున్నారు. అందుకని నీలుని బ్యాక్ కారులో కూర్చోపెట్టుకున్నారు. మళ్ళీ ఎరచ్ బస్ నడపడానికి ఒక్కడే అయ్యాడు. ఏదయినా జరిగితే అతడు ఒక్కడే తంటాలు పడాలి. బ్యూక్ కారు 70 మైళ్ళ వేగంతో వెళ్ళింది. ముల్తాన్ వెళ్ళి వెదకితే యిద్దరు మస్తులు కనిపించారు. అందులో ఒక స్త్రీ ఉంది. మధ్యాహ్నానికి గాని బస్ చేరుకోలేదు. ఆలస్యానికి కారణం అనుకున్నట్లుగానే, పంచర్ అయింది. చక్రం మార్చాడు ఎరచ్.

ముల్తాన్‌లో రెండు రోజులున్నారు. ఈ రెండు రోజులు ఎరచ్‌లు, నీలూలు మస్తుల కోసం తిరిగారు. వారికి పాపం విశ్రాంతి దొరక లేదు. వారి అన్వేషణలో జయము పొందలేదు. ఆ రాత్రి మరల ఎరచ్ నీలూలు బాబాతో బస్ విషయమై మాట్లాడి 'నాలుగు కాకపోతే రెండయినా టైర్లు ట్యూబ్‌లూ కొనడం చాలా అగత్యమని' విజ్ఞప్తి చేసారు. ఈ మారు యింక తప్పదని బాబా అవి కొనిపించారు.

బాబా వెళ్ళిన రోడ్డు మార్గమునందు సింధునది అయిదు శాఖలను దాటవలసి వచ్చెను. అదీగాక దారిలో ఎడారి కూడా దాటవలసి వచ్చింది. ఆ దారిన బందిపోటు

దొంగల భయంకూడా ఉంది. బాబా యీ ఎడారిలో నుండి ఎందుకు బయలు దేరారో సామాన్య మానవులకు అర్థంకాక ఆశ్చర్యపోతారు. కానీ ఆధ్యాత్మికావసరాలను బట్టి బాబా ప్రయాణం చేస్తూ ఉంటారు. ఈ సంగతి బాబా మండలివారికి బాగా తెలుసును. దారిలో ఎవరిదో కారు ఆగి ఉంది. వారిని బందిపోటు దొంగలు దోచుకున్నారని తెలిసింది. అప్పుడు బాబా బృందం ముల్తాన్ నుండి లోరాలై మీదుగా వెళ్ళవలసి ఉంది. ఈ వార్త వినగానే ఆడవారికి భయం వేసింది. అంతక్రితం రోజే తమతో కూడా క్వెట్టాకు రావడానికి మండలిని 'ఒక యువకుని వెదకి తీసుకురమ్మని' బాబా చెప్పారు. వారు యిద్దరు ముగ్గురు యువకులను వెంటబెట్టుకు వచ్చారు. వారిలో ప్రసిద్ధమయిన ఒక గజదొంగ కుమారుడున్నాడు. వానినే బాబా ఎంచుకొని ప్రక్కన కూర్చోబెట్టుకొని కారులో ప్రయాణం చేసారు. దొంగకే పెత్తనం యిస్తే రక్షణ ఎక్కువ 'అన్న సామెతను బాబా ధృవపరిచారు. అది కొండదారి గనుక ఆడవారికి ధైర్యం కలగడం కోసం బాబా అట్లు చేసారు. మార్చి 8వ తేదీన వేకువనే లేచి ముల్తాన్ నుంచి 110 మైళ్ళ దూరంలో ఉన్న ఫోర్ట్‌మన్రోకి బయలుదేరారు. 15 మైళ్ళు బస్సు వెళ్ళిన తరువాత అక్కడ ఒక రైలు వంతెనవచ్చింది. దానిమీద నుంచే బస్సు వెళ్ళాలి. బస్ వెళ్తూంటే వంతెన మీద పరచి ఉన్న కర్రపలకలు బస్సు బరువుకి కటకట చప్పుడవుతున్నాయి. బస్ చాలా నెమ్మదిగా నడుపుతున్నాడు ఎరచ్. 20 నిమిషాల్లో ఎలాగో వంతెనదాటారు. తరువాత ముజఫర్‌గర్ మీదుగా వెళ్ళింది బస్. అక్కడనుంచి సింధునది లోపల యిసుక దారిలో ఎనిమిది మైళ్ళు వెళ్ళాలి. నదిలో యిసుక ఎండుదేరాసి బస్సు యిసుకలో వెళ్ళడమే కష్టం. అదంతా పెద్ద ఎడారివలె కనిపిస్తోంది. ఈ నదిలో నుంచి. ఆ యిసుకలో గడ్డి, మట్టితోసు వేసి దానిమీద తీగ జాలీ పరచి తయారుచేసిన రోడ్డు ఉంది. ఆ నదిలో యీ రోడ్డుకి అడ్డంగా నీరు పారుతూం డడం వలన ఆ ఏరులు దాటవలసి వస్తుంది. ఏరులు లోతుగా ఉన్నచోట పడవల మీద వంతెనలు వేయించి ఉన్నాయి. ఈ పడవల మీదనుంచి బరువయిన బళ్ళు వెళ్ళడం అపాయకరం. అక్కడ 'రెండు టన్నుల కంటె బరువు ఉన్న బళ్ళు పోకూడదు' అని నోటీసుకూడా పెట్టారు. కానీ దానిని వీరు లక్ష్యపెట్టలేదు. ఈ బస్సు సామానుల సహితంగా అయిదు టన్నుల బరువు ఉంటుంది.

ఇటువంటి వంతెనలన్నీ అక్కడ ప్రభుత్వం వారి మనుష్యులు పడ్డంటున్నా, జబర్దస్తీగా, బస్సుని పోనిచ్చి దాటేసారు బస్సు వెళ్ళినప్పుడల్లా పై వైన మీదుగా వేసిన కర్రపలకలు అటూ యిటూ కదలడం, పెద్ద చప్పుడు చేయడమూ క్రింద నున్న పడవలు ముందుకి వెనక్కీ కదలిపోవడం జరుగుతూండేది. ఎప్పటికప్పుడే ఏం జరుగుతుందిరా భగవంతుడా— అని బాబా మీద భారంవేసి ధైర్యంచేసి దాటేసారు. అయినా దేవుడే వాళ్ళతో ఉంటే యింక దేనికి భయపడాలి ? ఈ యిసుకలోనుండి ఆవతలికిపడి నెమ్మదిగా డేరా గాజీఖాన్ చేరుకున్నారు. అక్కడ బస్సులో నిండుగా పెట్రోలు పోయించుకున్నారు. బ్యాక్‌లో ఎలిజబెత్‌తో బాబా పోస్టాఫీసుకి వెళ్ళారు. పోస్టాఫీసు వద్ద కారు ఒక బురదగుంటలో కూరుకుపోయింది. పదిమందయినా దానిని బయటకు లాగలేకపోయారు. ఇంకొక కారు ఏదో వస్తే దానికి దీనిని కట్టి ఎలాగో బయటకు లాగించారు. పోస్టాఫీసులో బాబా ఏదో టెలిగ్రాం యిప్పించారు అక్కడినుంచి.

ముల్తాన్‌కి 120 మైళ్ళ దూరంలో ఉన్న ఖార్ అనే గ్రామంలో నుండి వెళ్తూ బాబా— వారి శిష్యులకూ మొత్తం ప్రపంచానికీ— ఒక సందేశం యిచ్చారు. అందులో 1941వ సం॥ ఆగస్టు 1వ తేదీనుండి 16 సంవత్సరముల నుండి తాము అవలంభించిన మౌనమును విరమించి 1942వ సంవత్సరం ఫిబ్రవరిలో అవతారప్రకటీకరణ జరుగుతుందని' బాబా చెప్పారు. ఈ సందర్భంలో బాబా యిచ్చిన సందేశం పూర్తి పాఠాన్ని యిం దిగువన యిస్తున్నాను—

## బాబా యొక్క సందేశము

'నేను 1941 సం. ఆగష్టు 1వ తేదీన నాకు నేనే నాలో నేనే ఆ దివ్యమైన మాట మాట్లాడులాను. అప్పుడు మృత తుల్యమయిన ఈ ప్రపంచ మును పునరుజ్జీవింప చేస్తాను. దానితోపాటు ప్రపంచంలో ఏ మార్పులు రావాలో అవి ప్రారంభం అవుతాయి. నాకు నేనే మాట్లాడుకోవడ మనేది 1942వ సంవ త్సరం ఫిబ్రవరి 15వ తేదీ వరకు కొనసాగుతుంది. ఆ రోజున (15–2–1942) నేను బహిరంగంగా విశ్వమంతటి కోసము నేను మాట్లాడుతాను. ఆ రోజునే నా ప్రపంచ ప్రకటీకరణము నేను పూరిగా వెకమయేలా జరుగుతుంది. ఆ రోజునే

ఆరు నెలలపాటు జరిగే నాలో నేను మాట్లాడుకోవడమనే క్రమము ఆధ్యాత్మిక పునరుద్ధరణ కలుగచేస్తుంది. ఆ రోజునే నాయొక్క పరిధిలోని శిష్యులు సత్యమును తెలుసుకుంటారు. నా ప్రస్తుత ఏకాంతవాసము ఏప్రెల్ 15 వరకూ (1941) సాగుతుంది. కానీ ఆ తేదీ లగాయతు (15-4-1941) 1942 ఫిబ్రవరి 15 వరకు నా ఏకాంతవాసము యింతకంటె సంపూర్ణముగా నిరాఘాటంగా ఉంటుంది.'

అక్కడ నుంచి ముందుకు వెళ్ళడానికి వర్షాలు అమితంగా పడినందున ప్రయాణం కష్టం. రోడ్డు బాగా లేదు వెళ్ళడం కష్టం అని కొందరూ, ఫరవా లేదు వెళ్ళవచ్చునని కొందరూ అంటున్నారు. డేరా గాజీఖాన్ నుంచి కొండలలో నుంచి రోడ్డు వెళ్తుంది. ఫోర్ట్‌మన్రోకి వీరు వెళ్ళే రోడ్డు చాలా సన్నంగాఉంది. కొండల మీదకు ఎక్కడం దిగడం, అనేక తిరుగుళ్ళు ఉన్నాయి రోడ్డుకు. చాలా జాగ్రత్తగా నడపాలి బళ్ళని. ఆ చుట్టుప్రక్కల అంతా చెట్టూ చామా ఏమీలేని ఖాళీ ప్రదేశం. ఎక్కడా నర సంచారం లేదు సరికదా ఏ ప్రాణీ ఏ జంతువూకూడా కనిపించదు. ఇటువంటి చోట బ్యూక్‌కారు, బస్సుకూడా బురదలో కూరు కున్నాయి ఒక స్థలంలో.

బస్సులో వారంతా దిగి ఎలాగో వాటిని బయటకు లాగారు. ఫోర్ట్‌మన్రో వెళ్ళే సరికి చీకటిపడింది. అక్కడి డాక్ బంగళాలో మండలితోపాటు మూడు రోజులున్నారు బాబా. ఈ బంగళా ఒక కొండమీద ఉంది. కొండ దిగువన గోధుమలు పండించే పొలాలున్నాయి. ఆ పొలాల కావల పర్వత పంక్తులున్నాయి. రోడ్డువాటిలో నుండే వెళ్తుంది. ముందు వచ్చేది లొరాలై అనే ఊరు. కొండమీది యీ బంగళాలో నుంచి చూస్తే చుట్టుప్రక్కల ప్రదేశం అంతా మనోహరంగా కనిపిస్తుంది. అక్కడి వాతావరణం చాలా చలిగా ఉంది. అక్కడ కనబడే సూర్యోదయ సూర్యాస్తమయ దృశ్యాల కామణీయకత వర్ణనాతీతం. మార్చి 11వ తేదీ ఉదయం అమితమైన చలిలో 133 మైళ్ళ దూరంలో ఉన్న లొరాలైకి ఫోర్ట్‌మన్రో నుంచి బయలుదేరారు. రోడ్డుమీద అనేక తిరుగుళ్ళతో ఆ కొండల్లోంచి వెళ్తోంది కారు. పది మైళ్ళు వెళ్ళిన తరువాత రాఖీ అనే ఊళ్ళో అక్కడ మిలిటరీవారిని కూడా తీసుకొని వెళ్తే క్షేమం అని ఆగారు. ఇక్కడ బాబాకోసం ప్రజలు గుర్రపు పందాలు ఏర్పాటు చేసారు. ఆ పందెంలో మూడు గుర్రాలు పాల్గొన్నాయి. గెలిచిన

గుర్రానికి బాబా అయిదు రూపాయలిచ్చారు. మిలిటరీవారు తోడురాగా రాఖ్నీ నుంచి మధ్యాహ్నం 12 గంటలకు ముందుకు సాగారు. ఆ రోడ్డు ఎంతమాత్రమూ బాగాలేదు సరికదా, దానిమీద బందిపోటు దొంగలు తరుచుగా ప్రయాణీకుల్ని దోచుకుంటారుట కూడాను. దారిలో నీరులేని నదులలోనుంచి వెళ్లవలసి వచ్చింది. బస్సు యిసుకలో కూరుకుపోవడం జరిగింది. బస్సుని బ్యూక్ కారు బయటకు లాగేసింది. కారుకి తాడుతో కట్టి మనుష్యులంతా దిగి లాగించారు. లోరాలై వెళ్లేసరికి చీకటిపడింది. ఆ రాత్రి రాదారీ బంగళాలో గడిపారు.

తెల్లవారితే మార్చి 12వ తేదీ. ఉదయాన్నే బయలుదేరారు. క్వెట్టా చేరుకునే సరికి మధ్యాహ్నం 12 గంటలుదాటింది. 'అమ్మయ్య! చేరుకున్నాం గమ్యస్థానం' అని అందరికి సంతోషం కలిగింది. బాబా ఏకాంతవాసం సాగుతూనే ఉంది. బాబా ఎవ్వరికీ దర్శనం యివ్వలేదు. ఎవ్వరితోనూ మాట్లాడలేదు. ఈ ప్రయాణం చేసిన రోజుల్లో. మస్తుల కోసం వెళ్ళినప్పుడు గానీ, చారిత్రాత్మకమైన స్థలములు చూడడానికి వెళ్ళినప్పుడు గానీ వారు మెహెర్‌బాబా అని తెలియకుండా ఉండేలాగే వెళ్ళారు. మండలి అందరితోనూ బాబా క్వెట్టాలో ఒక నెల రోజులున్నారు. ఆ నెలరోజులూ ప్రపంచానికి సంబంధం లేకుండా ఆయన ఏకాంతంగానే ఉన్నారు. మస్త సాంగత్యం తప్ప యింక ఆయన బయటికి వచ్చి ఏ పనీ చేయలేదు. బాబా క్వెట్టా వెళ్ళాక అక్కడ యింకా చలి ఎక్కువుగా ఉంది. చట్టిబాబాకు ఎంత చలిగా ఉన్నా చాలలేదు. క్వెట్టాలో అతని పరుపుమీద మంచువలె చల్లని నీటిని పోసి ఆ చల్లని పరుపు మీద కూర్చునేవాడు.

బాబా వారి మండలితో క్వెట్టాలో 1941 మార్చి 11వ తేదీ నుంచి ఏప్రెల్ 7వ తేదీ వరకు (1941) ఉన్నారు. అప్పుడు నాదిర్ ఆలీషా అనే ఒక మస్తును సాంగత్యం చేసారు. ఇతడు క్వెట్టా పట్టణానికి ఆధ్యాత్మిక పాలకుడు. ఆ ఊరి ప్రజలు ఆ మస్తు ఉండడానికి చలికాలం చాలా ఎక్కువ బాధగా ఉంటుందని— అతనికి ఒక గుడారం వేయించి యిచ్చారు. అందులోనే అతడు నివసిస్తాడు. ఆ గుడారంలో అతడు ధుని వెలిగించుకొని ఉన్నాడు. అందువలన ఆ గుడారం అంతా పొగతో నిండిపోయింది. పొగ పోయేలా అతని చేతోనే నిప్పుని

విసురుతాడు. ఆ విసరడంతో పొగ తన వేపుకి వచ్చేలా చేసుకుంటాడు. అతనిని బాబా వద్దకు వచ్చేలా చేయడానికి అనేక మార్లు వెళ్ళి బైదుల్, ఎరచ్‌లు ప్రయత్నించారు. ఆ గుడారాన్నుంచి బయటపడితే చాలని (పొగ అంతగా అలుముకొని ఉండేది) వాళ్ళకి అనిపించేది. మంట చేత వాళ్ళకి కళ్ళ నీరు వచ్చేది. ఎన్నిమార్లు వాళ్ళు వెళ్ళినా నాదిర్ ఆలీషా వారితో వెళ్ళడానికి నిరాకరించేవాడు. ఒకమారు వాళ్ళు బాబా వద్దకు రమ్మంటే 'ఆ సముద్రంలో నా పడవ మునిగి పోతుంది' అన్నాడు. అతనితో బాబా సాంగత్యం చేయకపోయినా ఎలిజబెత్ కారులో వచ్చి బాబా అతని గుడారం చుట్టూ ప్రదక్షిణం చేసి వెళ్ళారు. ఒక విధంగా దూరాన్నుంచే యితనితో బాబా సాంగత్యం చేసారని చెప్పవచ్చును. బాబా క్వెట్టాలో ఉన్నన్నాళ్ళు చట్టిబాబాను అక్కడ తమతో ఉంచుకున్నారు. ఆ రోజులలో ఒక పేరు తెలియని మస్తును క్వెట్టా మార్కెట్‌లో బాబా సాంగత్యం చేసారు

బాబా మొదటిసారిగా 1924వ సం॥ర ప్రాంతాలలో క్వెట్టాకి వచ్చినప్పుడు ఒక పేరు తెలియని మస్తును సాంగత్యం చేసారు. అతడు మజ్జూబ్ వంటి ఆరవ భూమికలోని మస్తు. అతడప్పుడు కాలం చేసాడు. ఆ మస్తు ఒక గుడారంలో ఉండేవాడు. దానిలో పాత ఎముకలు, పాసిపోయిన రొట్టెముక్కలు పడుండేవి. ఆ మస్తు ఆ ఎముకల్ని చప్పరిస్తూ ఉండేవాడు. అతని శరీరం నిండా పేలు పాకుతూ ఉండేవి. ఒక్కదాన్నికూడా చంపకుండా అతడు వాటిని తనమీద అలాగే పాకనిచ్చేవాడు. ప్రతిరోజూ వెళ్ళి, ఆదీని అతనికి అన్నంపెట్టి రమ్మనేవారు బాబా. ఆ మస్తు గుడారానికి ఎదుట ఉన్న యింటిలోనే బాబా బస చేసారు. బాబా ఎప్పుడు బయటకు వెళ్దామని యింట్లోనుంచి బయటకు వచ్చినా, ఆ మస్తు బాబావైపు శూన్య దృక్కులతో చూసేవాడు. ఒక రోజున ఆ మస్తు వద్దకు సాంగత్యంకోసం వెళ్ళేసరికి, బాబాను అతడు గాఢంగా కౌగిలించుకున్నాడు. బాబా ఆగాబైదుల్‌ను క్వెట్టానుంచి మస్తులకోసం లోరీ పంపించారు. బైదుల్ ఒక మస్తును కలిసి బాబా వద్దకు క్వెట్టా రమ్మన్నాడుగానీ అతని ప్రయత్నం జయం కాలేదు. అందుచేత బైదుల్ నేన్‌రాజి అనే ఇంకొక మస్తు వద్దకు వచ్చాడు. ఆ మస్తును క్వెట్టాకు తీసుకువెళ్ళేందుకు వచ్చానని బైదుల్ అతనితో చెప్పలేదు

'ఇది రోరీ. నీవు క్వెట్టాకి నన్ను తీసికొని వెళ్ళామనుకుంటున్నావు', అని గదిలో కూర్చున్న బైదుల్‌తో నేవ్‌రాజి అన్నాడు. రెండు మార్లు యిలా అంటూ బైదుల్ తలమీద చేత్తో కొట్టాడు. బాబా యితనిని రోరీలో 1946వ సంవత్సరంలో మళ్ళీ వచ్చినప్పుడు కలిసారు.

క్వెట్టాలో ఉండగా చట్టిబాబా ఒకనాడు 'ప్రపంచంలో ఎవరూ ఊహించలేనంత విపత్తు సంభవిస్తుంది. మానవుడు తన సోదరుణ్ణే చంపుతాడు. ఎంతో ఎక్కువ ఆపద కలుగుతుంది. అప్పుడు ప్రజలు నా అన్నను (బాబాను) తలుచుకుంటారు. ఆ సమయంలో బాబా తెర తొలగిస్తారు. అందరూ ఆయనకి జోహారు చేస్తారు' అని చెప్పాడు. ఎవరో అడిగితే బాబా ఆ మస్తుల గురించి యిలా జవాబు యిచ్చారు — 'మస్తులు పిచ్చివారిలా కనిపిస్తారు గానీ వారు ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందారు. వీరిలో యిదివరకే ప్రేమ ఉంది. వీరిని సాంగత్యం చేసినందువలన, వీరికి శారీరకంగా సపర్య చేసినందువలన, నేను వారి అవసరాలు తీర్చుట వలన, వారి మనసులను మామూలు స్థితిలోనికి తీసికొని వస్తాను. అప్పుడు నాపని వారు చేయగలుగుతారు'. అని బాబా వివరించారు.

మస్తులపట్ల వారు ప్రత్యేకమయిన శ్రద్ధ తీసుకోవడం భారతదేశంలో వారి కోపమే పర్యటన చేయడం గురించి బాబా యిలా చెప్పారు— 'మస్తులు భగవదున్మత్త చిత్తులైన జీవాత్మలు. వారు భగవంతునిలో నిమగ్నమయి శరీరం తెలియకుండా ఉంటారు. నేను చేసే సాంగత్యము వారికి-వ్యక్తిగతంగాను సామూహికంగాను కూడా లాభం కలుగచేస్తుంది. వారందరినీ ఆధ్యాత్మికంగా నేను సాంగత్యం చేస్తాను. అందువలన వారు విశ్వ ఆధ్యాత్మిక కార్యంలో పాల్గొన గలుగుతారు'

క్వెట్టాలో బాబా పని పూర్తిచేసుకున్న తరువాత తిరుగు ప్రయాణానికి సమకట్టారు. కానీ బాబా మండలిని యీ మారు, వచ్చిన దారిని కాకుండా క్వెట్టా నుంచి లాహోరు వరకు రైలులోను, అక్కడినుంచి రోడ్డుమీద ప్రయాణం సాగించారు. బాబా మండలిలో కూడా కొంతమంది బాబా ఆజ్ఞ ప్రకారం ఏకాంతవాసం చేస్తున్నారు. అంటే, వారు బయట ప్రపంచంతో ఏవిధా పని పెట్టుకోకుండా ఉంటారు. బయటి వారెవ్వరితోటి మాట్లాడరు. అందుకోసం వీరి సౌకర్యంకొరకు,

బాబా మండలి కొరకు, ప్రత్యేకంగా టూరిస్ట్ కారు వేయించుకొని రైలు ఎక్కారు. ఈ రైలు ప్రయాణం కూడా రెండు రాత్రులు ఒక పగలు పట్టింది. వేసవికాలంలో యీ దీర్ఘ ప్రయాణం ఏమీ అంత సుఖంగా లేదు.

లాహోరులో రైలుదిగి, వెంటనే మామూలుగా కారుమీద బస్సుమీద ప్రయాణం సాగించారు. ఖన్నా అనే చోట బాబా బృందము ఆగారు. దారిలో బాబా అమృతసర్ వద్ద ఒక మస్తును కలిసారు.

లాహోరు నుంచి వెళ్ళేటప్పుడు బస్సు ఇంజన్‌లో ఏదో చెడి సరిగ్గా పని చేయడం మానేసింది. అందుచేత నెమ్మదిగా జాగ్రత్తగా నడపవలసి వచ్చింది. లూథియానా వచ్చి ఇంజన్ మరమ్మత్తు చేయించుకొని మరల బయలుదేరారు. ఈ ప్రయాణంలో పెద్ద గాలిదుమారం వచ్చి ఒక గంటసేపు ధూళీ లేపింది. చాలా వేగంతో వీచింది గాలి. ఎక్కడ చూసినా దుమ్మేగానీ ఏమీ కనిపించలేదు. దీనితో పాటు తరువాత వర్షం కురిసింది. లూథియానా నుంచి ఖన్నాకి వచ్చేసరికి మధ్యాహ్నం మూడు గంటలయింది. ఇక్కడికి రాగానే మస్తుల కోసం వెదుకగా యిద్దరు మంచి మస్తులను కనుగొన్నారు. వారిని రప్పించారు బాబా. వీరికి భోజనాలు పెట్టి వారి సాంగత్యం అయిన తరువాత పంపించేసారు బాబా. ఖన్నాలో ఆ రాత్రి విశ్రమించారు. మరునాడు ఉదయాన్నే బయలుదేరి ఆ మధ్యాహ్నానికే డెహ్రాడూన్ చేరుకున్నారు.

ఏప్రెల్ మాసంలో బాబా ఉపవాసం ఉన్నారు. మొదట పళ్ళు తింటూ 14 రోజులు, తరువాత వారం రోజులు రోజుకి 3 కప్పులు టీ తీసికొని, తరువాత కొద్దిరోజులు నీరు మాత్రమే తీసుకొనేవారు. ఏప్రెల్ 27వ తేదీ రాత్రి బాబా ఉపవాసం మానివేసి, రాత్రి 12 గంటలక సరిగ్గా బాబా మండలి ఒక్కొక్కరికి ఒక్క చెంచా నారింజ పళ్ళరసం యిచ్చి తాము ఒక కప్పు రసం త్రాగారు. రెండు రోజులు పళ్ళరసం మీద ఉండి, తరువాత 30వ తేదీన కాయగూరలతో చేసిన పులుసు తీసుకున్నారు. మే 1వ తేదీ నుంచి కొంచెం అన్నం పప్పు తినడం ప్రారంభించారు.

జూలై నెల తరువాత, ఏకాంతవాస మంతమయిన తరువాత, బాబా మండలితో 'ఆరు నెలలపాటు ఉంటామని' చెప్పారు.

బాబాను రావించాలని కరాచీలోని భక్తులు చాలా ఉత్సాహంగా పని చేస్తున్నారు. కరాచీలో ప్రధానమయిన ప్రేమికుడు ఆ నగరం మేయరు అయిన జామ్‌షెడ్ నస్సర్వాన్‌జీ మెహతా అతని సహకారాన్నంతా యిచ్చి బాబాకోసం యిల్లు వెతుకుతున్నాడు. కానీ బాబాకి మండలికి తగిన భవనం యింతవరకు దొరకలేదు. ఆ కారణం చేత కరాచీలో ప్రయత్నం సాగిస్తూ డెహ్రాడూన్‌లో కూడా అన్వేషణ చేయమన్నారు. డెహ్రాడూన్‌లో రెండు రోజులలో బాబా శిష్యులు యిద్దరువెళ్ళి మంచి వసతిని కుదిర్చారు. ఈ వార్త విన్న తరువాతనే బాబా క్వెట్టా వదిలిపెట్టి వస్తున్నారు. తగిన వసతిలేదని కరాచీ వెళ్ళడం మానివేస్తే అక్కడి తన భక్తులకు ఆశాభంగం కలుగుతుందని ఒక నెల గడువుయిచ్చి 'ఆ నెలలో వీలయిన వసతి ఏర్పాట్లుచేస్తే వస్తామని' బాబా కరాచీవారికి వ్రాయించారు. 'తగిన భవనం దొరికితే వారి ఏకాంతవాసం పూర్తి కాకుండానే వస్తామన్నారు.'

'ఈ లోపుగా బాబా గురించి ప్రజలకు తెలియజెప్పాలని—' నాగపూర్, జయపూర్ అయిన తరువాత బాబా శిష్యురాలు రాజకుమారి నోరీనా మాచెబెల్లి, ఆయన శిష్యుడు డా॥ సి. సి. దేశ్‌ముక్ (నాగపూర్) ఉపన్యాస పర్యటన చేస్తూ— కరాచీ వెళ్ళారు. అక్కడ బాబా భక్తుల మూడు ఉపన్యాసాలు ఏర్పాటయినవి. ఒకటి బహిరంగంగా ప్రజాబాహుళ్యానికి 'గులామ్ హుసేన్ ఖలెక్ దినా హోటల్'లోను. మరి యొకటి మహారాష్ట్ర మిత్ర మండలి వారూ ఏర్పాటు చేసారు. మూడవది పార్శీలకు ఒక సభ కత్రక్ హాలులో ఏర్పాటయినది. తరువాత ప్రశ్నలు, జవాబులకు ప్రత్యేకంగా సమావేశాలు కూడా జరిగాయి. కరాచీ తరువాత సుక్కూరులో యిలాగే సభలు సమావేశాలు జరిపారు. ఈ ఉపన్యాస పర్యటనకు బాబా అనుమతి యిచ్చారు. బాబా ఆశీర్వద బలమున నోరీనా యొక్క ఉపన్యాసములు అతి గంభీరంగాను ఉత్తేజకరంగాను ఉండుటయే గాక శ్రోతలందరిలోను మెహెర్‌బాబా గురించి యింకా తెలుసుకోవాలనే కాంక్షను కలిగించాయి.

డెహ్రాడూన్‌లో బాబా మేనెల మధ్యభాగం వరకూ ఉన్నారు. అక్కడ ఉన్న రోజులలో బాబా బాహ్య కార్యకలాపం ఏమీ జరిగించలేదు. కానీ అంతరంగ కార్యములు ఎన్నో జరుపుతున్నట్లు కనిపించారు. ఆయన ఏకాంతవాసం నిరంతరాయంగా

సాగింది. బాబా ఎవరికీ దర్శన మీయలేదు. ఆయనతో ఉన్న మండలికి కూడా అట్టే కనబడకుండా ఆయన గదిలోనే ఉండేవారు. శారీరకంగా నీరసంగా ఉన్నట్లు కనిపించే వారు. ఇంతకుముందు వరకు ఉపవాసాలతో గడిపారు కదా ! అయినా యిదివరకు ఎన్నివూరులు ఉపవాసాలు చేయలేదు ? ఈమారు ఎందుకో నీరసం బాగా కని పిస్తోంది. ఇదివరకు కంటె యీ విషయం బాగా ద్యోతక మవుతోంది. దీనికి కారణం తీవ్రమైన అంతరిక కార్యమే- అని చెప్పాలి. శరీరం నీరసంగా కనిపించినా నేత్రాలూ ముఖము మాత్రము తేజోవంతములై ప్రకాశిస్తున్నాయి.

ఇలా ఉన్నప్పటికీ బాబా ప్రతిరోజూ చట్టిబాబా అనే మస్తుకి స్నానం చేయిస్తూనే ఉన్నారు.

డెహ్రాడూన్‌కి ఆరుమైళ్ళ దూరంలో ఉన్న రాజపూర్‌లో మన్నూషా అనే మస్తు ఉండేవాడు. అతనిని మొదట రూర్కీలో పాపా, బైదుల్ చూసారు. పాపా ఎరచ్ యొక్క తండ్రి. అప్పుడు రాజపూర్ నుంచి మన్నూషా రూర్కీకి ప్రత్యేకంగా మఖ్దూమ్ ఆలీ అహమద్ సబీర్ అనే సాధువుయొక్క ఉర్సుకి వెళ్ళాడు. అతనిని పాపా, బైదుల్ డెహ్రాడూన్‌లో ఉన్న బాబా వద్దకు తీసికొని వచ్చారు. అతడు లావుగా పొడవుగా ఉంటాడు. బట్టతల, తెల్లటి గడ్డం. పాదరక్షలు లేకుండా నడుస్తాడు. పొడవైన ఒక కోటు ధరిస్తాడు. రాజపూర్‌లో పూర్వం యితనికొక దుకాణం ఉండేది. చాలా సంవత్సరాల క్రిందటే దానిని భగవంతుని పేరుతో వదిలే సాడు. అంటే భగవదిచ్ఛ ప్రకారం సరుకులు అమ్మెయ్యాలి అన్నమాట. అందుచేత ప్రపంచరీతికి తగినట్లుగా ప్రజలువచ్చి ఎవరికి కావలసినది వాళ్ళు తీసుకొని చక్కాగా పోయారు. డెహ్రాడూన్‌లో మన్నూషాను చాలా మంది ఎరుగుదురు.

తరువాత బాబా కన్‌ఖల్ (హరిద్వార్) వెళ్ళి అక్కడ మస్తాన్‌వాలాబాబా అనేవానిని సాంగత్యం చేసారు. ఈతడు చాలా వృద్ధుడయిన సాధువు. ఇతడు స్మశాన భూమిలో ఉంటాడు.

ఈ ఏప్రెల్ (1941) నెలలోనే బాబా హరిద్వార్‌లో గోద్రీవాలాబాబా అనే మంచిమస్తును కలుసుకున్నారు. ఈ మస్తు ఎప్పుడూ ఏ యింటిలోనికీ అడుగుపెట్టలేదు. 1941వ సంవత్సరంలో ఒక చౌరస్తాలో (నాలుగు రోడ్లు కలిసే చోట) ఒకంపెద్ద రాతిమీద కూర్చుని ఉండగా అతనిని కనుగొన్నారు.

ప్రతిరోజూ ఒక సమయంలో అతడు వచ్చి ఆ రాతి మీద కూర్చుంటాడు. బాబా అక్కడే గోద్రీవాలాబాబాను సాంగత్యం చేసారు. అప్పుడు బాబా అతనికి భోజనం కూడా పెట్టారు.

హృషికేశ్‌లో బ్రహ్మచారిబుషి అనే పేరుగల ఒక అభివృద్ధి చెందిన యాత్రీకుని బాబా కలుసుకున్నారు. ఇతడిదివరలో ఒక పెర్షియన్ పండితుడు ఆచార్యుడుగా ఉండేవాడు. ఒక ధర్మశాలలో పేదవారికి సేవచేస్తూ, జబ్బువారికి శుశ్రూష చేస్తూ రోజులు గడుపుతున్నాడు. అతని సాంగత్యం కోసం బాబా వచ్చినప్పుడు బ్రహ్మచారి బుషి ఆస్పత్రిలో రోగిగా పరుండి ఉన్నాడు. బాబా అర్ధరాత్రి వచ్చి అతనిని చూడడానికి వెళ్ళినప్పుడు బ్రహ్మచారి బుషి బాబాతో— "ఈవేళ రావలసి యున్నది. భగవంతుడు నన్ను రోగిగా చేసాడు. పేదవారికి ఎవరు అన్నం పెడతారు ?" అని అడిగాడు. బాబా అతనికి పది రూపాయలు యిచ్చారు. ఆ సొమ్ము అయిష్టంగా అతడు స్వీకరించాడు. బాబా— "పోనీ నీ కక్కరలేకపోతే కావలసిన వారెవరికయినా యివ్వు" అన్నారు.

హృషీకేశ్‌లో 1941 ఏప్రెల్‌లోనే దిగంబరుడు మధ్య వయస్కుడు అయిన ఒక మస్తును బాబా సాంగత్యం చేసారు. అతని పేరు దివానాసాధు లేక నంగాసాధు. ఇతడు ఒక మేడమీద గదిలో నివసించేవాడు. హృషీకేశ్‌లోని పెక్కు ఆశ్రమాలలో యితడున్న మేడ ఒక దానిలో ఉంది. బాబా వెళ్ళినప్పుడు అతనికి భోజనం పెడదామని ప్రయత్నించారు. ఆ మస్తు భోజనం నిరాకరించినా— అతనిని తృప్తిగానే సాంగత్యం చేసారు.

ఈ నెలలో బాబా హృషీకేశ్‌లోను, హరిద్వార్‌లోను 275 మంది సాధువులను సాంగత్యం చేసారు. ఈ ఊరులో ఎంతమందిని కలిసారో తెలియదు. మొత్తం మీద అంతమందిని బాబా కలిసారు. బెంగాలీబాబా అనే అన్వేషకుని బాబా హృషీకేశ్‌లో సాంగత్యం చేసారు.

1941 మే మాసంలో బాబా హరిద్వార్‌లో రామ్‌బాబా అనే ఉన్నతమయిన మస్తును చూసారు. అతడు చాలా మురికిగా ఉన్నాడు. కూలిపోతున్న ఒక గుడిసెలో ఒక గడ్డికట్టమీద దిగంబరుడుగా కూర్చున్నాడు. అతని వయస్సు 50–60 ఏళ్ళ

మధ్య ఉంటుంది. ఒక రాయిమీద యింకొక రాయితో కొడుతూ ఉన్నాడు. రాముని మీద పాటలు పాడుతూ తాళం వేస్తున్నాడు, అలా కొడుతూ రోజంతాను, రాత్రి చాలా భాగము రాముని గురించి స్తోత్రం చేస్తూ పాటలు పాడుతూ ఉంటాడు. అతని కంఠం కమ్మగా చాలా శ్రవణానందంగా ఉంటుంది. ఎవరయినా అతని ముందుకు వచ్చారంటే "బేటా! బచన్‌పాల్" అని అంటాడు. (అబ్బాయీ! నీ మాట ప్రకారం చెయ్యి) అతని ప్రక్కన ఒక పుర్రె ఉంది. గిన్నెలాంటి దానిలో ఎవరయినా వచ్చినప్పుడు అందులో ఉమ్మి వేయమంటాడు. రాయ్‌బాబాలో యింకొక జుగుప్సాకరమయిన అలవాటు ఏమిటంటే, అందులో వేసిన ఉమ్మిని తాను తింటాడు. వచ్చిన వారియొక్క పాదమును పట్టుకొని ఎత్తి, ఒక క్షణం తన తల మీద పెట్టుకుంటాడు. బాబా మొదటిసారిగా 1941 మేలో అతనిని సాంగత్యం చేసారు.

1941వ సం॥ మే 12వ తేదీన హృషీకేశ్‌లో బాబా వారి స్త్రీ మండలికి అనేకమంది సాధువులను యోగులను చూపించారు. కేశవానంద మహరాజ్ యొక్క శిష్యుడొకడు ఉత్తీర్ణుడయిన యాత్రికుడుండెను. అతడు నదిలో గులక రాళ్ళమీద నిలబడి యున్నాడు. ఒక దుప్పటి ముసుగు వేసుకున్న ఒక యోగి బాబా ఆ దారిన వెళ్తుంటే ముసుగు తీసివేసి నిలబడ్డాడు. బాబా వైపు గౌరవ సూచకంగా అతడాయనకు నమస్కారం చేసాడు. వీరి వెవరినీ బాబా ప్రత్యక్షంగా నేరుగా సాంగత్యం చేయలేదు.

బాబా శిష్యమండలి అందరినీ హృషీకేశ్ తీసికొని వెళ్ళారు. ఇక్కడ అనేక వందల సంవత్సరాలుగా ఋషులు తపస్సు చేసుకుంటూ ఉంటారు. బాబా మండలిని ఆ పర్వతాల లోనికి తీసికొనివెళ్ళి వారికి ఆ ఋషుల నివాస స్థానాలు చూపించారు. అక్కడ అడవులలో ఒక ఆశ్రమానికి వెళ్ళారు. గంగ ప్రవహించే లోయకు ఒడ్డునే ఉంది ఆ ఆశ్రమం. అక్కడ గంగ నీటిలో, నిశ్చలంగా దిగంబరుడై నిలబడిన ఒక సాధువును బాబా అకస్మాత్తుగా చూసారు. అతడు తన ముఖమును సూర్యునివైపు పెట్టి తదేకంగా సూర్యుని వీక్షిస్తున్నాడు. అతని స్థానము మార్చకుండా అతడు ఏడురోజులు అలాగే సూర్యుని చూడాలి. అదీ అతని పని. తరువాత రెండురోజులు అతనికి విశ్రాంతినిచ్చి ఇంకొక అభివృద్ధి చెందిన ఆత్మ వచ్చి అతని స్థాన మందుం

టాడు. ప్రకృతి ధర్మాలను పాటించి ఈ విధంగా వారు భగవంతుని విశ్వ కార్యంలో తోడ్పడుతున్నారు.

తరువాత ఒక అడవిలో నుంచి వెళ్తూ పదిమంది ధ్యానమందు నిమగ్నులై యున్నవారిని చూసారు. ఒకడు ఒక దుప్పటి ముసుగు వేసుకొని బాహ్య ప్రపంచంతో సంబంధం లేకుండా కూర్చున్నాడు. బాబా కొంచెం సేపయిన తరువాత మరల అ దారినే వస్తుంటే ఆ ముసుగు పెట్టుకున్న సాధుపుంగవుడు దైవము తన వద్దనే ఉన్నట్లు తెలుసుకున్నాడు కాబోలు, బాబా అతని వైపుకి వెళ్తూంటే వెంటనే లేచి పవిత్రమైన బాబా పాదారవిందాలకు సాష్టాంగ వందన మాచరించాడు.

''మీరు క్రీస్తు అద్వితీయమైన ప్రవక్త అని నమ్ముతారా?'' అని ఒకరు బాబాను అడుగగా బాబా యిలా జవాబు చెప్పారు.

''అద్వితీయమే. అవును ఆయన చైతన్య స్థితి అలాంటిదే. కానీ ఆయన ఒక్కడే అలాంటివాడుకాదు. ప్రతి మతంవారు వారి నాయకుని ప్రవక్త అనే అంటారు. కానీ అలా అన్నంతమాత్రాన క్రీస్తును తెలుసుకోలేరు. క్రీస్తును తెలుసుకోవాలంటే ఆయన జీవితం జీవించాలి. అందరూ క్రీస్తులే కాని కొద్ది మంది మాత్రమే జీసస్ కాగలరు.''

బాబా ఉపవాస విరమణచేసి 3 రోజులయింది. డెహ్రాడూన్ నుంచి 500 మైళ్ళ ప్రయాణం యీ ఎండలలో రైలులో బయలుదేరి ఒకరాత్రి ఒక పగలు ప్రయాణంలో గడిపి అజ్మీరు వచ్చారు. అక్కడ ఉన్న 4 రోజులలోను మస్తు అన్వేషణ చేసి కొద్దిమందిని రప్పించి వారికి స్నానపానాదులు బాబా స్వయంగా చేయించారు. 12వ తేదీన డూన్‌కి 30 మైళ్ళ దూరంలో ఉన్న హృషీకేశ్‌కి వెళ్ళారు మండలితో.

పాశ్చాత్య శిష్యులు అందమయిన ప్రకృతి దృశ్యాలతో ఉన్న ఆ పుణ్యక్షేత్రం చూసి చాలా ఆనందించారు. ప్రపంచంలోకెల్లా ఎత్తయిన హిమాలయ పర్వతాల వద్ద గంగాతీరాన ఉన్న హృషీకేశ్ చాలా సుందరమైన స్థలం. యాత్రీకులు అక్కడ సకల కల్మషహారి అయిన పవిత్ర గంగాతోయాల్లో మునిగి వారి పాపాలను

కడిగివేసుకుంటారు. అక్కడ ఎక్కడ చూసినా సన్యాసులు, సాధువులు ఒక్కొక్కరు చిన్న చిన్న కుటీరాలు వేసుకొని ఉంటారు. లక్ష్మణ్ ఝూలా అనే వంతెన అక్కడి అందాన్ని ఇనుమడింప జేస్తుంది. ప్రతిరోజూ వేలకొలది యాత్రికులు వచ్చిపోతున్నా అక్కడి వాతావరణం ప్రశాంతంగా ఉంటుంది. మైళ్ళకొలదీ వ్యాపించిన హిమాలయాలకి దిగువన ఉన్న యీ చోట గంగానది అనేక తిరుగుళ్ళతో ప్రవహిస్తూ ఉంటుంది. ఏ కాలమందైనా నీరు అతి చల్లగా ఉంటుంది. ఈ స్థలము తపస్సు చేసుకునేందుకు అనువుగా ఉంటుందని చాల మంది ధ్యాననిమగ్నులై ఉంటారు. పల్లానికి నీరు పరుగెత్తినట్లు మనసు భగవంతుని మీదకు అవలీలగా వెళ్తుంది. మెహెర్‌బాబాతో యీ పుణ్యస్థలానికి రాగలిగినందుకు బాబా శిష్యులందరూ ఎంతో సంతోషించారు. 18,000 అడుగుల ఎత్తులో హిమాలయ పర్వతాలలో పూర్వం శ్రీకృష్ణుడు తనువు చాలించిన పుణ్యస్థలానికి అక్కడి నుంచే వెళ్ళాలి. కొంత దూరం పాకి ఎక్కాలిట. మార్గం అంత దుర్గ మంగా ఉంటుంది. వాతావరణం అంత భగవత్పరంగా ఉన్నచోటు మరొకటిలేదు.

బాబా అక్కడిలోయ చివరికి మండలిని గంగాతీరం వెంబడే నడిపించి తీసికొని వెళ్ళారు. అక్కడ కేశవానందజీ అనే మహాపురుషుడున్నాడు. అతని శిష్యు డొకడు గంగలో నగ్నంగా నిలబడి సూర్యదేవునికి నమస్కరిస్తూ ఉండడం బాబా చూపించి 'యితడు యీ విధంగా ఏడు రోజుల నుంచి కదలకుండా ఉన్నాడని' చెప్పారు. 'నదిలో ఉన్న రాళ్ళవలెనే అతని శరీరం కూడా స్థిరంగా ఉన్నట్లు కనబడుతోంది' అన్నారు. చాలాకాలం అలా నిలబడియున్న అతని నిశ్చలభక్తిని చూసి, బాబా పాశ్చాత్య శిష్యులు అచ్చెరువు పొందారు. బాబా యింకా ముందుకి సాగి ధ్యాననిమగ్నులై ఉన్నవారిని ఆధ్యాత్మికాభివృద్ధి పొందినవారిని అనేకమందిని చూపారు.

ఒకడు తన గేటు వద్దకు, పరుగెత్తుకొని వచ్చి బాబా ముఖం లోనికి తేరిపార జూసాడు. అతనిని బాబా ఆశీర్వదించారు. 'అధ్యాత్మిక వాతావరణం కలిగిన క్షేత్రాలలో దీనికి ఎక్కువగా నేను యిష్టపడతానని' బాబా అన్నారు.

మే 15వ తేదీన బాబా మండలితో డెహ్రాడూన్ నుంచి కారుల్లోను బస్సులోను అజ్మీరు వెళ్ళడానికి బయలుదేరారు. బయలుదేరే ముందు యిద్దరు శిష్యులను 'అజ్మీరులో యిల్లు చూడమని' పంపించారు. అజ్మీరు 560 మైళ్ళ

దూరం ఉంది. అక్కడ యిల్లు దొరికిన తరువాత బాబా బయలుదేరారు. మధ్య దారిలో 15వ తేదీ రాత్రి ఖుర్జాలోను, 16వ తేదీన భరత్‌పూరులోను విశ్రమించారు. వేసవి మూలాన ప్రయాణం పొడుగునా వేడిజాస్తిగా ఉంది. ఈ రెండు చోట్లా రాత్రిళ్ళు కూడా చల్లగా లేదు. ఉక్కపోసింది. ఇక్కడ ఆగిన సమయంలో ఖుర్జాలోను భరత్‌పూరులోను కూడా మస్తులు దొరుకుతారేమోనని వెదకించారు బాబా. ఖుర్జాలో ఒక మంచి మస్తు కనిపించాడు. భరత్‌పూరులో మస్తానీమాయి అనే ఒక స్త్రీతో కలిసి ముగ్గురు మస్తులను బాబా సాంగత్యం చేసేరు.

తెల్లవారు ఝామున చల్లని సమయంలో 4–30 గంటలకి బయలుదేరి ప్రయాణం చేయడం, మధ్యాహ్నం 12 గంటలకి ఎక్కడో ఒక ఊళ్ళో ఆగడం, ఆ విధంగా పయనించి 17వ తేదీన అజ్మీర్ చేరుకున్నారు. ఇక్కడ బాబా కోసం, మండలి కోసం యేర్పాటు చేసిన భవనం ఒక కొండమీద ఉంది. అక్కడ నుంచి అన్నాసాగర్ తటాకం అందంగా కనిపిస్తోంది. ఆ చెరువు కొండ దిగువునే ఉంది. బాబా ఉన్న యింటికి పేరు 'ఫూర్ ఫిజా మహల్' అంటే 'అనుగ్రహంతో నిండిన గృహం' అని అర్థము. కరాచీలో తగిన వసతి దొరకనందున బాబా అజ్మీర్ రావలసి వచ్చింది. ఈ విషయం కరాచీ భక్తులకు ఆశాభంగం కలిగించింది. కానీ కరాచీలో ఉన్న భక్తులు శ్రద్ధతో యిన్ని రోజులు బాబా ఉండడానికి ఒక భవనం యేర్పాటు చేయడం కోసం చేసిన ప్రయత్నానికి మాత్రం బాబా సంతోషించారు.

బాబాను ప్రథమంలో 1931లో దర్శించి గత అయిదు సంవత్సరములుగా ఇండియాలో బాబా ఎక్కడ ఉంటే అక్కడ నాసిక్‌లోను, అహమద్‌నగర్, బెంగుళూరు మొదలగు యితర నగరాలలోను బాబాతో ఉన్న పాశ్చాత్య ప్రేమికులు రాజకుమారి నొరీనా మాచెబెల్లి, నడీనె టాల్‌స్టాయ్, ఎలిజబెత్ పాటర్సన్‌లను యిప్పుడు ప్రత్యేకమయిన ఒక పనిమీద బాబా వారిని అమెరికా వెళ్ళమని చెప్పారు. నొరీనా డా॥ దేశ్‌ముక్‌తో ఉపన్యాసాలిస్తూ పర్యటన చేసింది. కాంటెస్ నడీనె టాల్‌స్టాయ్ కూడా రెండు మూడు నగరాలలో వారితో వెళ్ళి ఉపన్యాసాలిచ్చింది. కానీ ఆమె దాదాపు ఒక సంవత్సరం నుంచి బాబా ఆజ్ఞప్రకారం మౌనం పాటిస్తోంది. బాబా ఆగస్టు 1940 నుంచి ఏకాంతంగా ఉంటూ, ఆమెను కూడా ఏకాంతంగా ఉండమన్నారు. 'బాబా సత్యప్రేమ సందేశాలను అమెరికా ప్రజలకు

తెలియజెప్ప వలసిందని' బాబా యీ శిష్యురాండ్రకు ఆదేశించారు. ఆ కాలంలో దేశాల మధ్య వైషమ్య భావాలు చెలరేగుతుండగా, బాబా వారిని పశ్చిమ దేశాలకు పంపడం ఒక విశేషం. నిజమైన ప్రేమ వారికి అవగాహన అయ్యింది. బాబాకోసం వారు తను—మన—ధనములతో సర్వార్పణ అయిన భాగ్యశాలినులు. ఇన్ని రోజులు బాబా వద్ద ఉండి, యిప్పుడు దివ్య ప్రియతముని వీడి వెళ్ళుట వారికి చాలా కష్టంగానే ఉంది. ఈ అయిదు సంవత్సరాలు నిజమయిన ప్రేమతో మెహెర్ బాబాను ఆదర్శప్రాయంగా నిస్వార్థంగా వారితోపాటు పర్యటనలు చేస్తూ సేవించా రంటే, వారి ఆధ్యాత్మిక జీవనానికి అలవాటుపడి ఆశ్రమవాసంలో ఉన్న కష్టసుఖాలకి తట్టుకొని అందులో ఉత్తీర్ణులై బాబాను సేవించారు.

ఇది కుహానా ఒక్కు నిషేధం

1941 జూన్ మాసంలో మీరాదాతార్‌లో సైయిద్ ముస్తఫా అనే ఆరవ భూమికలోని ఉన్నతుడగు మస్తును బాబా సాంగత్యం చేసారు. ముస్తఫా ఆ ఊరిలో చాలా ప్రసిద్ధుడు. సంవత్సరాని కొకసారి యీ మస్తును ఒక గుర్రంమీద ఊరే గిస్తారు ప్రజలు. అతని గౌరవార్థం గొప్ప ఉత్సవం జరుపుతారు. బహుశా యితనికి 85 సం॥ల వయసు ఉండవచ్చు. ఇతని ముఖం చూడగానే ఉదాత్తమైన వాడని తోస్తుంది. చూడడానికి మనస్సుకు నచ్చేలా బాగుంటాడు. మీరాదాతార్ దర్గా వద్దనే ఉంటాడు. ఆ పేరు గలవాడు ప్రఖ్యాతినందిన గొప్ప సాధు పురుషుడు. ఈ దర్గాకి వెళ్ళి మొక్కుకుంటే పిచ్చినయిమవుతుందని, దయ్యాలు పట్టిన వారికి అవి పారిపోయి, నయమవుతుందని నమ్మకం ఉంది. అందుచేత అన్ని మతాలవారు, అన్ని కులాలవారు, హిందువులు, ముస్లిములు, పార్శీలు— అందరూ వచ్చి మొక్కు కుంటారు యీ దర్గాలో. వారి ప్రియమయిన పిచ్చివారయిన బంధువులను తీసికొని వచ్చి అక్కడ కటకటాలకు కట్టేసి మొక్కుతారు. చాలమంది ఆ విధంగా చేసి నందువలన నయమయి బాగుపడ్డారని చెప్తారు.

అజ్మీర్‌లో జూన్ జూలై నెలనుండి బాబా మస్తు అన్వేషణ చేసారు. ఆ చుట్టుప్రక్కల రాజపుతానాలో చాలా భాగం తిరిగారు. ఇద్దరు ముగ్గురు శిష్యులను మాత్రం వెంట తీసుకొని వెళ్ళారు. మధ్య మధ్య అజ్మీర్‌కి వచ్చి, అనేక దేశాల నుంచి — బాబాకి వచ్చే అసంఖ్యాకమయిన ఉత్తరాలు చదివించుకొని, వాటికి అవ సరమయిన జవాబు లిప్పించి మళ్ళీ వెళ్ళుండేవారు. ముందుగా ఒకరిద్దరిని ఒక ఊరికి

పంపుతూ ఆ ఊళ్ళో మస్తులు ఎక్కడ ఉంటారో చెప్పి పంపేవారు. 78 గంటల సేపట్లో ఎక్కడా ఆగకుండా 500 మైళ్ళు కారుల్లో తిరిగారు.

జూన్ 8వ తేదీన యిద్దరు శిష్యులతో బాబా బయలుదేరారు. కొంత దూరం రోడ్డుమీద వెళ్ళారు. వస్తుందనుకున్న కారు సకాలానికి రాలేదు. అందు చేత అనుకున్న ప్రకారం బయలుదేరి కారులో వెళ్ళడం జరుగకపోయినా, ఆ సమయానికే బయలుదేరి బాబా నడక ప్రారంభించారు. కొంతదూరం వెళ్ళి అక్కడ ఒకకారు అద్దెకు తీసుకున్నారు. బాబా ఆనవాలు తెలియకుండా వెళ్ళారు. మూడు రోజులు కార్లలోను, బస్సులలోను. రైళ్ళలోను రాత్రింబగళ్ళు ప్రయాణాలు చేసారు. నిద్రలేకుండా, దారిలో ఎక్కడా విశ్రాంతి కోసం ఆగకుండా ప్రయాణం చేసారు. అయిదు ఊళ్ళు వెళ్ళారు. ఈ ప్రయాణంలో అనేక మంది మస్తులను సాంగత్యం చేసారు. నసీరాబాద్‌లో యిద్దరు మహమ్మదీయ మస్తులను(అందులో ఒక వృద్ధస్త్రీ ఉంది), బీవార్‌లో ముగ్గురిని, సోజత్‌రోడ్డులో యిద్దరిని, ఆబురోడ్డులో ఒకరిని, ఉనావాలో ఒకరిని మస్తులను కలిసారు.

జూన్ (1941) మాసంలో అజ్మీర్‌కి సమీపంలోని నసీరాబాద్‌కి వెళ్ళి అక్కడ హాఫీజ్ జీ అనే మంచి మస్తును బాబా సాంగత్యం చేసారు. ఇతడు పగలంతా ఊరిబయట తిరుగుతుంటాడు. రాత్రుళ్ళు ఒక మసీదులో నిద్రపోతాడు. ఇతడొక ముసలివాడు. చేతిలో ఒక యిత్తడి లోటా ఉంచుకొని తిరుగు తుంటాడు. బాబా అతనిని వెదకుతూ ఊరి బయట స్థలాల్లోనికి వెళ్ళి అతనిని కలిసారు. అప్పుడు హాఫీజ్‌కి మిఠాయి కూడా పెట్టారు.

ఆ ఊళ్ళో ఉండే తేలీవాలా అనే మస్తును కూడా బాబా సాంగత్యం చేసారు. ఇతడొక మంచి మస్తు. ఇతనికి నూనె అంటే చాలా యిష్టం. నూనె వంటిమీద పోసుకుంటాడు. నేను ఢిల్లీ పాదుషాను. నా పరిపాలన యిక్కడ సాగుతోంది' అంటాడు. సాంగత్యం కోసం అతనిని మండలి డాక్ బంగళాకి తీసికొని వచ్చారు బాబా. కానీ ఆ బంగళాలోకి రావడానికి నిరాకరిస్తూ 'నన్నెందుకు రమ్మంటున్నావో నాకు తెలుసులే' అన్నాడు. తరువాత బాబా ఊళ్ళోకి తీసికొని వెళ్ళి అతని సాంగత్యం చేసారు. అప్పుడు అతనికి బాబా జిలేబీ పెట్టారు.

భీవార్‌లో బాయిమస్తానీ అనే ఒక ముసలి మస్తానీ వెదురు కర్రలమ్మే ఒక వర్తకుని యింటిలో ఉండేది. ఆమెకు 3, 4 గురు ఫకీరు శిష్యులు ఉండేవారు. ఆమెకు యేమి కావాలో ఆ వర్తకుడు కనిపెట్టి చూచుకునేవాడు. బాబా ఆమెను జూన్ మాసంలో కలిసారు. ఆ నెలలోనే నారాయణ్‌బాబా అనే మంచి మస్తును కూడా బాబా కలిసారు. అతనిని ఖుతుబ్–ఎ–జంగల్‌వాలా అనికూడా పిలుస్తారు. ఇతడు నూటికి నూరుపాళ్ళు ఇత్తేఫాకే మస్తు. వయసులో చిన్నవాడు. సన్నగా ఉంటాడు. మొలవరకు నగ్నంగా ఉంటాడు. రాత్రింబగళ్ళు గ్రామసీమలోనే గడుపుతూ తెలకొకసారి పట్నానికి వస్తాడు. గ్రామాల్లో ఉన్నప్పుడు పూర్తి దిగంబరుడుగా ఉంటాడు. బైదుల్ మొదట అతనిని కలిసినప్పుడు ఒక రూపాయి అతనికి యివ్వగా, కోపంతో వెంటనే అతని వైపుకే విసిరేసాడు (ఇత్తేఫాకె లక్షణం). ఎల్ల వేళలా 'నారాయణ' 'నారాయణ' అని భగవంతుని స్మరణ చేస్తుంటాడు. అందుకే అతనిని నారాయణబాబా అనేవారు. బాబా యితనిని జూన్ నెలలో సాంగత్యం చేసారు.

బాబా ఆ నెలలోనే సోజాత్ వెళ్ళి అక్కడ స్మశాన భూమిలో ఉండే ఒక మస్తానీని కలుసుకున్నారు. ఆమె ఒక వృద్ధురాలు. మొదట బాబాకు భోజనం పెడతానంది. బాబా అక్కరలేదన్నారు. తరువాత ఆమె మంచినీరు యిస్తే త్రాగారు. ఆమె మోతాదయిన మస్తానీ.

జూన్ మాసంలోనే నూరుబాబా అనే మాదర్‌జాద్ ఉన్నత మస్తును బాబా సోజాత్‌లో రెండు మారులు సాంగత్యం చేసారు. పంజాబ్‌లోని అతని గ్రామం నుంచి పాతికేళ్ళ క్రిందట నూరుబాబా సోజాత్ వచ్చాడు. సోజాత్ వచ్చినప్పుడే అతడు మస్తు. అతడు వచ్చి ఒక యింటి వసారాలో స్థిరపడ్డాడు. ఆ యింటి యజమాని మంచి మాటలతో నూరూబాబాను ఆ యింటి వసారానుండి వెళ్ళిపొమ్మని చెప్పాడు. కానీ లాభం లేకపోగా బలవంతంగా అతనిని పంపించేసాడు. అందుచేత నూరూబాబా అప్పటినుంచి బయుట ఒక రాతిమీద ఎండకి వానకీ ఎండుతూ తడుస్తూ దిగంబరంగా కూర్చునేవాడు. ఆ మస్తు వెళ్ళిపోయిన తరువాత ఆ యింటికి ఒకటి తరువాత ఒకటిగా అరిష్టాలు పట్టుకున్నాయి. అ యింటి యజమాని పిల్లవాడు పోయాడు,

భార్య మరణించింది. అతడు కూడా యీ దెబ్బలవలన పిచ్చివాడయి పోతాడేమో అన్నంతగా దిగజారిపోయాడు. సోజాత్ పట్టణవాసులు 'నూరాబాబాను బలవంతాన పంపించి వేసిన కారణంగా నీ కిన్ని కష్టాలు వచ్చి పడ్డాయని' అన్నారు. అప్పటి నుంచి నూరాబాబాని ఆధ్యాత్మిక వ్యక్తిగా పరిగణించి గౌరవించసాగారు. అతనిని ఆ యింటి వసారాలోనికి వెళ్ళమని అక్కడే ఉండమని చెప్పారు మళ్ళీ. ఇప్పుడు రోజంతా ఆ వసారాలోనే అతడు పూర్తి దిగంబరిగా కూర్చుంటాడు. అతని వద్ద 10, 12 కుక్కలుకూడా ఉన్నాయి, వాటిని అతడు ఆహారం పెట్టి పెంచు తున్నాడు. నూరాబాబాకి యిప్పుడు 80 సంవత్సరాల వయస్సుంది. ఇతడు జన్మ తోనే మస్తు. జలాలీ జమాలీ వైఖరులు కలగా పులగంగా ఉన్నాయి యితనికి. దీని తరువాత, బాబా యితనిని జూలై 6వ తేదీన మూడవ మారు సాంగత్యం చేసారు.

75 ఏళ్ళ వయసున్న ఒక ముసలి వానిని బాబా 'ఆబూ రోడ్డులో (1941) జూన్ మాసంలోనే సాంగత్యం చేసారు. అతనిపేరు ఖుదాబక్ష్. ఒక రొట్టెల అంగడిలో చింకి గుడ్డలతో ఉండేవాడు. ఆ దుకాణాదారునికి అతడంటే చాలా గౌరవం. అతనిని ప్రేమించేవాడు. ఆ ముసలివానికి అవసరాలే తక్కువ. ఎప్పుడైనా ఏమైనా కావలిస్తే ఆ దుకాణాదారుడు యిస్తుండేవాడు. ఆ మస్తుకి టీ అంటే యిష్టం. పగలంతా గ్రామంలో తిరిగి రాత్రి పరుండేందుకు వస్తుండేవాడు. అతడు యిదివరలో 40 సంవత్సరాలు ఒక దర్గాలో ఉండేవాడు. ఆ కాలంలో అతడు ఎవరితోనూ మాట్లాడేవాడు కాదు. ఈ కారణంచేత ఆబూ రోడ్‌లో అందరికీ అతనంటే తెలుసును. తిండి చాలా తక్కువగా తినేవాడు. ఏమి చ్చినా పుచ్చుకునేవాడు కాదు. అతడు మంచి మస్తు.

జూన్ 15వ తేదీన బాబా ముగ్గురు శిష్యులతో రేవారీకి బయలుదేరారు. ఈ ప్రయాణంలో బాబా చాలా కష్టపడవలసి వచ్చింది. కొంతదూరం రోడ్డు బాగాలేక ఎద్దుబండ్లలో వెళ్ళారు. అక్కడ పఠాన్‌బాబా అనే పేరుగల ఒక యువక అన్వేషిని బాబా సాంగత్యం చేసారు. ఈ యువకుడు చాలా మట్టుకు రేవారీ రైలుస్టేషన్‌లో ఉంటాడు. రేవారీ నుంచి బాబా రైలుమీద ఖైర్తాల్ వెళ్ళారు. అక్కడ నుంచి ఇస్లామ్‌పూర్ చేరుకున్నారు. అక్కడ రోడ్లు సరిగ్గా లేకపోబట్టి

బాబా ఎద్దుబండిలో వెళ్ళారు. తిరుగు ప్రయాణంలో దారిలో పెద్ద తుఫాన్ తగిలింది. ఎడ్లబండిలో వస్తూన్న బాబా బాగా తడిసిపోయారు. వారి పరుపులు యితర సామానులు అన్నీ తడిసిపోయాయి. బురదలో బండిని ఎద్దు లాగలేక పోయింది. లాగినా చాలా మెల్లగా నడిచింది. మళ్ళీ ట్రైల్ చాలా ఆలస్యంగా చేరారు. అక్కడినుంచి నీమచ్‌కి రైలులో వెంటనే బయలుదేరి వెళ్ళారు. నీమచ్‌లో ఖబ్రిస్తాన్‌వాలా అనే మస్తును ఒక గోరీల దొడ్డిలో సాంగత్యం చేసారు. ఆ ఊర్లోనే మస్తాన్‌వాలాసాధు అనే మంచి మస్తును ఒక హిందువుల స్మశానభూమిలో, ఒక అపరి శుభ్రమయిన గదిలో బాబా సాంగత్యం చేసారు. ఇతడు నిరంతరము భగవన్నామ స్మరణ చేస్తూంటాడు.

నీమచ్‌లో రూయీవాలాబాబా అనే యింకొక మస్తును బాబా సాంగత్యం చేసారు. ఈతడు ఒక మోతాదయిన మస్తు. ఈ మస్తు తన జేబులనిండా ప్రత్తి కుక్కుకొని ఉంటాడు. అందుకే అతనిని రూయీవాలా అంటారు. ఏమీ పనిలేకుండానే అక్కడికీ యిక్కడికీ తిరుగుతూ ఉంటాడు. నీమచ్ నుంచి బాబా చితోర్‌ఘడ్‌కి రైలులో వెళ్ళి, అక్కడ ఒక మంచి మస్తును సాంగత్యం చేసారు. బాబా అప్పుడు ఒక సంవత్సరంపాటు ఏక భుక్తం చేస్తూ ఉంటున్నారు. ఆ ఒక్కపూట భోజనంకూడా యీ అవసర ప్రయాణాలలో సరిగ్గా దొరికేదికాదు. వెళ్ళవలసిన స్థలములకి ఎన్ని కష్టాలయినా ఓర్చి వెళ్ళి, మస్తుపని చూసుకొని తిరిగి అజ్మీరుకి జూన్ 19వ తేదీకి చేరుకున్నారు బాబా.

తరువాత బాబా కిషన్‌రిడ్‌లో భాయ్యాబాబా అనే మంచి మస్తును సాంగత్యం చేసారు. బాబా మొదట యితనిని ఒక హోటల్లో కలిసారు ఈ మస్తు బాబా సాంగత్యానికి రావడానికి మొదట్లో నిరాకరించాడు. బాబా వద్ద కూర్చో మనగా మస్తు 'నాతో నీ కున్న పని యేమిటో నేనెరుగుదును. నేను రాను, అన్నాడు, బాబా అప్పుడు. 'అన్నం పెడతాను తిందువుగానిరా' అని పిలువగా 'అన్నం పెట్టు నేనే తింటాను' అన్నాడు. కొంతసేపయిన తరువాత ఆ హోటలుకి వెళ్ళబోతుంటే బాబా వద్దకి రమ్మని మండలివారు అడుగగా భాయ్యాబాబా వచ్చాడు. అప్పుడు బాబా అతని సాంగత్యం చేసారు.

బాబా అజ్మీర్‌నుంచి పుష్కర్ వెళ్ళి, అక్కడ బెంగాలీ బాబా అనే ఒక వృద్ధమస్తుని సాంగత్యం చేసారు. అతడొక ఉపదేశం పొందిన యాత్రీకుడు. పుష్కర్‌కి 3 మైళ్ళ దూరంలో ఒక రాతి కొండమీద ఒక చిన్న కుటీరంలో ఉంటాడతడు. ఇప్పుడక్కడి నుంచి వెళ్ళిపోయాడు. ఆ నెలలోనే మహరాజ్ అనే మంచి మస్తును కూడా బాబా సాంగత్యం చేసారు. (జూన్ 1941) అతడొక కుష్ఠురోగి. ఒకనూతిలో కూర్చొనుటకు వీలుగా గుహఉంటే అందులో ఉండేవాడు. భగవంతుని ప్రేమవలన అతనికి కుష్ఠురోగం వచ్చిందని' బాబా అన్నారు ఇదివిన్నవారికి విపరీతంగా తోచవచ్చు. కానీ, దైవానుగ్రహం కలవారికి యిటువంటి రోగాలుగానీ, కష్టాలుగానీ తెచ్చిపెట్టి భగవంతుడు వారి సంస్కారాలను హరించి త్వరగా ముక్తిని ప్రసాదిస్తాడు.

జూలై 6వ తేదీన బాబా ఒక సాధువును సాంగత్యం చేసి అతనికి కొంత డబ్బును కూడా యిచ్చారు.

వృద్ధబాబా

సైయిద్ మహమ్మద్ షెరిఫ్ అనే పేరుగల |వాలిబాబా| అనే మంచి మస్తును బాబా జూలై 9వ తేదీన రేవారీలో సాంగత్యం చేసారు. రైలుస్టేషన్‌లో పెద్ద టికెట్ కలెక్టరు నివసిస్తూన్న యింటిలో యీ మస్తు కూడా ఉంటున్నాడు. బాబా అక్కడ అతని సాంగత్యానికి కూర్చున్నప్పుడు యీ మస్తు పెద్దగా నవ్వాడు. ఆ సమయంలో బాబా ఆ రైల్వే ఉద్యోగికి అయిదు రూపాయిలిచ్చి మస్తుకి ఒక పరుపు కొనిపెట్టమన్నారు. లతడు ఆరవ భూమికలోని సంపూర్ణమయిన మజ్జూబ్‌వంటి జమాలీ మస్తు. ఇంతకుముందు బాబా జూన్ (1941) మాసంలో యితనిని ఒకసారు కలుసుకున్నారు. జూలై మాసంలో మూడవవారంలో బాబా మండలితో బయలుదేరి తిన్నగా మెహెరాబాద్ చేరుకున్నారు.

వారు పర్యటన చేసి వచ్చేసరికి మెహెరాబాద్‌లో మేడమీద హాలులోను క్రింద ఒక పెద్ద గదిలోను, మధ్య తడకలు కట్టి వేరే వేరేగా చిన్న గదులుగా, యేర్పాటు చేసిపెట్టారు. పాశ్చాత్యులను మూడు బృందాలుగా బాబా విభజించారు. ఒక్కొక్క గదిలో ముగ్గురు చొప్పున ఉండాలి. ఆ ముగ్గురు వారిలో వారేగానీ యితరులతో మాట్లాడరాదు. బాబా ఒక సంవత్సరంపాటు ఏకాంతంలో ఉన్నారు.

ఉపవాసాలతో కూడా ఉన్నారు. మెహెరాబాద్ కొండమీద బాబా మస్తు కార్య క్రమంలో ఉన్నారు. పాశ్చాత్య శిష్యులు కూడా ఒక్కపూటే భోజనం చేస్తూ, ధ్యానాది కార్యక్రమంతో కూడిన శిక్షణతో బాబా ఆదేశం ప్రకారం కాలం గడిపే వారు. ఈ బృందంతో ముగ్గురు— ఐరీన్ బిల్లో, ఖార్ మెన్ మాసి, డి. మన్సారీ ఒక సంవత్సరం పూర్తిగా మౌనంగా ఉన్నారు. ఇలా 1941సం॥లో జరిగింది. తరువాత బాబా రాయిపూర్, హైదరాబాద్, డెహ్రాడూన్, ఔరంగాబాద్, పంచాగ్ని, లాహోరువగైరా నగరాలకి వెళ్ళారు. కొన్నిచోట్లకి బాబా మెహెరాబాద్ నుంచి మండలి యావన్మందిని కూడా తీసికొని వెళ్ళేవారు. బాబా ఎప్పుడు ఎక్కడికి వెళ్తారో, ఎవరికి తెలిసేదికాదు. దర్శన కార్యక్రమాలు అప్పుడప్పుడు జరిగినా, బాబా అవి చాలా మట్టుకు తగ్గించి మండలితో ఎక్కువ కాలం గడుపుతూ మస్తులతోను పేదవారితోనూ సాంగత్యం చేస్తూ ఉండేవారు. తరువాత ఏకంతవాసము, ఉప వాసం చేస్తూ ఉండేవారు.

జూలై 1941లో బాబా ఒక చిన్న పుస్తకం లండన్‌లోని బాబా కార్యకర్తలగు విల్, మేరీ బాకెట్లకు పంపించి 'అటువంటివి 30,000 ప్రతులు అచ్చు వేయించి ఉచితంగా పంచిపెట్టమన్నారు. అప్పుడు మేరీ సెంట్‌జాన్స్ అంబులెన్స్ బ్రిగేడ్‌లో చేరింది. అది యుద్ధ సమ యంకదా. బాబా చెప్పినపని చేయడానికి అంటే 30,000 కాపీలు అచ్చు వేయించడానికి 60 పౌనుల సొమ్ము అవుతుంది. విల్ మేరీలు ధనవంతులు కాదు. అయినా బాబా అనుగ్రహం వలన ఆయన అభీష్టం నెరవేర్చారు వారు. ఈ వియోగం వలన విల్‌ని మేరీని కలిసి పని చేసేలా చేసారు. అంతకు ముందు వారిరువురుకు ఎడ్డం అంటే తెడ్డం అనేలా ఉండేదీ. మాట ఏకం అయ్యేది కాదు. అలా కలిసి పనిచేసి అనేకమందిని వారు బాబాపరిధిలోనికి తీసికొని వచ్చారు.

బాబా అజ్మీరు నుంచి మెహెరాబాద్ వచ్చేశారంటే అందరికీ సంతోషాన్ని కలుగ జేసినా, ఆయన ఏకాంతవాసంలో తలుపులు బిగించుకొని ఎవరినీ చూడ కుండా ఉన్నారంటే. బాబా, భక్తిలో ఆయన దర్శనం దొరకడం దుర్లభం అని అనుకున్నప్పుడల్లా విచారంగా ఉంటోంది. అలాంటి వాళ్ళకి దూరాన్నుంచయినా ఆయనను చూడడానికి వీలులేదంటే మరీ కష్టంగా ఉంది. బాబా వస్తున్నారు,

అహమ్మద్‌నగర్ స్టేషన్‌లో దిగుతారు; యీ దారినే మెహెరాబాద్ వెళ్తారు-- అని తెలియగానే నగరవాసులు ఆ చుట్టుప్రక్కల ఉన్నవారు చాలా సంతోషించారు. ఆయన కారులో వెళ్తుంటేనైనా చూడగలుగతాము. కారు ఎక్కేటప్పుడు గానీ, రైలులో నుండి స్టేషన్‌లో దిగేటప్పుడు గానీ చూడగలుగుతాం– అని ఎంతో ఆశ పెట్టుకొని ఉన్నారు.

బాబా మూడవ తరగతిలో ప్రయాణం చేస్తారు. టూరిస్టుకారులో ప్రయాణం చేస్తారు. జి. ఐ. పి. రైల్వేవారి యాత్రీకుల పెట్టె ప్రత్యేకంగా యేర్పాటు చేసుకున్నారు. నగర్ స్టేషన్‌లో రైలు అర్ధరాత్రి దాటాక వస్తుందని తెలిసింది. రైలు దిగి, వెంటనే బాబా వారి మండలితో మెహెరాబాద్‌కి వెళ్తారని తెలిసింది. బాబా రైలు దిగగానే కార్లు బస్సులు సిద్ధంగా ఉన్నాయి. బాబా మాత్రం ఆఖరి నిమిషంలో ఒక నిశ్చయానికి వచ్చారు. అంత అర్ధరాత్రివేళ దిగి మెహెరాబాద్ వెళ్ళి అక్కడ కాపలా ఉన్నవారిని, యితరులను లేపి వాళ్ళకి యిబ్బంది కలిగించడం ఎందుకనో ఏమిటో రైలులోనే అంటే రైలు వెళ్ళిపోయినా వారి ప్రత్యేకమైన టూరిస్టుకారు అక్కడే ఉంచేస్తారు గనుక, అక్కడే తెల్లవారి 4 గంటల వరకు పరుండి అప్పుడు దిగివెళ్తే బాగుంటుందని నిశ్చయించుకున్నారు. ఆయన యిలా నిశ్చయించుకోగానే యీ సంగతి మన్మాడ్ నుంచి నగర్‌కి సందేశం వచ్చేసింది. సరోష్ ఒక్కడు తప్ప స్టేషన్‌కి ఎవరూ రాకూడదు– అని ఆ సందేశంలో బాబా పేర్కొన్నారు. చాలామంది భక్తులు అర్ధరాత్రికి ముందేవచ్చి స్టేషన్‌లో వేచి ఉన్నారు. ఇందాక చెప్పినట్లు దూరాన్నుంచయినా బాబాను ఒక్కమారు స్టేషన్‌లో నుంచి బయటకు వెళ్తుంటే చూడవచ్చునని– వారి ఆశ. ఈ సంగతి అంటే, తెల్లవారి 4 గంటల వరకూ రైలు దిగరని తెలిసాక ఆశాభంగం కలిగింది వారందరికి. అయినా వారు నిద్రపోకుండా అక్కడే ఉందామనుకున్నారు. బాబా ప్రత్యేకంగా ఎవరినీ స్టేషన్‌కి రావద్దన్నారని చెప్పగానే ఆయన మాట జవదాట కూడదని పాపం యింక చేసేది లేక అందరూ బరువైన హృదయాలతో యిళ్ళకి వెళ్ళిపోయారు. నగర్‌లోను, పూనాలోను, బొంబాయిలోను ఆ సమీప ప్రదేశాల్లోను ఉన్న బాబా భక్తులు ఆగష్టు 1వ తేదీ లోపుగా ఒక్కమారు బాబా దర్శనం చేసుకునే అవకాశం ఉంటుందని ఆశించారు. కాని వారు యిక లాభంలేదు

బాబాని ఎవరూ చూడడానికి వీలులేదని తెలిసింది. బాబా ఏకాంతం చాలా తీవ్రంగా పాటిస్తున్నారని తెలిసింది.

మెహెరాబాద్‌కి బాబా రాగానే ఎక్కడా అలజడి లేకుండా ఉండే ఆశ్రమానికి యిప్పుడు జీవం పోసినట్లయింది. ఈ హడావుడి బాబా వస్తారనగానే ప్రారంభమయినది. నీటికి, భోజనానికి మండలి అందరికి చేయవలసిన సదుపాయాలన్నీ ముందుగానే చేసి ఉంచాలి కదా. దానికి సంబంధించిన పనివాళ్ళు పనిచేయడం ప్రారంభించారు. ఈ మారు బాబా కరిన ఏకాంతవాసానికి ప్రత్యేకంగా ఏర్పాట్లు చేయవలసి వచ్చింది. బాబా ఉన్న పరిసరాలలోకి ఎవరూ పోకూడదు. మానవుల శబ్దం కూడా వినపడకూడదు. బాబా చెప్పినట్లుగా తు-చ- తప్పకుండా అన్ని ఏర్పాట్లు చేస్తున్నారు. నాలుగు కుటీరాలు కాపలాదార్లు నలుగురుండటానికి నిర్మించారు. బాబా ఉన్నవైపుకి ఎవరినీ పోనివ్వకుండా చూసే బాధ్యత వీరిది. బాబా మెహెరాబాద్ లోనే ఏకాంత నియమం జరుపుతారని తెలియగానే యీ ఏర్పాట్లన్నీ ప్రారంభించారు. మండలి అందరూ దిగువ మెహెరాబాద్‌లో ఆశ్రమంలో ఉంటారు. వారెవ్వరూ వచ్చి బాబా కంటపడకూడదు. ఆగస్టు 1 నుంచి ప్రారంభించే ఏకాంతవాస సమయంలో మెహెరాబాద్‌లోను, అహమద్‌నగర్‌లోను, నాసిక్‌లోను, బెంగుళూరులోను, బొంబాయిలోను ఉన్న బాబా మండలిలోని కొందరు శిష్యులను బాబా ప్రత్యేకంగా 'వచ్చే ఆరు నెలలలోను చేయవలసింది' ఏదో చెప్పడానికని అందరినీ మెహెరాబాద్‌కి రమ్మని పిలిచారు. వారంతా వచ్చాక, బాబా అందరినీ వేరే వేరే చూసి మాట్లాడారు. వారికి ఒక్కొక్కరికి ఏవో పనులు చెప్పారు. జూలై 20, 21 తేదీలలో యీ పని జరిగింది. అందరినీ సామూహికంగా సమావేశపరచి బాబా కొన్ని విషయాలు వారితో చెప్పారు. అందరూ ఎవరి స్థలాలకు వారిని 21వ తేదీ సాయంకాలం వెళ్ళిపొమ్మని కూడా చెప్పారు. ఆరోజు రాత్రి బండికి అందరూ వెళ్ళిపోయారు.

ఈ మాటలలో శిష్యుల మానసములందు ఏవో కొన్ని సందేహాలు ఉన్నట్టుగా బాబాకు పొడకట్టింది. వాటిని గురించి అందరూ సమావేశమయినప్పుడు బాబా ఒక ప్రసంగం చేసారు. అందులో ఉత్తర హిందూస్థానంలో ఒక నగరంలో ఒకానొక వ్యక్తి వింతగా ప్రవర్తిస్తుంటే వచ్చేపోయేవారు చూస్తూ ఊరుకున్నారే గాని

ఎవరూ— చివరికి పోలీసులు కూడా ఏమీ చేయలేదని, అందరూ మనకెందుకని ఊరుకున్నారని ఆ పనే ఎవరయినా మామూలు మానవుడైతే తీవ్రంగా శిక్షించే వారనీ, అలా ఊరుకోవడానికి కారణం వానిని అందరూ వట్టి పిచ్చివానిలా భావిస్తు న్నారని చెప్పారు. బాధ్యతలేని వ్యక్తి అనుకొని వదిలేసారని చెప్పారు. అప్పుడు ఆ మస్తు సంగతి చెప్పి బాబా ''అలాగే నన్ను గురించి గానీ నా పనిని గురించి గానీ ఎవరైనా ఏదైనా అంటే వారిని నేను పిచ్చివారుగానే భావిస్తాను. నన్ను గురించి దూషించినా నిందించినా బాధ్యతారహితంగా ప్రవర్తించిన వారి వెనుక వారి చేష్టలకు కారకులుంటారని నాకు తెలుసును· మీా రెవరైన ఆ సందర్భాన్ని బట్టి వారు చెప్పేమాటలలో నిజం లేదని, అది అసత్యమని చెప్పదలచుకుంటె ప్రేమతో ఆప్యాయతతో ఆత్మగౌరవంతో సభ్యతతో చెప్పాలి.' అని బాబా హెచ్చరించారు.

బాబా యింకా యిలా చెప్పారు 'ఈ లోకంలో ఒక వైపున మాయఉండి పనిచేస్తోంది. ఒక వైపున నిజమే ఉంది. ఈ నిజం అనంతమయినది. ఈ నిజానికి ఛాయామాత్రంగా ఉన్న మాయకూడా అనంతమయినదే. అనేక నామరూపాలతో ఉన్న యీా మాయ — జీవము, వెలుగు, ప్రేమ, శక్తి—అనంతంగా ఉంది. ఈ రూపాలు మాత్రం ఏమీా అంత పట్టించు కోవలసినవి కావు. వాటికి నాశనం ఉంది—అంతముంది. అవన్నీ శూన్యంలో చేరినవే. సూక్ష్మంగా చెప్పాలంటే యీా కనిపించే అనేకమైన వాటిలో దాగియున్న ఆ ఒక్క వస్తువు అనంతమయినది. ఆ ఒక్కదానిలోను ఉన్న అనేకవస్తువులు కూడా అనంతమయినవే. జీవితంలోని అసంఖ్యాకమైన సమస్యలులాగే.

బాబా అవతారుడు గనుక ఆయన వెనుక అనంతత్వం ఉంది. ఆయన దానితో ఒకటిగా ఉన్నారు. ఒక మామూలు మనిషి వెనుక మనసుఉంది—వెయ్యి తలలు వేసే అహంకారం ఉంది. పైకి ఆ మనిషీ, బాబా ఒకలాగే కనిపించవచ్చు-అనంత పరమాత్మ సాధారణ మానవస్థితికి దిగివచ్చాడు గనుక. బాహ్యంగా కనిపించే యీా పోలిక ఉన్నా, యిరువురకు బ్రహ్మాండమంత అంతరముంది. బాబా చేసే పనుల వెనుక అనంతత్వం ఉండుటచే, ఆయన పనులు ఆయనని బంధించవు. ఆయన మనస్సుకీ అహంకారానికీ అతీతుడు గనుక ఆయనకు సంస్కారాలంటూ కలుగ

చేయువు. మామూలు మానవుని చేష్టలకు, అతడుచేసే పనులకు వెనుక అహంకారయుతమైన మనసు ఉంది గనుక-ఆ పనులు అతనికి బంధాలు కలుగ జేస్తాయి. సంస్కారాలు కలిగిస్తాయి. ఉదాహరణకి ఒకడు ఇంకొకనిని లెంపకాయ కొడితే ఆ చర్యకి వెనుక మనసు అహంకారము కోపం వగైరా పనిచేస్తున్నాయి. అందుకని అది చెడ్డ సంస్కారము కలిగిస్తుంది. అలాగే బాబా ఎవరినయినా లెంపకాయ కొట్టినప్పుడు, బాబా యీ సంస్కారాలకి అతీతుడు గనుక, ఆయనకు బంధనాలు ఉండవు. ఈ విధంగా ఒక అనంతమయిన శక్తి సాధారణ మానవుని మీద ఒక ప్రత్యేక ప్రయోజనంకోసం చెయ్యిచేసుకుంటే, ఆ మానవుని యొక్క సంస్కారాలు పోగొట్టగలదు. అంతేగాక ఆధ్యాత్మికంగా చాలా లాభం కలుగుతుంది ఆ మనిషికి. అందుచేత మీకు ఉన్న ప్రశ్నలు సందేహాలు అవన్నీ యీ మాయా జీవితానికి సంబంధించినవి గనుక, వాటికి నేను యేమీ ప్రాముఖ్యత యివ్వను. నేను చెప్పినట్లు నా పనికి సంబంధించినంత వరకూ మీ విధులు మీరు నెరవేర్చండి. మీరు ఆందోళన చెందకండి'. అని బాబా చెప్పారు.

బాబా యిదివరలో చెప్పినట్లుగా (1941) ఆగస్టు 1వ తేదీని కఠినమయిన ఏకాంతవాసం ప్రారంభం చేసారు. వచ్చే ఫిబ్రవరిలో మౌన విరమణ చేయుడానికి యిది అవసరమని బాబా చెప్పారు.

మెహెరాబాద్ కొండమీద బాబా ఏకాంతవాసం చేస్తుండగా నాలుగువైపుల ఉన్న కుటీరాలలో ఉన్న మండలి శిష్యులు— కాపలాదారులు, ఎట్టి శబ్దమూ ఎవరూ చేయకుండా ఎవరూ సమీపానికి ఏవైపు నుంచీ రాకుండా చూస్తున్నారు. శిష్యులు వారిలో వారు మాట్లాడుకొనవలసినచో రహస్యము చెప్పుకున్నట్లు మాట్లాడవలసినదే. వారిని దాటి ఆ శబ్దము యీవలకు వినపడకూడదు. అందుచేత భయంకరమయిన నిశ్శబ్దం అంతటా ఆవరించింది. వాతావరణం గంభీరంగా ఉంటోంది.

1941వ సంవత్సరం చాలా వరకు బాబా ఏకాంతంగా గడిపారు. ఆ సంవత్సరం ఆయన వారియర్ అనే ఒక నల్లటి అల్సేషియన్ కుక్కని పెంచేవారు. మెహెరాబాద్ కొండమీద కేబిన్‌లో ఉండేవారు బాబా. ఏదయినా కావలసి వస్తే ఆ కేబిన్‌కి ఉన్న చిన్న చిన్న కిటికీలో నుండి అక్షరాల పలకమీద బయటికి చూపించేవారు. ఆ కావలసినదేమిటో విష్ణుకి కబురు చేస్తే, బాబా చెప్పినట్లు

అతడు చేసేవాడు. ఆ రోజులలో విష్ణు అత్యవసరమయిన ఉత్తరాలకి జవాబులు వ్రాసే పని చేస్తూ ఉండేవాడు ఆయన సన్నిధానంలోనికి (గది లోపలికి) ఒక్క వారియర్ మాత్రం పోతూ వుండేది - అంతే. ఈ ఏకాంతం అంతం అయ్యేసరికి వారియర్‌కి జబ్బు చేసింది. దానికి వైద్య చికిత్స ఎంత చేసినా ఒకవారం రోజులలో చనిపోయింది. (ఆగస్టు 1941)

బాబా మండలితో— "వారియర్ చాలా అదృష్టవంతమయిన కుక్క. నా ఏకాంతంలో ఒక విశ్వాసపాత్రమయిన 'మానవుడు కాని జీవుడు' నావద్ద ఉండాలని అనుకున్నాను. నేను అనుకున్నట్లు గానే వారియర్ నా కోరిక తీర్చింది. దాని పని అయిపోయింది. అది వెళ్ళిపోయింది. దాని మరణానికి ఎవరూ విచారించకూడదు. దానికి పూర్తిగా నా దగ్గర ఉండబట్టి సంభావన లభించింది. అది యిూ మారు జంతువుగా పుట్టదు. మనిషిగా జన్మ ఎత్తుతుంది" అన్నారు. అది చనిపోయినప్పుడు 'చవ్‌' సమాధికి ప్రక్కనే దానిని సమాధి చేసారు. స్విడ్జర్లాండు నుంచి తరువాత ఐరీన్ తీసుకువచ్చిన 'కిప్పీ' చనిపోయినప్పుడు కూడా, ఆ వరుసలోనే దానిని పాతి పెట్టారు.

ప్రతీరోజు విష్ణు ప్రపంచంలో అన్ని దేశముల నుంచి వచ్చిన టెలిగ్రాములు, అర్జంటు ఉత్తరాలు, కాగితాలు పట్టుకొని ఉదయమే బాబా వద్దకు వెళ్ళేవాడు. బాబా వాటికి జవాబులు యివ్వవలసిన విధానము విష్ణుకి సూచించేవారు. బాబా చిన్న కిటికీలోనుంచి అక్షరఫలకం మాత్రం కనపడేలా దానిమీద అక్షరాలు కనపరిచేవారు. బాబా చేయి మాత్రం కనిపించేది. ఆయన కనిపించేవారుకారు. విష్ణుతో యిలా మాటాడ్లేపని ఎక్కువసేపు పట్టేలా ఉంటే బాబా అయిదు నిమిషాలు యిలా మాట్లాడి, లోపలికి వెళ్ళిపోయి తిరిగి రెండు నిమిషాలకి మళ్ళా వచ్చేవారు.

ఏకాంతవాసంలో బాబా ఒక చిన్న యింటిలో నివసించేవారు. ఆ యింటిని యిదివరలో ఆస్పత్రిగా ఉపయోగించెడివారు. పైన డోరియా ఇనపరేకులు వేసిన కప్పు ఉంది. కొండమీద గాలి ఎక్కువగా ఉండేది. గాలి వేసినప్పుడల్లా యిూ రేకుల కప్పు చాలా చప్పుడు చేస్తుండేది. బాబా అందులోనే అహోరాత్రులు ఉండి పని చేసేవారు. ఇంకొకరెవరయినా ఆ శబ్దానికి అందులో ఒక్కరోజు కూడా ఉండలేక

పోయేవారు. బాబా అప్పుడు ఒకపూట మాత్రం భోజనం చేసేవారు. మరల మరునాటి వరకు ఉపవాసమే. బాబా శబ్దాలను భరించిన కొలదీ, గాలి యింకా జోరుగా వీచి యింకా ఎక్కువ ధ్వని కలిగించేది. బాబా అందుచేత పంచాగ్నికి వెళ్ళి ఉందామని—అనుకున్నారు. బాబా వెళ్ళిపోదామనుకున్న సమయానికి యీ గాలి, యీ ధ్వని అన్నీ తగ్గిపోయాయి. అయినా ఆయన నిర్ణయం అమలు జరిపారు.

సెప్టెంబరు 3వ తేదీన బాబా పంచాగ్నికి వెళ్ళారు. ఆయన గదిలో నుంచి తిన్నగా కారులో ఎక్కి కూర్చున్నారు. కారులో ఎక్కినా ఎవరికీ కనబడకుండా అంతా తెరలతో మూసివేసేవారు. కారు దిగి తిన్నగా పంచాగ్నిలో వారికోసం ఏర్పాటు చేసిన గదిలో ప్రవేశించారు. బాబా శారీరకంగా చాలా నీరసంగా ఉన్నారు, మెహెరాబాద్‌లో పని ఆయనను భౌతికంగా చాలా బలహీనుణ్ణి చేసింది. అయినా ఆయన పని ముగించిన తరువాతే మెహెరాబాద్ నుంచి పంచాగ్నికి వెళ్ళారు. కొద్దిమంది బాబాతో వెళ్ళారు. మిగిలిన వారు పాతిక మంది వరకు మెహెరాబాద్‌లో ఉండి ధర్మాసుపత్రి వగైరాలు పనులు నిర్వహిస్తున్నారు.

బాబా ప్రపంచ పరిస్థితి గురించి యిలా అన్నారు- 'ప్రపంచం నిజంగా ఒక సుడిగుండంలో ఉంది. దానికి పిచ్చి ఎత్తింది. అన్నిచోట్లా ఉన్న పరిస్థితిని చూడండి. జీవితం తలక్రిందులైంది. న్యాయం గాలిలో కలిసిపోయింది. దేనికీ గౌరవం లేదు. న్యాయం, ధర్మం ఎవరూ పాటించడం లేదు. చట్టాలను వ్యతిరేకిస్తున్నారు. జీవితాలను నాశనం చేస్తున్నారు. బొత్తిగా దయాదాక్షిణ్యం లేదు. మాటకీ, మర్యాదకీ విలువలేదు. అంతా స్వార్థం కోసం, కామాన్నీ, , ఆశనీ తృప్తి పరచడం కోసం, ఏదయినా నేరానికి ఒకనిని తీవ్రంగా శిక్షిస్తే, అదే నేరంచేసిన యింకొకణ్ణి అడిగేవారేలేరు. సహిస్తారు కూడాను. ఆధ్యాత్మికంగా ఆలోచిస్తే ఏదో విధంగా వీళ్ళంతా మాయా మోహితులై పోయారు' ఆధ్యాత్మికాభివృద్ధి చెందినవాడు (బాలోన్మత్త పిశాచవత్) చిన్నపిల్లవాడిలాగ, పిచ్చివాడిలాగ, ఒక దయ్యంలాగ కనిపిస్తాడు, ప్రవర్తిస్తాడు.

సెప్టెంబరు 3వ తేదీన బాబా పంచాగ్ని వెళ్ళినప్పటినుంచి వాతావరణం ఆహ్లాదకరంగానే ఉంది. 12వ తేదీ నుంచి మరల ఎండలు మిక్కుటమయ్యాయి. 'ఈ ఏకాంతవాసంలో కొన్నిరోజులు పళ్ళరసం తీసుకుంటాను, లేక టీ గాని,

పాలుగానీ త్రాగుతాను, కొన్నిరోజులు పట్టి నీరు మాత్రమే త్రాగుతాను ఉపవాసం చేస్తున్నారు' బాబా. నారింజ పళ్ళరసం తీసుకుంటూ ఉపవాసం చేయాలని నిశ్చ యించిన రోజున వర్షం పడింది. తరువాత ప్రతిరోజూ అడపా దడపా వర్షం పడుతూ వచ్చింది. చలిగా కూడా వుండేది. అటువంటప్పుడు నారింజ రసం తీసుకో వడం అంత ఆరోగ్యకరం కాదు. జలుబు చేస్తుంది- అంటారు. అయినా బాబా యే మార్పు చేయకుండా ద్రవపదార్థాలతోనే ఉపవసిస్తూ 9 రోజులున్నారు. తరువాత ఆఖరు 3 రోజులు పచ్చి మంచి-నీళ్ళమీదే ఉన్నారు.

చట్టిబాబా, బాబా వద్దకు వచ్చి 21 మాసములు అయినది. అతడికి తిరిగి వాళ్ళ ఊరు వెళ్ళామని యిచ్ఛ కలిగింది. అందుచేత పంచాగ్ని వెళ్ళిన కొద్ది రోజులలోనే సెప్టెంబరు మాసంలో బాబా ప్రేమ ఆశీస్సులతో యిద్దరు శిష్యు లతో, చట్టిబాబాని తన ఊరు నాగపట్టణానికి పంపించారు.

ఏకాంతవాసం తీవ్రంగా పాటిస్తున్నా బాబా ఒక దీర్ఘమయిన ప్రయాణం చేయడానికి బయలుదేరారు. బాబా ఆనవాలు తెలియకుండా మారు వేషంలో వున్నారు. ఇద్దరు శిష్యులే ఆయనతో వున్నారు. ఇప్పుడు యీ ప్రయాణంలో బాబా 3,000 మైళ్ళు తిరిగారు. ఒక్కొక్క నగరం వెళ్ళి అక్కడ ఒకటి రెండు రోజులుండి, ఏదో ఒకచోట ఒక్కరే వుంటూ వచ్చారు. ఎందుకు యింత ఏకాంతవాసం చేస్తూ యిలా బయలుదేరారో వారితో వెళ్ళిన ఆ యిద్దరు శిష్యులకు కూడా తెలియదు. ఆ ప్రత్యేకమైన ఆంతరిక కార్యమేదో బాబాకే తెలియాలి. ఏ ఊళ్ళు తిరిగారో మాత్రం ఆ యిద్దరు శిష్యులకు తెలుసు. మూడవ తరగతిలో ప్రయాణము. ఆ ప్రయాణాల్లో ఉపవాసాలు. ఆ ఉపవాసాలలో ఏకాంతము. వీటి వలన బాబా ఆయనతో వెళ్ళిన శిష్యులు చాలా కష్టాలు పడవలసి వచ్చింది. పంచాగ్నినుంచి సెప్టెంబరు 30వ తేదీని బయల్వెడలి 15 రోజులలో అక్టోబరు 14వ తేదీని తిరిగి ఎచ్చారు.

బాబా యీ పర్యటన చేసి వచ్చిన తరువాత 'త్వరలోనే మరల యింకొక పర్యటన చేస్తానని' చెప్పగానే—పంచాగ్నిలో ఉన్న వారి శిష్యబృందానికి ఆశ్చర్యం కలిగింది.

ఈ ప్రయాణాలు యిలా చేస్తూనే 'ఉత్తర మధ్య హిందూస్తానంలో రాజపుతానా నగరాలలో తగిన వసతి చూడమని' శిష్యులను పంపారు. బాబా వచ్చే ఆరు నెలల్లోను తీవ్రమయిన ఏకాంతవాసం గడపడానికి వీలుగా-ఎవరితోను మాట్లాడకుండా ఎవరికీ కనబడకుండా గడపాలి-అలా ఉండే బసలను ఏర్పాటు చేయాలి. కొద్దిరోజులలో ఆ శిష్యులు బసలు దొరకలేదని తిరిగి వచ్చారు. అందుచేత మళ్ళీ మండలి అందరితోను మెహెరాబాద్ వెళ్ళి అక్కడ రెండున్నర మాసాలుందామని బాబా నిశ్చయించుట వలన మండలివారికి చాలా సంతోషం కలిగింది. బాబా ఎవరినీ చూడక పోయినా, బాబా భక్తులందరకు బాబా అక్కడ ఉండటమే ఆనంద దాయకం. తరువాత నాలుగు నెలలు ఉండడానికి వసతి సదుపాయాల కోసం అన్వేషణ జరుగుతోంది. కానీ సెప్టెంబరు అఖరువారంలో కొద్దిమంది శిష్యులను తీసికొని, మస్తులను సాంగత్యం చేసేందుకు బాబా ఉత్తర హిందూస్తానం బయలు దేరార.. బాబా ఆశీర్వాదాలతో 'కిట్టీ డేవీ' సెయింట్ జాన్సు అంబులెన్సు బ్రిగేడ్‌లో చేరింది.

కురన్‌వాడ్‌లో అక్టోబరు (1941) 1వ తేదీన కృష్ణ అనే మంచి ఇత్తేఫాకీ మస్తును బాబా సాంగత్యం చేసారు. ఇతనికి జలాలీ లక్షణాలు చాలా వున్నాయి. 'ఇంత స్థిరంలేని మస్తును ఎక్కడా చూడలేదన్నారు' బాబా. స్థానికంగా వున్న ఒక రాజా అతని సంరక్షణ పోషణ భారం వహించాడు. కావలసినప్పుడల్లా క్రొత్త బట్టలు కొని ఆ మస్తుకి యిస్తుంటాడు.

బాబా అక్టోబరు (1941) 5వ తేదీన ఇటార్సీలో మస్తానీ మాయిని కలుసుకున్నారు. ఈమె మంచి మస్తానీ. ఆమె చేతులకు ఇనుపగాజులు వేసుకుంది. ఇనుపకంకెలు మెడలో వేసుకుంది. ఆమెకు 40-45 సంవత్సరాల వయసుంటుంది. ఆ రోజునే గోరీల దొడ్డిలో ఒక అన్వేషకుని ఒకరిని బాబా సాంగత్యం చేసారు. ఇటార్సీ నుంచి ఫతేపూర్ వెళ్ళి 7వ తేదీన అక్కడ స్టేషన్‌వద్ద నివసిస్తున్న ఒక మస్తును బాబా సాంగత్యం చేసారు. అతడు 35-40 ఏళ్ళ వయసున్నవాడు. మంచి మస్తు 'అతనికి మామూలు మానవ చైతన్యం సగం మటుకు ఉందని' బాబా చెప్పారు.

ఖండ్వాకి సమీపంలో 4 మైళ్ళ దూరంలో సనావత్ అనే చిన్న గ్రామం వుంది. ఆ ఊళ్ళో హరిహర్ దాదాజీ అనే ఉత్తీర్ణుడయిన యాత్రికుడున్నాడు.

ఇతడు ధునివాలా దాదాకి శిష్యుడుగా వుండి తరువాత అతని చార్జిమన్ అయ్యాడు. ఇతని గురువులాగే యితడు కూడా ఎప్పుడూ ధుని వెలిగించి ఉంచు కుంటాడు. కాకా యితని వద్దకు వెళ్ళి మిఠాయి, కొబ్బరికాయ, పువ్వులు యిచ్చాడు. దాదాజీ కాకా మెడలో పూలవాల వేసాడు. కొబ్బరికాయ హోమ గుండంలో వేసి అగ్నిహోత్రునికి అర్పించాడు. సనావత్‌లో హరిహర్ దాదాజీ అతని శిష్యులకోసం ఒక ఆశ్రమం నడుపుతున్నాడు. ఇతనిని బాబా అక్టోబరు (1941) 12వ తేదీన సాంగత్యం చేసారు. ఆ రోజునే ఖండ్వాలో కల్లుబాబా మస్తాన్ మోతాదయిన మస్తును రొట్టెలు తయారుచేసే ఒకచోట బాబా సాంగత్యం చేసారు.

అక్టోబరు నెలలో బాబా ఇస్మాయిల్‌పూర్ వెళ్ళి అక్కడ ఆరవ భూమికలో ఉన్న ఒక మస్తును కలిసారు. గోఖలేబాబా అనే యీ మస్తు ఎంతో ప్రేమతో బాబా వైపుచూసి 'భగవాన్ ఆగయే' అన్నాడు. (దేవుడు వచ్చాడు)· ఇంతకు ముందు యీ సంవత్సరంలో బాబా గుజరాత్ పర్యటించినపుడు సాంగత్యం చేసారు. బాబా ఇండోర్‌లో అక్టోబరు (1941) నెలలో 50-55 సంవత్సరాల వయసున్న ఒక కంచి మస్తును కలుసుకున్నారు. అతడు పాత బట్టలు కట్టుకొని ఉంటాడు. సాటు సారా అంటే అతనికి చాలా యిష్టం. రైలుస్టేషన్‌కి ఎదురుగా ఉన్న ఒక ధర్మశాలలో యితడు నివసిస్తున్నాడు.

అక్టోబరు మాసంలోనే బాబా అలహాబాదు పర్యటించినపుడు ఝూన్సీలో మౌనీబాబా అనే అన్వేషకుని సాంగత్యం చేసారు. ఈ మస్తుకి 45 సంవత్సరాల వయసుంటుంది. ఇతడు మౌనంగా ఉండాలని వ్రతం పట్టాడు. బాబా సాంగత్యం చేసినప్పుడు యీ మౌనిబాబా ఒక ఆపిల్ పండు బాబాకు యిచ్చాడు.

నైనిలో (అలహాబాద్‌లో ఒక పేట) ఒక ఉన్నతుడయిన ఆరవ భూమిక లోని మస్తును 1941 అక్టోబరులో బాబా సాంగత్యం చేసారు. అతనిపేర్ు ఖాదిర్‌మియాం. అతనిని చాయిబాబా అనీ, చా-సాహెబ్ అనీ పిలుస్తారు. నైని రైల్వేస్టేషన్‌వద్ద ఒక రైల్వే గుమస్తా యింటిలో అతనికోసం ప్రత్యేకించబడిన ఒక చిన్నగదిలో అతని నివాసం. ఇతడు పూర్తిగా దిగంబరుడు. పొడవుగా ఉంటాడు. నల్లటివాడు. కోలముఖం. టీ అంటే చాలా యిష్టం. అందుకే అతనిని

చా-సాహెబ్ అని పిలుస్తుంటారు. ఇతడు నెమ్మదయినవాడు. ఇతనిని బాబా సాంగత్యం చేసినపుడు ఆ గదిలో అయిదు గంటలు అతనితో ఏకాంతంగా కూర్చున్నారు. సాయంకాలం 5 గంటల నుంచి రాత్రి 10 గంటల వరకు. ఈ సమయంలో ఖాదిర్‌మియాఁ అతని గది లోపల తాళం వేసాడు. బాబా 30 టేసీటి కప్పులు పట్టే ఒక కెటిల్ నిండా టీ తీసుకు వెళ్ళారు. అందుచేత ఖాదిర్‌మియాకి గావలసినంత టీ లభించింది. రాత్రి 10 గంటలకు మస్తు కాకాని సావక్‌ని గదిలోనికి పిలవమని బాబాతో చెప్పాడు. సావక్ రాగానే తనకు టీ, తమలపాకుల్ని కావాలని మస్తు చెప్పాడు. కాకా వైపు చూపిస్తూ ఖాదిర్‌మియా బాబాతో 'కాకాను మీతోనే ఉంచుకుంటారా!' అని అడిగాడు. బాబా 'ఔనని' తల ఊపారు. సావక్ టీ, తాంబూలం తెచ్చాక వాటిని మస్తు సేవించాడు. మళ్ళీ బాబా తరువాత యింకొక 10 నిమిషాలు అతనితో కూర్చున్నారు.

అలహాబాద్‌లో బషీర్‌మస్తాన్ అనే మస్తు ఉన్నాడు. ఇతడు 'బాటసారులు'లో వర్ణించిన అరవ రకానికి చెందినవాడు. అలాంటివారు ఇండియాలో ముగ్గురే ఉన్నారు. ఇతడు అలహాబాద్‌కి ఆధ్యాత్మిక పాలకుడు. వృద్ధుడు. సంపూర్ణ దిగంబరిగాను, పొట్టిగాను ఉంటాడు. బజారు మధ్యలో ఉంటుంటాడు. అతనికి తమలపాకులు వేసుకోవడం చాలా యిష్టం. బాబా సాంగత్యంలోనికి రావడానికి ఆలస్యం చేసాడు. రమ్మనమంటే యిష్టం లేనట్లు చూసాడు. చివరికి ఒక డాక్టరు ఆసుపత్రిలో అతనిని సాంగత్యం చేసారు బాబా. ఆ మస్తు అంటే ఆ డాక్టరుకి చాలాయిష్టం. మొదటి అయిదు రకాల మస్తుల వైఖరులు యితనిలో ఉన్నాయి. ఇలాంటి వారింకా యిద్దరు ఉన్నారు. ఫిలిభిట్‌లో చుప్‌సాహెబ్ ఒకడు, కాశ్మీర్ దేశంలో చిందులూరు నివాసి అయిన నూర్‌షా రెండవవాడు. ఈ రకం మస్తుల్ని చాలా అరుదు. వీరి ముగ్గురిని కూడా బాబా సాంగత్యం చేసారు.

అలహాబాదులో నారాయణ్‌బాబా అనే ఒక వృద్ధుని బాబా కలిసారు. లావుగా ఉండి తెల్లని గడ్డం కలిగి ఉండేవాడు. అతడు కట్టుకున్న లుంగీ పొట్టిగా ఉండేది. ఇతడెప్పుడూ నదీతీరాన కూర్చుని 'నారాయణ, నారాయణ' అని ఉచ్చరిస్తూ ఉండేవాడు. అందుకే అతనిని నారాయణ్ బాబా అన్నారు. ఇతడొక మంచి అన్వేషకుడు.

అక్కడే యింకొక 55 ఏళ్ళ వృద్ధుని కలిసారు బాబా. ఇతడు మొలవరకు దిగంబరిగా ఉండేవాడు. అలహాబాద్‌లో డెప్యూటీ కలెక్టరు ఆఫీసు వరండాలో వుండేవాడు ఎప్పుడూను. ఆ కచేరీలో పనిచేసే ఒకడు అతనికి కావలసిన అన్నం వగైరా యిస్తూ ఉండేవాడు. ఇతడొక మంచి మస్తు.

అక్టోబరులోనే అలహాబాదులో యింకా యిద్దరు మస్తులను సాంగత్యం చేసారు బాబా. బాబా పర్యటన ముగించుకొని శిష్యులతో అక్టోబరు రెండవ వారంలో పంచాగ్ని చేరుకున్నారు.

గత కొద్ది సంవత్సరాలుగా ఉపాసనీ మహరాజ్ వద్దకు గుల్‌మాయి వెళ్ళినప్పుడల్లా 'మెర్వాన్‌జీని చూడాలని వుంది' అని అంటూ ఉండేవాడు. అతడు మెహెర్ బాబాని వెనుకటి వలెనే మెర్వాన్‌జీ అని పిలుస్తూ ఉండేవాడు. గుల్మాయి యీ సంగతి బాబాకు చెప్పేది. బాబా గుల్మాయికి "మహరాజ్‌ను చూడడానికి నేనొక్కడినే ఒక్కమాటే వెళ్తాను" అని చెప్పారు. "సాకోరీకి మెహెరాబాద్‌కి దూరంగా ఉండేచోట అతనిని కలుస్తాను. నేను మౌనంగా ఉండడం వలన మహరాజ్‌తో మాట్లాడను కదా" అని చెప్పగా యీ విషయం గుల్మాయి మహరాజ్‌తో చెప్పెను మహరాజ్. అందుకు అంగీకరించెను. మహరాజ్ అప్పుడు గుల్మాయిని ఒక దూరపు దేశము నందు దహిగావ్ అనేచోట ఒకే ఒక కుటీరమున్న చోటికి తీసికొని వెళ్ళెను. ఇక్కడే మా సమావేశము జరుగవలెను అని మహరాజ్ గుల్మాయికి చెప్పాడు.

1941 అక్టోబరు 17వ తేదీన (ఆశ్వీయుజ బహుళ ద్వాదశి నాడు) బాబా పై ప్రకారం మహరాజ్‌ను కలుసుకున్నారు. ఆ రోజున గురుద్వాదశి శుక్రవారం. అది రంజాన్ నెల. పవిత్రమయిన దినం. ఆ ఒక్కరోజుకి బాబా తను ఏకాంతవాస దీక్ష సడలించుకున్నారు. 1941 డిశంబరు 24 శ్రీ ఉపాసనీ నిర్యాణం చెందారు.—

పంచాగ్ని నుంచి బాబా ఆజ్ఞప్రకారం సరోష్. కె. ఇరానీ అహమద్‌నగర్ నుంచి కారులో వచ్చి బాబాను ఆ సమావేశ స్థలమునకు తీసికొని వెళ్ళాడు. దారిలో పూనాలో బాబా తల్లిని (షిరీన్ మాయిని) చూడడానికి కొంత తడవు ఆగారు. అక్కడ బాబా వారి తల్లి చేతి భోజనమును తిన్నారు. పూనా నుంచి మెహెరాబాద్ వచ్చారు అక్కడ మండలితో రెండు గంటలు కాలక్షేపం చేసారు.

మధ్యాహ్నం రెండున్నర గంటలకి బాబా, గుల్మాయి, సావక్ కొత్వాల్, కాకా బారియా, పాద్రి, సరోష్–వీరంతా మెహెరాబాద్ వదలి, అహమద్‌నగర్‌కి 40 మైళ్ళ దూరమున నున్న దహిగాం అనే ఊరికి వెళ్ళారు. అక్కడ గుల్మాయికి మహరాజ్ చూపిన కుటీరమున్నది. సాయంకాలం 4 గంటలకు అందరూ ఆ ప్రదేశానికి వెళ్ళారు. అది చూసిన తరువాత బాబాకి తృప్తి కలిగింది. అది ఒక చిన్న తోట. దాని చుట్టు కంచె ఉంది. లోపల ఒక ఝోంపడి (కుటీరం) ఉన్నది. అక్కడికి వచ్చిన తరువాత యశ్వంతరావు–మహరాజ్‌కి చాలా పాత శిష్యుడు, బాబాలో గట్టి నమ్మకం ఉన్నవాడు–ఆ కుటీరము యొక్క తాళం తీసాడు. ఏమిటని అడుగగా యశ్వంతరావు 'మహరాజ్ నన్ను తాళం తీసి లోపల శుభ్రం చేయమని' పంపారు అని చెప్పాడు.

బాబా సరోష్‌ను గుల్మాయిని సాకోరీ వెళ్ళి మహరాజ్‌ను కారులో తీసు కొని రమ్మని చెప్పారు. మహరాజ్ ఒక్కడే రావాలని బాబా జ్ఞాపకం చేసారు. వారు వెళ్ళి మహరాజ్ ఒక్కడినే కారులో తీసికొని వచ్చారు. మహరాజ్ వచ్చేసరికి 5–30 గంటలయ్యింది. మహరాజ్ కారు దిగి తిన్నగా ఝోంపడి లోనికివెళ్ళారు. బాబా లోపల ఒక్కరే ఉన్నారు. మిగిలిన వారంతా– సరోష్ గుల్మాయి, యశ్వంత రావు, సావక్, కాకా, పాద్రీలు ఆవరణ బయట వేచియున్నారు. 'ఎవరూ ఆవ రణ లోనికి రాకూడదని, కుటీరంవైపు కూడా ఎవరూ చూడకూడదని' బాబా చెప్పారు. బాబా చప్పట్లు కొట్టినపుడు వారు ఆవరణలోనికి రావాలని బాబా చెప్పారు.

ఉపాసనీ మహరాజ్, మెహెర్‌బాబా యీ యిరువురు మహానుభావులు యీ విధంగా కుటీరంలో ఏకాంతంగా మాట్లాడుకున్నారు. అప్పుడు మహరాజ్ బాబాతో "నీ మౌనమును విరమించి నాతో మాట్లాడు. ఏదయినా సరే ఒక్కమాట చెప్పు. ఏదో ఒక విషయం నీవు మాట్లాడగలవు. నా సముఖంలో నీవు మాట్లాడి తీరాలి" అని మహరాజ్ బాబాను బ్రతిమాలాడు. "నేను మాట్లాడనని పురాణ పురుషుడనై మూల పురుషుని స్థితిలోనికి నేను చేరుటచే మాట్లాడకూడదని మహరాజ్‌కి తెలుసును. నేను మాట్లాడకుండా వుంటే కొద్దికాలంలోనే మహరాజ్ తన శరీర మును వదలి వేయునని నాకు తెలుసును" అని అప్పుడు జరిగిన సంగతి 10 సంవత్సరాల తరువాత బాబా విశదీకరించి చెప్పారు.

ఆ విధంగా బాబా మహరాజ్ యిద్దరూ మాట్లాడుకుంటూండగా ఒక అరగంట అయిన తరువాత బయట ఉన్నవారికి చప్పట్లు కొట్టిన చప్పుడు వినిపించింది. ఆవరణలోనికి అందరూ వెళ్ళారు. గుల్మాయి సద్గురువు లిరువురకు పుష్ప మాల వేసింది. మిగిలిన వారందరూ వారికి ప్రణామాలు చేసారు. తరువాత సరోష్, గుల్మాయి మరల కారులో మహరాజ్‌ను సాకోరీలో దిగబెట్టి వచ్చారు. వెళ్తూ మహరాజ్ 'యీ స్థలం ఏకాంతంగా బాగుంది' అన్నారు. తరువాత బాబా దహిగాం నుండి మిగిలిన వారితో కారులో పంచాగ్ని చేరేసరికి రాత్రి బాగా పొద్దు పోయింది.

ఇరువురు సద్గురువులు భౌతికంగా కలుసుకోవడం చాలా అరుదు. అందుచేత యీ సమావేశానికి చాలా ప్రాధాన్యత, విశిష్టత కలిగింది. ఆ సమావేశంలో సద్గురువులు భావికాలం గురించి ప్రపంచాని కంతటికి చెందిన చారిత్రాత్మకమయిన నిర్ణయాలు చేసి ఉండాలి. 19 సంవత్సరాల తరువాత బాబా మహరాజ్‌ను కలిసారు. 1922లో బాబా సాకోరీ నుంచి వచ్చేసిన తరువాత యిదేవారి సమాగమం. ఈ సమావేశానికి గొప్ప ఆధ్యాత్మిక ఫలితాలుండక తప్పదు.

కొన్నాళ్ళయిన తరువాత ముందుగా ప్రకటించకుండా, 1942 ఫిబ్రవరి 15వ తేదీ లగాయతు, 1943 ఫిబ్రవరి 15వ తేదీలోగా ఏ తేదీనయినా తన మౌనమును విరమించ వచ్చుని' బాబా అన్నారు. ఈ అపూర్వ సంఘటన కోసం కనిపెట్టుకొని ఉన్న వేలాది భక్తులు యీ తేదీ యింకా దూరమందనదని అనుకొని కొంచెం ఆశాభంగం పొందారు. చాలా మంది భక్తులు బాబా మాట్లాడినప్పుడు రేడియో ద్వారా ప్రపంచాని కంతటికీ వినిపించేలా ప్రసారం చేస్తారనుకున్నారు. బాబా ముందుగా చెప్పకుండా మాట్లాడతారని తెలియగానే వారి ఆశాభంగం యింకా తీవ్రమయినది.

1941 అక్టోబరు 26వ తేదీన పంచాగ్నిలో బాబా వారి బంగళా ప్రక్కన రోడ్డు మీద అనుకోకుండా బాబాను చూసి ఒకడు "మీరు మహావిష్ణువు యొక్క అవతారం. సర్వదా స్మరించడానికి నాకేదయినా ఒక నామం చెప్పండి. అది నేనొక వరంగా భావిస్తాను" అన్నాడు. కొద్ది నిమిషాల తరువాత మరల అన్నాడు—

'నా పని అయిపోయింది. ఇక్కడ మిమ్ము ఎవరూ ఎరుగరు. నేను మిమ్ము దర్శించాను. మీరు మహావిష్ణువు యొక్క నిజమైన అవతారమని నేను గుర్తించాను. నన్నుకూడా మీరు జ్ఞాపకం ఉంచుకోమని ప్రార్థిస్తున్నాను.' బాబా ఒక శిష్యుని ద్వారా అతనితో 'నా కంతా తెలుసును. అందుకే నేను యిప్పుడు నీవద్దకు వచ్చాను' అన్నారు. అప్పుడు అతడు చేతులు జోడించి ప్రణామం జేసి— 'నా జీవితాశయం నెరవేరింది. జయమహావిష్ణుదేవ! అన్నాడు బాబా పంచాగ్నిలో ఉన్నప్పుడు ఈతడు తరచుగా బజారులో కనిపిస్తూ ఉండేవాడు. కానీ బాబాను అతడు కలుసుకున్నది ఈ ఒక్కమారే. ఇతడొక ఉపదేశం పొందిన యాత్రికుడు.

'పంచాగ్ని నుండి ఒక సముద్రతీరపు పట్టణానికి వెళ్ళి వారి ఏకాంతవాసం అందరి ప్రత్యేక కార్యాలు జరిపిస్తానని' బాబా చెప్పారు. ఆ ప్రకారం మలబార్ తీరంలో కార్వార్ అనే పట్టణానికి వెళ్ళడానికి నిశ్చయించారు. ముందుగా శిష్యులను పంపించి అక్కడ బాబాకి ప్రత్యేక ఏర్పాట్లతో మండలికి వసతులు చూడమని పంపారు. అక్టోబరు 28వ తేదీని పంచాగ్ని వదలి బాబా 20వ తేదీకి కార్వార్ చేరుకున్నారు.

నవంబరులో మళ్ళీ బాబా బయలుదేరి హుబ్లీ, గదగ్, బళ్ళారి వగైరా పట్నాలకి వెళ్ళారు.

## హుబ్లీ

హుబ్లీలో బాబా స్వామి సిద్ధారూఢుని శిష్యునొకనిని 1941వ సం. నవంబరులో కలుసు కున్నారు. ఇతడొక ఉపదేశం పొందినయాత్రికుడు. ఇతడు మౌనం పాటించే వ్రతం కలవాడు. ఎక్కువగా ఉపవాసాలు చేస్తుంటాడు. ఇతడు 35 సంవత్సరముల వయసువాడు. ఇతని గురువు గతించి కొన్నేళ్ళయింది. తరువాత సంవత్సరంలో (1942) కూడా యితనిని బాబా రెండుమార్లు, జనవరిలోను అక్టోబరులోను సాంగత్యం చేసారు. మస్తాన్ మియా సాహెబ్ అని ఒక ముసలి వానిని హుబ్లీలోనే 1941 నవంబరు మాసంలో బాబా సాంగత్యం చేసారు. ఇతడు లుంగీ ధరించియున్న ఒక మస్తు. ఇతనికి పళ్ళన్నీ ఊడిపోయాయి. అందు చేత మెత్తని ఆహారమే తినగలడు. బాబా అతనికి గులాబ్ జాంబుల్ అనే తియ్యని షరబత్ యిప్పించారు.

హుబ్లీలో ఛోటామస్తాన్ అనే ఆరవభూమికలోని మస్తుకు బాబా యీ నవంబరు మాసంలోనే సాంగత్యం చేసారు. తరువాత 1942లో కూడా పైన చెప్పిన యాత్రీకుని వలెనే జనవరిలోను అక్టోబరులోనూ యీ మస్తును బాబా మరల కలుసుకున్నారు. ఇతడు 22 ఏళ్ళ యువకుడు. ఒక వీధిలో కుళాయి కెదురుగా ఒకరాతి మీద కూర్చుంటాడు యితడు. అన్ని కాలాలలోను నగ్నంగానే ఉంటాడు అడుక్కొని తినే బిచ్చగాండ్లవలె దారేపోయే వారికి తన కడుపును చూపించి డబ్బు అడుగుతాడు. కానీ డబ్బు యిస్తే అది విసిరి పారేస్తాడు. హుబ్లీ పౌరులు అతనిని దేవపురుషుడని అంటారు. అతని చిన్నతనంలో జరిగిన సంఘటన ఒకటి చెప్తూంటార. [illegible]నిని ప్రసవించి తల్లి ఆ బిడ్డను ఒక గుడ్డలో చుట్టి ఒక పెంటకుప్ప మీద [illegible]రేసింది. వీధులు తుడిచేవాడు యీ బిడ్డను చూసి బ్రతికే ఉన్నాడని వానిని తీసికొని వెళ్ళి పిల్లలు లేని ఒక తల్లికి యిచ్చాడు. ఆమె కన్నబిడ్డ లాగే వానిని పెంచి పెద్దచేసింది. పదేళ్ళు రాగానే అతడు మస్తు అయిపోయి యిల్లు వదలి వెళ్ళిపోయాడు. బాబా యితనిని సాంగత్యం చేసినప్పుడు ఒకమారు దిగంబరిగా ఉన్నాడని ఆయన కోటు విప్పియిచ్చారు. మరునాడు మరల బాబా వెళ్ళిచూసేసరికి అతడు దిగంబరిగానే ఉన్నాడు. ఛోటామస్తాన్ ఆ కోటు అప్పటికే ఎవరికో యిచ్చివేసాడు.

## గదగ్

గదగ్‌లో లంగ్‌డామస్తాన్ అనే మస్తు ఉండేవాడు. అతనిని బాబా సాంగత్యం చేసారు. మస్తాన్ కుంటివాడు. ఒక పంచ కట్టుకుంటాడు. గడ్డం ఉంటుంది. ఇతనిని బాబా ఒకరి యింటిలో కూర్చుని సాంగత్యం చేసారు. ఆ యింటి యజమాని బాబాను చూసి దయచేయుండని గౌరవించి మస్తు సాంగత్యం కోసం సదుపాయం చేసాడు. మస్తును కూడా గౌరవించాడు. బాబా మస్తుతో కూర్చున్నంతసేపు అతడు కూడా కొంచెం ఎడంగా కూర్చున్నాడు. బాబా ఎక్కడికయినా వెళ్తే ఎవరు మరియాద చేయకుండా ఉండగలరు? గదగ్‌లో బాబా యింకొక మస్తునుకూడా కలిసారు. ఆ వూరి నుంచి బాబా వెళ్ళారు.

## బళ్ళారి

షా మస్తాన్ అనే మస్తు బళ్ళారి పట్టణంలో ప్రసిద్ధి చెందినవాడు. సాధారణంగా అతడు గోరీల దొడ్డిలో ఉంటాడు. ఇదియొక అడవిలో ఉండే విశాల ప్రదేశం. బాబా వారి శిష్యులతో అక్కడికి రాత్రివేళ వెళ్ళారు. అది 1941వ సం. నవంబరు మాసం. ఆ రోజున అమావాస్య. అమావాస్య రాత్రి స్మశానం లోనికి వెళ్తే మళ్ళీరాలేరని అంటారు. వారు ఆ రాత్రి వెళ్ళి ఆ ప్రదేశమంతా తిరిగారు. ఆ చీకటిలో గోతులలో కూడా పడ్డారు. ఎంత వెదకినా అతడు వారికి దొరకలేదు. నాలుగు మారులు ఆ మూల నుంచి యీ మూలకి స్మశానం అంతా తిరిగినా లాభంలేక పోయింది. ఒక టాంగా వాలా ఆ మస్తు ఎక్కడున్నాడో తెలుసునని ఒక ముస్లిమ్‌ను తీసుకు వచ్చాడు. కానీ వాడు ఆ అమావాస్య రాత్రి ఆ గోరీల దొడ్డిలోనికి వెళ్ళనన్నాడు. పైగా తాను అప్పుడు శుభ్రంగా లేనన్నాడు. ఏలాగయితేనేం 'యింకొక ముగ్గురు కూడా వస్తే వచ్చి ఆమస్తుని చూపిస్తా' నన్నాడు. ఆ ముగ్గురిలోను గుస్తాద్‌జీ కూడా రావాలన్నాడు. అంతా బయలుదేరి వెళ్ళి ఎంత వెదికినా మస్తు కనబడలేదు. చివరికి కాకా ఒక్కడూ వెళ్ళాడు. అయినా లాభం లేక ఆ రాత్రికి యింక అన్వేషణ మానేసి మరునాడు ఉదయం మళ్ళీ వచ్చారు. ఉదయాన్నే ఆమస్తు గోరీల దొడ్డి లోనే కనిపించాడు రాత్రికూడా అతడు అందులోనే ఉన్నాడట. బాబా అప్పుడతనిని సాంగత్యం చేసారు.

బువాపూర్ అనే గ్రామవాసి అయిన కువాన్‌వాలా బాబా అనే మస్తును నవంబరు (1941) మాసంలో బాబా సాంగత్యం చేసారు. ఒక గోడ దగ్గర చెత్త పోగుచేసుకుని యీ మస్తు దానిమీద పరుంటాడు. పురపాలక సంఘంవాళ్ళు బండి మీద అప్పుడప్పుడూ ఆచెత్తను తీసుకు పోతూంటారు. అప్పుడు మళ్ళీ వేరే చెత్తను పోగుచేసి దానిమీద పరుంటాడు. రాత్రుళ్ళు దానిమీదే నిద్రపోతాడు. ఈ ప్రయాణం తూర్పు తీరాన ఉన్న నాగపట్టణం వరకుచేసి అక్కడ మరల చట్టి బాబాను సాంగత్యం చేసి బాబా తిరిగి అహమద్ నగర్ చేరుకున్నాడు.

డిశెంబరు 22 వ తేదీన మహరాజ్ సాకోరీ నుండి అతని జన్మస్థలమగు సతానాకు వెళ్ళెను. సాకోరీలో బయలు దేరినపుడు సతానాలో నెలా

ఖరు వరకు ఉంటానని మహరాజ్ చెప్పెను. కానీ శరీరమున అస్వస్థతగా నుండుట చేత ఒక్క రోజుండి మరునాడే డిశెంబరు 23 వ తేదీన బయలుదేరి సాకోరీ తిరిగి వచ్చెను. 24వ తేదీ తెల్లవారు ఝామున హృదయము దగ్గర ఏదో బాధగా ఉన్నదనెను. శిష్యులు మామూలు చికిత్స ఏదో చేసారు. కానీ ఆ రోజునే మహరాజ్ మహానిర్యాణము చెందెను. అయినను దగ్గరున్నవారు మహరాజ్ నిద్రపోతున్నాడని అనుకున్నారు. రెండు మూడు గంటల వరకూ లేపకూడదని దూరముగా ఉన్నారు. నిద్రలో కూడా మామూలుగా ఉండే చలనమ్ము లేక పోయేసరికి వారికి అనుమానం కలిగింది. తరువాత మహరాజ్ శరీరాన్ని కన్యా కుమారిస్థాన్‌లోనే సమాధి చేయడానికి అన్ని ప్రయత్నాలూ చేసారు.

1941 సం. డిశంబరు 24వ తేదీ మధ్యాహ్నం సాకోరీ నుంచి సద్గురు ఉపాసనీ మహరాజ్ నిర్యాణం చెందినట్లు అహమ్మద్‌నగర్‌కి టెలిగ్రాం వచ్చింది. సరోష్ యీ టెలిగ్రాం వార్త బాబాకు చెప్పటకై విష్ణుతో కూడా మెహెరాబాద్ కొండమీదకు వెళ్ళాడు. అప్పుడే బాబా గేటు బయటకు వచ్చి— 'అది జరిగి పోయిందా?' అని అడిగినట్లు సైగచేసారు. ఆయన ముఖంలో ఎక్కడా విచారరేఖ పొడసూపలేదు. ఆశ్చర్యం అంతకన్నా కనిపించలేదు. అనుకున్నదే జరిగినట్లుగా మామూలుగానే ఉంది బాబా వదనం. మంచికోసం యిది, యిదివరకే నిర్ణయింప బడినట్లుగా ఆయన కనిపించారు.

కానీ బాబా ఉపాసనీ మహరాజ్ సమాగం తరువాత యిది జరుగుతుందని అనుకున్నప్పటికీ యింత త్వరలోనే మహరాజ్ నిర్యాణం సంభవిస్తుందని మండలి వారు ఊహించలేదు. వారందరికీ చాలా విచారంగానే ఉంది. బాబా అభీష్టం ప్రకారం ఆయన ఆదేశాన్ననుసరించి మండలిలోని 9 మంది శిష్యులు 25వ తేదీని మెహెరాబాద్ నుంచి మహరాజ్‌కు ఆఖరుసారిగా శ్రద్ధాంజలి ఘటించడానికి సాకోరీ వెళ్ళారు.

శోకప్రవాహం

మహరాజ్ కోరిక ప్రకారం సాకోరీ లోని జోపు ప్రక్కన ఆయన భౌతిక దేహము సమాధి చేయుబడినది. బ్రాహ్మణ భక్తులు చెప్పిన ప్రకారం హిందూశాస్త్ర విధి ప్రకారం అంత్యక్రియలు జరిపించారు. మహరాజ్ శరీరాన్ని ఊరేగించిన అనం

తరవు ఖననం పూర్తి చేయుసరికి ఆరుగంటల కాలం పట్టింది. ఈ కర్మ కాండ పూర్తికాగానే బాబా ఆజ్ఞానుసారం బాబా శిష్యులందరూ వెంటనే బయులు దేరి రాత్రి 10 గంటలకు మెహెరాబాద్ చేరుకున్నారు. మహరాజ్ నిర్యాణము సాకోరీలో ఉన్న శిష్యులకు కూడా తరువాతనే తెలిసింది. అంత శాంతంగా అతడు తనువు త్యాగం చేసాడు. అప్పుడు మిగిలిన వారందరూ వచ్చారు. అయిదుమైళ్ళ దూరంలోని కోపర్‌గావ్ నుంచి డాక్టరును తీసికొని వచ్చారు. అతడు వచ్చి చూపి ప్రాణము పోయి కొన్ని గంటలయిందని చెప్పాడు. ఆ కాలము నందలి పంచ సద్గురువులలో ఒకనిని భారతదేశం, కాదు ప్రపంచం యీ విధంగా గోల్పోయెను.

26వ తేదీ ఉదయం బాబా మండలి నందరను సమావేశ పరిచారు. 'ఉపాసనీ మహరాజ్ శరీరం చాలించినంత అకస్మాత్ గా అనుకోకుండా బాబా తమ మౌన విరమణ చేస్తానని' చెప్పారు. 'అప్పుడు ఆ సంఘటన ప్రపంచాన్ని భూకంపం వచ్చినట్లుగా కదలించి వేస్తుందని, అందరికీ అనుభూతి కలుగుతుందని' బాబా అన్నారు. కొన్నాళ్ళయిన తరువాత బాబా పంచాగ్ని నుండి మెహెరాబాద్ వచ్చారు.

డిశెంబరు నెలలో మస్త్ సాంగత్యం కోసం మెహెరాబాద్ నుంచి బయట ఊళ్ళకి రెండుసార్లు ప్రయాణం చేసి వచ్చారు. మొదటిసారి బాబా పండరీపురం వెళ్ళారు. ఆ చుట్టు ప్రక్కల మీరజ్ సంగ్లీ పట్టణాలు కూడా తిరిగి వచ్చారు. డిసెంబరు (1941) మాసంలో పండరీపురానికి చెందిన బాపు మహార్ అనే వానిని బాబా సాంగత్యం చేసారు. ఇతడు ఆ నగరంలో స్మశానభూమిలో దిగంబరుడై కూర్చుని ఉంటాడు. కులానికి యితడు హరిజనుడు. గ్లాసులు కల్లు యిస్తే చాలా సంతోషిస్తూ త్రాగుతాడు. బాబా మొదట యితనిని అక్టోబరులోను, యిప్పుడు డిసెంబరు 27వ తేదీన సాంగత్యం చేసారు.

## మహా కుంభ మేళా

ఈ మహా కుంభమేళా అనునది కుంభరాశిలో గ్రహచారమును బట్టి యీ ఉత్సవం 36 సంవత్సరాల కొకసారి వస్తుంది. ఇండియాలో చాలా పెద్దయెత్తున జరిగే ఉత్సవాలలో యిది యొకటి. అలహాబాద్, హరిద్వార్, ఉజ్జయిని, నాసిక్

నగరాలలో జరుగుతూంది యిది. ఈ మహాకుంభమేళా పర్వదినమునకు అనేక లక్షల మంది యాత్రీకులు వచ్చి త్రివేణి సంగమమున (అలహాబాద్) స్నానాలు చేస్తారు. అక్కడ గంగా, యమున, అంతర్వాహినియైన సరస్వతీ నదికలుస్తాయి. అందుచేత సంవత్సరంలో ప్రతిరోజు కూడా అనేక లక్షలమంది యాత్రీకులు అలహాబాద్ వచ్చి ఆ పవిత్ర సంగమ స్థానంలో స్నానం చేసి వెళ్తుంటారు. కుంభమేళా సమయంలో దేశం నలుమూలల నుంచి అనేకవేల మంది సన్యాసులు, యోగులు, సాధువులు వస్తారు. వారిని సాంగత్యం చేయుటకై బాబా సంకల్పించారు. పది రోజులు ముందుగానే బాబా సాధుసాంగత్యం చేసే పనిలో వారికి బాగా సహాయము చేయగల ప్లీడర్‌ను ప్రయాగ (అలహాబాద్) పంపించారు.

మహత్తరమైన ఆధ్యాత్మిక కార్యమునకు బాబా బయలుదేర బోతుంటే మాయకూడా తన పని చేసుకుంటూ బాబా ప్రయాణానికి యిబ్బందులు చేకూరుస్తోంది. సాధు సందర్శనార్థం బాబా ప్రయోగ వెళ్ళడానికి నిశ్చయించుకున్న రోజునే ఇండియా ప్రభుత్వం వారు అలహాబాదుకు మహాకుంభమేళా ఉత్సవానికి వెళ్ళే ప్రత్యేకరైళ్ళు అన్నీరద్దు పరచినట్లు ప్రకటించారు. తూర్పు తీరానఉన్న పట్నాలు కొన్ని యుద్ధ ఫలితంగా ఖాళీ అవుచున్నవి. అందుచేత మామూలుగా ఉండే రైళ్ళన్నీ విపరీతంగా క్రిక్కిరిసి ఉంటున్నాయి.

బాబా మెహెరాబాద్ నుంచి 1941 డిశెంబరు 29వ తేదీ ఉదయం రైలుకి వెళ్దామని మండలితో బయలుదేరారు. అహమద్‌నగర్ స్టేషన్ చేరిన తరువాత మిలిటరీ స్పెషల్‌బండ్లు అడ్డంగా ఉండుటచేత మన్మాడ్ నుంచి ఎక్కి వెళ్ళే బండి దొరకదని మన్మాడ్ వెళ్ళేరైలు ఎప్పుడు వస్తుందో తెలియదని రైలు వాళ్ళు చెప్పారు. అంత మాత్రంచేత బాబా ప్రయాణం ఆపుచేయలేదు. రైలుకి వెళ్ళవలసినది బదులు రోడ్డుమీద ప్రయాణం చేసారు. సరోష్ మోటారు వర్క్సువారు యిచ్చిన ఒక బస్సులో మండలితో అహమద్‌నగర్ మన్మాడ్ రోడ్ మీదుగా బయలుదేరారు. ఈ రోడ్డు సాయిబాబా దర్గా ఉన్న షిర్డీ, ఉపాసనీ మహరాజ్ యొక్క సాకోరీ ఆశ్రమ్, యిటీవల బాబా మహరాజ్ సమాగమ మయిన దహిగాం గ్రామము వీటి మీదుగానే వెళ్తుంది. బస్సులో వెళ్తూ బాబా మండలికి బాబా మహరాజ్‌ను కలిసిన కుటీరమును చూపించారు.

మన్మాడ్ యింక పది మైళ్ళుందనగా సుందరమయిన అంకాయ్ పర్వతశ్రేణి కనిపించింది. బాబా శిష్యులు కొందరు యింతకు ముందు ఆయన ఆజ్ఞప్రకారం ఆ కొండలలో ఏకాంతవాసం చేసి ఉన్నారు. ఆ కొండలవద్ద ఆగి బాబా, వారి మండలి ప్రాతఃకాల అల్పాహారము తీసుకున్నారు. మండలితో కూడా బాబా ఒక పెద్ద మర్రిచెట్టు క్రింద కూర్చున్నారు. ప్రక్కనుంచి పారే ఒక చిన్న ఏరులో నిర్మలమైన జలము దొరికింది. త్వరలోనే మన్మాడ్ చేరుకున్నారు. అలహాబాద్ వెళ్ళ వలసిన రైలుకి యింకా వ్యవధి ఉండగానే మన్మాడ్ స్టేషన్‌కి వెళ్ళారు.

బాబాతో 'యీ రద్దీలో ప్రయాణం కష్టం గనుక టూరిస్టు కారు రిజర్వు చేయించుకుందాం అని, లేకపోతే రెండవ తరగతి పెట్టె ఒకటి రిజర్వు చేయించుకుంటే బాగుంటుందని' మండలి ప్రతిపాదించారు. ఇవేవీ బాబా ఒప్పుకోలేదు. మామూలుగా మూడవ తరగతి లోనే వెళ్దామనుకున్నారు. ఇంతలోనే అలహాబాద్ ఎక్స్‌ప్రెస్ బండి వచ్చింది. అందులో కావలసినంత స్థలం అందరికీ దొరికింది. బాబాకి మండలికి ఒక్క పెట్టెలోనే స్థలం కుదిరింది. బాబా నవ్వుతూ 'యీ పెట్టె మధ్య దారిలో తీసేయకుండా చివరివరకూ వెళ్తుందో లేదో కనుక్కోండి' అన్నారు. రైల్వే అధి కారులిద్దరిని అడుగగా, 'అది తిన్నగా అలహాబాదు వెళ్తుందన్నారు.' మండలి అందరూ ధైర్యంగా నిద్రపోతున్నారు. అర్ధరాత్రివేళ ఎక్కడో స్టేషన్‌లో పోర్టర్లు కేకలు వేస్తుంటే అందరికీ మెలకువ వచ్చి లేచారు 'ఈ పెట్టె అక్కడ విడదీయవలసిన అగత్యం వచ్చిందని అందులో ఉన్నవారందరూ మిగిలిన పెట్టెలలో సర్దుకోమని' చెప్పారు. ఆ అర్ధరాత్రివేళ యింకో పెట్టెలో చోటు దొరుకుతుందో లేదో అని కొందరను కుంటూంటే యింత కష్టం తెచ్చిపెట్టి నందుకు యిక్కడి రైల్వే వాళ్ళని తిట్టారు కొందరు. మన్మాడ్‌లోనే అడిగినపుడు సరిగ్గా సమాధానం యివ్వక తిన్నగా యీ పెట్టె అలహాబాదు పోతుందన్న అధికారులను నిందించారు కొందరు. 'సరే, మీరు మాటలలో సమయం వృధ చేయక యింకొక పెట్టెలో చోటు చూసుకునేందుకు వెళ్ళండని' బాబా హెచ్చరించారు. రైలుకు చివర ఒక పెట్టెలో కొంత ఖాళీ ఉంది. అందరూ త్వరగా అక్కడికి చేరుకున్నారు. ఎలాగో అందరూ రైలెక్కారు. రైలు బయలుదేరింది.

ఇంకొక స్టేషన్‌లో ఎక్కడో ఒక తమాషా మనిషి వీరి పెట్టెలో ఎక్కాడు. అతనికి పెద్ద బొజ్జ సన్నని కాళ్ళు ఉన్నాయి. మనిషి పొట్టివాడు. పెద్ద తలకాయ ఉంది. చూస్తే నవ్వు వచ్చేలా ఉన్నాడు. అతడు కూర్చున్న చోటుకి దగ్గరగా టిక్కట్లు లేకుండా ఎవరో బిచ్చగాళ్ళు ఎక్కి ఉన్నారు. వాళ్ళందరూ చోటు చాలకుండా అక్కడ మూగుతుంటే 'హే! హే! తప్పుకో, దూరంగా పో.' అని కేక వేస్తున్నాడు, ఆ పొట్టివాడు పాపం. అది చూసి మండలి అంతా నవ్వుకున్నారు.

మరునాడు 30వ తేదీ ఉదయం పది గంటలకు రైలు అలహాబాదు చేరింది. ఒక హోటలులో అల్పాహారాలు తీసుకొని కొంతసేపు విశ్రమించిన తరువాత బాబా బయలుదేరి కుంభమేళా ఉత్సవ స్థలానికి వెళ్ళారు. కొంతమంది మండలిని కూడా తీసికొని వెళ్ళారు. వెళ్ళి చూస్తే సాధు సందర్శనం అంత సులభమయినదిగా తోచ లేదు. ఆరోజు చాలా వేడిగాను ఉక్కగాను ఉంది. మేళా స్థలం యిసుక నేలగా ఉంది. ఈ సాధువులంతా ఒకచోట లేరు. ఎటు చూసినా రెండుమైళ్ళ మేరలో అక్కడా అక్కడా ఉన్నారు. బ్రహ్మాండమయిన యీ పని జయప్రదంగా జరగడానికి అలాచేస్తే బాగుంటుంది. ఇలా చేస్తే బాగుంటుంది. అని మండలి ఎవరికి తోచినట్లు వారు సలహా లివ్వడం ప్రారంభించారు. బాబా అవేవీ ఒప్పుకోలేదు. వారు చెప్పి నట్లే విని యుంటే ఎన్నో రోజులు ప్రయాగలో ఉండిపోవలసి వచ్చేది. ఆయనకి తోచినట్లే ఆయన చేసారు.

మొదట బాబా మండలితో బయలుదేరి ఆ యిసుకలోను ఎండలోను నాలుగు గంటలసేపు నాలుగువైపులాతిరిగివచ్చారు. ఈ తిరుగుతూన్నప్పుడు కూడావున్న శిష్యులు అంతాచూడడానికి గంగా యమునా నదులు రెండుమారులు ఒక పడవమీదదాటారు. అలా దాటినప్పుడు బాబా 'అలహాబాదు పూర్వం నుంచి ఆధ్యాత్మిక వాతావరణం కలిగిన నగరం' అని మండలికి చెప్పారు. బాబా అంతటా తిరిగి కలయజూచి సాధు సాంగత్యం చేయడం ప్రారంభించారు. సూర్యాస్తమయం అవుతుంటే మొదట సాధు వును సాంగత్యం చేసారు. ఆ సాధువు సూర్యాస్తమయం చూస్తూ "ధ్యానించు జపించు" అంటున్నాడు. ఇతని దుస్తులు ప్రాచ్య పాశ్చాత్య వేషాలు రెండూ కలిసినట్లున్నాయి. మహోన్నతమైన తూర్పు పడమర దేశాల కలయిక బాబా పనిగా పెట్టుకున్నారు కదా! భారత దేశపు సాధువు వలెనే ఒక పొడవైన చొక్కా

వేసుకున్నాడు. మిగిలిన బట్టలు మాసి చిరిగికూడా ఉన్నాయి. పాశ్చాత్య పద్ధతి అతడు పెట్టుకున్న హాట్ వలన తెలుస్తోంది.

రెండవ సాధువు బాబా స్పృశించిన వాడిని చూస్తే, చైతన్య మహాప్రభువు లాగ చేతులు పైకెత్తి ఆ భగవత్ప్రేమలో ఒడలు మరచిఉన్నట్లుగా ఉన్నాడు. చైతన్య ప్రభువు అలాగే శ్రీకృష్ణుని యందలి ప్రేమాతిశయం వలన పూరీ జగన్నాథ్‌లో సముద్రతీరాన ఆ సైకతస్థలాల్లో ఇలాగే పరవశుడై తిరిగాడు. బాబాకు బదులు మీరు కృష్ణ పరమాత్మను, ఆ సాధువుకు బదులు చైతన్య ప్రభువును తలచుకుంటే సరిపోతుంది. ఈ గంగా తీరానికి బదులు సముద్రతీరాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. ఆ సాధువు మంచి వయసులో ఉన్న 30 ఏళ్ళ వయస్సున్న యువకుడు. చాలా అందగాడు. బాబాకి 50 అడుగులు దూరంలోనుంచి చేతులు పైకెత్తి నృత్యం చేస్తున్నాడు. వాడి జీవితంలో అంతటి ఆనందం ఇదివరకు పొందలేదేమో అన్నట్లుగా పరవశుడైనాడు. నాలుగడుగులు ముందుకు వేసి కూర్చున్నాడు. బాబా అతనివద్దకు కన్నపిల్లవాడిని గనిన తల్లివలె వెళ్ళికౌగిలించుకున్నారు. ఆ సాధువు దిగంబరుడుగా కౌపీనం కూడా లేకుండా ఉన్నాడు. వాని శరీరము ధూళి ధూసరితంగా ఉంది. అతడు దివ్యప్రేమ సాగరంలో మునిగియున్నాడని' బాబా అన్నారు.

ఎవరయినా బాబాను 'ఏది మీకు ఎక్కువ సుఖాన్ని కలుగ జేస్తుంది?' అని అడిగితే 'నా జవాబు ఏమంటే-ఒక మస్తుని కౌగిలించు కొనుట' అని బాబా జవాబు చెప్పారు. ఇందాక ప్రయాగలో మొదట దర్శించిన మస్తు యొక్క ప్రేమను గురించి చెప్తూ బాబా 'అటువంటి ప్రేమ నీ అసత్యాహంకారాన్ని నశింపజేస్తుంది. అతీతమయిన చైతన్య స్థితిలో ఉన్నతోన్నతమయిన స్థితి నిన్ను వాంఛలను కలిగించే, నీ అహంకారాన్ని నిర్మూలిస్తుంది. ''ఆ సాధువుయొక్క స్థితిని గురించిచెప్తూ బాబా' మానవుడు భగవంతునితో సహవాసముచేసినట్లే, పరమాత్మతో ఆత్మయొక్క తాదాత్మ్యము ప్రియతమునితో ప్రేమికుని ఏకత్వము అర్థం చేసుకోవడానికి అతీతమైన విషయాలు. అలాగే భగవంతుని ప్రేమికుడయిన యితని స్థితి వర్ణనాతీతము.''

''చైతన్య మహాప్రభువు'' అయిన రెండవ సాధువు బాబాకు ఎంత ఆకర్షితుడయ్యాడో గానీ, రెండవ రోజున వేలకొలది సాధువుల సాంగత్య మొనర్చినను బాబా

'యీ ప్రత్యేక వ్యక్తిని మరల చూడవలెనని అతనిని గొనిరమ్మని' శిష్యుల బంపిరి. ఆ రోజున కూడా యితనిని బాబా మరల కలిసారు. కలిసి అరగంటసేపు అతనితో సాంగత్యం చేసారు— ఆ రోజు బాబాకు అసలు తీరుబడి లేకపోయినా.

మొదటి రోజున సాధువులు ఎక్కడెక్కడ ఉన్నారో తిరిగి తెలుసుకున్న తరువాత, సాధువుల సాంగత్యం ప్రారంభించి 359 మందిని సందర్శించారు. మండలి అందరూ బాగా అలిసిపోయారు. కానీ దారికి ఆ కారణంచేత బాబా పనికి అంతరాయం కలిగించడం యిష్టంలేదు. అయినా వారంతటవారే "బాబా! ఈ రోజుకు చాలు. మళ్ళా రేపు మిగిలిన పని చూద్దాం" అని ఆపేసారు. నిజంగా బాబా అలిసిపోలేదని మండలి సహాయార్థమే నిస్సటి దినం పని చాలించారని మర్నాడుగానీ వారికి తెలియలేదు. మరునాడు— (31-12-41) - బాబా తమ మండలిని అక్కడక్కడ నిలబడి యుండమని నియోగించారు, పిలిస్తే పలికేలా దగ్గరగా. ఆయన మాత్రం ఆ యిసుకలో యంత్రంలా తిరుగుతూ పని చేసారు. ఆ సాధువులు ఎక్కడుంటే అక్కడికి బాబా వెళ్తూండడమే కాకుండా వారు ఏ స్థితిలో ఉన్నా క్రిందకి వంగి వారి పాదాలను స్పృశించాలి. కొంతమంది సాధువులు పరుండి యున్నారు. కొంతమంది కూర్చున్నారు. కొంతమంది వారు కూడా తిరుగుతున్నారు. కొంతమంది చిన్న గుడిసెలలో ఉన్నారు. అందులోకి దూరి వెళ్ళాలి. బాబా యీ విధంగా యింత కష్టపడి వారిని కలుసుకుంటుంటే బాబా శక్తిని మండలివారు ఒకవైపు మెచ్చుకుంటున్నారు. తరువాత దీని ఫలితం ఆయన ఆరోగ్యం మీద ఎలా పరిణమిస్తుందో అనే భయం మరి యొక వైపున మండలికి మనస్సు వేధిస్తూనే ఉంది. సాయంకాలం అయ్యేసరికి 6700 మంది సంఖ్య దాటిపోయింది. అసలు యీ పని చేసినది— ఉదయం 6 మొదలు 11 గంటల వరకు, అయిదు గంటలసేపు మరల సాయంత్రం 6 నుంచి 9 గంటల వరకు 3 గంటల సేపు. భగవత్ప్రార్థన చేసేసమయాలలో బాబా యీ పని చేయడానికి బాగా అనుకూలించింది. ఈ ప్రార్థనా సమయాలలో సాధువులు వందలకొద్దీ ఒక్కొక్కచోట గుమికూడారు. కొన్ని శిబిరాలలో వారు వందలకొలదిగా ఉండగా ఆ అవకాశాన్ని బాబా ఉపయోగించుకున్నారు. అన్ని సత్రాలలో కూడా సాధువులు అనేక మంది చేరియున్నందున బాబా అక్కడికి వెళ్ళివారిని సాంగత్యం చేసారు.

## నైనిలో మస్తు సాంగత్యం

ఉదయం 11 గంటలయిన తరువాత మళ్ళా సాయంత్రం 6 గంటల వరకూ ఉన్న సమయం వృథా చేయలేదు బాబా. మధ్యాహ్నం కొంచెం సేపు విశ్రమించి, బాబా అక్కడికి 5 మైళ్ళ దూరంలో ఉన్న నైని అనే స్థలానికి మండలితో వెళ్ళారు. వెళ్ళి అక్కడ ఒక మస్తును రెండవమారు సందర్శించారు. బాబా అక్టోబరులో అలహాబాదు వచ్చినపుడు సాంగత్యం చేసిన ఖాదిర్ మియా యితడే. ఈ మస్తు చీకటిగా ఉన్న తన గదిలో మంచం మీద కూర్చుని ఉన్నాడు. ఆ గదిలోనే పొయ్యిలో నిప్పు రగులుతూ ఉంది. పొగకూడా ఉంది. గది అంతా వేడిగా ఉంది. అక్కడ ఆ మస్తును చా సాహెబ్ అంటారు. వెళ్ళేటప్పుడే ఒక పెద్ద బకెట్‌తో 50 కప్పుల టీ తీసికొని రమ్మని బాబా తమతో కూడా పట్టించుకొని వెళ్ళారు. బాబాను మండలిని ద్వారం వద్దనే చూసి చాసాహెబ్ మంచంమీద నుంచి లేచి వారికి స్వాగతం యిచ్చాడు. అతని వైఖరి చూస్తే చాలా సేపటినుంచి బాబా వస్తారని ఎదురు చూస్తున్నట్టుగా ఉంది. చిరునవ్వుగల మోము, వెలుగు చిమ్మెడి అతని మనోహరములయిన నేత్రాలు, అతని వాలకం అదీ చూస్తే చాలా ఆనందంలో తేలియాడుతూన్నట్లున్నాడు. బాబా శిష్యుని చేతిలో ఉన్న టీ పాత్రను అందుకొని పొయ్యిమీద పెట్టాడు. బాబాను, శిష్యులను మంచంమీద కూర్చోబెట్టాడు. ఆరోగ్య విషయాలు సాధారణంగా మాట్లాడుతూ టీ తీసుకోమని చా సాహెబ్ మండలిని ఆహ్వానిస్తూ, బాబా వైపు ప్రక్కచూపులు చూస్తూనే ఉన్నాడు. బాబా కూడా చాలా సంతోషంగానే ఉన్నారు. ఒక అరగంట సేపు చా సాహెబ్ గదిలో గడిపారు. తరువాత టీ అంతా చా సాహెబే త్రాగేసాడు. బాబా వచ్చి వెళ్ళినకొద్ది కాలానికి యీ మస్తు శరీరం వదిలేసాడు. బాబా అలహాబాద్‌కి తిరిగి వచ్చేసారు. అక్కడి నుంచి తిన్నగా మేళా స్థలానికి వెళ్ళారు. సాధు సాంగత్యం పూర్తి చేసారు.

అనేక వేలమందిని అంత స్వల్పకాలంలో యీ విధంగా సాంగత్యం చేయడం అనేది దైవ-మానవునికే సాధ్యమయింది. ఇది చరిత్రలోనే ఒక అసాధారణమయిన అపూర్వ సంఘటన.

'ఉపాసనీ మహరాజ్ దేహం చాలించిన తరువాత ఆయన ఏకాంతవాసం అంతమయ్యే ముందు బాబా యీ విధంగా సాధు సాంగత్యం చేయడం ఎంతో ఆధ్యాత్మిక ప్రాముఖ్యత కలిగిఉందని' బాబా చెప్పారు. అనేక సంవత్సరాల క్రిందట బాబా నీలగిరి కొండలలో సంచారము చేస్తూ 'ఒక్కవూరు నేను 7,000 మంది సాధువుల సాంగత్యం చేస్తానని' చెప్పియున్నారు.

సాధారణ మానవుడు అటువంటి వారిని చూసినపుడు సాష్టాంగవందన మాచరించి తన పాపములను పోగొట్టు కుంటాడు. అవతార పురుషుడు గనుక వారి పాదాలకు నమస్కరించినపుడు వారందరిని పవిత్రుల జేసి ముందు వారిద్వారా కావలసిన మానవ కళ్యాణ కార్యమునందు పాల్గొనుటకు వారికి అర్హత కలుగజేసి వారికి కావలసిన ఆధ్యాత్మిక శక్తిని బాబా ప్రసాదించారు. అంతేగాక మానవలోకానికి సాధు సజ్జన సత్కారము ఒక మహత్తరమైన ఆదర్శముగా బాబా స్వయంగా చేసి నిరూపించారు.

పూర్వం ద్వాపరయుగంలో ధర్మరాజు రాజసూయ యాగం చేసినపుడు భీమార్జున నకుల సహదేవులకు యింకా తక్కువగల సుయోధనాది రాజ బంధువులకు శ్రీకృష్ణపరమాత్మ సలహామీద ఎవరికి తగినపని వారికి అప్పగించెను. పృథ్వీమీద ఉన్న రాజులందరు విచ్చేసి ధన కనక వస్తు వాహనాది రూపంలో అనేకమయిన కానుకలను సమర్పించారు. ఇవన్నీ అందుకుని ధనాగారాల్లోకి చేర్పించి భద్రపరిచే పనికి ప్రత్యేకంగా దుర్యోధనుడు నియోగింపబడ్డాడు. దుర్యోధనుడు స్వహస్తాలతో అందుకొని లోపల భద్రపరచినపుడెల్లా అతని చేతులు నొప్పి పుట్టినంత అధికంగా యీ కానుకలన్నీ వచ్చాయి. అందుచేతనే అతనికి కళ్ళు కుట్టాయి. లోపల కొండలవలె రాసులయిపోతూంటే ధర్మరాజు ఐశ్వర్యం చూడలేక దుర్యోధనుని హృదయంలో అసూయ కూడా కొండలా పెరిగిపోయేది. ఈ విధంగా ఒక్కొక్క పనికి ఒక్కొక్కనిని నియోగించి శ్రీకృష్ణపరమాత్మ రాబోయే కురుక్షేత్ర మహాసంగ్రామానికి బీజాలు నాటాడు. తరువాత శ్రీకృష్ణభగవానుడు స్వయంగా యాగశాల ప్రవేశించి ద్వారం వద్ద ఆసీనుడై యాగమునకు విప్రులు, ఋషులు, మునీశ్వరులు, సిద్ధపురుషులు, యోగులు, సాధువులు, సన్యాసులు, తపశ్శాలురు యింకా భారతదేశమందలి వారేగాక యితర దేశముల నుండి వచ్చిన పుణ్య

పురుషులందరూ రాగానే అభివాదన పూర్వకముగా స్వాగతం పలికి బంగారు పళ్ళెరములతో వారి పాదవములను గంగా జలములతో స్వయముగా కడిగి ఆ నీరు శిరస్సున చల్లుకొని, కడిగిన పాదాలను గుడ్డతో ఒత్తి, ఆ పాదాల మీద శిరస్సు ఉంచి ప్రణమిల్లి యీ విధంగా సత్కరించెనని పురాణాలవలన మనకు తెలుస్తోంది. శ్రీకృష్ణుడు అవతారపురుషుడు కదా, ఆయన ఏమి పుణ్యము సంపాదించవలెనని యీ రీతి సజ్జన సత్కారంచేసాడు? బాబాకూడా యిప్పుడిటువంటి సాధు సత్కారమే చేసాడు.

అలహాబాదులో నంగాసాధు అనునతడొక డుండెను. ఇతడిని మస్తు అనే అనుకుంటారు. కానీ యితడొక అభివృద్ధి చెందిన యాత్రీకుడు. బాబా యితనిని కలిసినప్పుడు 'యితడు నాలుగవ భూమికలో ఉన్నాడని' చెప్పారు. కళ్ళు పైకి పెట్టుకొని నడిచేవాడు. అంటే అతని నల్లనిగుడ్డు కనిపించేది కాదు. మరి అతడు ఎలా నడిచేవాడో ఎలా చూడగలిగేవాడో తెలియదు. ఎవరి మీదా పడకుండా మామూలుగా నడవగలిగేవాడు. జ్ఞాననేత్రంతో చూసేవాడేమో అనిపిస్తుంది. డిశెంబరు (1941) 31వ తేదీన అలహాబాద్‌లో కుంభమేళా ఉత్సవంలో బాబా యితనితో సాంగత్యం చేసారు. ఒక బాజ్ గుడారం లోనికి కాకా యితనిని తీసికొని రాగా, బాబా అతనితో అందులో ఒక అరగంట కూర్చున్నారు. అలా కూర్చుని ఉండగానే ఆతడు గుడారం గుడ్డ క్రింద నుంచి దూరి బయటకు పారిపోయాడు అనుకోకుండా. అతడు మాట్లాడే మాటలు సందర్భశుద్ధి లేకుండా ఉండేవి. బాబా 'అతడొక గొప్ప సాధువని' చెప్పారు.

బాబా అలహాబాద్‌లో ఉన్న మూడురోజులలోను 30,31 డిశెంబరు, జనవరి 1 అక్కడఉన్న బాబా భక్తులు వారి పనివారు చేసుకుంటున్నారు. బాబాదాసు, శ్రీవాస్తవ, విభూతి, చతుర్వేది మొదలగువారు బాబా 'దివ్య సందేశము'ను లచ్చు వేయించి అనేకవేల ప్రతులు బాబా బొమ్మతో సహా అలహాబాద్ నగరంలోను, కుంభమేళా స్థలంలోను విరివిగా పంచి పెట్టారు.

మెహెరాబాద్ నుంచి బాబా జీవిత పరిమాణం కలిగిన తైలవర్ణ చిత్రము 31వ తేదీన మెహెరాబాద్ నుంచి అలహాబాద్ తెప్పించారు. ఆ రోజున బాబా అలహాబాదులో సాధు సాంగత్యము, నైనీలో మస్తు సాంగత్యము చేస్తూ గడిపారు.

ఈ పెద్దచిత్రం వచ్చిన తరువాత అలహాబాద్ భక్తుల ఉత్సాహము మిన్నుముట్టింది. జనవరి (1942) 1వ తేదీన బాబా తైలవర్ణ చిత్రాన్ని బ్రహ్మాండంగా అలహాబాద్ నగరంలో మేళతాళాలతో ఊరేగించారు. వసంతపంచమి రోజున కూడా యిలాగే పంచకోశి సంకీర్తన, సమితివారు బాబా చిత్రాన్ని ఊరేగించి బాబా సందేశాలను పంచిపెట్టారు. బాబా నైనివెళ్ళి చా సాహెబ్ సాంగత్యం చేసారన్న సంగతి తెలుసుకుని అలహాబాద్ ప్రేమికులు కొందరు జనవరి 29వ తేదీన నైనివెళ్ళి ఆ మస్తుని సందర్శించారు.

బాబాదాస్ మెహెర్‌బాబా చిత్రాన్ని చా సాహెబ్‌కు చూపించగా అతడు చిరునవ్వుతో తాను ఆ సమయమునందు టీ త్రాగుతున్న తన నివాసానికి సమీపమందున్న హోటలులో ఒక వైపున గోడమీద వ్రేలాడదీయబడిన ఒక అట్టను చూపించాడు. ఆ అట్టమీద ఉర్దూలో యిట్లు వ్రాయబడి ఉండెను.

"ఒక సద్గురువు తనకు తెలిపిన దైవరహస్యాలను మానవుడు తేలికగా తీసుకొనరాదు. వాటికి తగిన ప్రాముఖ్యత, గౌరవము తాను యివ్వకపోతే ఆ మానవుడు వాడిపోయిన పుష్పంలా ఎందుకూ పనికిరాని వాడవుతాడు. అసలయిన ఉన్నతస్థానం పొందాలంటే మానవుడు తనలోని అహంకారాన్ని నిర్మూలించుకోవాలి. బీజములు చిక్కని బురదలో పడినప్పుడు కదా పచ్చని చెట్లుగా పరిణమించేది!"

తరువాత బాబా చా సాహెబ్‌తో కూడా అతడు నివసిస్తున్న గదికివెళ్ళి అతనికి టీతో బాటు ఆ గదిలో రాజుకుంటున్న నిప్పులోనికి కర్రలు కూడా తెప్పించి యిచ్చి, ఆ మస్తు దగ్గర సెలవు తీసుకొని వెళ్ళారు.

31వ తేదీ రాత్రి 9 గంటలకు హోటలుకి వచ్చి ఒక్క గ్లాసుతో జింజర్ (అల్లం) షరబత్తు త్రాగారు. బాబా తరువాత పరుండే ముందు వేడి నీటి స్నానం చేసారు. 'బాబా యింక చాలా సేపు విశ్రాంతి తీసుకుంటారేమో' అనుకున్నారు మండలి. కానీ చీకటితో 5 గంటలకే లేచి బాబా వారికి ఆశ్చర్యం కలుగజేసారు. ఎక్కడా అలసటలేని వానిలా కనిపించారు. బాబా పని జయప్రదంగా అయినది గనుక టీ తీసుకొని అలహాబాద్ స్టేషన్‌కి వెళ్ళి బొంబాయి మెయిలులో నూతన సంవత్సరాది రోజున (జనవరి–1942-1వ తేదీన) మెహెరాబాద్‌కి

బయలు దేరారు. బాబా తిరుగు ప్రయాణంలో సికిందరాబాదు షోలాపూరు నగరాల మీదుగా వచ్చి అక్కడ ఉన్న మస్తులలో కొందరిని సాంగత్యం చేసారు.

'1942వ సంవత్సరం జనవరి 1టవ తేదీ నుంచి ఫిబ్రవరి 1 వ తేదీ వరకు ప్రాచ్యపాశ్చాత్య ప్రేమికులందరు ఉపవాసం ఉండాలని' బాబా ఆదేశం పంపించారు. ఇది లండన్‌లో కూడా అందింది. ఈ నెలా 15 రోజులు ప్రేమికులు ద్రవపదార్థాలేవయినా తీసుకోవచ్చును. కానీ ఏవీ తినకూడదు.

ఈ విధంగా ఉపవాసాలు చేస్తూకూడా విల్ బాకెట్టు అతని భార్యమేరీ, కిట్టీడేవీ బాబా చెప్పిన ప్రకారం అచ్చువేయించిన పుస్తకాలు రోడ్లమీద నిలబడి బాబా సందేశాలు వచ్చేపోయే వారికి పంచిపెట్టారు. ఈ పనిచేయడం కోసం వారు కాపురం ఉన్న సర్రేనుంచి లండన్ వచ్చేవారు. హైడ్ పార్క్‌కు కూడా వెళ్ళి యీ చిన్నపుస్తకాలు పంచిపెట్టారు. ఈ పని చేసేకాలంలో బాబా వారి ముగ్గురకు ప్రత్యేకమైన సందేశాన్ని పంపించారు. హృదయపూర్వకంగా చేసే యీ పనికి బాబా చాలా సంతోషిస్తున్నానని, బాబాకి చాలా సంతృప్తి కలిగిందని ఆ సందేశంలో వ్రాస్తూ వారు ముగ్గురు దివ్యప్రేమికులని బాబా పేర్కొన్నారు.

బాబా అలహాబాదు నుంచి మెహెరాబాద్ తిరిగి వచ్చిన తరువాత 'చాలా రోజులుగా అనుకుంటున్న హిమాలయాలలో సంచారము చేయుటకై వెళ్తాననియు అప్పుడే నేపాల్ భూటాన్ టిబెట్ కాశ్మీర్ దేశాలు కూడా సందర్శించి వస్తాననియు ఆ పర్యటన చేసి తిరిగి వచ్చేవరకు బాబా ఎవరికీ దర్శనమిచ్చుట లేదనియు, ఎవరి తోనూ సంభాషించుట లేదనియు' తెలియపరచారు.

1942వ సంవత్సరంలో జనవరి 3వ తేదీన చందాలో బాబా అయిదవ భూమికలో ఉన్న లోహేవాలాబాబా అనే మస్తును సాంగత్యం చేసారు. ఆ మస్తులో ఇత్తెఫాకీ, జమాలీ రీతులు కలిసి ఉన్నాయి. ఇతడు చిన్నవి పెద్దవి అనేక యినుప ముక్కలు పోగుచేసి పెట్టుకున్నాడు. రైలుబద్దెల ముక్కలు, రైలుపట్టాల క్రింద వేసే ఇనుపబద్దలు, పాత బండిచక్రాలు, ఇనుపవైతే సరి అవి యేమయినా సరే తీసుకొనివచ్చి పెట్టుకొనేవాడు. ఒక గుహలాంటి చోట యివన్నీ పడేసాడు. అక్కడే అతడి నివాసం. ఇనుపవి చెట్లకి కట్టి వాటివైపు చూస్తూ కూర్చుంటాడు.

చందా మధ్యప్రదేశ్‌లో అడవుల మధ్యను ఉన్న ఊరు. ఎప్పుడయినా ఎవరయినా ఆ అడవులలోనికి షికారు వెళ్తే అక్కడక్కడా చెట్లకి పాత ఇనుప సామాను వ్రేళ్ళాడదీసి ఉండడం చూడగలరు. ఇదంతా లోహేవాలాబాబా చేసిన పనే. కష్టపడి చెట్టెక్కించి ఆ యినుపబద్దెనో లేక చక్రాన్నో చెట్టుకి చిటారు కొమ్మకు కూడా కట్టేవాడు. చెట్లని వ్రేలాడే యీ ఇనుప సామాను చూసినవారు, యీ బరువైన యినుపవాటిని అంత ఎత్తుకి ఎలా ఎత్తి తీసుకువెళ్ళాడా— అని ఆశ్చర్యపోతారు. అతడు నడి వయస్కుడు. సగం దిగంబరిగా ఉండేవాడు. చింపిరి జుట్టుతో ఉండేవాడు. చందా రైలుస్టేషన్ సిబ్బంది యితనిని ఎంతో గౌరవించేవారు. ఇనుపముక్కలు వగైరా తీసుకుపోతూ ఉంటే అతనికి ఏమీ అభ్యంతరం చెప్పేవారు కారు. అతడు మస్తు అని వారికి తెలుసును. అతడు కొన్ని సంవత్సరాల తరువాత మరణించెను.

1942 జనవరి 5వ తేదీన గులియప్పస్వామి అనే అయిదవ భూమికలోని యోగిని షోలాపూర్‌లో బాబా సాంగత్యం చేసారు. అతడు మగవాని వలె వేషం వేసుకున్నా మగవాడిలా ప్రవర్తించినా తాను మాట్లాడేటప్పుడు తానొక స్త్రీనని చెప్పుకుంటాడు.

ఆ రోజునే ముల్లాబాబా అనే మంచి మస్తును బాబా సాంగత్యం చేసారు. అతడు చాలా వృద్ధుడు. తన వ్రేళ్ళ గోళ్ళు చాలా పొడుగుగా అసహ్యకరంగా అపరిశుభ్రంగా పెంచుకున్నాడు. మాసినగుడ్డలు కట్టుకుంటాడు. అతనికి కల్లు త్రాగడం యిష్టం. నాటుసారాయి అన్నా యిష్టమే. బీజాపూర్ బస్‌వద్ద (షోలాపూర్) ఒక తాలింఖానా మూలలో కూర్చుంటాడు. అక్కడే గత పదిహేనేళ్ళుగా ఉంటున్నాడు. ఆ మూలనుంచి ఎప్పుడూ లేవడు. ఇతనంటే ఆ నగరంలో చాలా గౌరవం. అతనిని అక్కడి ప్రజలు బాగా ఎరుగుదురు. ఇంతకు ముందు బాబా యితనిని 1941 నవంబరులో ఒకమారు కలుసుకున్నారు.

మెహెరాబాద్ లోను, బెంగళూరు, నాసిక్, అహమద్‌నగర్, పూనా, బొంబాయి, కరాచీ, మద్రాస్, నవసారీ మొదలగు నగరాలలో నున్న మండలి వారిని '1942 జనవరి 1వ తేదీ లగాయతు ఫిబ్రవరి 15వ తేదీ వరకు ఒక్కపూట భోజనం మాత్రం చేసి, రెండవపూట ఉపవాస ముండాలని' బాబా ఆదేశించారు.

ఇలాగే బాబా భక్తులందరు విదేశాలలో ఉన్నవారితో సహా మండలితో బాటు వారి విశ్వకార్యంలో పాల్గొనుటకుగాను ఈ 1½ మాసాలు ఒక్కపూట భుజిస్తూ రెండవపూట ఉపవాస ముండాలని-బాబా చెప్పారు. అందరికీ తెలియడానికి యీ విషయము పత్రికా ముఖమున బాబా ప్రకటింపజేసారు.

## ధు ని జ్వ ల న ం

ఇదివరలో డిశెంబరు 12వ తేదీన ఒక్కరోజు వెలిగించిన ధుని మరల 1942 జనవరి 12వ తేదీన వెలిగించాలని యికముందు ప్రతీనెలా 12వ తేదీన ధుని జ్వలింపచేయాలని– ఆనతిచ్చారు. ఈ రోజున మాత్రం ఉపాసనీ మహరాజ్ గౌరవార్థం అతని జ్ఞాపకార్థం ధుని 48 గంటలు వెలగాలని బాబా చెప్పారు.

బాబా సోమవారం సాయంకాలం (12–1–42) 7 గంటలకు కొద్ది నిమిషాలు పూర్వమే వారి ఏకాంతవాస గృహము (కేబిన్) నుండి వేపచెట్టు వద్ద నుంచి వచ్చారు. వచ్చి, ధుని వెలిగించే స్థలం వద్ద ఉంచిన ఉపాసనీ మహరాజ్ ఫోటో, బాబా ఫోటోలను చూసారు. బాబా రాగానే బి. డి. జెస్సావాలా (పాపా–ఎరచ్ తండ్రి) బాబాకు పుష్పమాల వేసాడు. తరువాత బాబా అక్కడవేసిన కుర్చీపై కూర్చున్నారు. పాపాకి బాబా ధుని వెలిగించే అవకాశం యిచ్చారు. బాబా పశ్చిమ ముఖంగా కూర్చుని ఉన్నారు. మండలి అందరూ చుట్టూ నిలబడ్డారు.

బాబా సంజ్ఞ చేయగానే పాపా ధుని వెలిగించాడు. బాబా ఆజ్ఞపై ప్రతి యొక్కరు మంచి గంధపు ఇంధనాలను ధునిలో ఒకరి తరువాత ఒకరు వేసారు. కొందరు అగ్ని ప్రజ్వరిల్లుతుండగా నమస్కరించారు. అంతట ధుని బాగా రాజు కోగా రెండు నిమిషాలసేపు ఆ సమయాని కనుకూలంగా ప్రసంగించారు. ఈ ప్రసంగంలో బాబా మస్తుల గురించి కూడా చెప్పారు.

మహమ్మదు మస్తు అనేక సంవత్సరములుగా బాబా వద్ద ఉంటున్నాడు అతని ద్వారా ప్రపంచమందలి మస్తులందరిని బాబా ప్రభావితులను చేస్తున్నారు. అతనితో బాబా పని అయిపోగానే మహమ్మదును అక్కడనుంచి అతని ఊరికి పంపి వేసారు.

జనవరి (1942) 9వ తేదీన మరల మహమ్మదును మెహెరాబాద్‌కి రప్పించారు బాబా. కొన్ని గంటలు అతని సాంగత్యం చేసి మరల అతనిని వెంటనే పంపించేసారు. ఈ మారు మహమ్మదు మండలివారి నందరిని ఆనవాలు పట్టి మాట్లాడాడు. ఇది వరకు వెళ్ళి ఒక సంవత్సరం అయింది. మొదట వచ్చినపుడు అతని లోకమే అతనిది. ఆ భగవంతుని చింతనలోనే ఎలా ఉన్నవాడు అలాగ గంటలకొలదీ ఉండేవాడు. అన్నం నీరు లేకుండా ఎంత సేపయినా నాలుగురోజులు కూడా ఆ స్థితిలో కదలకుండా ఉండేవాడు. ఈ ప్రాపంచిక చైతన్యం ఉండేదికాదు. తన స్వంత ప్రయత్నం మీద స్వతంత్రంగా దేవుని పొందాలనే ప్రయత్నంలో అతడు చైతన్యం పోగొట్టుకుంటే బాబా సాంగత్యం వలన యిప్పుడు యీ స్థితికి వచ్చాడు మహమద్‌ను మరల జనవరి 13వ తేదీన రప్పించారు.

ఈ నెల 13వ తేదీన ధునివద్ద మండలి సమావేశమయినపుడు బాబా కొన్ని సూఫీపాటలను గ్రామఫోనులో పాడించారు. వాటికి బాబా అర్థం కూడా యిలా చెప్పారు.

"నిన్ను మధుశాలను చూడడానికి ఎంత ఆనందంగా ఉంది! అందులో నన్ను నా చెదరిన హృదయంతో చూసుకుంటున్నాను. నిన్ను చూడడమే నాకు వినోదం; నా ఆనందం; అది ఎక్కడ లభ్యమయినా సరే-చర్చిలోగాని, కాబాలో గాని, దేవాలయంలోగాని - సరిగ్గా ఆలోచిస్తే ప్రతీవాడు, ప్రతిదీకూడా ప్రేమతో జ్వలిస్తున్నారు.— ప్రేమికుడుగానీ, దీపంగాని దానికోసం వచ్చిన శలభం గాని.

జీవితంలో మనకు రెండు బారల నేల చాలదా? అది ఒక నగరంలో ఉన్నా, చిన్న పట్టణంలో ఉన్నా లేక అడవిలో ఉన్నా—"

ఉపాసనీ మహరాజ్ జ్ఞాపకార్థం బాబా ప్రత్యేకంగా మండలి అందరినీ— మెహెరాబాద్ లోను, యితర స్థలాల్లోను, ఉన్న వారందరినీ - జనవరి (1942) 13వ తేదీన సంపూర్ణ ఉపవాసముండాలని ఆదేశించారు. మండలిని టీ మాత్రం తీసుకోవచ్చునని బాబా చెప్పారు. ఆరోజు భోగి పండుగ. ఆ మరునాడు— 14వ తేదీన— మకర సంక్రాంతి పర్వదినం వలన బాబా మెహెరాబాద్‌లో భండారా ఏర్పాటు చేయమని ఆనతి యిచ్చారు. ఆనాడు హిందువులకు పెద్ద పండుగ.

ఔరంగాబాద్ ఆ పరిసర ప్రాంతాల నుంచి గ్రామవాసులంతా వచ్చారు. కార్యక్రమం భజనతో ఆరంభమైంది. ఇంత బహిరంగ సమావేశంలో బాబా ఏకాంతవాసం చేస్తూ వచ్చి కూర్చోవడం ఒకటిన్నర సంవత్సరాలలో యిదే మొదటిసారి. ఎవరూ వారి పాదాలకు నమస్కరించడానికి వీలులేదు. బాబా వారితోపాటు కూర్చుంటేనే చాలని వారికి సంతోషమైనది. అందులోనూ ఆ సంక్రాంతి పండుగ పర్వదినం నాడు ఆయన వచ్చి తమ మధ్య కూర్చోవడం వారి భాగ్యం అని అనుకున్నారు సాయంకాలం ఆరు గంటలకు ధుని సమీపాన యీ సమావేశం అయినది. బాబా వారితో రెండు గంటలసేపు కూర్చున్నారు అందరూ బారులు తీర్చి కూర్చున్నారు. బాబా అందరికీ కనిపిస్తున్నారు. అస్పృశ్యులు బ్రాహ్మణులు అందరూ కలిసేవున్నారు. వారికి అన్నము, పప్పుతోపాటు లప్సీ అనే తీపి పదార్థము తయారుచేయించి వడ్డించారు. అహమద్‌నగర్ నుంచి కూడా అనేకమంది బాబా భక్తులు— పార్శీలు, ఇరానీలు, బ్రాహ్మణులు, ఇతరులు, వచ్చారు. వీరందరికీ బాబాను అంటుకోకుండా చూసే అవకాశం కలిగింది.

1942 జనవరిలో పైన చెప్పిన భండారా అయిన తరువాత బాబా యిద్దరు మండలి సభ్యులతో కలిసి దక్షిణ భారతదేశంలో సంచారం చేయుటకై బయలుదేరారు. ముఖ్యంగా నాగపట్టణంలో చట్టీబాబాను మరల నొకసారి సాంగత్యం చేయాలని బాబా ఉద్దేశం. ఈ ప్రయాణంలో యింకా యితర మస్తులని కూడా కలవాలని వారి ఉద్దేశం.

మెహెరాబాద్ నుండి బాబా 15వ తేదీన బయలుదేరి ముందు హుబ్లీ వెళ్ళారు. అక్కడ ఒక హిందువు, ఒక మహమ్మదీయుడు— ఇద్దరు మస్తులను చూసారు. అందులో ఒకడు ఆరవ భూమికలోనివాడు. గత 8 సంవత్సరాలుగా అతడు ఒక నీటికుళాయి వద్ద కూర్చుని యుండెను. ప్రజలు యితనిని మిక్కిలి గౌరవిస్తున్నారు. ఇతనిని యిదివరకు పర్యటనలో బాబా ఒకమారు కలిసారు. అప్పుడు బాబా అతడు తొడుక్కోవాలని ఒక కోటు కూడా యిచ్చారు. ఈ తూరి యీ మస్తును బాబా రాత్రి 11–30 గంటలకు చూసారు. బాబా అతనితో ఏకాంతంగా ఒక అరగంట కూర్చున్నారు. ఈ మస్తు ఎల్లప్పుడు దిగంబరిగా ఉంటాడు. శరీరం ఎప్పుడూ కప్పుకోడు. వేసవి అయినా చలికాలం అయినా

వర్షం కురుస్తున్నా అంతే. ఒకరాయి మీద కూర్చుని ఉంటాడు. అక్కడినుంచి అతడు కదలనే కదలడు.

హుబ్లీ నుంచి నాగపట్టణానికి వెళ్ళారు. అక్కడ బాబా మరల చట్టిబాబాను కలుసుకున్నారు. ఈ సాంగత్యం తరువాత చట్టిబాబా శరీరం వదలి పెట్టవలసి ఉంది. అందుచేత బాబా అతనితో సమాగమం చేయడం యిది తుదిసారి. బాబాను మళ్ళీ దర్శించినందుకు చట్టిబాబా చాలా ఆనందించాడు. అతనితో బాబా ఒక అరగంట ఉన్నారు. చట్టిబాబాకు పరిచర్య చేస్తూ ఉన్న వారికి అతని సంరక్షణ చేస్తూ ఉన్నవారికి 'చట్టిబాబా అచిరకాలంలోనే దేహయాత్ర చాలిస్తాడని' బాబా మండలిని చెప్పమంటే వారు చెప్పారు. 'ఈ మహానుభావునికి తగినట్లుగా అతనిని సమాధి చేసి అక్కడ ఒక దర్గా కట్టించమని' బాబా చెప్పారు.

తరువాత బాబా మోతీబాబా అను ఆరవభూమికలోని మస్తును చూసారు. ఇతడు ఆ జిల్లాకు ఆధ్యాత్మికాధికారి. ఆ రోజున బాబా అతని వద్దకు మూడు మారులు వెళ్ళి సాంగత్యం చేసారు.

నాగపట్టణం నుండి నాగోర్ అనే ఊరు వెళ్ళి అక్కడ నాగోర్‌షావలీ అను మస్తు ఉంటే అతనిని కలుసుకుని తరువాత నాగోర్‌వాలా బాబా అనే మంచి మస్తును కూడా సాంగత్యం చేసారు. ఇతడు చాలా వృద్ధుడు. సన్నగా ఉండేవాడు. ఇతనికి పొడుగయిన గడ్డం ఉండేది. ఈ మస్తు మంచి బట్టలు వేసుకునేవాడు. ఇతడు తను వ్రేళ్ళకి గోళ్ళు పొడుగ్గా పెంచేవాడు. ఒక్కొక్క వ్రేలికి సిగరెట్టంత పొడుగు గోరు ఉండేది. ఇతడొక బీడీ దుకాణం వద్ద కూర్చునేవాడు. నాగోర్‌లో ఒక మందిరం వద్ద ఆ దుకాణం ఉండేది. అక్కడ నుంచి బాబా యీరోడ్, చెంగల్పట్టు, రాయచూరు, కుర్దువాడీ మీదుగా మీరజ్ నగరానికి జనవరి 21వ తేదీన చేరుకున్నారు. అక్కడ కారులో నగరం లోపలికి వెళ్ళారు. ఒక నదిని దాటి బాబా ఔర్వాద్ అనే గ్రామానికి వెళ్ళి అక్కడ వజీర్‌బాబా అనే మస్తును సాంగత్యం చేసారు.

వజీర్‌బాబా అత్యున్నతుడయిన మస్తు. ఆరవ భూమికకు చెందినవాడు. ఇంతకు ముందు 1941వ సం॥ అక్టోబరు 1వ తేదీన ఒకమారు బాబా యీ మస్తును

కలిసారు. రెండవమారు డిశెంబరు (1941) లో కాబోలు బాబా తిరిగి కలిసినపుడు వజీర్‌బాబా చాలా సంతోషముగా నుండెను. అతడు కొన్ని పాటలు గట్టిగా పాడి బాబాకు వినిపించాడు. ఆఖరిమారుగా జనవరి (1942) 22వ తేదీన యితనితో బాబా సమావేశం చేసారు. కాకా అప్పుడు అతని వద్దకు వెళ్ళగా "ఒక్కడవే వచ్చావా మీ గురువుగారితో వచ్చావా ?" అని అడిగాడు వజీర్‌బాబా. కాకా "నా గురువుగారితోనే" అని జవాబిచ్చాడు. "మీ గురువుతో చెప్పు ఆయన పని చాలా నెమ్మదిగా ఉందని. నాతో యీ రోజున పని ముగించాలని చెప్పు" అన్నాడు మస్తు. ఆ రోజున బాబా ఆ మస్తుతో రెండు గంటలసేపు కూర్చున్నారు. ఆ మస్తుతో బాబా తమ పని ముగించారు. 3 నెలల కాలంలోనే వజీర్‌బాబా కాలం చేసాడు. నర్సోభావడీకి కొద్ది మైళ్ళ దూరంఉంది ఔర్వాద్.

1942 జనవరిలో బాబా కృష్ణ అనే మస్తును రెండవమారు సాంగత్యం చేసారు. ఈ మారు అతనిని పోషించే రాజాయొక్క కోటలో అతడున్నాడు. బాబా వెళ్ళి కృష్ణ మస్తు కోసం ప్రశ్నించగా ఆ మస్తుకి మంచిబట్టలు ధరింపచేసి తయారుగా తీసుకొని వచ్చారు. బాబా మండలివారు అతనిని ఆనవాలు పట్టడం కూడా కష్టమయింది, యిదివరకు చూసినా సరే. కోటనుంచి మస్తును ఒక హోటలుకి తీసికొని వెళ్ళి బాబా అక్కడ అతనిని సాంగత్యం చేసారు. ఒక అరగంట అయిన తరువాత ఆ బట్టలన్నీ తీసివేసి చిరికి గుడ్డలు కట్టుకొని ఒక వీధిలో యితడు బాబాకి వారి బృందానికి కనిపించాడు. క్రొత్తబట్టలు ధరించిన ప్రతీసారీ శీఘ్రంగా అవి తీసేస్తేగానీ అతనికి తోచదు. ఈ బట్టలు ఒకమూట కట్టి పెడతాడు. ఆ రాజా యింటిలో యిలాంటి మూటలు చాలా ఉన్నాయి. కృష్ణ మస్తు నడివయస్కుడు. నల్లనివాడు, పొడుగుగా బక్కపలచగా ఉంటాడు. 'ఇతడు మంచిమస్తు' అని బాబా అన్నారు.

ఢోండ్‌లో పొడుగుపాటి కేశము గెడ్డము కలిగిన ఒక మస్తు ఉన్నాడు. అతడొక వృద్ధుడు. అతడొక క్రైస్తవ అన్వేషకుడు. బాబా ఢోంఢ్‌వెళ్ళి అతనిని కలిసినపుడు సాధువులను మస్తులను సాంగత్యం చేయుటకొరకు బాబా వచ్చారని విని ఆ క్రైస్తవుడు బాబాతో- "మీరు యిక్కడినుంచి తిన్నగా అహమ్మద్‌నగర్ వెళ్ళండి. అక్కడ మెహెర్‌బాబా అనేగొప్ప మహాత్ముడున్నాడు. ఆయనను దర్శించండి"

అని సలహా యిచ్చాడు బాబాకి. బాబా ఫలానా అని తెలుసుకోకుండా పర్యటన చేస్తున్నారు. ఎరచ్ అతనితో మాట్లాడుతుండగా బాబా చూసారు. వేరే అతనితో ఏకాంతంగా కూర్చోలేదు బాబా. ఆ సమయంలో ఆ మస్తు ఒక కుళాయి క్రింద కూర్చుని స్నానం చేస్తున్నాడు. ధోండ్ రైలుస్టేషన్‌లోనే అతనిని బాబా చూసారు. ఆ కుళాయి స్టేషన్‌లోనిదే.

ఈ పర్యటనలో యీ వారం రోజులలోను ఏడుగురికి పైగా మస్తులను కలిసారు. బాబా 23వ తేదీ ఉదయం మెహెరాబాద్ తిరిగి చేరుకున్నారు. ఈ ప్రయాణాలలో బాబా ఒక్కపూటే భోజనం చేస్తూ వచ్చారు. అదైనా ప్రయాణపు తొందరలో ఆ గ్రామాలలో ఏది దొరికితే అదే చాలనుకుని భుజించి తృప్తి చెందారు. బాబా యీ మస్తులకోసం భారతదేశం అంతా ఒక్కొక్కప్పుడు పై దేశాలలో కూడా ఎందుకు తిరుగుతారు. ప్రపంచానికి అక్కరలేనట్లు కనిపించే యీ "పిచ్చివారి" కోసం. బాబా యింత కష్టపడి వారి సాంగత్యం చేయడానికి యీ మస్తులలో ఉన్న ప్రత్యేకత ఏమిటి? బాబా కావాలని, ఆయన దర్శనం చేసుకోవాలని, వచ్చే వేలకొలది జనాన్ని చూడక, బాబా ఏకాంతంలో ఉన్న ఎంతదూరమయినా అహోరాత్రాలు కష్టపడి ప్రయాణాలు చేసి ఆ మస్తులు ఉన్నచోటికి వెళ్ళి వారిని చూడడానికి కారణం ఏమిటి? ఈ మస్తులకి దివ్య ప్రియతముని యెడల ఉన్న ప్రేమ ఆయన కావాలని తీవ్రవాంఛ తప్ప వాళ్ళకి యింక కావలసినది లేదు. సాధారణ మానవులకి వాళ్ళకి ఎంత బేధమున్నది?

ప్రపంచంలోని ప్రజలకి మతిపోయింది. వాళ్ళకీ మతిపోయింది. ఐహిక సుఖాలను వెతుక్కోవడంలో వాళ్ళకి, భగవంతుని, దివ్య ప్రియతముని అన్వేషణలో వీళ్ళకి, మతిపోయింది. ఇలాంటిదే వీరికున్న సామ్యం.

ఇరువురికి సద్గురువు సహాయం కావాలి. మానవులు వారు సృష్టించుకున్న గొడవలోనుండి యివతల పడటానికి మానవులు మానవత్వం గోల్పోయి వ్యవహరిస్తున్నారు. అధోగతికి పోతున్నారు. ఈ మస్తులు వారి ఆధ్యాత్మిక యాత్రలో ఒకచోట ఊబిలో కూరుకుపోయినట్లు దిగబడి పురోగమనంలేక ఉండిపోయారు. వారికి సద్గురువు చేయూత కావాలి. ఒకరికి మానవత్వంలో నుండి దివ్యత్వం చేరడానికి, జంతు

వులులా జీవిస్తున్న మనుష్యులకు మానవత్వం కలుగచేయడానికి— సద్గురు సహాయం యీ యిరువురకు కావాలి.

ఈ 1942వ సంవత్సరంలో పార్సీ పంచాంగం ప్రకారం బాబా జన్మదినం ఫిబ్రవరి 14న అయినది. ఆ సంవత్సరం జన్మదినోత్సవాలు చేయవలదని ప్రత్యేకంగా బాబా ఆదేశించారు. మెహెరాబాద్‌లో గానీ, డెహ్రాడూన్‌లో గానీ అంతకుముందే, ఫిబ్రవరి 13వ తేదీన డెహ్రాడూన్‌నుంచి బాబా ముగ్గురు శిష్యులతో మస్తు అన్వేషణ కోసం బయలుదేరారు. ఈ ప్రయాణంలో బాబా హరిద్వార్, రూర్కీ, లన్ధౌరా, సహరన్‌పూరు, జలాలాబాద్, తాణాభవన్, మొరాదాబాద్, మీరట్, అజ్మీర్, బరీలీ, డెహ్రాడూన్ పట్టణాలు సందర్శించారు.

ఈ ఫిబ్రవరి మాసంలోనే చింటూవాలాబాబా అనే ఒక వృద్ధుని మీరట్‌లో బాబా సాంగత్యం చేసారు. అతని చేతిలో ఒక పటకారు (చింటూ) ఉంచుకునేవాడు. లావుగా ఉండి యితడు మంచి దుస్తులు ధరించేవాడు. అతని గదిలో రోజస్తమానం కూర్చునేవాడు. తరువాత బాబా గోరాబ్‌షా అనే అన్వేషకుని సాంగత్యం చేసారు. ఇతడు చాలా ముసలివాడు. మీరట్‌లో, ఒక మసీదులో నివసించేవాడు. బాబా యితనిని సాంగత్యం చేసినపుడు యితడు జిగట విరేచనాలతో బాధపడుతున్నాడు.

మీరట్‌లో జమీల్‌బాబా అనే మంచి మస్తును కూడా బాబా సాంగత్యం చేసారు యీ నెలలోనే. ఇతడు వృద్ధుడు. ఒక బయలులో ఒక చిన్నగుడిసెలో నివసించేవాడు. చాలా సంవత్సరాల క్రితం జమీల్‌బాబా రైల్వే ఆవరణలో కూర్చువేవాడు.

బాబా ఫిబ్రవరి మాసంలోనే (1942) జలాలాబాద్‌లో లోహేషా అనే మస్తును సాంగత్యం చేసారు. అతడొక పొడవైన గౌను ధరించి యున్నాడు. ఈ మస్తు తన చేతులకు ఇనుపముక్కలు కట్టుకున్నాడు. అందుకే అతనిని లోహేషా అనేవారు. 'చేతులు ముఖము కడుగుకునేందుకు నీరు కావాలి తీసుకురమ్మని' బాబాతో ఆ మస్తు చెప్పాడు. అప్పుడు బాబా నీరు తెచ్చి యిచ్చారు. ఇతడు బక్కపలచగా ఉండే ఒక అన్వేషకుడు.

సహరన్‌పూరులో బాబా ఒక పేరు తెలియని మస్తును సాంగత్యం చేసారు తరువాత 120 సంవత్సరాల వయసుగల ఒక ఉత్తీర్ణుడయిన యాత్రీకుని బాబా మెహెరాబాద్‌లో సాంగత్యం చేసారు ఇతని పేరు మౌలానా షమ్సుద్దీన్ ఉలేమా. ఇతడు అరబ్బీ పెర్షియన్ భాషలలో పండితుడు. ఇతడొక ప్రభుత్వోద్యోగి పోష ణలో ఉన్నాడు. ఆ సర్కారు ఉద్యోగి అతనిని ప్రేమించి గౌరవిస్తున్నాడు. బాబా అతని సాంగత్యం కోసం వెళ్ళినప్పుడు అతడు పరుండి నిద్రపోతుండగా బాబా అతనిని లేపారు. లేచి అతడు బాబాను చూసి పెర్షియన్ భాషలో— "దర్‌జుల్‌మత్—ఎ—షబ్‌నూర్—ఎ-ఖుదామిచినమ్" అన్నాడు. అంటే ఈ రాత్రియొక్క అంధకారంతో నాకు భగవంతుని వెలుగు కనిపించింది" అని.

1942 సం॥ ఫిబ్రవరి మాసంలో బాబా అలీగర్‌లో ఒకప్పుడు ఒక దుకాణం ఉన్న గదిలో నివసించే అగ్నివాలాబాబా మస్తాన్ అనే మస్తును సాంగత్యం చేసారు. అతడెప్పుడూ అయిదారు కుక్కపిల్లలను పెంచుతుంటాడు. ఎల్లప్పుడూ అతని గదిలో నిప్పు రాజుతూ ఉంటుంది. అందుకే అతనికి అగ్నివాలా అనే పేరు వచ్చింది. నిజంగా యితడు నిత్యాగ్నిహోత్రి అన్నమాట. నిప్పు రాజేయడం కోసం యితడు కట్టెలు కావాలని బాబాని అడిగాడు. ఒక మణుగు కట్టెలు బాబా యిప్పించగా ఆ మోపు నెత్తిపై పెట్టుకొని ఆ మస్తు తన గదికి తెచ్చుకున్నాడు బాబా అతనికి భోజనం తెప్పించి పెట్టారు. భోజనం రాగానే అగ్నివాలా ముందు కుక్కపిల్లలకు పెట్టి తరువాత తాను తిన్నాడు. ఇతడొక మంచి మస్తు.

ఫిబ్రవరి మాసంలోనే మౌలానా అష్రఫ్ అలీ చిరాగ్-ఎ-హింద్ అనే ఒక ఉత్తీర్ణుడయిన యాత్రీకుని బాబా సాంగత్యం చేసారు, ఠాణాభవన్‌లో. ఇతడు బక్కపలచగా ఉండే వృద్ధుడు. ఠాణాభవన్‌లోని మసీదులో యితడే ప్రార్థనలు చేయిస్తాడు. అదే సమయంలో ఢిల్లీలో జుమామసీద్‌లో కూడా యితనిని చూసామని చెప్పినవారు ఉన్నారు. ఇతనికి భార్య పిల్లలు ఉన్నారు. ఇతడు మంచి బట్టలు ధరిస్తాడు. బాబా యితనికి 30 రూపాయలు యివ్వబోతే అతడు పుచ్చుకోలేదు. కానీ జలాలాబాద్ నుంచి యితనికి యీ సొమ్ము మనియార్డరు ద్వారా పంపించారు బాబా. షరియత్ మార్గంలో ఉన్న యితడొక వలీ అని బాబా చెప్పారు.

తరువాత లన్ఢౌరా అనే గ్రామంలో ఖాదర్‌సాహెబ్ అనే ఒక ఉన్నతుడయిన మస్తును బాబా సాంగత్యం చేసారు. ఆ ఊరు బాబా వర్షంలో పొలాల్లోనుంచి బురదలోనుంచి నడిచి వెళ్ళారు. ఈ మస్తు ఒకప్పుడు మజ్జూబ్ వలెను మరియొకప్పుడు సాలిక్ వలెను ఉంటాడని చెప్పారు. ఈ మస్తు జలాలీ రకంవాడు. గడ్డం పెంచిన పొడుగయిన ముసలివాడితడు. ఊరి బయట అరణ్యంలో ఒక గుడిసెలో నివసిస్తున్నాడు. ఇతడొక కఫ్నీ ధరించి ఉంటాడు. బాబా యితనిని అతని గుడిసెలో సాంగత్యం చేసి 20 రూపాయ లిచ్చారు.

తరువాత బాబా బరేలీ వెళ్ళారు. అక్కడ బొభారీషా అనే మోతాదయిన మస్తును బాబా సాంగత్యం చేసారు. ఇతడొక మహబూబీ మస్తు. తన ప్రక్కన ఎప్పుడూ గుడ్డల మూటలు ఉంచుకుంటాడు. చేతులకు గాజులు వేసుకుని ఉండేవాడు. ఇవన్నీ మహబూబీ లక్షణాలు. తరువాత యీ మస్తు బరేలీ నుంచి లక్నోకి వెళ్ళాడు.

బాబా ఫిబ్రవరి మాసంలో (1942) బరేలీ వెళ్ళినపుడు బషీర్‌మియాం అనే అభివృద్ధి చెందిన ఒక యాత్రికుని బాబా సాంగత్యం చేసారు అతడు చాలా ముసలివాడు. సన్నంగా ఉంటాడు. చాలా కొద్దిగా ఆహారం తీసుకుంటాడు. అతడు చేతి వ్రేళ్ళకి గోళ్ళు పొడుగుగా పెంచాడు. రాత్రిళ్ళు అతడు నిద్దురపోడు. అతనికి 30, 40 మంది శిష్యులున్నారు. అందులో స్త్రీలు కూడా ఉన్నారు. అతనివద్ద ఉన్నప్పుడు స్త్రీలను తెరచాటున కూర్చో పెడతాడు. పురుషులందరూ గడ్డాలు పెంచుకున్నారు. వారంతా ప్రతి సాయంకాలమూ బషీర్‌మియాం వద్దకు వస్తారు. ఒకడు హార్మోనియం వాయిస్తాడు. అతడు పార్సీభాషలో 'గుణా గరంవాలేకిన్ ఖుష్‌నసీబమ్' (నేను దోషినే కానీ నేను అదృష్టవంతుడను) అని పాడుతుంటాడు. ఆ పాటలో కొందరు పాడుతూ కలుస్తారు. కొందరు తలలూపుతారు. కొన్ని సమయాలలో 'యాహూ' అని శిష్యులు అరుస్తారు. బషీర్‌మియా బీదలకోసం ఒక అన్నసత్రం నడుపుతున్నాడు. బాబా యితనిని మళ్ళీ మార్చిలోను జూలైలోను సాంగత్యం చేసారు.

బాబా యీ మాసంలో రూర్కీ వెళ్ళి అక్కడ ఒక ఉపదేశం పొందిన యాత్రికుని కలిసారు. బ్రహ్మచారిబాబా అతనిపేరు. ఈ యాత్రికుని చత్తర్‌షా

అనీ ఛత్తర్‌దాన్ అనీ కూడా పిలుస్తారు. ఇతనికి చాలా మంది శిష్యులున్నారు. అక్కడ ఇతనిని చాలా గౌరవిస్తారు. ఈ యాత్రికుడు పన్‌నెల్ అనే గ్రామంలో (రూర్కీకి 3 మైళ్ళ దూరం) నివసిస్తాడు. తరువాత బాబా హరిద్వార్ వెళ్ళి అక్కడ ఎనమండుగురు సాధువుల సాంగత్యం చేసారు. డెహ్రాడూన్‌వెళ్ళి అక్కడ ఆదం ఆలీ అనే మస్తును కలిసారు. అతడు రాత్రుళ్ళు ఒకవెదురు డొంకక్రింద పరుండేవాడు.

ఫిబ్రవరిలోనే అఘోరిబాబా అనే మస్తును కూడా సాంగత్యం చేసారు. ఈ మస్తు ఏమిచ్చినా తినేవాడు. రుచి ఎలా ఉంది అని చూసేవాడుకాదు. అందుకే అతనిని అఘోరి అన్నారు. శిథిలమైపోయి చెడిపోయిన ఒక మంచం మీద ఎప్పుడూ కూర్చుని ఉండేవాడు ఆ మంచం ఎండకి ఎండి వానకి తడిసిపాడయింది. మంచంవీధిలో వేసుకునేవాడు. ఇతను చైతన్యం సగం మామూలుగాను సగం మస్తుగాను ఉండేది. బాబా ఫిబ్రవరి 4వ తేదీ నుండి మే నెల 26వ తేదీ వరకు డెహ్రాడూన్‌లో ఉన్నారు. కొన్నాళ్ళు గ్రామాంతరం వెళ్ళి మళ్ళీ జూన్‌లో డెహ్రాడూన్ వచ్చేసారు. ఆ ఊళ్ళో 20 ఏళ్ళుగా ఒక చిన్న గుడిసెలో ఉంటూన్న కాళీనాధ్ బాబా అనే వృద్ధుని బాబా సాంగత్యం చేసారు. కాళీనాధ్ పళ్ళు తప్ప ఏమీ తినె వాడు కాదు.

డెహ్రాడూన్‌లో హిందువుల స్మశాన భూమిలో ఒక ముసలి సాధువు వుండే వాడు. అందుకే అతనిని మాసాన్‌ఘాట్‌వాలా అన్నారు. ఆ స్మశానంలో 35 ఏళ్ళుగా ఉంటున్నాడు. అక్కడ స్మశానం నెలకొల్పక ముందు నుంచీ అతడు వుండేవాడు. అక్కడి నుంచి కదలి వెళ్ళిపోవడానికి యీ సాధువు నిరాకరించాడు. తనతో ఒక పిల్లి, ఆవు, కుక్కని ఉంచుకునేవాడు. వాటికి ముందు అన్నంపెట్టి తరువాత తాను తినేవాడు. వాటికి వెచ్చదనం కోసం ఎప్పుడూ నిప్పు రాజుతూ ఉంచుకునేవాడు. అక్కడ కనిపించే ఎలుకలకి కూడా ఆహారం పెట్టేవాడు. ఆ పిల్లి వాటిజోలికి వెళ్ళేదికాదు. అతనికి ముగ్గురు నలుగురు శిష్యులుండేవారు. మాసాన్‌ఘాట్‌వాలా ఒక ఉపదేశం పొందిన యాత్రికుడు.

1942వ సంవత్సరం ఫిబ్రవరి మాసంలో డెహ్రాడూన్‌లో నన్హ్వామియా అనే మస్తును బాబా సాంగత్యం చేసారు. నన్హ్వామియా డెహ్రాడూన్‌కి ఆధ్యాత్మిక

పరిపాలకుడు. ఇతడొక కుంటి ముసలివాడు. కాళ్ళకు బూట్లు వేసుకునేవాడు. కఫ్నీ ధరించేవాడు. ఒక శాలువా నడుముకు చుట్టుకునేవాడు. డెహ్రాడూన్‌లో యితనిని చాలా గౌరవించేవారు. తరుచుగా ఏ దుకాణంలో నయినా కావలసినది అడిగి పుచ్చుకుని తన కఫ్నీ జేబులో వేసుకొనేవాడు. ఇలా అడిగిపుచ్చుకున్నవి తాను ఉన్న గదిలో దాచి తాళం వేసేవాడు. ఆ తాళంచెవి తన వద్దనే ఉంచుకునేవాడు. సన్న్యాసియాకి కొద్దిమంది శిష్యులున్నారు. రాత్రిళ్ళు ఊరిలో తిరుగుతూ ఎదురొచ్చిన వారిని తిడుతూ వారితో పోట్లాడుతూ ఉంటాడు. పొట్టిగా వంగిన వాని రూపము ఊళ్ళో కనబడుతూనే ఉంటూంది. చేతిలో ఒక పెద్ద కర్ర పుచ్చుకొని నడుస్తుంటాడు. ఆ కర్రకి గుడ్డపీలికలు చుట్టబడి ఉంటాయి. పిల్లలంటే అతనికి చాలా యిష్టం కాబోలు వారికి మిఠాయిలు యిస్తుంటాడు. అతని చుట్టూ యువకులు మూగుతూ ఉంటారు. అతడు ఉన్నతశ్రేణికి చెందిన మస్తు.

ఆ నెలలోనే డెహ్రాడూన్‌లో సన్యాసిబాబా అనే ఒక సాధువును బాబా సాంగత్యం చేసారు. ఇతడు ఒక దేవాలయంలో ఉంటూంటాడు. చాలా సేపు ఊరిలో తిరుగుతూ ఉంటాడు.

~~శివాజీమహరాజ్ అనే ఒక~~ ఉన్నతుడయిన మస్తునుకూడా బాబా సాంగత్యం చేసారు. అతనికి మామూలు చైతన్య స్థితి సగం ఉంది. రాత్రిళ్ళు ఒక పల్లెలోకి పోయి పరుంటాడు. పగలు అతడు ఒక తమలపాకుల దుకాణంలో కూర్చుంటాడు.

1942 మార్చి మాసంలో బాబా అనేక ఊళ్ళు మస్తు సాంగత్యం కోసం తిరిగారు. బాబా మస్తు పర్యటనలో పాటియాలా, ముజఫర్‌నగర్, రాంపూర్, ఫైజాబాద్, లక్నో, అయోధ్య, బహ్రాయిచ్, గోండా, మంకాపూర్, గోరఖ్‌పూర్, శివన్ గోపాల్‌గంజ్, ఛీప్రా, చింతన్‌వాలా, ధుర్రి గ్రామాలలో సంచారం చేసారు.

1942 మార్చి ఆఖరువారంలో డెహ్రాడూన్ నుండి బాబా తాము యిచ్చిన "ప్రస్తుత యుద్ధము—దాని ఆధ్యాత్మిక విశిష్టత" అను సందేశమును దేశనాయకులందరికీ యిచ్చిరమ్మని యిద్దరు శిష్యులను పంపించి అందరికీ చేరేలా చూసారు. ఇదియును, దీనితోపాటు "హింస, అహింస" అను ప్రసంగ వ్యాసమును కూడా

పంపించారు. 30 మంది భారతీయ నాయకులకు యివి అందచేయబడ్డాయి. వారిపని జరుగగానే బాబా శిష్యులు డెహ్రాడూన్ తిరిగి వెళ్ళారు. అప్పుడు బాబా 'నేను మీద్వారా నాయకుల సాంగత్యము చేసాను. ఇప్పుడు భగవంతుడు వారిని ప్రేరణచేసి వారికి తోపించిన విధంగా వారు నిర్ణయాలు తీసుకుంటారు. భగవంతుని నిర్ణయం ఎప్పటికీ మంచికే. ఒక్కొక్కప్పుడు పైకి ఎలా కనిపించినా అది తప్పుదారిని తొక్కదు. "అసలయిన అహింస, సత్యము వలెనే, ప్రేమవలెనే, నిస్వార్ధసేవ వలెనే, భగవంతునిపొందుటకు మార్గము అయిఉంది. నా అహింస కొన్ని సందర్భాలలో హింసాయుక్తంగా ఉంటుంది.— నూటికి నూరుపాళ్ళు పరులకోసం చేసి నప్పుడు, మనసులో మాలిన్యము, ద్వేషము, ప్రతీకారము, స్వలాభము లేకుండా ఉన్నప్పుడు నేను దానిని అహింసాయుతమయిన హింస అంటాను"

1942 మార్చిలో బాబాజీ అనే మస్తును బాబా పాటియాలాలో సాంగత్యం చేసారు. ఆ నెలలోనే మౌనిబాబా అనే మౌనంగా ఉన్న ఒక సిక్కు అన్వేషకుని కూడా బాబా కలుసుకున్నారు. ఇతడు హిందువుల స్మశాన భూమిలో నివసిస్తాడు. మార్చి మాసంలోనే పాటియాలాలో మరి యిద్దరు మస్తులను - బాబా సమావేశ మయినారు. ఋషిబాబా అనే మంచి మస్తు ఎప్పుడూ ఒక మూటను ఒక చేతిలో కలిగి ఉండేవాడు. ఇతడు శతవృద్ధు. రెండవ చేతిలో ఒక విసనక్రను ఉంచుకునే వాడు. దానితో అతడు విసురుకుంటూ ఉండేవాడు. ఇతడొక బెంగాలీల యింట్లో వుండేవాడు. ప్రజలను తిడుతూ ఉంటాడు. అయినా యితనిని చాలా గౌరవిస్తారు పాటియాలాలో. 1942 మార్చిలో యితనిని కూడా బాబా సాంగత్యం చేసారు.

జిందావలీ అనే ఒక వృద్ధుడు ఉత్తీర్ణుడయిన యాత్రీకుడు. ఫూల్‌వాలీ షెరీఫ్ దర్గాను అతడెప్పుడూ వదిలి పెట్టేవాడుకాదు. చాలా సంవత్సరాలుగా జిందా వలీ అక్కడ ఉంటున్నాడు. ప్రతీరోజూ ఒకమారు తలుపు తెరచి వచ్చిన వారికి దర్శన మిస్తాడు. తరువాత అక్కడి నుంచి వెళ్ళిపోతాడు. జనం చాలామంది అతని వద్ద ఉండడం వలన జిందావలీతో బాబా సరియయిన సాంగత్యం చేయలేక పోయారు. కానీ బాబా అతనిని చూడడానికి చాలా సంతోషించారు. అతనిని గురించి ఎక్కువగా ప్రశంసిస్తూ మాట్లాడారు.

1942 మార్చిలో ముజఫర్‌నగర్‌లో బ్రహ్మచారి హరిజన్ అనే ఒక ఉపదేశం పొందిన యాత్రికుని బాబా సాంగత్యం చేసారు. ఇతడు సన్నగా ఉన్న ఒక నడివయస్కుడు. ఒక కఫ్నీ ధరిస్తాడు. ఆ నెలలోనే ముజఫర్ నగర్‌లో కుత్తేవాలా బాబా అనే ఒక అన్వేషకుని సాంగత్యం చేసారు. ఇతనివద్ద 6, 7 కుక్కలున్నాయి. అవి మంచి జాతికి చెందినవే. అతడు వాటిని రోజూ బాగా సంరక్షణ చేసేవాడు. వాటికి ఒడలు తోమి నీళ్ళు పోసేవాడు. వాటిని షికార్ల తీసుకువెళ్ళేవాడు. వాటికి మంచి రంగులు గల సిల్కు చొక్కాలు తొడిగేవాడు. బైదుల్ అతని వద్దకు వెళ్ళినప్పుడు కుత్తేవాలా బాబా ఒక గోచీ గుడ్డ మాత్రం ధరించి కుక్కలను స్నానం చేయిస్తున్నాడు.

1942 మార్చిలోనే ముజఫర్ నగర్‌లో ఆదమ్ ఆలీ అనే ఒక మోతాదయిన మస్తును బాబా సాంగత్యం చేసారు. తరువాత కాలీకంబ్లీవాలా అనే ఒక దిగంబరుడిని కూడా కలుసుకున్నారు. ఇతడు ఒక చిన్నగుడిసెలో ఉండే నడి వయస్కుడు. ప్రజలు అతనికోసం ఆ గుడిసెకి ఆహారం తెచ్చి పెడుతూంటారు. అతనికి ఆకలి లేకపోయినా ఆ ఆహారం వారి వద్దనుంచి తీసుకుని అతనికి అక్కర లేకపోతే అవతల పారవేసేవాడు.

ఆ నెలలోనే ఆబూమియాఁ అనే ముసలి మస్తును ముజఫర్‌నగర్‌లో బాబా సాంగత్యం చేసారు. ఆబూమియాఁ మౌనం పాటిస్తున్నాడు. అతడొక గోరీలదొడ్డిలో నివాసం ఉంటున్నాడు. ఇతడు మంచి మస్తు అని బాబా చెప్పారు. బాబా అతనికి ఒక చపాతీ యిచ్చి టీ యిచ్చారు. ఈ మార్చి మాసంలో రాంపూర్‌లో మజ్జూబ్ మియాఁను షామియా అనే మోతాదయిన మస్తును బాబా సాగత్యం చేసారు.

తరువాత ఫైజాబాద్‌లో ఒక రాత్రి అమీర్ మియా, బడేమియాఁ, మస్తాన్ ఆలీషా, పహెల్‌వాన్, ఖుర్‌బాన్‌ఆలీ అనే మస్తులను కలుసుకుని బాబా వారి సాంగత్యం చేసారు. హాఫీజ్ జీ అనే ముసలివానిని కూడా బాబా కలిసారు. ఇతడు మాసిన గుడ్డలు కట్టుకొని ఒక హోటలుకి ఎదురుగా ఉంటూండేవాడు. మౌల్వీ సాహెబ్ అనే అన్వేషకుని కూడా బాబా కలుసుకున్నారు. అతనిని గురించి "మౌల్వీ సాహెబ్‌కి భగవంతుడంటే ప్రేమ ఉంది'' అని బాబా అన్నారు.

1942 మార్చి మాసంలో బాబా లక్నోలో అల్లావాలాబాబా అనే మంచి మస్తును సాంగత్యం చేసారు. ఇతడు చింకి గుడ్డలు ధరించి ఒక మసీదు వద్ద ఒక చిన్న గదిలో కూర్చుని ఉండేవాడు. ఎవరైనా అతని వద్దకు వెళ్తే చేయెత్తి "అల్లా"అని దైవస్మరణ చేసేవాడు. వారుకూడా ఆ విధంగా అనాలని అనిపించేవాడు. ఈ అల్లావాలా బాబాని తరువాత కూడా రెండుసార్లు బాబా సాంగత్యం చేసారు. నారాయణ్ బాబా అనే వాడొక ఆధ్యాత్మిక యాత్రికుడు. అతనిని బాబా అయోధ్యలో సరయూ తీరాన ఒక గుడిలో కలిసారు. నారాయణ్ బాబా ఆ గుడిలోనే ఉండేవాడు. ఆ నదీతీరాన బాబా సంత్ మహారాజ్ ని కూడా చూసారు. ఇతడు మంచి అన్వేషకుడు. ఇతనిని సంత్ రామ్ అని కూడా అనేవారు. శివన్ మహారాజ్ అనే అన్వేషకుని కూడా బాబా చూసారు. అతడు అయోధ్యలో హనుమాన్ గుడిలో నివసించేవాడు.

1942వ సంవత్సరం మార్చి మాసంలో బాబా అయోధ్యలోనే ఒక వృద్ధురాలిని కలిసారు. ఆమె పేరు బెంగాలీ మస్తానీ మాయి. ఆమె నల్లగా ఉంటుంది. ఈమె శరీరానికి చేతులకి కాళ్ళకి ఇనుపకడియాలున్నాయి. ఆమె ఒక చిన్న గుడిసెలో ఉండేది. ఆ చుట్టు ప్రక్కల ప్రజలు ఆమెను గౌరవంతో చూసేవారు. ఆమె మంచి మస్తానీ. అయోధ్యలో ఆ సమయం లోనే గర్నివాలా బాబా అనే యింకొక వృద్ధుణ్ణి బాబా సాంగత్యం చేసారు. అతనికి పళ్ళుకూడా ఊడిపోయాయి. అతడు పాతికేళ్ళనుండి ఒక చిన్న గదిలో ఉంటున్నాడు. ఆ గది ఒక రైలు పెట్టెలా ఉంది, దానికి చక్రాలు కూడా ఉండేవి. అక్కడి ప్రజలు అతనికి అన్నము నీరు తెచ్చి యిచ్చేవారు. ఆ గదినుంచి అతడు ఎక్కడికీ వెళ్ళేవాడు కాదు. అతడు మార్గంలో ప్రవేశించిన ఒక యాత్రికుడు. అతనిని అక్కడివారు చాలా గౌరవించేవారు.

మఠ్ మహారాజ్ అను ఒక మంచి మస్తును కూడా బాబా కలిసారు. అతనిని అక్కడ వారు అతడొక సాధువుని గృహమందు నివసించేవాడని అదే ఒక మఠం అని అందుకే అతనికాపేరు వచ్చిందని బాబా అన్నారు. బ్రహాయిచ్ లో మార్చి (1942) మాసంలో బాబా కచేరివాలాబాబా లనే దిగంబర్ మస్తుని కలిసారు. అతడు గోచీపెట్టుకునేవాడు అంతే. బాబాను చూడగానే అతడు ధోవతి కావాలని

అడిగాడు. అప్పుడు బాబాకు ధోవతి కొని యివ్వడానికి సమయం లేకపోయింది. ఇది చూసి ఒక పోలీసు మనిషి తానుయిస్తానన్నాడు. అందుకు బాబా అతనికి డబ్బు యిచ్చారు. ఇతడొక మంచి మస్తు.

ఆ వాసంలోనే ఆ ఊరులోనే బాబా యింకొక మస్తును సాంగత్యం చేసారు. అతనిపేరు లోహేబాబా. ఇతనికి కూడా గోచీ తప్ప యింకేమీ లేదు. మధ్య వయస్కుడయిన యితడు ఇనుపముక్కలు తన శరీరం మీద ధరించేవాడు. అందుకే అతనిని లోహేవాలా అన్నారు. అతని దగ్గర ఒక పెద్ద ఇనుపదిమ్మ ఉంది. దానిమీద దేవుని పేర్లు వ్రాయబడి ఉన్నాయి. అనేక మతాలకు చెందినవి అనేక భాషలలో వ్రాయబడ్డాయి. ఇతడు మోతాదుగా ఉండే మస్తు. మస్తానీ మాయి అని బొద్దుగా ఉండే ఒక స్త్రీని బాబా కలుసుకున్నారు. తోటలో ఒక గడియార స్తంభం దగ్గర ఆమె కూర్చునేది. ఆమెకు ఇనుప కడియాలు తీగలు కాళ్ళకు చేతులకు ఉన్నాయి. బాబా ఆమెకు భోజనం పెట్టారు.

బ్రహోయిచ్‌లో మార్చినెల (1942)లోనే సఖీబాబా అనే యింకో మస్తును బాబా సాంగత్యం చేసారు. ఇతడొక మంచి మహబూబీ మస్తు. లావుగా ఉండే యీ మస్తు ఒక మట్టికుండను ఎప్పుడూ తనతో తీసుకువెళ్తూ ఉండేవాడు. అతనికి తినడానికి ఎవరయినా ఏదైనా యిస్తే అందులో వేసుకునేవాడు. భుజంమీద ఒక గోనె సంచీ కూడా ఉండేది. ఇతనిని చూస్తే చట్టిబాబా లావుగా ఉంటే యిలాగే ఉండేవాడనిపిస్తుంది. ఇతని వద్ద ఒక మూట ఉండేది. బాబా వచ్చినప్పుడు ఆ మూటలో నుండి మువ్వలు తీసి కాలికి కట్టుకొని ఆ గజ్జెలతో నృత్యం చేస్తూ 'అల్లా దర్శన్ దేనేకో ఆయే' అని శ్రావ్యంగా పాడేవాడు. బాబా మండలి ఒక టాంగాను పిలిచి అందులో సఖీబాబాను ఎక్కించి ఊరిబయట ఉన్న ఒక దర్గాకి తీసికొని వెళ్ళారు. అక్కడే బాబా అతనితో ఏకాంతంగా కూర్చుని సాంగత్యం చేసారు. బాబాను చూడగానే "భగవంతుడు దర్శనం యివ్వడానికి వచ్చాడని" ఆడుతూ పాడడంటే అతడు బాబాను భగవంతుడని గుర్తించినట్లేగా.

గొండా అనే గ్రామంలో అహమద్అలీ అనే జలాలీ మస్తు ఉన్నాడు. అతడు మజ్జూబ్ వంటి స్థితిలో ఉన్నాడని బాబా చెప్పారు. అతడు చూడడానికి

ఒక పెద్దపులిలా చాలా క్రూరంగా కనిపిస్తాడు. ఈ మస్తు ముసలివాడు. పొట్టిగా ఉంటాడు. చింకి గుడ్డలు కట్టుకొని ఉంటాడు. చేతిగోళ్ళు చాలా పొడుగ్గా పెంచుకున్నాడు. ఇతనితో బాబా సాంగత్యం చేయడం కష్టమయింది. జలాలీ మస్తుకదా మరి. 1942 మార్చి మాసంలో బాబా అతనికి భోజనం పెడదామని తీసుకొని వెళ్ళారు. అక్కడ ఉన్న సాయిబులు కొందరు అతడు పేచీ పెడుతూంటే బాబా అన్నం తీసుకువచ్చారు. తిను అని కసురుకోగా యింక అల్లరి పెట్టక చెప్పినట్లు విన్నాడు. అక్కడే బాబా అతనితో సాంగత్యం చేసారు. గొండాలో బాబా యింకా కొందరు మస్తులను చూసారు. రోడ్డు ప్రక్క ఒక గుడిసెలో ఒక హిందూ మస్తుని, రైలు స్టేషన్ వద్ద సాధారణంగా కనిపించే మోయిన్‌మస్తాన్ అనే బక్కపలచని నడివయస్కుడయిన మస్తును సాంగత్యం చేసారు బాబా.

ఆ నెలలోనే గొండాలో నూర్‌జహాన్ అనే మస్తానీని కూడా బాబా కలుసుకున్నారు. ఆమె చేతులకు చాలా గాజులు వేసుకుంది గానీ కాళ్ళకుక్కూడా గాజుల్ని వేసుకుంది. ఆమె బట్టలు మాసిపోయి కల్మషయుతంగా ఉన్నాయి. బైదుల్ మొదట ఆమెను చూసేసరికి ఆమె నేలమీద కూర్చుని ఉంది. తలముందుకి వాల్చి నేలకి తగిలేలా ముందుకి వంగి కూర్చుంది. బాబా ఆమెను కలుసుకున్నప్పుడు ఆమె నవ్వింది. గొండాలోనే రంగేలాబాబా అనే మస్తు ఉన్నాడు. ఇతడు మధ్య వయస్కుడు. ఇతనిలో జమాలీ జలాలీ లక్షణాలు రెండూఉన్నాయి. ఇతడు సగం వరకు మామూలు చైతన్యం కలిగి ఉన్నాడు. రంగేలాబాబా పట్టుబట్టలు ధరిస్తాడు. అతనికి చక్కటి ఆకర్షణీయమయిన యిల్లువుంది. స్థానిక ప్రజలు అతనిని బాగా గౌరవిస్తారు. అతడు నాటు సారా త్రాగడానికి బాగా అలవాటు పడ్డాడు. వచ్చిన వారికి కూడా కావాలా అని అడిగి పోస్తుంటాడు. బాబా అతని సాంగత్యం కోసం వచ్చినప్పుడు రంగేలాబాబా గుర్రంమీద ఎక్కి ఆయనకు యెదురు వెళ్ళి సగౌరవంగా నమస్కరించి తన యింటికి తీసుకువచ్చాడు. బాబా అతని యింటిలో ఒక గంటసేపు రంగేలాబాబాతో సాంగత్యం చేసారు.

గొండాలో బాబా సాయిన్‌బాబా అనే మంచి మస్తును కూడా అతడు కూర్చున్న ఒక గోపురం ఎక్కి అక్కడ సాంగత్యం చేసారు. సాయిన్‌బాబా అయిదవ భూమికలోని వాడని బాబా చెప్పారు. 1942 మార్చి మాసంలో మంకాపూర్

రైల్వే స్టేషన్‌లో యువకుడయిన ఒక మస్తును బాబా సాంగత్యం చేసారు. ఈ మస్తు మోతాదుగా ఉండేవాడు. తరువాత బాబా గోరఖ్‌పూరు వెళ్ళారు.

చిన్ని షా మజ్జూబ్ అని గోరఖ్‌పూర్‌లో మంచి మస్తు ఉన్నాడు. అతడు ఆరవ భూమికలోని వాడు. బజారులో ఎక్కడో కూర్చుని ఉంటాడు. రోజుకొక మారు ఊరంతా తిరుగుతాడు. బాబా యితనిని 1942 మార్చిలోనే సాంగత్యం చేసారు. ఆ నెలలోనే మజ్జూబ్‌షా అనే మస్తును కూడా గోరఖ్‌పూర్‌లో బాబా కలుసుకున్నారు. ఇతడు మజ్జూబ్ వంటి స్థితిలోని మంచి మస్తు. చాలా ముసలి వాడు. తెల్లటి గడ్డము పొడవైన తలవెంట్రుకలు ఉన్నాయి. ఇతడు ఒక ధర్మ శాలలో ఎప్పుడూ ఉంటాడు. బాబా అక్కడే యితని సాంగత్యం జరిపారు. టూాటీషా అనే ముసలి మస్తును కూడా బాబా కలుసుకున్నారు. ఈ మస్తు తన గది విడిచి ఎక్కడికీ రాడు.

బాబా శివన్ అనే ఊరు వెళ్ళి అక్కడ ఆత్మాబాబా అనే మస్తును సాంగత్యం చేసారు. ఆ మస్తును శివమహారాజ్ అనికూడా పిలుస్తారు. ఇతడొక కంసాలి దుకాణంలో కూర్చుని ఉంటాడు. బాబా ఆ దుకాణంలోనే రాత్రివేళ ఆ మస్తును కలిసారు. బాబా ఎవరో తెలియకపోయినా యీ సాంగత్యం కోసం రాత్రి ఆ దుకాణం యజమాని తలుపులు తెరిచాడు. సాంగత్యం అయిన తరువాత బాబా శివమహరాజ్ నిజంగా శివుడి లాంటివాడే అనీ మంచి మస్తు అనీ అన్నారు.

తరువాత ఆ నెలలోనే బాబా గోపాల్‌గంజ్ వెళ్ళారు. ఆ చుట్టుప్రక్కల ప్రఖ్యాతి వహించిన ఫతేబాబా అనే మస్తుకోసం, అతడు వచ్చినపుడు ఉంటాడని ఒక్కొక్క ఊరులో ఒక్కొక్కగది ఖాళీగా ఆతనికోసం కేటాయించి ఉంచారు. ఇతడు దిగంబరుడు వృద్ధుడు. బాబా గోపాల్‌గంజ్ వెళ్ళినప్పుడు ఫతేబాబా నిద్రపోతూ ఉన్నాడు. ఎంతకీ లేవలేదు. ఫతేబాబాకి 15, 20 మంది వరకు శిష్యులున్నారు. వారందరూ అతనిని ఎంతో గౌరవంగా చూస్తారు. కానీ బాబా వచ్చినప్పుడు శిష్యులెవ్వరూ కూడాలేరు. అతనిని లేపడానికి ఎవరూ లేకపోయారు. అవతార పురుషుని దర్శించే యోగం అందరికీ పడుతుందా? ఫతేబాబాతో సాంగత్యం అంత తృప్తికరంగా జరగలేదు.

చాప్రాలో చంచేలీషా అను మస్తును బాబా 1942 మార్చిలో సాంగత్యం చేసాడు. చంచేలీషా అయిదవ భూమికలోనివాడు. ఇతడు గౌస్‌వంటి స్థితిలో ఉన్నాడని బాబా చెప్పారు. నడుస్తుంటే ఎగురుతాడేమో అన్నట్లుంటుంది. అంటే ఎగిరి పడుతూన్నట్లు నడుస్తాడు. గౌస్ లాంటి వాళ్ళు యిలాగే నడుస్తారని బాబా వివరించారు.

తంజావూరులోని అబ్దుల్‌ఖాదర్ జిలానీ అనే గౌస్‌వంటి మస్తు కూడా యిలాగే నడిచేవాడు. చంచేలీషా చాప్రాలో బోగంవాళ్ళ కొంపల దగ్గర నివసించే వాడు. ఎవరయినా అతని దగ్గరకువెళ్తే దూరంగా పారిపోయేవాడు. బాబా అతనిని సాంగత్యం చేయాలని వెళ్తే యిలాగే జరిగింది. ఎవరో ఆ మస్తుకి పొగాకు నమలడం అంటే యిష్టం అని చెప్పారు. బాబా అలాంటి పొగాకు చేతినిండా పట్టుకొని వెళ్తుంటే అదిచూసి పారిపోకుండా ఆగాడు. అప్పుడు అతనిని బాబా సాంగత్యం చేయడానికి వీలయ్యింది.

1942వ సంవత్సరం మార్చి నెలలోనే బాబాజీ అనే మస్తును చింతన్‌వాలా అనే ఒక గ్రామంలో బాబా కలుసుకున్నారు. ఇతడు చాలా లావుగా ఉండేవాడు. ఒక పాత కోటమీద ఒక గదిలో ఉండేవాడు. అక్కడ అతడు 41 సంవత్సరాలపాట్కు కూర్చున్నాడని అంటారు. ఆ మస్తు పాలు, పళ్ళు, నీళ్ళు తప్ప యింకేమీ తీసు కునేవాడు కాదు. ఇతడొక ఉపదేశం పొందిన యాత్రీకుడు. ఆ గ్రామంలోనే బాబా శంకర్‌నాధ్ అనే మస్తును కూడా సాంగత్యం చేసారు.

బాబా మార్చిలోనే ధురి అనే గ్రామంవెళ్ళి మధ్య వయస్కుడయిన బ్రహ్మ చారి మహరాజ్ అనే సాధువును షాజీబాబా అనే మస్తును సాంగత్యం చేసారు. షాజీ బాబా 15, 16 సంవత్సరాలు నాలుగు గోడల మధ్య ఉన్న ఒక చిన్న ఆవరణలో కూర్చుని ఉండేవాడు.

1942 మార్చి ఏప్రెల్ నెలల్లో బాబా ఆయన అంతరిక కార్యం కోసం హిమాలయ సంచారమునకై వెళ్ళారు. అనేక స్థలాలలో సంచరించి రెండుచోట్లు అన్ని విధాలా తగినవని ఎన్నుకున్నారు. ఒకటి కాశ్మీర్‌లో ముర్రీ సమీపాన ఉంది. రెండవది హృషీకేశ్‌లో లక్ష్మణ్‌ఝూలా వద్ద బద్రీనారాయణ్ రోడ్డుమీద ఉంది.

బాబా అక్కడ ఏకాంతవాసం చేద్దామని వెళ్తూ శిష్యులు నలుగురు ఆయనతో వచ్చిన వారిని కొండల దిగువను ఉండమని చెప్పి వెళ్ళారు.

యుద్ధము మనకు నేర్పిన పాఠాల గురించి చెప్తూ బాబా ఒకనాడు ఒక ప్రసంగం చేసారు. అందులో ప్రాపంచిక సంబంధమయిన ఆస్తులయొక్క నిష్ప్రయోజనమును గురించి చెప్పారు. జీవితమే బుద్బుదప్రాయం కనుక బాధ అనుభవించుట, ఆత్మత్యాగము యొక్క విలువను గురించి చెప్పారు. ప్రపంచమును ఆధ్యాత్మికంగా ఉద్ధరణ చేయడంలో ఆధ్యాత్మికాభ్యుదయం కలుగచేయడంలో భారత దేశము యొక్క ముఖ్యమయిన పాత్రగురించి ప్రస్తావించారు బాబా. ప్రాపంచిక వస్తువుల యొక్క అసత్యపు విలువలు యీ యుద్ధము వలన ప్రజలకు తెలిసాయి. ఎంతో కష్టముతో శ్రమతో యావజ్జీవము ఆర్జించి కూడబెట్టుకున్న ధనము, ఆస్తులు, ప్రాణాలకే అపాయం వచ్చినప్పుడు ఆకాశంలో విమానదాడులు జరిగేటప్పుడు నగరాలపై బాంబుల వర్షం కురిసేటప్పుడు, శత్రుసైన్యాలు దేశాలు ఆక్రమించుచున్నప్పుడు ప్రజలందరూ యిళ్ళూ వాకిళ్ళూవారి వారి ఆస్తులూ అన్నీ వదలి ప్రాణాలు రక్షించుకుంటే చాలని అనుకుంటారు. అప్పుడు శత్రువులు వీరు వెనుక ఆస్తులన్నీ ధ్వంసం చేసేస్తారు. లేకపోతే శత్రువులకు చిక్కకూడదని మన సైనికులే నాశనం చేసేస్తారు. పారిపోయే ప్రజలు వారితో ఏమి తీసుకొని వెళ్ళగలరు పాపం! బాబా యీ పరిస్థితిని విపులంగా వర్ణించారు. ఈ ఆస్తులే కాకుండా ఎవరికోసం జీవితమంతా శ్రమించి యివన్నీ సంపాదించారో ఆ ఆత్మీయులనే వదిలిపెట్టి పారి పోవలసివస్తుంది. శాశ్వతంగానే వదలి వెళ్ళాలో అది తాత్కాలికమో ఎవరూ చెప్పలేరు. ఇటువంటి అపాయకర పరిస్థితిలోకూడా మానవుడు తనకు సహజమయిన స్వార్ధాన్ని, తన ఆశలను, కోరికలను వదలుకోలేడు. ఏ క్షణాన మృత్యువు మీద పడుతుందో అన్న పరిస్థితిలోకూడా ఏదయినా వీలయినంత వరకూ, కూడా తీసుకు పోదామనే ఉంటుంది ఆహా! మాయ ఎంత బలంగా ప్రజలను తన అదుపులో పెట్టుకుంది! ప్రపంచంలో ఎంత ఐశ్వర్యం ఉన్నా, ఎన్ని సంపాదించి పెట్టుకున్నా అన్నీ చివరికి పనికిమాలినవే అవుతాయి అని యుద్ధం ప్రజలకు విలువయిన పాఠాన్ని నేర్పుతోంది అన్నారు బాబా. కావున పరిస్థితులే మానవుణ్ణి నిస్వార్ధపరుణ్ణిగా చేస్తాయి.

1942వ సంవత్సరంలో ఏప్రిల్ నెలలో బాబా హరిద్వార్ వెళ్ళినప్పుడు మస్త్ అన్వేషణలో ఉన్నారు. రైలుస్టేషన్‌కి సమీపమున ఒక డాబా మీద బుధా

బెంగాలీబాబా అనే అభివృద్ధి చెందిన యాత్రికుడు బాబా వీధిలో నుండి వెళ్తుంటే పిలిచి "మీరు నన్ను చూడాలని అనుకుంటున్నారు కదూ. నాకు కూడా మిమ్మల్ని చూడాలని ఉంది" అన్నాడు. ఇతడు ఎల్లప్పుడు కూర్చొని సంస్కృత భాషలా ఉన్న భాషలో అస్తమానం వ్రాస్తూ ఉండేవాడు. తరువాత జూన్ మాసంలో 11వ తేదీన బాబా ఆతనిని తీసికొని రమ్మని బైదుల్‌ని పంపించారు. బైదుల్ రమ్మని పిలువగా "అబ్బే నేను రాను. నాకు తెలుసు నీవెందుకు రమ్మంటున్నావో. నీవొక దళవాయివి. ఇందులో నీకు లాభం కూడా ఉంది. నేను రాను" అన్నాడు. ఈ సంగతి బైదుల్ వెళ్ళి బాబాకు చెప్పగా బాబా నవ్వారు. తరువాత సగం కడుతున్న ఒక ధర్మశాలకు బెంగాలీబాబాను తీసికొనిరాగా అక్కడకు వెళ్ళి బాబా అతనిని సాంగత్యం చేసారు. ఒక గంట అతనితో కూర్చున్నారు. ఆ మరునాడు బాబా అతనికి ఒక పండు బైదుల్‌చేత పంపించారు. నాలుగు సంవత్సరాలయిన తరువాత అతనికోసం మండలి వెదకితే హరిద్వార్‌లో ఎక్కడా కనబడలేదు. హరిద్వార్ పోస్టాఫీస్ వద్ద బాబా దివానాసాహు అనే ఒక మస్తును సాంగత్యం చేసారు, 1942 ఏప్రెల్ మాసంలో.

ఆ నెలలోనే మౌనిబాబా అనే సాధువును కూడా కలుసుకున్నారు. ఇంకా బాబా హృషీకేశ్ వెళ్ళినప్పుడు బ్రహ్మచారి బెంగాలీబాబా అనే అన్వేషకుని సాంగత్యం చేసారు. ఇతడొక సాధారణమైయున గుడిసెలో నివాసం ఉంటున్నాడు. హరిద్వార్ వెళ్ళినపుడు రామచందర్ అనే మస్తును సాంగత్యం చేసి బాబా అతనికి ఒక క్రొత్త కఫ్నీ తొడిగారు. తరువాత మరల ఏప్రెల్ నెలలో యింకొకమారు కలుసుకున్నారు. మూడవ మారు బాబా యీ మస్తును సెప్టెంబరు మాసంలో సాంగత్యం చేసి నప్పుడు ఉన్నిబట్టతో కుట్టించిన ఒక కఫ్నీ అతనికి యిచ్చారు. మస్తు ప్రతి కులము వారితోను ప్రతి మతము వారితోను తన మతమే అది తన కులమే అది అన్నట్లుగా ఉంటాడు. ఇలాంటి మస్తును సర్‌భంగీ అంటారు. ఇతనికి జాతి మత కుల భేదా లెంతమాత్రమూ లేవు. అతడు వాటికి అతీతుడయ్యాడు.

ఈ ఏప్రెల్ నెలలో బాబా హోషియార్‌పూర్ వెళ్ళారు. అక్కడ గోరీల దొడ్డిలో నివాసం చేసే గోరాబ్‌షా అనే అన్వేషకుని బాబా సాంగత్యం చేసారు. కాశ్మీర్‌మస్తానీ అనే ఆమెను కూడా బాబా అక్కడ కలుసుకున్నారు. ఈ మస్తానీ ఎర్రటి బట్టలు కట్టుకుంటుంది. ఎర్రగా ఉంటుంది. ఆమెకు చాలామంది శిష్యులు

ఉన్నారు. హోషియార్ పూరులో యింకా యిద్దరు మస్తులను కూడా బాబా సాంగత్యం చేసారు.

గోరయా అనే ఊరిలో అంబిబాబా అనే సిక్కు మస్తును ఏప్రెల్ నెలలో బాబా సాంగత్యం చేసారు. అతడొక గొల్లవాని గుడిసెలో ఉంటాడు. అంబిబాబా మంచి మస్తు. బాబా అతనితో ఒక గంటసేపు కూర్చున్నారు.

బ్రహ్మర్ సమీపంలో ఇత్తేషా అని ఒక చాలా శక్తి కలిగిన ఒక మస్తు ఉండేవాడు. అతడు జలాలీ జమాలీ వైఖరులు రెండూ కలిగి ఉండేవాడు. ఆ మస్తు వృద్ధుడు, గుడ్డివాడూను. మాసిపోయిన గుడ్డలు ధరిస్తూ ఒక చీకటి గదిలో కూర్చునేవాడు. అందులో కూర్చున్నందున ఎవరికీ సులభంగా కనిపించేవాడు కాదు. ఎన్నో మైళ్ళనుంచి అతని దర్శనంకోసం ప్రజలు వస్తూండేవారు. బాబా మండలితో అతని వద్దకు వచ్చిన రోజున ఒక భక్తురాలు అక్కడ వుంది. ఆమె ఆ మస్తు గదిలోనుంచి బయటకు వెళ్ళనంటుంది కానీ అలాగే ఆమె ఉండగానే బాబా ఆ మస్తును సాంగత్యం చేసారు. ఇత్తేషా ఉండే గ్రామం బ్రహ్మర్‌కి 8 మైళ్ళ దూరంలో ఉంది. బాబా బృందం వెనుకకు వెళ్ళే టప్పుడు గుర్రాలతో కష్టమయింది. ఆఖరికి వారు స్టేషన్‌కి నడచి వెళ్ళారు. రానుపోను 16 మైళ్ళు నడిచారు బాబా ఆ రోజున.

బాటలా అనే గ్రామంలో లోహేషా అనే మస్తు ఉండేవాడు. అతడు గోరీల దొడ్డిలో ఒక గదిలో నివసించేవాడు. అతడు తన శరీరం మీద ఇనుపకడియాలు, ఇనుప తీగెలు, ఇనుపకడ్డీలు వేసుకుని ఉండేవాడు. అందుకే అతనిని లోహేషా అని పిలిచేవారు. ఇతడు నల్లగా ఉంటాడు. బాబా యితనిని ఏప్రెల్ మాసం లోనే సాంగత్యం చేసారు లోహేషా ఒక మోతాదయిన మస్తు.

ఆ ఊళ్ళో బాబా ఒక యాత్రీకుని కూడా కలిసారు. అతని పేరులోనే బాబా. ఇతడు ఆధ్యాత్మిక మార్గంలో ఉపదేశం పొందాడు. ఈ యాత్రీకుని పేరు సైయద్‌సాయిన్‌షా. షా సిల్కు బట్టలు ధరించేవాడు. మంచి రంగులుకల బట్టలు, విలువ కలిగిన పాదరక్షలు, మంచి తలపాగా పెట్టుకునే వాడు. తనకూడా ఒక గొడుగును తెచ్చుకునేవాడు. ఇంత మంచిబట్టలు అతనికి ఎక్కడనుంచి లభించేవో

ఎవరికీ తెలియదు. మొదట బాబా యితనిని బాటలా రైల్వేస్టేషన్ వద్ద కలుసుకున్నారు. మరల బాబా యితనిని 1946 జూలై నెలలో సాంగత్యము చేసారు. అప్పుడు ఒక సోడాకొట్టు దగ్గర కూర్చుని యుండెను. బాబాను అతడప్పుడు ఒక ఖాళీగదిలోనికి తీసికొని వెళ్ళాడు. ఆ గదిలోనే బాబా ఆ యాత్రీకుని సాంగత్యం చేసారు.

ఏప్రెల్ నెలలో బాబా పర్యటనలో పఠాన్‌కోట కూడా వెళ్ళారు. అక్కడ కల్లూసాయిన్ అనే అభివృద్ధిచెందిన యాత్రీకుని బాబా కలుసుకున్నారు. ఇతడు మంచి దుస్తులు ధరించే ఒక ముసలివాడు. ఎలక్ట్రిక్ పవర్ హౌస్ వద్ద ఒక గుడిసెలో యితడు నివసిస్తున్నాడు. పఠాన్‌కోట్‌లో యితనిని ప్రజలు చాలా గౌరవిస్తారు. అతని వద్దకు ఎవరూ వెళ్ళినా చాలా దయగా మాట్లాడుతాడు. తరువాత యితడు కాలధర్మం పొందాడు. ఆ నెలలో మస్తాన్‌షా అనే మోతాదయిన ఒక మస్తును నాదిర్‌బాబా అనే ఒక అన్వేషకుని బాబా కలుసుకున్నారు. ఊరికి అయిదు మైళ్ళున్న ఒక నదీతీరాన్నుంటాడు నాదిర్‌బాబా. పఠాన్‌కోట వెళ్ళినప్పుడు బెంగాలీబాబా అనే ఉన్నతుడయిన మస్తును బాబా సాంగత్యం చేసారు. ఈ మస్తుకి జలాలీ జమాలీ లక్షణాలు ఉన్నాయి. ఈ మస్తు ఆ ఊరికి ఆధ్యాత్మిక పరిపాలకుడు. సన్నగా బక్కపలచగా ఉంటాడు. వృద్ధుడు. ఈ మస్తు ఒక కుమ్మరి దుకాణంలో పరుండి ఉంటాడు. ఎవరైనా అతని వద్దకు వెళ్తే 'జావో జావో' అని అంటాడు. ఆ కుమ్మరి అతనంటే నమ్మకంతో గౌరవిస్తాడు. అతనిని దుకాణంలో పెట్టి ఆ కుమ్మరి తన యింటికి వెళ్ళిపోతాడు. రాత్రంతా ఆ దుకాణం తెరిచే ఉంటుంది. బెంగాలీబాబా అక్కడ తెల్లవార్లూ పరుండేవాడు. ఆ పట్టణవాసులు ముఖ్యంగా మహమ్మదీయ స్త్రీలు ూూ అవకాశం తీసుకుని అతని దర్శనం కోసం రాత్రి వస్తుంటారు. అతనిమీద గౌరవం కొద్దీ ఒక్క వస్తువుకూడా అక్కడ దొంగతనం జరుగలేదు.

బాబా జలంధర్‌వెళ్ళి ఘనీషా అనే మస్తును (ఏప్రెల్ 1942) ఒక గోరీల దొడ్డిలో సాంగత్యం చేసారు. తరువాత మూంజీబాబా అనే మస్తును బాబా రైల్వే స్టేషన్‌కి ఎదురుగా ఒక చెట్టుక్రింద కూర్చుని ఉండగా కలుసుకున్నారు.

1942 ఏప్రెల్ మాసంలో నకోదార్ అనే ఊళ్ళో ఫతేసాయిన్ అనే మంచి మస్తును బాబా సాంగత్యం చేసారు. ఇతడు జమాలీ రకపు మస్తు.

నకోదార్‌లోను ఆ చుట్టుపట్ల అతడు చాలా ప్రసిద్ధుడు. ఒక చెట్టుక్రింద ఒక గుడిసెలో నివాసం చేస్తున్నాడు.

ఆ నెలలోనే ఆరవ భూమికలోని చాలా ఉన్నతుడయిన ఒక మస్తును మజ్జూబ్‌వలీ అనే పేరుగల వానిని బాబా సాంగత్యం చేసారు. పంజాబ్‌లో ఆ వైపున యితడు ప్రఖ్యాతి గాంచాడు. ఒకే సమయంలో దూర దూర స్థలాల్లో యితడు అనేకచోట్ల కనిపిస్తూంటాడని ప్రతీతి. మజ్జూబ్‌అలీ చాలా ముసలివాడు. బక్కపలుచగా నగ్నంగా ఉంటాడు. ఇతనికి పొడుగైన జుట్టు ఉంది. దనేవాల్ అనే ఊళ్ళో (నకోదార్‌కి సమీప గ్రామం) ఒకానొక వ్యాపారస్తుని యింటిలో నివసిస్తున్నాడు. ఈ మజ్జూబ్‌వలీ అనే మస్తు అక్కడే అతడు రాత్రుళ్ళు పరుంటాడు.

అతని సాంగత్యం చేసాక బాబా వారి బృందంతో దనేవాల్ నుంచి బయల్దేరి నకోదార్ స్టేషన్‌కి తిరిగి వెళ్ళేటప్పుడు యుద్ధపు రోజులు గాన బ్లాక్‌ఔట్ చేసినందున చీకటిగా ఉంది. కుళాయిలన్నీ కట్టేసి ఉన్నాయి. దుకాణాలన్నీ మూసి ఉన్నాయి. ఊరంతా నిద్రపోతున్నట్లు ఉంది. అందుచేత ఆ చీకటిలో నకోదార్ వచ్చి బాబా మండలితో భోజనం లేకుండా ఆ రాత్రి శ్రమతో ప్రయాణం చేసారు. ఏమీ తినడానికి లేక వారంతా ఆకలితో పరున్నారు.

ఈ ఏప్రెల్ మాసంలో బాబా లూధియానా వెళ్ళి అక్కడ హమీద్ మస్తాన్ అనే మస్తును కలుసుకున్నారు తరువాత రావల్పిండిలో షంసాలి దర్వేష్ అనే వానిని బాబా సాంగత్యం చేసారు. ఈ నెలలోనే కుప్ అనే గ్రామానికి వెళ్ళి తోతాపురి అనే ఒక ఉన్నతుడైన జలాలీ మస్తును బాబా సాంగత్యం చేసారు. ఇతడు ఆరవ భూమికకు చెందిన ఒక దిగంబర మస్తు. ఇతడు ఆ ప్రాంతాలలో చాలా ప్రసిద్ధుడు. సాగుచేసే ఒక భూమి వద్ద పారే ఒక పంటకాలువ దగ్గర ఒక కుటీరంలో నివసిస్తున్నారు. మొదట బాబా అతని సాంగత్యం చేసినప్పుడు కొని అరటిపళ్ళు సిగరెట్లు అతనికి యిచ్చారు. ఈ మస్తు చాలా దూరం తిరుగుతుంటాడు. అతనితో కొన్ని కుక్కలు ఎప్పుడూ ఉంటాయి.

నౌరంగాషా అనే జలాలీ జమాలీ వైఖరులు కలసిన ఒక మంచి మస్తును బాబా మే (1942) మాసంలో గుజ్రన్‌వాలాలో కలుసుకున్నారు. రైలుస్టేషన్

వద్ద ఒక చిన్న గుడిసెలో ఉండేవాడు యీ మస్తు. ఇతనిపేరు నంగాషా. ఇతనిని నంగాబాబామస్తాన్ అనీ సాయిన్ జోష్టివాలాబాబా అనీకూడా పిలిచేవారు. ఇతడు పప్పుపేలాలు తిని షర్బత్తు త్రాగుతూ ఉండేవాడు. ఇతనికి సిగరెట్లు త్రాగడం చాలా యిష్టం. షేక్‌మలాంగ్‌బాబా అనే మస్తును కూడా బాబా మేలోనే సాంగత్యం చేసారు. తరువాత పస్రూర్‌లో హీరాబాబా అనే ఉన్నతుడయిన మస్తును బాబా కలుసుకున్నారు. ఇతడొక వృద్ధుడు మే మాసంలో పస్రూర్‌లోనే రాభీమాయి అనే మంచి మస్తానీని బాబా సమావేశం చేసారు. ఆమె తెల్లగా నెరసిన వెంట్రుకలు గల ఒక ముసలిది. హుక్కా పీలుస్తూ ఆమె ఒక స్మశాన భూమిలో కూర్చునేది. అర్థం లేకుండా ఊరికే వాగుతూంటుంది. చాలా దూరాన ఉన్న గ్రామాలనుంచి ప్రజలు ఆమెను దర్శిద్దామని వస్తారు. ప్రతిరోజూ ఆమె వద్దకు అనేక మంది స్త్రీలు వచ్చి కూర్చుంటారు. ఆమెను వారు చాలా గౌరవిస్తారు.

సియాల్‌కోట వద్ద సైదన్‌వాలి అనే గ్రామంలో కాకా సైయిద్ మస్తాన్ మస్తు అనే ఉన్నతుడయిన మస్తును బాబా సాంగత్యం చేసారు. ఈమస్తు సైదన్‌వాలిలో ఒకానొక మసీదు బయట 25 ఏళ్ళ నుంచి ఉంటున్నాడు. ఈ గ్రామం సియాల్‌కోటకి మూడు మైళ్ళదూరం ఉంది. అతనిని ఆ ఊరువారు చాలా గౌరవిస్తారు అతని వద్దకువెళ్ళిన ప్రజల ప్రార్థనలు ఫలించాయి. అతని వద్దకు వచ్చే భక్తులకోసం ఒక ధర్మశాల కట్టించవలసి వచ్చింది.

బాబా లాహోరు వెళ్ళి అక్కడ బత్తి దర్వాజా వద్ద లాగా అనే మస్తును యీ మే మాసంలోనే కలుసుకున్నారు. తరువాత లాహోరులో హుజూరీగేట్ వద్ద సైయిద్‌మస్తాన్ అనే ఒక మోతాదయిన మస్తును సాంగత్యం చేసారు. లాహోరు అనార్కలీలో ఒక ఆసుపత్రివద్ద ఉంటూ ఉండే బెంగాలీమాయి అనే మస్తానీని బాబా కలుసుకున్నారు. ఈ సాంగత్యంకూడా మే మాసంలోనే జరిగింది.

హైయాల్‌షాబాబా అనే బాబా హైయ్యాల్ మస్తుని లాహోరులో 1942 మే నెలలో బాబా సాంగత్యం చేసారు. మొదట బాబా సాంగత్యం చేసినపుడు యీ మస్తు ఒక బహిరంగమైన తోటలోఒక చెట్టుక్రింద దిగంబరిగా ఉండేవాడు. అతడు ఆ చెట్టుక్రింద 20 ఏళ్ళ నుంచి ఉన్నాడని అంటారు.

ఇంకా యీ నెలలో అమీర్‌చంద్ అనే మంచి మస్తును బాబా లాహోరులో సాంగత్యం చేసారు. ఒక మేడమీద గదిలో యీ ముసలివాడు ఉండే వాడు. అతని గది అంతా అపరిశుభ్రంగా చెత్తతో ఉండేది. అతనితో ఎప్పుడూ పది మందివరకూ ఉండేవారు. కొందరు అతని కేమి కావాలో అన్నీ చూసేవారు. మిగిలినవారు ప్రత్తి బజారు చట్టా వ్యాపారంలో ఏ అంకెమీద కాస్తే లాభమో అతని వలన తెలుసుకుందామని వచ్చారు. అమీర్ చంద్‌కి కుక్కలంటే యిష్టం. అతనితో కొన్ని కుక్కలు ఎప్పుడూ ఉండేవి.

బేరీవాలా హుస్సేన్‌షా అనే మస్తు గుజరాత్ అనే ఊరికి చెందినవాడు. ఇతడు పాతబట్టలు, కుండలు, ఎన్నోరకాల సామానులు యితని గదిలో జాగ్రత్త చేసేవాడు. బాబా యితనిని 1942 మే మాసంలో గుజరాత్‌లో సాంగత్యం చేసారు.

గులాబ్‌షా అనే మస్తును కూడా గుజరాత్‌లో మే లోనే బాబా కలిసారు. ఈ మస్తు కోర్టు భవనాలలో ఉండేవాడు. ఇంచుమించు అదే సమయంలో సాయిన్ రెహమాన్‌షా బాబా అనే ముసలి మస్తును బాబా కలుసుకున్నారు. రెహమానషా ఒక జాగీర్‌దార్‌గా ఉండేవాడు. చాలా ఉదార స్వభావుడు. మస్తుగా చిన్నపిల్లవాడిలాగ అయిపోయాడు. పాడడం అంటే యితనికి చాలా యిష్టం. సంతోషంగా ఉన్నప్పుడు చంకలో చేయిపెట్టి చప్పుడు చేసేవాడు. చిన్న పిల్లలకు యిష్టమయినట్లు యిలా తమాషాగా చప్పుడు చేయడం అంటే అతనికి సరదా. తరు వాత కొంతకాలానికి ఇతడు కాలం చేసాడు.

బరేలీలో బాబా జారాషా అనే జలాలీ మస్తును 1942వ సంవత్సరంలో కలిసారు. మొదట అతడు బాబా వద్దకు రానని పేచీ పెట్టాడు. బైదుల్ అతని వద్దకు వెళ్ళి రమ్మనమంటే 'సాహెబ్—ఎ—జమాన్ (అవతార్) వస్తున్నాడు. అతని సమయం సమీపించింది. నాకృపాణంతో అయోగ్యులను హతమార్చి ఆయనకు సాయపడతాను.' అన్నాడు జారాషా వృద్ధుడు. బరేలీలో అతనిని చాలామంది గౌర విస్తారు. ఎవరి యింటిలోని కయినా నిరాటంకంగా వెళ్ళిపోతాడు: బరేలీలోనే ఒక మోతాదయిన మస్తుఉన్నాడు. ఇతడు మహబూబీ రకానికి చెందినవాడు. ఎప్పుడూ నవ్వుతూ సంతోషంగా ఉంటాడు. అతని పేరు ముల్లాషా. చేతులకు గాజులు వేసుకుని

ఉండడంచేత 'బాంగ్రివాలా' అని పిలుస్తారు అతనిని. బరేలీ స్టేషన్‌లో మేనెల ప్రాంతంలో బాబా యితనిని మూడవ తరగతి ప్రయాణీకుల గదిలో సాంగత్యం చేసారు.

నగీనా. అనే గ్రామంలో నావ్‌షా అని జమీర్‌షా అని యిద్దరు మస్తులను బాబా కలిసారు.

1942వ సంవత్సరం మేనెలలో బుడావున్‌లో పర్బతిమస్తాన్ అనే స్త్రీని కలుసుకున్నారు. ఆమె మాసిన బట్టలు కట్టుకొని ఉన్న ఒక యువతి. ఒకానొక దుకాణంలో రోజంతా కూర్చునేది. అక్కడే బాబా ఆమెతో సమావేశమయ్యారు.

మే మాసంలోనే అజీజ్‌మియాం అనే వృద్ధమస్తును బాబా సియోహారాలో సాంగత్యం చేసారు. ఈ మాసంలోనే బాబా షాజహాన్‌పూరులో సుభాషామస్తాన్ అనే మస్తును ఒక గోరీలదొడ్డిలో బాబా సాంగత్యం చేసారు.

1942వ సంవత్సరం నెలలో నజీబాబాద్ సమీపంలో ఉన్న సహన్‌పూర్ అనే ఊళ్ళో తులాషా అనే వృద్ధమస్తును బైదుల్ ఒక నూనె దుకాణంలోనికి రమ్మని బ్రతిమాలగా వచ్చాడు. అక్కడ బాబా అతని సాంగత్యం చేసారు. ఇది చూసి అక్కడి ప్రజలకు ఆశ్చర్యం కలిగింది. ఎందుచేతనంటే అతడు ఎవరు చెప్పినా యింతవరకు వినినట్లు వారు చూడలేదు. అటువంటిది బాబా యొక్క ఆజ్ఞానువర్తి అయ్యాడు.

ఆ ఊళ్ళోనే ఛత్రివాలాసాధు అనే ఒక మస్తు ఉన్నాడు. బాబా యితనిని సాంగత్యం చేసారు. గొడుగులా ఒక గుడ్డ పైన కట్టుకుని దాని క్రింద కూర్చున్నాడు. సహన్‌పూరులోనే మే (1942) నెలలో నజిబాబాద్‌కి సమీపంలో 'గనిమస్తు' అనే 30 సంవత్సరాల వయసున్న ఒకనితో బాబా సాంగత్యం చేసారు. ఇతడు మజ్జూబ్‌వంటి స్థితిలో ఉన్నాడని బాబా అన్నారు. ఇతడు మాదర్‌జాద్ మస్తు. కానీ ఇత్తెఫాకీ లక్షణాలు కూడా ఉన్నాయి. జమాలీ లక్షణాలుకూడా యితనిలో కనిపించును. ఇతనికి పిచ్చెక్కిందనే అభిప్రాయం కలిగి యితని తల్లి దండ్రులు దుఃఖిస్తూ ఉండగా, "ఇది పిచ్చికాదు. ఆధ్యాత్మికంగా యితడు అభివృద్ధి చెందినవాడు. అటువంటి కొడుకును కన్నందుకు మీరు ఎంతో అదృష్ట

ఎంతులు'' అని బాబా వివరించి చెప్పారు. 1942 మే నెలలోనే రియాజుద్దీన్ అనే 50–60 ఏళ్ళ మంచి మస్తును నజీబాబాద్‌లో ఒక చెట్టు క్రింద బాబా సాంగత్యం చేసారు. ఇతడు లావుగా నల్లగా ఉండే దిగంబరుడు. సమావేశం అయి పోయిన తరువాత అతడు బాబాతో 'కామ్ హోగయా' అన్నాడు. అంటే పని అయిపోయిందని అర్థము.

ఆ నెలలోనే ఫిలిభిట్ అనే ఒక ఊళ్ళో చుప్‌షా అనే మిక్కిలి ఉన్నతుడయిన మస్తును బాబా సాంగత్యం చేసారు. ఆరవ రకానికి చెందిన యీ మస్తులాంటి వాళ్ళు ఇండియాలో యితడు కాక యింకా యిద్దరే ఉన్నారు. ఇది చాలా అరు దయిన రకం. బైదుల్ అతని కోసం వెళ్ళినప్పుడు చుప్‌షా అసాధారణమైన విధంగా పరుండి ఉన్నాడు. ఒక కాలు వంచి తన తల క్రిందకు తలగడగా పెట్టుకున్నాడు యీ ముసలివాడు. ఇతడు ఎవరితో నయినా చాలా నిక్కచ్చిగా మాట్లాడుతాడు. బాబా యితనిని కలిసినపుడు చుప్‌షా బాబాని అడిగి పది రూపాయలు తీసు కున్నాడు. ఇతడు మాట్లాడడమే అరుదు. చాలా కొద్దిమందితో మాట్లాడుతాడు. ఇతడు తరువాత కాలధర్మం చెందాడు.

మే (1942) మాసంలోనే హృషీకేశ్‌లో ముగ్గురి మస్తుల్ని హరి ద్వారంలో జూన్ 7వ తేదీన ఒక సాధువుతో బాబా సాంగత్యం చేసారు. ఈ సాధువును తులసీబాబా అని పిలుస్తారు. ఇతడొక అన్వేషకుడు. ఈ తేదీనే హరిద్వార్‌లో ప్రసిద్ధి నొందిన ఒకవృద్ధుని సాంగత్యం చేసారు. అతని పేరు దావుజీ మహరాజ్. ఆ ఊరిలో అతనిని ఎంతో గౌరవంతో చూస్తారు. అక్కడి ప్రజలు అతనికి హారతి కూడా యిస్తారు. అతని వద్దకు బాబా వెళ్ళినప్పుడు బాబాకు అతడు షర్బత్తు త్రాగమని యిచ్చాడు. అతడు అభివృద్ధి నొందిన యాత్రికుడని బాబా చెప్పారు. జూన్ 7వ తేదీన గోవిందబాబా అనే మంచి సాధ కుని బాబా కలుసుకున్నారు. ఇతడొక చెట్టు క్రింద పెద్దపులి చర్మం కట్టుకుని ఉండేవాడు. ఆ మరునాడు అనగా జూన్ 8వ తేదీన హరిద్వార్‌లో మండలిని సాధు వుల కోసం పంపించగా బాబా బసచేసి ఉన్న గదికి 125 మంది సాధువులను తీసికొని రాగా బాబా ఆ రోజున వారందరితో సాంగత్యం చేసి ఒక్కొక్కరికి ఒక రూపాయి దక్షిణ యిచ్చారు.

1942 జూన్ నెలలో బాబా హరిద్వార్‌లో రామ్‌బాబా అను ఉన్నతమస్త్తను రెండవసారి సాంగత్యం చేసారు. మొదటిసారి యితనిని బాబా హరిద్వార్ లోనే 1942 మేలో కలుసుకున్నారు. ఈ మస్త్ చాలా మలినంగా ఉన్నాడు. తరువాత బాబా అతనిని మళ్ళీ చూసేలోగా రామ్‌బాబా ఉన్న కుటీరం కూలగొట్టేసి ఆ స్థానంలో ఒక క్రొత్త యిల్లు కట్టడానికి చోటు చేసారు. అందుచేత యిదివరకు రామ్‌బాబా ఉండే నివాసం కనబడక బాబా మండలి చాలా తంటాలు పడ్డారు. తిరగగా తిరగగా ఒకచోట రామ్‌బాబా కంఠం "బేటా! బచన్‌పాల్" అనే మాటలు అతడు ఎవరినో అంటుండగా వినిపించి అతనిని పట్టుకోగలిగారు. రామ్ బాబా ఒక చెట్టుక్రింద కూర్చుని ఉన్నాడు. అది ఒక ధర్మశాలకి యెదురుగా ఉంది. రామ్‌బాబాతో సాంగత్యం చేయడం కోసం బాబా ఆ ధర్మశాలలో బస చేయడానికి వచ్చారు. అయిదారు రోజులపాటు రామ్‌బాబా వద్దకు బాబా ధర్మ శాల నుంచి చెట్టువరకు వచ్చేవారు. బాబా తరువాత హరిద్వార్‌లో నాలుగునెలలు ఉండడానికి ఒక గది అద్దెకు తీసికొనమని మండలితో చెప్పారు. గది దొరికిన తరువాత రామ్‌బాబా తన మురికిగుడ్డలు, రాళ్ళు, గడ్డి వీటన్నితో సహా ఆ గది లోనికి తీసికొని వచ్చి బస చేయించారు. జూన్ 15 (1942) తేదీ వరకు బాబా ప్రతిరోజు రామ్‌బాబా వద్దకు వెళ్ళి సాంగత్యం చేసేవారు.

1942 జూన్‌లో బాబా డెహ్రాడూన్‌లో బాబా నిహాల్‌షా అనే మస్త్తను కలిసారు. ఇతడు చాలా వృద్ధుడు. ఈ అన్వేషకునికి ఒక శిష్యురాలు కూడా ఉండేది. జూన్‌నెల 18వ తేదీన బైరాగిబాబా అనే సాధువును కూడా బాబా కలుసు కున్నారు. ఆ క్రితం రోజున డెహ్రాడూన్‌లో చిమ్‌టావాలా సాధు అనునతనిని ఝూరువాలామస్తాన్‌ను బాబా సాంగత్యం చేసారు. చిమ్‌టావాలా అతనితో ఎప్పుడూ ఇనుప పటకారును (చిమ్‌టా) ఉంచుకునేవాడు. ఝూరూవాలా వీధిలో ఒక చిరిగిపోయిన గోనె సంచులు కప్పిన పందిట్లో ఉండేవాడు. జూన్ 18వ తేదీన మహాత్మాజీసోన్‌కర్ అనే మస్త్తను కూడా కలిసారు. జూన్ నెలలో బాబా హృషీ కేశ్‌లోనే ఉండి అక్కడికి సమీపంలో ఉన్న పానిపట్, హరిద్వార్, డెహ్రాడూన్ లకు వెళ్ళి ఆయా పట్టణాలలో కొద్దిరోజులు ఏకాంతవాసంలో గడిపి వచ్చారు. అక్కడ మస్త్తలతో కూడా సాంగత్యం చేసారు.

జూన్ 23వ తేదీ పండుగ దినము శెలవు అగుటచేత బాబా మండలి అందరిని హరిద్వారం తీసికొని వెళ్ళారు. ఆ రోజున వేలకొలదీ యాత్రీకులు హరిద్వారానికి వచ్చారు. గంగానదికి వరద వచ్చి పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తోంది. హృషీకేశ్‌లో నావమీాద నది దాటడం సురక్షితం కాదని అందరూ లక్ష్మణ్ ఝూలా మీాదనుండి యివతలి వడ్డుకి వచ్చారు. వాతావరణం మేఘావృతమై వర్షం పడుతుందేమో అన్నట్లుగా ఉంది. హరిద్వారం వచ్చి ఒక బంగళాపైన డాబా మీాద బాబా మండలితో కూర్చున్నారు. అక్కడినుంచి ఉత్సవం తిలకించడానికి వీలుగాఉంది. యాత్రీకుల నందరినీ చూడవచ్చును. అనేకులు ఎవరికి తోచినట్లుగ వారు అనేక రీతులుగా ఉత్సవం చేస్తున్నారు. కొందరు భక్తి గీతాలు పాడుతూ భజనలు చేస్తున్నారు. కొందరు కీర్తనలు ఆలకిస్తున్నారు. కొందరు పండితుల ఉపన్యాసాలు వింటున్నారు. కొందరు భక్తులు సాధువులకు భోజనం పెడుతున్నారు. కొందరు నదీతీరాన తీయని పానీయాలు త్రాగుతున్నారు.

గంగానది వరదలలో పెద్ద పెద్ద వృక్షాలు దూలాలు కొట్టుకొని పోతున్నాయి. నది అతి వేగంగా ప్రవహిస్తున్నది. గ్రామస్తులు కొందరు ఆ దుంగల మీాద కూర్చొని నదిలో విలాసంగా పోతున్నారు. దొప్పలలో నేతితో దీపాలుపెట్టి నదిలోనికి వదులుతుంటే చూడడానికి చాలా యింపుగా ఉంది. వర్షంలో బాధ పడవలసి వస్తుందేమోనని ఆ రాత్రికే బాబా మండలితో హృషీకేశ్ మరల వచ్చేసారు. జూన్ 26వ తేదీన బడా మస్తాన్ అనే మంచి మస్తును బాబా సహరన్‌పూర్ సమీాపంలో కపోసా అనే గ్రామంలో సాంగత్యం చేసారు. ఆ ఊరు సహరన్‌పూర్‌కి 8 మైళ్ళ దూరం ఉంది. అక్కడికి వెళ్ళేటప్పుడు బాబా వారి మండలి కొన్ని యేరులు దిగి నీటిలో నడిచి వెళ్ళవలసి వచ్చింది. ఆ గ్రామానికి సరియయిన దారి లేనందున బురదతో నిండిన పొలాలలో నడిచి వెళ్ళారు.

ఆ తారీఖునే సహరన్‌పూర్‌లో రాజీమాయి మస్తానీ (రజ్జోబాజీ) అనే ఆమెను బాబా కలుసుకున్నారు. ఆమె మంచి మస్తానీ అని బాబా చెప్పారు. ఆమె చక్కని మేని ఛాయ కలిగి నడివయసులో ఉండెను. ఆమె వదనము తేజస్సుతో నిండి యుండెను. ఒక గోరీల దొడ్డివద్ద ఒక గుర్రపుశాలలో అపరిశుభ్రమయిన స్థలంలో ఆమె దిగంబరియై యుండెడిది. మొదట ఆమె డెహ్రాడూన్‌లో ఉండేది. ప్రకాశవంతమయిన ఆమె చహరాని బట్టి ఆమె దేవత అని అందరు అనేవారు. ఇప్పుడామె

కాలగతి చెందినది. ఆ రోజునే బాబా సన్నగా పొడుగుగా ఉండే 20 ఏళ్ళ దిగంబర యువకుడయిన ఒక మాదర్‌జాద్ మస్తును పానిపట్టులో కలుసుకున్నారు. తరువాత జూన్ 26వ తారీఖునే ఒకనడివయస్కుడు పొడుగూకాదు పొట్టీకాని వానిని, దిగంబరిని, ఒక చిన్న గడ్డము కలవానిని ఊరంతా తిరుగుతూ ఉండే మాదర్‌జాన్ మస్తును పానిపట్టులోనే బాబా సాంగత్యం చేసారు. ఇతని ముఖం తమాషాగా ఉంటుంది. బాబా యింకొక యిద్దరు దిగంబర మస్తులను కలుసు కున్నారు. ఆనాడే పానిపట్టులో అల్లాదియా అనే దిగంబర మస్తును బాబా సాంగత్యం చేసారు. ఇతడు ఒక అంధుడు. సన్నగా ఉండే ఉన్నత మస్తు. పాని పట్టులో బుఆలీషాఖాలందర్ దర్గాకి వెళ్ళే ద్వారానికి ఒక వైపున అతడు కూర్చుం టాడు. అక్కడ ఒక తెరకట్టి అతనితో బాబా సాంగత్యం చేసారు.

ఒక నెల హృషీకేశ్‌లో ఉండి అందరూ జూన్ 30వ తేదికి డెహ్రాడూన్ చేరుకున్నారు. ఈ మారు బాబా రైలులో ప్రయాణం చేసారు. మండలిలో కొంత మంది బస్సులో వెళ్ళారు. అందులో మండలి సామానులన్నీ తీసికొని వెళ్ళారు. బస్సు హృషీకేశ్ నుండి తిన్నగా డెహ్రాడూన్ వెళ్ళింది. మామూలుగా బస్సు రెండు గంటలలో డెహ్రాడూన్‌కి వెళ్తుంది. దూరం 20 మైళ్ళుఉంది. వర్షం కురుస్తున్నందున ఒక గోతిలో బురదలో బస్సు చక్రం దిగబడి పోయింది. ఇలా దారి పొడుగునా నాలుగు మార్లు జరిగింది. సామానంతా దింపుతూండడం తోస్తూండడం మళ్ళీ బరువు ఎక్కించడం యిలా తంటాలుపడి చివరికి యీ కాస్త ప్రయాణానికి 12 గంటల సమయం పట్టింది. దారి పొడుగునా వర్షం పడుతున్నందువలన అందరూ పూర్తిగా తడిసిపోయారు. దారిలో యీ విధంగా ఆగినపుడల్లా డ్రైవరు క్లీనరు తప్ప యింక కూలివాళ్ళు మధ్య దొరకనందున మండలి సామాను మోసుకోవలసి వచ్చింది. వారికి భోజనాలు లేవు సరికదా త్రాగడానికి మంచినీరయినా దారిలో దొరకలేదు. తెల్లవారుఝామున 4 గంటలకు బయలుదేరిన వాళ్ళు డెహ్రాడూన్‌కి సాయంత్రం 4 గంటలకు ఎలాగో ఒకలాగ చేరుకున్నారు. కానీ సామాను అంతా చెక్కుచెదరకుండా వచ్చింది.

హృషీకేశ్‌లో బాబా రాణీ సింఘై బంగళాలో స్వర్గాశ్రమంలో ఉన్నారు. ఒకడయిన ఎరచ్ సాధువులు నివసిస్తున్న ఆశ్రమాలలో నుంచి ఎక్కడికో వెళ్ళి హృషీకేశ్‌కి తిరిగి వస్తూన్న బాబాను కలుసుకోవడానికి గబగబా వెళ్తున్నారు.

అలా వెళ్తూండగా ఒకానొక కుటీరంలో పడుకొనియున్న ఒకనిని ఎరచ్ చూసాడు. ఆ కుటీరానికి పైన కప్పులేదు. అది కూలిపోతుందేమో అన్నట్లుగా ఉంది. ఎరచ్ దారిప్రక్కన ఉన్న ఆ కుటీరం లోపలికి తొంగి చూడగా అందులో 14 ఏళ్ళ అందమైన బాలుడు ఒకడు అతని కంటబడ్డాడు. ఒక మంచి పిల్లవాడు బాబాకు కావాలన్న సంగతి ఎరచ్‌కి జ్ఞాపకం వచ్చింది. లక్ష్మణ్ ఝూలా వంతెన వద్దనుంచి బంగళావద్దకు నడుస్తూ యీ సంగతి బాబాకు చెప్పి ఎరచ్ బాబాను ఆ పిల్లవానిని చూడడానికి అతనితో రమ్మన్నాడు. ఆ కుటీరం చేరుకోగానే బాబా ఎరచ్‌ని ఆ పిల్లవానిని యిక్కడ ఏం చేస్తున్నావని అడగమన్నారు. అతనితో సంభాషించిన మీదట యీ విషయములు తెలిసినవి. ఆ పిల్లవానిది అంబాలా అక్కడ అతని తల్లిదండ్రులున్నారు. కాని లోపల భగవంతుని దర్శించాలనే ఆరాటం కలిగి ఇల్లు, తల్లిదండ్రులను వదలి యిలా వచ్చేసాడు ఆ బాలుడు. యీ హిమాలయ ప్రాంతానికి.

ఎరచ్- నీకు ఎవరయినా గురువున్నాడా మరి.

బాలుడు- లేరు. నాకు ఎవరూ గురువు లేరు. వాళ్ళంతా ఊక కబుర్లు చెబుతారు. నాకు ఏ మాటలూ చెప్పని గురువు కావాలి.

ఎరచ్— గత 18 ఏళ్ళుగా మాట్లాడని గురువును ఒకరిని నేనెరుగుదును ఆయన పేరు మెహెర్ బాబా.

బాలుడు- నేను మెహెర్ బాబా వారిని గురించి విన్నాను. ఆయన యీ చుట్టుపట్ల ఎక్కడో ఉన్నారని విన్నాను. ఎక్కడో సరిగా తెలియదు. కానీ మెహెర్ బాబా అంతటి వారు నన్ను శిష్యునిగా అంగీకరిస్తారా?

అంతట ఎరచ్ బాబాను ఆ బాలునికి చూపించి 'వీరే మెహెర్ బాబా' అని చెప్పాడు. ఆబాలుడు అపరిమితానందం పొందాడు. బాబా ఆ బాలునికి 'గురువుగా ఉంటానని అయితే యిదే మొదటిసారి యిదే ఆఖరిసారి, ఆ బాలుడు గురువును చూడడం అనీ', ఎరచ్‌ని చెప్పమన్నారు. ఇంకా ఆ బాలుడు 'మూడు' షరతులకు అంగీకరించాలి'' అన్నారు. ఈ షరతుల ప్రకారం ఆచరించినచో ఆ బాలుడు తన హృదయంలో బాబాను కనుగొన గలడని చెప్పారు. బాబా ఆ బాలునితో ఆ షరతులను యిలా చెప్పారు.

1. కామ వాసన ఎంతమాత్రము ఉండకూడదు. ఎప్పుడూ నీ జీవితంలో స్త్రీని స్పృశించరాదు.

2. దానికి బదులు నీ దివ్య ప్రియతముడయిన భగవంతుని పొందాలని ఎల్లప్పుడు తలచుకుంటూ ఉండాలి.

3. నీవు డబ్బు ఎప్పుడూ ముట్టరాదు. నీ భోజనానికి భిక్షమెత్తవలయును.

నల్లటి తేళ్ళు పాములు వస్తూంటాయి ఆ ప్రదేశంలో. ఇంత భయంకర మైన అడవి ప్రదేశంలో ఆ బాలుడు ఉంటున్నాడు. అక్కడికి పెద్దపులులు కూడా అప్పుడప్పుడు వస్తుంటాయి. కానీ ఆ బాలుడు భయం ఏమిటో ఎరుగడు. బాబా యొక్కడ ఆ బాలుని భగవంతుని ఏ నామము నీకు ఎక్కువ మక్కువగా ఉంటుంది అని అడిగించారు. అందులకాతడు "ఓం హరినారాయణ్" అని చెప్పాడు. ఈ నామమే ఆ బాలునికి గురుమంత్రం అని బాబా అతనికి ఉపదేశం చేసారు. "ఓం హరినారాయణ్" అను దివ్య నామాన్ని అనంతరము జపిస్తూ ఉండు' అని బాబా అతనికి ఆదేశించారు. బాబా అతనికి అంతరికంగా సహాయం చేస్తానని చెప్పారు. ఆ బాలుడు ఆనందముతో బాబాకు హృదయపూర్వకంగా ప్రణమిల్లి సెలవు తీసికున్నాడు. ఇరువురికి, (గురువుకి, శిష్యుడికి) ఆనందం కలిగింది. బాబా అతనిని ఆశీర్వదించి ఆ కుటీరము నుండి వెలువడి బయటకు వెళ్తుండగా ఆ బాలుడు తృప్తి నిండిన కళ్ళతో బాబా వైపు ఆనందంతో చూస్తూ ఉండెను. మరల బాబా అతనికి యీ జన్మలో కనిపించరు. అందుచేత వేయికళ్ళు చేసుకుని ఆయన వైపుకే చూస్తూ ఉండెను. ఆ బాలునికి చిన్నతనము నందే భగవంతుని యెడల కలిగిన తీవ్రమైన కాంక్ష, తనకున్న ప్రాపంచిక సౌకర్యాలను, సంపదలను, సుఖాలను వదలి హిమాలయ పర్వత ప్రాంతములందు భగవంతుని అన్వేషించి శాంతి బడయువలెనను కోరికతో హృషీ కేశ్ వచ్చేలా చేసింది. ఆ మరునాడు బాబా ఆ బాలుని యందు కలిగిన అపార కరుణ, వాత్సల్యము చేత బాబా ఫోటో ఉన్న ఒక పతకమును, ఆ బాలుడు కూర్చొనడానికి ఒక చాప, బాబా చరిత్ర ఉన్న ఒక పుస్తకము, అతనికి ఆహారం కోసం కొంత గోధుమపిండి, బాబా గురుప్రసాదంగా ఆ బాలునికి పంపించారు. ఇది ఆ బాలుని అపూర్వమయిన అదృష్టం.

1942 జూలై 12వ తేదీన బర్బరీమస్తాన్ అనే మస్తును బాబా కథ్‌గోదామ్‌లో సాంగత్యంచేసారు. ఇతడెప్పుడూ తనలోతాను గొణుగుకుంటూఉంటాడు. అందుకే అతనిని బర్బరీ అన్నారు. ఆ తేదీనే మియాఁసాహెబ్ మస్తాన్ అనే మస్తుని సాంగత్యం చేసారు. ఉదర్‌మాన్‌మస్తాన్ అనే వాడు చాలా మంచిమస్తు. నెమ్మదయిన వాడు. ఇతడు జమాలీ రకానికి చెందినవాడు. వయసుకి పెద్దవాడు. కొండజాతిలో పుట్టాడు. ఇతనిని మొదట మండలి జూలై 12వ తేదీన (1942) బాబా వద్దకు తీసికొని వచ్చారు. ఆ రోజున బాబా అతనితో సాంగత్యం చేసిన తరువాత ఇంక తనంతట తానే కథ్‌గోదామ్‌లో బాబా బసకి జూలై 13, 15, 16, 18, 19, 20, 21, 22 తేదీలలో వరుసగా రాగా బాబా అతని సాంగత్యం చేసారు. ఏకాంతంగా బాబా ఉన్న బసలో కొన్ని గంటలసేపు అతనితో కూర్చునేవారు. తరువాత ఆగష్టు నెల 4వ తేదీన ఉదర్‌మాన్‌ని డెహ్రాడూన్ బాబా వద్దకు తీసికొని వచ్చారు మండలివారు. అక్కడ అతడు 3 వారాల పాటు బాబా ఇచ్ఛప్రకారంగా ఉన్నాడు. ప్రతీ రోజున బాబా అతనికి స్నానం చేయించి అన్నం పెట్టేవారు. అప్పుడు బాబా అనేకమంది శిష్యులతో డెహ్రాడూన్‌లో మకాం చేస్తున్నారు.

1942వ సంవత్సరం జూలై మాసంలో బాబా మస్తు అన్వేషణకై అనేక గ్రామాలు వెళ్ళారు. సహాన్‌పూరు వెళ్ళినప్పుడు తులాషా అనే మస్తు బాబాను తప్పించుకుందామని ఊరిబయట తుప్పల లోనికి పారిపోయాడు. మళ్ళీ బాబాతో సమావేశానికి అతడు అంగీకరించలేదు.

1942 జూలైలో మళ్ళీ ఒయా మస్తు వద్దకు సహాన్‌పూరు వెళ్ళడానికి బాబా వారి మండలితో ఒక టాంగాలో వెళ్తూ ఒక నది దాటవలసి వచ్చింది. నీరు గుర్రం వీపు మీదకి వస్తోంది. బాబా ఆయనతో వెళ్తున్న అదే బండిలో వెనుకకు సర్దుకొని కూర్చున్నారు. బండిలోకి నీరు వచ్చి వారి బట్టలు తడిసాయి. ఆ మధ్య కురిసిన వర్షాలవలన నదిలోనికి క్రొత్తనీరు బాగా వచ్చింది. చివరకు ఎలాగో దాటి వెళ్ళారు. బాబా 24వ తేదీన కూడా గనీ మస్తును సాంగత్యం చేసారు. జూలై 24వ తేదీనే సహాన్‌పూరులో కాలీకంబ్లీవాలా అనే యింకో మస్తుని సాంగత్యం చేసారు బాబా. ఈ మస్తు రోజూ ఒక మాటున జీబాబాదుకి

నడచివెళ్ళి వస్తుంటాడు. అక్కడ ఒక హిందువు అతనికి భోజనం పెడతాడు. ఇంకెవరు ఏమిచ్చినా యీ మస్తు తీసుకోడు.

ఈ మాసంలో బాబా అజ్మీర్ వెళ్ళినప్పుడు ఢిల్లీగేటు వద్ద ఉంటూఉన్న ఒక మస్తుని కలిసారు. ఆ మస్తు ఎల్లప్పుడూ అక్కడ ఉండడం వలన ఢిల్లీ ధర్వాజా వాలా మస్తు అనే పేరు వచ్చింది. అజ్మీరు లోనే ఢిల్లీ గేటుఉంది. రావల్పిండిలో బాబా వాలిబాబా అనే సైయిద్ మహమ్మద్ షెరిఫ్‌ను సాంగత్యం చేసారు. ఈతడు 6వ భూమికలోని ఉన్నతుడయిన మస్తు. బాబా క్రిందటి సంవత్సరం రావల్పిండి వచ్చినప్పుడు రెండుమార్లు సాంగత్యం చేసారు. 24వతేదీన నజీబా బాదులో ఒక మస్తును కలిసారు. జూలై (1942) 28వ తేదీన పుష్కర్‌నుంచి అజ్మీరు వస్తూ బాబా రోడ్డు ప్రక్కన ఒక సాధువును సాంగత్యం చేసారు.

ఆగస్టు 4వ తేదీన ఉదర్‌మాన్ అనే మస్తును 21 రోజులపాటు డెహ్రాడూన్ తీసుకుని వచ్చి బాబా అతనిని సాంగత్యం చేసారు. ఉదర్‌మాన్ కథ్‌గోదామ్ అనే ఊరివాడు. మృదుస్వభావం కలిగిన ఉదర్‌మాన్ మంచి జమాలీ రకం మస్తు. వయసులో పెద్దవాడయిన యితడు, కొండప్రదేశంలో పుట్టాడు. మొదట యితనిని జూలై 12వ తేదీన బాబా వద్దకు తీసుకు వచ్చారు. మరునాడు తనంతట తానే బాబా బసకు అతడు వచ్చాడు. ఆ రోజు లగాయతు బాబా అతనితో ఏకాంతంగా కొన్ని గంటలు ప్రతీరోజూ కూర్చునేవారు. మరల ఆగస్టు 4వ తేదీన ఉదర్‌మాన్‌ను డెహ్రాడూన్ రప్పించి బాబా వారివద్ద 3 వారాలు ఉంచుకున్నారు. ప్రతిరోజూ అతనికి స్నానం చేయించి అన్నం తినిపించే వారుబాబా. బాబా అప్పుడు మండలితో డెహ్రాడూన్‌లో ఉన్నారు.

డెహ్రాడూన్‌లో యిదివరకు ఫిబ్రవరి మాసంలో బాబా సాంగత్యం చేసిన శివాజీ మహరాజ్ అనే మస్తును జూన్ నెలలో కలిసిన తరువాత, మరల ఆగస్టులో 12వ తేదీ మొదలు 18వ తేదీ వరకు ప్రతి రోజున అతనిని బాబా వద్దకు తీసుకువచ్చారు. రోజూ అతనికి స్నానం చేయించి భోజనం పెట్టేవారు. ప్రతిరోజూ బాబా అతనితో కొంతసేపు కూర్చునేవారు. తరువాత కొన్నాళ్ళకి యితడు కాలం చేసాడు.

సెప్టెంబరు (1942) మాసంలో బాబా మరల మండలితో హరిద్వార్ వెళ్ళారు. వెళ్ళి అక్కడ మరల రామ్‌బాబాను కలుసుకుందామని వారు అద్దెకు తీసుకున్న గదికి వెళ్ళారు. వెళ్ళి చూసేసరికి అందులో ఎవరో పెద్దమనిషి చక్కగా దుస్తులు ధరించి కూర్చుని ఉన్నాడు. ఆ గది యిప్పుడెంతో పరిశుభ్రంగా ఉంది. ఆ పెద్దమనిషిని చూసిన ఎరచ్ "రామ్‌బాబా అనే వాని గది ఎక్కడ ఉంది" అని అతనిని అడిగాడు. ఆ గదికోసం కొన్ని నెలల అద్దె ముందే యివ్వబడింది అని కూడా చెప్పాడు. ఆ పెద్దమనిషి ఉన్న గదికి ప్రక్కగదిలో ఉంటూన్న అతడు "అతడే, ఆ పెద్దమనిషియే రామ్‌బాబా అని ఎరచ్‌కి చెప్పాడు" ఆఁ! ఎంతలో ఎంత మార్పు వచ్చింది! చాలా నాగరీకుడు వలె దుస్తులు వేసుకున్నాడు. జల్తారు అల్లిక అంచుగల టోపీ ధరించాడు. అతని చైతన్యం అన్ని విధాల చాలా బాగుంది. నిజంగా బాబా యిదివరకు చేసిన సాంగత్యం ఫలితంగా యిప్పుడు రామ్‌బాబా సాలిక్ వలె తయారు అయ్యాడు. బాబా అతనితో సాంగత్యం చేయడం యిదే ఆఖరుసారి.

హరిద్వార్‌లో రెండవమారు బాబా సెప్టెంబరు (1942) 5వ తేదీన యితనిని కలిసారు. ఈ మారు ఒక చిన్న వంతెన మీద ఉండగా అతడు బాబాకు కనిపించాడు.

బాబా హృషీకేష్ నుంచి డెహ్రాడూన్ తిరిగి వచ్చిన తరువాత మరల హిమాలయములకే దీర్ఘసంచారము నిమిత్తమై వెడలుటకు ఏర్పాట్లు చేస్తున్నారు. బాబా ఏకాంతముగా ఉండి వారి ఆంతరిక కార్యమును నెరవేర్చుకొనుటకు ఏర్పాటు చేయుమని మండలిలో యిద్దరిని కాకా బైదుల్‌లను ముందు పంపించారు. బాబా ఉండుటకు హిమాలయము లందలి ఆల్మోరా ప్రాంతమును ఎన్నుకున్నారు. ఈ మధ్యనే అక్కడ పెద్ద తుఫాను వచ్చి అనేక కుటుంబాలకు నిలువ నీడ లేకుండా పోయిందని పత్రికలలో వార్త వచ్చింది. కుళాయి గొట్టములు బద్దలయినందున మంచి నీటికి కూడా కరువు ఏర్పడింది. చాలా చోట్ల రోడ్డుకి గండ్లు పడ్డాయి. మూడు రోజులు వెదకి బాబా శిష్యులు, బాబా వసతి నిమిత్తం ఒక యిల్లు చూసారు. అది కత్‌గోడామ్‌లో రోహిల్ ఖండ్—కామో రైల్వేకి చివరఉంది. ఇక్కడి నుండే నైనిటాల్‌కి ఒక రోడ్డు, రాణి ఖేట్‌కి ఒకరోడ్డు ఆల్మోరాకి ఒక రోడ్డు వెళ్తున్నాయి.

జూలై 10వ తేదీన—ఆయన 18వ మౌనవార్షికోత్సవ దినమున— బాబా డెహ్రాడూన్ నుండి హిమాలయాలలో ఏకాంతవాసానికై ముగ్గురు శిష్యులతో బయలుదేరారు. బాబా మరునాడు అక్కడికి చేరగానే మారువేషంలో తిరగడం మొదలుపెట్టారు. కాలినడకను తిరుగుతున్నారు. ఉపవాసాలు చేస్తున్నారు. బాబాకు కాకా, బైదుల్ ఏర్పాటు చేసిన బస నచ్చింది. బాబా గది శుభ్రంగా ఉంచడం ఆదీ వంతు. అతడు ఉత్తరాలకు జవాబులు కూడా వ్రాయాలి. బైదుల్ బజారు పని, పోస్టాఫీసుకు వెళ్ళడం చూస్తుండేవాడు. కాకా బాబాకి మండలికి వంట చేసి భోజనం పెట్టేవాడు. మిగిలిన శిష్యులు వీరందరికీ సహాయం చేసేవారు. రెండేసిగంటల చొప్పున తమ శిష్యులను వంతుల వారీగా రాత్రిళ్ళు కావలి కాయమని బాబా చెప్పారు. సాధారణంగా అనేక విధాలయిన సంస్కారాలు కలిగిన ప్రేతాత్మలు బాబా వద్దకు వచ్చి చుట్టూ తిరుగుతూ తమకు సహాయం చేయమని వారిని ప్రాధేయపడుతుంటాయి. కానీ యీ ఏకాంతవాసము నందు అటువంటిదేదీ జరుగలేదు. ప్రతి రోజు విష్ణుని పిలిచి మెహెరాబాదు ఉత్తరములు యేమి వచ్చాయని అడిగి తెలుసుకుంటున్నారు. అతడు డెహ్రాడూన్ నుండి వచ్చి అక్కడి స్త్రీ పురుష మండలి వారి ఆరోగ్యం వగైరా కూడా బాబాకు తెలుపుతున్నాడు.

బాబాకు హిమాలయాలలో సంచారం చేయాలని ఆధ్యాత్మిక ప్రేరణ కలిగింది. ఆయన కథ్‌గోదామ్‌లో ఉంటూ జూలై 14వ తేదీన బయలుదేరి భోవాలి వెళ్ళారు. ఆయనతో 4 గురు శిష్యులను తీసికొని వెళ్ళారు. అక్కడ మహర్వార్, హోసాలి కొండలలో తిరిగారు బాబా.

బాబా మహర్వార్ గ్రామంలో నైనిబాబా యను యువకుని చూసారు: అతనికి ఆ ఊరులో ఒక వర్తకుడు అన్నంపెట్టి బీడి వగైరాలనిస్తున్నాడు. ఆ వర్తకునితో బాబా అక్షరఫలకం సహాయంతో మాట్లాడారు. భోవాలికి 5 మైళ్ళ దూరంలోని ఆ గ్రామంలో నన్హిబాబా అనే అన్వేషకునితో బాబా సాంగత్యం చేసారు. అక్కడి కొండలలో 12 మైళ్ళు తిరిగారు. ఉదయాన ఒక కప్పు టీ మాత్రం బాబా తీసుకున్నారు. ఆయన అనుకున్న ప్రయాణం ముగిసే వరకు భోజనం చేయలేదు.

బాబా మనవలె కాదు. మనం కంటితో ప్రపంచాన్ని చూస్తాము. చెవులతో వింటాము నాసికతో వాసన చూస్తాము. మన ఇంద్రియముల శక్తి చాలా పరిమితమయినది. బాబా మనస్సు విశ్వానికే కేంద్రస్థానము. పైకి మనలాగే కనిపించినా ఆయన అనుభవాలు వేరు. ఆయన సర్వజ్ఞుడు. ఆయన ఆత్మ అన్ని చోటులా ఉంటుంది. ఆత్మతోనే ఎంత దూరాన ఉన్నదయినా చూస్తారు. స్పృశిస్తారు. ఆఘ్రాణిస్తారు. ఏ ధ్వనినైనా వినగలరు. ఈ శక్తులన్నీ ఆయన ఆలోచనలో ఉంటాయి. ప్రపంచం అనుభవిస్తున్న సుఖం అంతా బాబా అనుభవిస్తారు. అది పడే బాధ అంతా ఆయన పడతారు.

మెహెర్ బాబా మానవకోటికి పరమాత్మ. మానవులు బాధపడితే ఆయనకూ బాధ కలుగుతుంది. ఆ కొండలలో తిరుగుతూ కాళ్ళునొప్పి వచ్చి బాధపడడంలో ఆధ్యాత్మిక విశిష్టతఉంది. అప్పుడు జరుగుతున్న యుద్ధం, అందులో కలిగే రక్తపాతం బాబాకు అక్కడ నుంచి అంతా అవగతమగుటయే కాక, ఆంతరికంగా ఆయన అందు నిమిత్తం పని చేస్తున్నారు. అక్కడక్కడ ఒక వ్రేలితో భూమాతను స్పృశిస్తారు. నడుస్తూ నడుస్తూ ఆగుతారు. ఆయన నుదుటినుంచి శ్రమబిందువులు నేల రాలుతాయి. అయిదారు కొండలు దాటి ముందుకు వెళ్ళేసరికి అక్కడ ఒక ఏకాకి వీరిని కలిసాడు. అతడు మాటలాడుట లేదు. బాబా 1925వ సం॥ నుంచి మౌనంగా ఉన్నారని విని అతడు చాలా ఉత్తేజితుడయ్యాడు. అతనికి అక్కడ భూములు, పశువులు ఉన్నాయి. అతడు బాబాతో కూడా నడిచాడు. అతడు ఒక కాగితం మీద "గత యుగానికి సంబంధించినది, నూతన యుగప్రతిష్ఠాపనకు సంబంధించినది అయిన ఆత్మను నేను బాబాలో చూస్తున్నాను" అని వ్రాసి యిచ్చాడు. బాబా అతనిని ఆశీర్వదించి ముందుకు సాగారు.

ఒక ఎత్తయిన కొండమీద నుంచి నడుస్తున్నారు. కాలుజారితే పాతాళానికి పడి చావవలసినదే. బాబా ఆ దారిన త్వరితంగా నిర్భయంగా వెళ్తున్నారు. అక్కడి చల్లని నిర్మల వాయువులు మండలివారు ఎంత అలసట చెందినా వారికి సేదదీర్చి బలము కలిగిస్తున్నాయి. బాబాను చూస్తే ఒక ఆధ్యాత్మిక కార్యభారాన్ని మోస్తూ ఉన్నట్లున్నారు. బాబా మండలితో యిలా నడుస్తూ నలదమయంతుల పేరుతో ఉన్న ఒక లోయవద్దకు వచ్చారు. బాబా అక్కడ మౌనిబావా

అను నతనిని కలిసారు. కొంతకాలంగా యీతడు నియమ నిబంధనలతో కూడిన జీవితం సాగిస్తున్నాడు. అతనితో కొందరు శిష్యులున్నారు. బాబా యొక్క ఉజ్వల కాంతిని చూస్తుంటే అతని కళ్ళు మిరుమిట్లు గొలుపుతున్నాయి. అతని శిష్యులు అతడు కళ్ళు మూసుకుంటుంటే ఆశ్చర్యపడ్డారు. బాబా మౌనిబావాను అతని శిష్యులనూ దీవించారు. మౌనిబావాకు ఆ కొండలలో చిన్న ఆశ్రమం ఉంది. మౌని ఆశ్రమం వద్ద నుంచి భోవాలికి దగ్గిర దారిన బాబా మండలివెళ్ళారు. అయితే యిది అపాయకరమైన దారి. దారి అంటే అది దారి కానేకాదు. ఎత్తయిన పర్వత శిఖరాల మీద చేతులు ఆనుకుంటూ ఎక్కి దిగిపోవాలి. వదనము నుండి స్వేదబిందువులు కారుతున్నా బాబా విశ్రమించలేదు. "విశ్వ దేహము నొప్పిపెట్టి నప్పుడు వేలకొలది శరీరాలు నొప్పితో బాధ పడుతాయి" అని బాబా అంటుంటే మండలి వారి శరీరాలలో నొప్పిని బాధను అనుభవించారు. వారందరికి దాహం వేస్తోంది. బాబా క్కూడా దాహం వేస్తోందన్నారు. బాబా నీరు త్రాగలేదు. మండలిని కూడా త్రాగవద్దన్నారు. వారికి ఆకలి వేస్తోంది. అప్పుడు మధ్యాహ్నం రెండు గంటలయినది. ఉదయాన్నే బస వదలి బయలుదేరారు. ఇంకా నాలుగుమైళ్ళు మైదానప్రదేశం ఉంది. ఆ తరువాత యింకొక కొండ దాటవలసి ఉంది. బాబాతో సమంగా వారంతా నడచి భోవాలి చేరుకున్నారు.

16వ తేదీన బాబా కథ్గోడామ్ చుట్టుప్రక్కల ఉన్న కొండలమీద సంచారం చేయాలనుకున్నారు. అక్కడ ఏదయినా అనువైన ప్రదేశంలో ఒక గంట ఏకాంతంగా గడపాలని బాబా ఉద్దేశ్యం. ఆ రోజున తెల్లవారు ఝామున 3 గంట లకు లేచారు. అవశిష్టాలన్నీ తెచ్చుకున్న తరువాత మండలితో 5 గంటలకు చీకటితో టీ త్రాగకుండానే బయలుదేరారు.

ఒక వంతెన దాటి పర్వతారోహణ ప్రారంభించారు. దారిలో ఎక్కడా నరసంచారం లేదు. అంతటా నిశ్శబ్దం ఆవరించి యున్నది. ఒక పర్వతం ఎక్కి దిగారు. ప్రక్కన ఉన్న యింకొక దాని మీద ఎక్కుట ప్రారంభించారు. సమ తలానికి వచ్చిన తరువాత బాబా చాలావడిగా నడుస్తున్నారు. శిష్యులు ఆయనతో సమానంగా వెళ్ళలేక పోతున్నారు. బాబాకు తగిన స్థలం దొరకలేదు. ఆ ప్రక్క నున్న లోయవైపు చూపిస్తూ బాబా "అక్కడ అదృశ్య ఆత్మలు నాకు స్వాగతం

యిస్తున్నారు.'' అనే అర్థం వచ్చినట్లు శిష్యులతో ఏదో చెప్పారు. బాబా పరు గెత్తడం ప్రారంభించారు. శిష్యులు కూడా పరుగెత్తుతున్నారు. ఏకాంతం ప్రధాన మయినా బాబా విగతదేహులయిన ఆత్మల పిలుపు నందుకుని త్వరగా వెళ్తున్నారు. ఒక గంట సేపటివరకు యిలా వడివడిగా వెళ్ళి యింకొక కొండ మీదను చుట్టి వెళ్ళి ఆ లోయదరికి వెళ్ళారు. బాబా పని అయిన తరువాత మరల రెండవ కొండకు వెనుకకు వచ్చారు. అక్కడ ఒక చోట ఏకాంతంగా కొంతసేపు ఉన్నారు. ఈ యుద్ధఫలితంగా మానవకోటి యొక్క విధిని నిర్ణయిస్తూ ఆధ్యాత్మిక బీజా లను బాబా యీ ఏకాంతమందు నాటారు. ఆయన కూర్చున్న స్థలమును కాకా, బైదుల్ చూపించారు.

ఒక కొండ చరియ ప్రక్కనఉన్న పల్లంలో ఒక అనువైన ప్రదేశం కను గొన్నారు. కొండ ఒక గోడగా ఆనుకొని నేలమీద బాబా కూర్చున్నారు. అక్కడ కూర్చున్నంత సేపు బాబా ముఖం జ్యోతిలా వెలిగింది. 'నాకు దూరంగా మీరు తలొక స్థలమునందు నన్ను చూడకుండా కూర్చోండి' అని ఆనలుగురు శిష్యులకు ఆజ్ఞ నిచ్చారు బాబా. ''నేను చప్పట్లు కొట్టినప్పుడు రండి. అంతవరకు యిటు చూడవద్దు'' అని బాబా ఆదేశించారు. బాబా చెప్పిన ప్రకారం 50 గజాల దూరమునకు పోయి ఒక్కొక్కరు మరల సమాన దూరంలో కూర్చున్నారు. ఉదయం 9–50 నిమిషాలకు బాబా ఏకాంతవాసం ప్రారంభమయినది. గం. 10–45 నిమిషాల వరకు బాబా అట్లే కూర్చున్నారు. ఆ తరువాత బాబా లేచారు. బాబా కూర్చున్న స్థలం నుండి కొంతమట్టిని సేకరించారు మండలి.

17వ తేదీ లగాయతు 3రోజులు బాబా ఉపవాసం జరిపారు. దానికి కారణం ఏమిటో మండలితో చెప్పలేదు. ఆధ్యాత్మిక కారణమే అయి ఉండాలి. చాలా పలుచని, పాలులేని, టీ తీసుకున్నారు బాబా రోజుకు మూడుసారులు, ఆ మూడు రోజుల ఉపవాసంలోనూ. ఆ రోజున బాబా ఒక కొండవద్ద ఏకాంతంగా ఒకగంట ఉండి వచ్చారు. ఆ రోజు మాత్రం ఉదర్‌మాన్ మస్తును రావద్దన్నారు. 19వ తేదీ అర్థరాత్రి బాబా కొంచెం మెత్తని అన్నం వెన్నతో తీసికొని ఉపవాసం విరమించారు.

బాబా మండలితో బయలుదేరి బరేలీ 22వ తేదీన చేరుకున్నారు. బరేలీలో హోటలుకు వెళ్తూ బాబా ఒక మస్తును సాంగత్యం చేసారు. ఆ మస్తు అందమయిన వాడే కానీ కఠినంగా కనిపించాడు. పైగా దగ్గరకు వెళ్ళిన వారిని దూషిస్తున్నాడు. ఒక అంగవస్త్రం మాత్రం కట్టుకున్నాడు. అధికారం కలవానిలా నడుస్తాడు. బాబా అతనిని స్పృశించలేదు. బాబాను ఆంతరికంగా సాంగత్యం చేసినట్లు మస్తుయొక్క చేష్టలు తెలిపాయి.

23వ తేదీ సాయంకాలం 6-15 గంటలకు బాబా మండలిని నజీబాబాదుకి తీసికొని వెళ్ళారు. ఆ పల్లె ప్రదేశంలో ఒక హోటలులో ఒక గదిలో భోజనం చేసారు. అక్కడ ఒక వైపు మాత్రమే శుభ్రంగా ఉంది. అయినా ఎలా ఉన్నా బాబా సర్దుకుపోతారు. 6 మైళ్ళ దూరంలో ఉన్న షాహన్‌పూరుకి రెండు టాంగాలు మాట్లాడారు. దారి వర్షపు నీటితో నిండి ఉంది. ఆ నీటిలోనే టాంగాలు వెళ్ళాయి. నీళ్ళలోనుంచి వెళ్తుంటే టాంగాలో కూర్చున్న సీట్లు నీటితో తడిసాయి. వారి బట్టల సంగతి చెప్పనే అక్కరలేదు. షాహన్‌పూర్ చేరిన తరువాత బాబా గ్రామంలో కొంతసేపు తిరిగి వచ్చారు. అక్కడ ఘనీబావా అన్న మస్తును బాబా సాంగత్యం చేసారు. ఆ రాత్రే బాబా మండలితో నజీబాబాద్ స్టేషన్‌కి వచ్చేసారు.

ఆ రాత్రి నజీబాబాద్ రైల్వేస్టేషన్ ప్లాట్‌ఫామ్ మీద గడిపి మరునాడు ఉదయం గ్రామంలో తిరుగుదామని బాబా మండలితో వెళ్ళారు. దారిలో రియాజుద్దీన్ అనే మస్తుని కలుసుకున్నారు బాబా. ఈ మస్తు వారిని తప్పించుకున్నాడు. అతనికి ఎవరినీ కలిసి మాట్లాడడం యిష్టంలేదు. అతని వెనుక బయలుదేరి ఆ గ్రామంలో చాలాదూరం తిరిగారు బాబా మండలితో. మస్తు ఆజానుబాహువు. చాలా వడిగా నడుస్తాడు. బాబా అతని సాంగత్యం చేసి ఆధ్యాత్మికంగా పై భూమికకు తీసుకుని వెళ్దామని ఉద్దేశించారు. అతడు ఊరంతా సందులు గొందులు తిప్పి తిప్పి వెళ్తుంటే బాబా యింక అతని యిష్టానికి వదిలేసారు.

రైలు చాలా క్రిక్కిరిసి ఉంది. తిరుగు ప్రయాణం చాలా కష్టం అయినది. బాబా మండలితో 26వ తేదీకి అజ్మీరు వచ్చారు. కింగ్ ఎడ్వర్డ్ మెమోరియల్ రెస్టుహౌస్‌లో బాబా విశ్రాంతి తీసుకున్నారు. మండలి వేరొక గదిలో దిగారు.

అజ్మీరులో ఒక్క అరగంట మాత్రమే ఏకాంతంగా గడుపుటకే బాబా అజ్మీర్ వచ్చారు. అందులకు వేరే యింకొక కారణం ఉంది. ప్రపంచానికి ఆధ్యాత్మిక లాభం కలిగే శక్తులను హిమాలయాలలో నిర్ణయించినట్లు యిప్పుడు వాటిని తగిన మార్గాలలో సరఫరా చేయడమే బాబా పని. యుద్ధంలో పాల్గొంటున్న ఇరుపక్షాల వారూ యీ ఆధ్యాత్మిక కార్యం వలన లాభం పొందారు. ఈ యుద్ధం వలన ప్రజలకు కలిగే బాధలను చివరికి వారికి మంచిగా పరిణమించుటకు బాబా ప్రజల బాధలను ఆధ్యాత్మికంగా మలిచారు. ఈ సంగతి ఒక అరగంట సేపటి ఏకాంతవాసంలో నిర్వహించినట్లు తరువాత బాబా చెప్పిన దానినిబట్టి తెలిసింది.

27వ తేదీన అజ్మీరు నుండి 12 మైళ్ళ దూరంలో ఉన్న పుష్కర క్షేత్రానికి బాబా మండలితో వెళ్ళారు. ప్రసిద్ధి పొందిన పుష్కరకాసారం ప్రక్కన 'మహల్' అనే పాత భవనంపైన గుండ్రటి (డోము) కప్పు ఉన్న గదిని వెదకి పట్టుకున్నారు. అందులో గాలి ఎండ మొదలయినవి ఉండవు. చెట్ల ఆకుల గలగలలు, గాలి వీచే ధ్వనులు వీటివలన ఏ విధమయిన భంగము లేకుండా బాబా ఏ శబ్దము లేని ప్రశాంతతలో కొంతసేపు గడిపారు. ఆ సమయంలో బయట నలుగురు శిష్యులు కావలి కాస్తున్నారు. ఏకాంతము నుండి బాబా ఆధ్యాత్మికంగా నిర్మలమైన మోముతో అసాధారణమైన ఆనందంతో బయటకు వచ్చారు. బాబా తటాకము నుండి తిరిగి వచ్చినప్పుడు దేవాలయము నుండి వచ్చే గురుపూర్ణిమ ఊరేగింపు కనుగొన్నారు. బాబా తమ ఏకాంతవాసం ముగియడం యీ ఊరేగింపు రావటం రెండూ ఏకకాలమందు జరుగుటలో విశిష్టత ఉందని శిష్యులతో అన్నారు. అజ్మీరు నుండి తిరిగి బాబా డెహ్రాడూన్‌కి వెళ్ళిపోయారు. బాబా డెహ్రాడూన్‌లో కొంతకాలమున్న తరువాత సెప్టెంబరు 10వ తేదీన లోనవలా చేరుకున్నారు.

ప్రపంచంలో యిప్పుడు ఉన్న దుఃఖపరిస్థితులను బట్టి బాబా యొక్క ఏకాంతవాసం అంతం కావాలని చాలా కాలానికి ఆయన దర్శనం లభించాలనీ ఆయన శిష్యులేగాక అనేకమంది భక్తులు కూడా కోరుకుంటున్నారు. వారు బాబా వారి దర్శనం చేసుకుని రెండు సంవత్సరాలయినది. అందుచేతనే ఎప్పుడు బాబా దివ్య సుందర వదనారవిందము సందర్శిస్తామా అని అందరూ ఉవ్విళ్ళూరుతున్నారు.

ఈ సంవత్సరంలోనే బ్రిటిషు ప్రభుత్వం వారు వారి తరఫున సర్‌స్టాఫర్డ్ క్రిప్స్ అను నతనిని ఇండియాకు పంపించి యుద్ధానంతరం భారత ప్రజలకు స్వాతంత్ర్యం ప్రధానం చేస్తామని కబురు చేసారు. యుద్ధంలో వారికి భారతీయులు అన్నివిధముల సహాయం చేయాలని దీనికి అర్ధం. దేశంలోని రాజకీయ నాయకులందరికీ ఆ సందర్భంలో 'కర్మ, అకర్మ' 'సృజనాత్మకమయిన నాయకత్వం అవసరం' అనే విషయాల మీద బాబా రెండు సందేశాలు పంపించారు.

## లోనవలా మకాం (LONAVALA)

డెహ్రాడూన్ కంటే లోనవలా వాతావరణం బాబాకు ఆధ్యాత్మిక కార్యాలను కొనసాగించడానికి ఎక్కువ అనువుగా ఉంది. శారీరకంగా కూడా ఎక్కువ ఆరోగ్యకరంగా ఉంది.

వంట ఏర్పాట్లు చేసేవరకూ కె. యి. అఫ్సారీ బాబాకు మండలి అందరికీ భోజనాల బాధ్యత వహించాడు. అందరికీ తృప్తికరంగానే భోజనాలు పెట్టాడు. స్త్రీలు ఉండడానికి ఎక్కువ సౌకర్యంగా ఉన్న వసతి దొరకగానే బాబా ప్రాస్పెక్ట్ లాడ్జి అనే బంగళాకు బస మార్చారు. నలుగురు పురుష మండలి కూడా వారితో ఉండడానికి అంగీకరించారు బాబా. బాబా ఎక్కడికయినా త్వరగా వెళ్ళిరావడానికి వీరిని కూడా తీసుకుని వెళ్ళేందుకు వీలుగా ఉంది. గ్లెన్ వ్యూ అనే బంగళాలో 15 రోజులున్నారు. అక్కడ బాబాకు ఏకాంతవాసం బాగా సాగింది.

ఇది వరకు తాము చేసిన ఆధ్యాత్మికపు పనియొక్క ఫలితాలు భౌతికంగా ఎంతవరకు పరిణమించాయో తెల్లవారగానే వార్తాపత్రికల వలన తెలుస్తూ ఉండేది. కానీ బాబాకు యివి అవసరం కాకపోయినా బాబా శిష్యులు పత్రికలు చూసి బాబాకు నివేదించేవారు.

బాబా లోనవలాలో ఉన్నప్పుడు కళగోదావ్ నుండి ఉదర్‌మాన్‌మస్తాన్ అనే మస్తును సెప్టెంబరు 12వ తేదీన తాము ఉన్న చోటుకి పిలిపించుకున్నారు. కానీ అతడు అక్కడ జిగట విరేచనాలతో బాధపడుతుంటే బాబా చికిత్సకోసం అతనిని మెహెరాబాద్‌కి పంపించారు. కానీ ఎంత శ్రద్ధతో చికిత్స చేసినా

అతనికి గుణం కనిపించకపోయేసరికి డెహ్రాడూన్ వద్ద కత్ గోడావ్‌కి అతనిని పంపించి వేసారు బాబా. ఛగన్ అతనిని తీసుకువెళ్ళాడు. పాపం రైలు ప్రయాణం చేస్తుంటేనే దారిలో జబ్బు ఎక్కువై బదావున్ అనే స్టేషన్‌లో అతని మరణం సంభవించింది. మరణాత్పూర్వం అవతారుని దర్శనం, సాంగత్యం చేసిన యీ మస్తు చాలా భాగ్యశాలి.

1942 సెప్టెంబరు 22వ తేదీన ఉరన్‌లో వృద్ధుడయిన ఒక ఉపదేశం పొందిన యాత్రికుని బాబా సాంగత్యం చేసారు. అతని పేరు గంగాగిరి మహరాజ్ ఆ ప్రాంతంలో ప్రజలు అతనిని బాగా ఎరుగుదురు. అతనికి అనేక మంది శిష్యులున్న ఒక ఆశ్రమం ఉంది.

ఆరోజునే మొహిఉద్దీన్‌బాబా (నంగాబాబా) అనే ఆరవభూమికలోని ఒక ఉన్నతుడయిన మస్తుతో బాబా సాంగత్యం చేసారు. ఇతడు ఉరన్‌లోనే కాక బొంబాయిలో కూడా ప్రసిద్ధుడు. ఇతడు శతవృద్ధుడయిన దిగంబరుడు. ఈ మస్తు మజ్జూబ్‌వంటి స్థితిలో ఉన్నాడు. అతడు అతని చిన్నగుడిసెలో గాని రోడ్డు ప్రక్కనగాని ఎక్కడో కూర్చుని ఉంటాడు. బాబా అతనిని ఒక స్మశానభూమిలో చూసి అక్కడే అతనితో సాంగత్యం చేసారు.

అక్టోబరు 5వ తేదీనుంచి బాబా గ్లెన్‌వ్యూలో ఉండడం ప్రారంభించారు. అప్పుడు పచ్చి మంచినీళ్ళు మాత్రమే తీసుకుంటూ ఉపవాసం చేసేవారు. తరువాత దైనందిన కార్యక్రమం యీ విధంగా ఉండేది. ఉదయం 6 గంటలకు నిద్రలేవడం, 7 గంటలకు స్నానం పూర్తిచేయడం, 8 గంటలకు టీ తీసుకోవడం 8-30 నుంచి 11–30 వరకు ఒక గదిలో ఏకాంతంగా కూర్చోవడం, మరల సాయంకాలం 4 గంటల నుంచి 5 వరకు ఏకాంతం పాటించడమూను. భోజనమునకు రెండు సారులు పప్పుమాత్రం తిని ఒక్కమారు బత్తాయిపండ్ల రసం తీసుకునేవారు. కాకా పప్పు ఉడికించి బాబాకు పెట్టేవాడు.అలాగే పళ్ళరసం తీసి యిచ్చేవాడు. ఈ ప్రయాణాలలోను, ఏకాంతవాసాలలోను, ఉపవాసాలలోను బాబాకు ఎప్పుడు ఏది కావాలో అది యివ్వడానికి కాకాకు తగిన సామర్థ్యము ఉండేవి.

బైదుల్‌ను బాబా కథ్‌గోదామ్ పంపించి అక్కడ సాంగత్యం చేసిన 'ఒక మస్తును రప్పించారు. అలాగే మెహెరాబాద్ నుంచి మహమ్మదు మస్తును కూడా రప్పించారు. మహమ్మదును సిద్ధు తీసికొని వచ్చి అతని సంరక్షణ చేస్తూ ఉండే వాడు. 9వ తేదీన బాబా ఆయన సన్నిహిత శిష్యులకు యీ దిగువ లేఖను సంతకం చేసి తిరిగి పంపమని పంపించారు.

"15 నవంబరు 1942 నుంచి 15 డిసెంబరు 1942 వరకు యీ నెల రోజులలోను నా మండలిలోని సన్నిహిత సభ్యులు ప్రతి యొక్కరు నేను రమ్మనగానే నా వద్దకు వచ్చి ఉండడానికి సిద్ధంగా ఉండాలి. నేను సాధారణంగా అందరికీ సామూహికంగాను, వ్యక్తిగతంగాను ప్రతివారికి ప్రత్యేకంగా చెప్పినట్లు చేస్తూ ప్రపంచాన్ని ఆధ్యాత్మికంగా త్రిప్పడానికి నేను చేయబోయే పనిలో పాల్గొంటూ నా విశ్వకార్యంలో నాకు సహాయం చేయాలి.''

విష్ణు ప్రతిరోజు బాబా ఆజ్ఞప్రకారం సాయంకాలం 5 గంటలకు గ్లెన్‌వ్యూకు వచ్చి లెక్కలను బాబాకు చూపించేవాడు. తరువాత వీలయినపుడల్లా వచ్చి భోజనము, టీ, యితర విషయాల గురించి కనుక్కుంటూ ఉండేవాడు. కావలసిన పదార్ధాలను మండలి ఉండే బంగళా నుంచి గ్లెన్‌వ్యూకి తెచ్చి పెడు తూండేవాడు. 12వ తేదీన యింకొక సాధారణ లేఖను టైపు చేయించి ఇండియా లోని అందరి భక్తులకు బాబా పంపించారు.

'మీ౦ అందరికి నేను చెప్పినట్లుగా, మీకు నేను వేరే వ్యక్తిగతంగా ప్రత్యేకంగా చెప్పినట్లుగా డిశెంబరు మాసంలో నేను రమ్మనగా వచ్చి నా యొక్క విశ్వ ఆధ్యాత్మిక కార్యంలో పాల్గొని నాకు సహాయం చేయడానికి సిద్ధంగా ఉన్నారా? అందులకు మీరు యిష్టపడుతున్నట్లయితే నా పిలుపు అందగానే రావ డానికి మీరు స్వేచ్ఛగా ఉన్నట్లయితే దీనిమీద సంతకం చేసి తిరిగి నాకు పంపించండి. ఇతరులు కూడా దీనికి యిష్టంగా ఉన్నవారు సంతకం చేయవచ్చు''.

13వ తేదీన రంజా కొన్ని నిమిషాలు బాబాతో సంభాషించడానికి అనుమతి పొందాడు. బాబా పని సమర్ధవంతంగా చేయాలంటే ఏకాంతవాస సమయాలలో బాబాకు దగ్గరగా కాకుండా వేరే ఉండి ఫలవంతంగా పని చేయగలిగి యుండాలి.

ఆ రోజులలో చాన్జీబాబా చరిత్రను గుజరాతీ భాషలో పాపాతో కలిసి వ్రాస్తున్నాడు. అందు నిమిత్తము బాబా ఏకాంతవాస సమయాలు మధ్య 16వ తేదీని బాబాను దర్శించి సంభాషించడానికి చాన్జీబాబా అనుమతి తీసుకుని ఆయనతో మాట్లాడి వెళ్ళాడు.

కొల్హాపూరులో జి. వై. డిక్సిట్ (దీక్షిత్) వగైరాలు కృషి చేసి పురపాలక సంఘంవద్ద పాఠశాల నెలకొల్పే నిమిత్తం ఒక భవనం సంపాదించారు. ఆ పాఠశాల కొరకు కొంతధనం కూడా పురపాలక సంఘం నుంచి పుచ్చుకున్నారు. ఆ పాఠశాలకు మాంటిస్సోరీస్కూలు అని పేరు పెట్టారు. కొల్హాపూరులో యీ పాఠశాల ప్రారంభోత్సవానికి బాబా ఒక సందేశాన్నిచ్చి ఆదీనీ తీసికొని వెళ్ళి అక్కడ చదవమని పంపించారు. ఆ సందేశపాఠము యీ దిగువ యిస్తున్నాము—

''సాంస్కృతికంగా నిస్వార్థసేవ చేయవచ్చు. మాంటిస్సోరీ స్కూలు చేసేసేవ అభ్యాస ప్రాప్తమైన విలువ కలిగి ఉంది. వికసించే స్థితిలో పిల్లలయొక్క ప్రకృతిని అది ప్రభావితం చేస్తుంది. ఏ బాదరబందీలేని ఆ లేతహృదయాలు దివ్యమైన గుణాలను వారి ఆనందపూరితమయిన అమాయకత్వం లోను నిరంతరం వారి ఆటపాటలలోను ప్రతిబింబిస్తాయి. దాని వలన బాలుర రూపంలోని భగవంతుని ద్వారా మానవులలోని దివ్యత్వాన్ని ఎంతవరకు ఉపయోగించగలరో తెలుస్తుంది. కొంచెం ఓర్పు, కొద్దిగా కరుణ, అనంతమయిన అవగాహన, మధురమైన ప్రేమ వీటివలననే ఉపాధ్యాయులు తాము పొందిన నిర్మలమైన మానవసేవ యొక్క ఉపయోగానికి ప్రతిగా ఏదయినా యివ్వగలరు. ఈ పాఠశాలను రూపొందించుటకు బాధ్యులయిన వారందరికిని, పాఠశాలలో హాజరయిన పిల్లలకును నా ఆశీర్వాదాలు— మెహెర్‌బాబా.''

అక్టోబరు (1942) 20వ తేదీన మండలిని ఎక్కడివారి నక్కడికి పంపించేసి బాబా ఒక వారం రోజులు దక్షిణభారత పర్యటనకై బయలుదేరారు. ఇప్పుడు లోనవలాలో బాబా మకాం యింకా డిశెంబరు (1942) 15వ తేదీ వరకూ సాగవచ్చును. బాబా లోనవలాలో మకాం చేస్తుండగా బొంబాయి నుంచి కాకా 'అరబ్‌బాబా' అనే మస్తును లోనవలా తీసుకువచ్చాడు. బాబా అతనితో ఒక గంట సాంగత్యం చేసారు. అరబ్‌బాబా బొంబాయిలో కీలాబాలో ఉంటాడు. అతనికప్పుడు

40 సంవత్సరాల వయస్సుండెను. జుట్టు పొడవుగా పెంచుకున్నాడు. అతనికి గడ్డము కూడా ఉండెను. ఈ మస్తు పొడుగయిన ఒక కఫ్నీ ధరించాడు. కానీ ఆ మస్తు అపరిశుభ్రంగా ఉండెను. బాబా అతనికి భోజనం పెట్టారు. తరువాత అతడు చెప్పకుండా పారిపోయాడు. మళ్ళీ కొలాబా చేరుకుని ఉంటాడని భావించబడినది.

లోనవలా అనే యీ ఊరు పూనాకి బొంబాయికి మధ్యను ఉంది. అక్కడ ప్రకృతి సౌందర్యం ఉట్టిపడుతూ అతి రమణీయంగా ఉంటుంది. బాబాకి మామయ్య ఒకడు లోనవలాలో ఒక టీ దుకాణం నడుపుతున్నాడు. ఆ దుకాణం వద్దకు ఒక తాత రోజూ సాయంత్రం వచ్చేవాడు. బాబా ఆయన శిష్యులు ఆదుకాణం దగ్గరకు ఆ సమయానికి చేరేవారు. ఆ తాత ఎన్నో కథలు చెప్పేవాడు. వీరందరికీ అతడు చెప్పే కథలు వినడంలో చాలా ఆసక్తి ఉండేది. కథ చెప్పే సమయంలో అతనికి వారు టీ, చుట్టలు యిప్పిస్తూ ఉండేవారు. ఆ తాతకి గూని కూడా ఉండేది. వీరేగాక, ఆ టీ అంగడికి వచ్చినవారు కూడా ఆ గూని తాత చుట్టూ చేరి ఆ తాత చెప్పే కథలు వింటూ వుండేవారు. ఒకరాత్రి అతడు చెప్పే కథలు వింటూ కూర్చుని ఆ సాహసగాథలలో ఆ అల్లిక కథలలో లీనమయిపోయి సమయం కూడా తెలియలేదు బాబా శిష్యులకు. ఆ రోజు రాత్రి ఎంత ప్రొద్దుపోయినా ఆ కథ ముగింపుకాలేదు. ఆ తాత కొంతవరకు కథ చెప్పి మరునాటికి వాయిదా వేసాడు. ఈ విధంగా ఒక కథ పూర్తయేసరికి ఒక వారం రోజులయ్యేది. ఇలాగే బాబావారి శిష్యులను భక్తులను వారికి తెలిసిన కథలను చెప్పమని వింటూ ఉండేవారు.

1942 అక్టోబరు మాసంలో లోనవలా నుంచి కాకాను బొంబాయి పంపించి కొందరు మస్తులను తీసుకొని రమ్మని బాబా చెప్పారు. అప్పుడు బాబా వద్దకి లోనవలా రమ్మని కాకాపఠాన్ మస్తును అడిగాడు. అందుకతడు— "నీ ఆత్మ నా ఆత్మ బాబా వద్దనే ఉన్నాయి. ఇంక అక్కడికెందుకు రావాలి?" అన్నాడు. కాకాకి ఒక బత్తాయి పండు యిస్తూ పఠాన్‌మస్తు యిలా అన్నాడు— "ప్రపంచ మొత్తానికి తాళంచెవి ఆయన చేతిలో ఉంది. రష్యా, జర్మనీ మొదలయిన అన్ని దేశములు ఆయన చెప్పినట్లు చేస్తాయి" బాబా యొక్క సంగతి యితడు బాగా తెలుసుకున్నాడు గనుక యితనితో సాంగత్యం చేసే అవసరం బాబాకు లేక పోయింది.

అప్పుడు కొలాబా (బొంబాయి) నుంచి అరబ్‌బాబా అనే మంచి మస్తును లోనవలా రప్పించారు. కాకా వెళ్ళి యీ మస్తును తీసుకువచ్చాడు. అరబ్‌బాబాకి 40 ఏళ్ళ వయసుంటుంది. పొడుగయిన తల వెంట్రుకలు గడ్డముతో యితడు చాలా అపరిశుభ్రంగా ఉన్నాడు. పొడుగయిన ఒక కఫ్నీ ధరించాడు. బాబా యితనికి భోజనం పెట్టారు. తరువాత కొంతసేపట్లో లోనవలా నుంచి యితడు పారి పోయాడు. వెతికినాకనబడలేదు. మళ్ళీ బొంబాయి వెళ్ళిపోయిఉంటాడని అనుకున్నారు బాబా మండలి.

లోనవలా మకాం లోనే మహార్‌మస్తు అనే ఒక షాకీ వానిని బాబా సాంగత్యం చేసారు. మధ్యవయస్కుడయిన యీ మస్తు మౌనంగా ఉంటాడు. భిక్ష మెత్తడు. డబ్బు యిస్తే పుచ్చుకోడు. చిత్తుకాగితం ముక్కలు ఏరి పోగు చేస్తుంటాడు. ఆ నెలలోనే మస్తాన్ అనే యువకుని కలిసారు బాబా. ఇతడు డబ్బు అడిగి పుచ్చుకొని ఎవరికయినా యిచ్చేస్తుండేవాడు. ఈ యువకుడు తరు వాత కాలం చేసాడు. అక్టోబరు 8వ తేదీన మెహెరాబాద్ నుంచి బాబా మహ మ్మద్ మస్తుని లోనవలా రప్పించి అక్కడ కొన్ని వారాలుంచుకున్నారు. మామూ లుగా అతనితో ప్రతిరోజూ బాబా పనిచేసేవారు. ఆ మకాంలో బాబా సెప్టెంబరు 12 (1942) నుంచి డిశెంబరు (1942) 22వ తేదీ వరకు ఉన్నారు.

తరువాత బాబా మస్తు సాంగత్యం కోసం దక్షిణ దేశానికి వెళ్ళారు. గుంతకల్ మీదుగా ప్రయాణం చేస్తూ బాబా 1942 అక్టోబరులో ఒక మస్తును కలుసుకున్నారు. 22వ తేదీన రెండవమారు తంజావూరులో అబ్దుల్ ఖాదర్‌జిలానీ అనే ఆరవ భూమికలోని మస్తును బాబా సాంగత్యం చేసారు.

అక్టోబరు (1942) 23వ తేదీన బాబా నాగపట్నం వెళ్ళి చట్టిబాబాను సాంగత్యం చేసారు. ఈ మస్తు బాబా యొక్క అయిదుగురు యిష్టులలో ఒకడు. ఇతని గురించి యిదివరకే ముచ్చటించినాము. ఇతడు 6వ భూమికలోని ఉన్నతు డయిన మస్తు. ఎంతోమంది మస్తులు 6వ భూమికలోని వారున్నా చట్టిబాబాయే బాబా యొక్క అధ్యాత్మికమయిన పనికి తగినట్లున్నాడు. అందుచేతనే బాబా ఎక్కడికి వెళ్తే అక్కడికి అతనిని కూడా తీసికొని వెళ్ళేవారు. ఇతడు సంపూర్ణ

డయిన జమాలీమస్తు. అతనికి కొన్ని జలాలీ లక్షణాలు కూడా ఉన్నాయి. అంత కాలం బాబాతో గడిపిన అత్యున్నత మస్తులలో యితడే ప్రధానుడు.

1942 డిశెంబరు 6వ తేదీన ఇన్సాన్ ఆలీబాబా అనే మంచి మస్తును "లుత్రా"లో బాబా సాంగత్యం చేసారు. మోటార్లు వెళ్ళే పెద్దరోడ్డుకి యీ గ్రామం 5 మైళ్ళ దూరం ఉంటుంది. ఈ మస్తు పొడుగుగా బక్క పలచగా ఉండేవాడు. బాబా అతనితో ఒక గంట కూర్చున్నారు. ఇతడు మంచి మస్తు అయినా బాబా పనికి తగినవాడుగా లేడని బాబా అన్నారు. బాబా యితనితో సాంగత్యం చేయడం కోసం చీకటిలో అతని గ్రామానికి రానూపోనూ పదిమైళ్ళు నడిచారు. దక్షిణ భారతదేశంలో పర్యటన ముగించుకుని లోనవలా మకాం నుంచి బాబా మెహెరాబాద్ వచ్చేసారు.

డిశెంబరు (1942) మాసంలో ఒకనాడు దిగువ మెహెరాబాద్‌లో ధుని వెలిగించి బాబా మండలితో యిలా అన్నారు— "నా వద్ద నుంచి నేను యివ్వబోయేది మీరు స్వీకరించే భాగ్యం మీకు ఉంటే దానికి మీరు అర్హులు కాకపోయినా అది మీకు ఎలాగూ ప్రాప్తిస్తుంది." దీనిని బట్టిమనకు ప్రాప్తం ఉండాలని బాబా స్పష్టీకరించారు. అయితే మనకు ప్రాప్తం ఉండబట్టే మన విధి మనలను బాబా పరిధిలోనికి తీసుకు వచ్చిందని అనుకోక తప్పదు. బాబాను దర్శించిన వారు, వారిని దర్శించి వారి ఆశీస్సులను పొందిన వారు ధన్యులు. ఆయన కొంగును పట్టువిడువకుండా గట్టిగా పట్టుకుని వారి హృదయాలలోని ప్రేమను ప్రజ్వలింప చేసుకుని బాబా అనుగ్రహానికి పాత్రులయిన వారు ధన్యాతిధన్యులు.

1942వ సంవత్సరం డిశెంబరు 27వ తేదీన బాబా ఆయన యొక్క శిష్యులు ఆయన భక్తులు అనేకులు మెహెరాబాద్‌లో సమావేశమయినారు. ఆ సందర్భంలో ఆ మహాసభలో బాబా ఒక సందేశం యిచ్చారు. అది ఆదిషెరియార్జీ ఇరానీ (బాబా కడసారి తమ్ముడు) చేత చదివించారు.

బాబా సందేశము :— "యుద్ధం అవసరమయిన చెరుపు. అది భగవంతుని నిర్ణయం. దానివలన మానవులు ఉన్నత విలువలు తెలుసుకుంటారు. యుద్ధం కలుగచేసిన పాఠాలవలన మానవాళి లాభం పొందకపోతే మానవాళి వృధాగా బాధపడి

నట్లే. నిస్వార్థమయిన ప్రయోజనం కోసం మామూలు మానవుడు కూడా గొప్ప త్యాగాలు చేయగలడని యీ యుద్ధం మనకు బోధిస్తుంది. అంతేగాక, ప్రాపంచిక ఐశ్వర్యము, ఆస్తులు, పదవి, కీర్తి, కుటుంబ సౌభాగ్యము, భూమి మీద ఉండే యీ జీవితపు రీతి – యివన్నీ అశాశ్వతాలు; వీటికి స్థిరమయిన విలువలు లేవు. సత్య స్వరూపుడయిన భగవంతుని పొందగలిగే మార్గాన్ని యీ యుద్ధం నేర్పే పాఠాల వలన తెలుసుకోగలరు. అవి మానవుని సత్యము, శాశ్వత విలువలు తెలుసుకో గలిగిన ఒక క్రొత్త జీవితము లోనికి ప్రవేశ పెట్టగలవు. ప్రజలు వారి దేశం కోసం, రాజకీయ సిద్ధాంతాలకోసం అపరిమితమైన త్యాగాలు చేసి చెప్పరాని బాధలు పడుతున్నారు. భగవంతునికోసం సత్యంకోసం అంతటి త్యాగాలు చేయగలరు. అంతటి బాధలు సహించగలరు. సత్యజీవితం మానవుడు జీవించాలని అన్ని మతాలు చాటుతున్నాయి. మతము పేరుతో దెబ్బలాడుకొనుట వట్టి అవివేకమే కాగలదు. జీవితమంతా ఒకటేనని, భగవంతుడే నిజమని, భగవంతుడే కావలసిన వాడనీ, మానవులందరూ ఒక నూతన దృక్పథం తెచ్చుకోవలసిన సమయం వచ్చింది. భగవంతునికై జీవించాలి. ఆయనకోసమే మరణించాలి. మిగిలినదంతా మాయాన్వితమైన వృథా ప్రయత్నమే.

1942వ సంవత్సరంలో ఒక రోజున బాబా అవతార పురుషుని గురించి ప్రస్తావించి యిలా చెప్పారు—

"దైవ మానవుడు తన విశ్వ కార్యాచరణలో సరిపుచ్చుకోవడం అనే గుణాన్ని అనంతంగా కలిగి ఉంటాడు. దివ్యత్వానికి మార్గం చూపడానికి దైవమానవుడు తరుచుగా భగవంతుని యొక్క భక్తునిగా నటించవలసి వస్తూ ఉండవచ్చును. ఆయన భగవంతునితో సంపూర్ణ ఏకత్వం పొంది ఉన్నప్పటికీ యితరులకు మార్గం అవగాహన అవడానికి అట్లానర్చును."

అండమాన్ దీవులలో పాశ్చాత్య ప్రేమికులు ఒక కుటుంబం ఉండేవారు. 1942వ సంవత్సరములో బాబా తన ప్రేమికురాలికి ఒక టెలిగ్రాం యిచ్చారు— "అండమాన్‌లో కొంతకాలం గడుపుదామని ఉంది" అని. ఆమె అక్కడ ఒక ఏకాంత ప్రదేశంలో బాబాకోసం ఒక బంగళా అద్దెకు తీసుకుంది. పోర్ట్‌బ్లెయి

ర్‌లో ఆ బంగళా ఉంది. అక్కడ బాబా ప్రజలతో తిరగనూ వచ్చును. ఆయన ఏకాంతంగానూ ఉండవచ్చును. కానీ అది జరుగలేదు. ఆగ్నేయ ఆసియాలో యుద్ధం ప్రారంభం అయినందున బ్రిటిషువారంతా ఇండియాకు వెళ్ళిపోవాలని ఆదేశాలు వచ్చాయి. అండమాన్‌దీవులు జపాన్‌వారు దెబ్బతీయడానికి ఏ అడ్డమూ లేదు. అందుచేత ఆమె బాబాకు యీ సంగతి ఉత్తరంలో వ్రాసింది. ఇది అండ మాన్ వెళ్ళడానికి అనువయిన సమయం కాదని బాబా అక్కడికి వెళ్ళడం మాను కున్నారు. అండమాన్‌లో ఉన్న బ్రిటిషువారిని ఖైదీలుగా పట్టుకుని జపాన్‌వారు వారిని చంగీసింగపూరులో ఉంచారు.

ఆ 1942వ సంవత్సరం లోనే ఒకమారు బాబా ముగ్గురు మండలితో ఒక మూడవ తరగతి రైలుపెట్టెలో ప్రయాణం చేస్తున్నారు. ఆ రైలుపెట్టె చాలా క్రిక్కిరిసి ఉంది. మెట్లమీదకూడా ఇనుప కడ్డీలు పట్టుకుని ప్రయాణీకులు వ్రేళ్ళాడుతున్నారు. లోపల ఎక్కడా చోటులేదు సరికదా మనిషి ఎక్కేందుకూ వీలులేదు, దిగేందుకూ వీలులేదు. ఎంతకయినా తెగించిన వాళ్ళు కిటికీల గుండా లోపలికి దూరాలి అంతే. అప్పటికి మస్తు అన్వేషణలో అనేక ప్రయాణాలు చేసిన బాబా అలసిపోయారు. ఒకటి రెండు స్టేషన్లు దాటిన తరువాత ఒక ముసలి మహమ్మదీయుడు అయిదేళ్ళ మనుమడిని కిటికీ గుండా లోపలికి తీసుకోమని లోపలివారిని బ్రతిమాలుతూ ఆ పిల్లవాణ్ణి ఎత్తి చూపిస్తున్నాడు. ఆ బాలుణ్ణి లోపలున్నవారు త్రోసేస్తున్నారు గానీ లోపలికి తీసుకోవడం లేదు. గార్డు యీల వేస్తున్నాడు. ఈ ముసలివాడు కంగారుగా కుర్రవాడిని ఎత్తి లోపలకు అందివ్వబోతూ "అల్లా కోసమయినా పిల్లవాడిని లోపలికి తీసుకోండి బాబూ" అని ప్రాధేయపడ్డాడు. అది చూసి బాబా, ఆ పిల్లవానిని లోపలికి తీసుకోమని తమ మండలితో అన్నారు. అందులో ఉన్న యితర ప్రయాణీకులు వద్దని గోలపెడు తున్నా వాళ్ళు ఆ బాలుని అందుకున్నారు. బండి కదిలింది. ముసలివాడు పరుగున ప్రక్కపెట్టెలో మెట్లమీద నిలబడడానికి చోటు చూసుకుని ఎక్కాడు. అయినా ప్రతిస్టేషనులోనూ బండి ఆగినప్పుడల్లా ఆ ముసలివాడు పిల్లవానిని చూడడానికి యీ పెట్టె వద్దకు వస్తూనే ఉన్నాడు. ఆ పిల్లవాడు బాబా ప్రక్కనే కూరుచ్చు న్నాడు. మాటిమాటికీ ఆ వృద్ధుడు యిలా రావడం వెళ్ళడం అతని అవస్థచూసి పాపం! అతనిని కూడా ఎక్కించుకోండి అన్నారు బాబా. గడ్డం ఉన్న ముసలి వాళ్ళంటే బాబాకి చెప్పలేని ఆప్యాయత ఉంది. తోటి ప్రయాణీకులు వద్దంటున్నా

ఆ ముసలి వానిని కూడా యిందులో ఎక్కించుకున్నారు బాబా మండలి. బాబా తాము కూర్చున్న ప్రక్కనే అతనికి చోటు చూపించగా ఎలాగో ఒకలాగ అక్కడ యిరికాడు. ఆ పిల్లవానిని తీసి అతడు తన ఒడిలో కూర్చో పెట్టుకున్నాడు. ఆ వృద్ధుని మనసు యిప్పటికి కుదుటపడింది.

ఈ ప్రయాణంలో బాబా ఎవరో తెలియకుండా ఎవరూ ఆయనని గుర్తు పట్టడానికి వీలు లేకుండా అజ్ఞాతంగా ఉండేలా ప్రయాణం చేస్తున్నారు. మామూలు బట్టలు కట్టుకొని కాశ్మీర్ బొచ్చుటోపీ పెట్టుకొని కళ్ళకు నల్ల అద్దాలు ధరించి ఉన్నారు. మండలి ముసలివానితో మాట్లాడుతూంటే అతడు గుల్బర్గానుంచి వస్తున్నాడని తేలింది. గుల్బర్గాలో సుప్రసిద్ధుడయిన హజ్రత్ బందా నవాజ్ అనే సద్గురువు యొక్క దర్గా ఉంది. మండలి అతనితో యిలా సంభాషణ చేసారు—

మండలిలో ఒకరు : ఏమయ్యా! మీ ప్రాంతాలలో ఎవరయినా దేవుని ప్రేమలో నిమగ్నులయిన మస్తులున్నారా? మేము అటువంటి వారి కోసం అన్వేషిస్తున్నాము.

ముసలివాడు : మీది ఏ ఊరు?

మం : అహమద్‌నగర్

ము : మీరు మెహెర్‌బాబాను గురించి విన్నారా ?

మం : విన్నాము.

ము : (కొంచెం కోపంతో) మీరు పార్శీవారై ఉండి అహమద్‌నగర్ కాపురస్తులై ఉండి మెహెర్‌బాబాను గురించి వినియుండి యింకా దైవోన్మత్తులగు వారి గురించి అడుగుతారెందుకు? మెహెర్‌బాబా అంటే ఎవరో తెలుసునా? ఆయన దేవుణ్ణి మీకు చూపించగలడు. ఆయన ప్రభావం మీరు తెలుసుకోనందుకు సిగ్గుపడాలి. (కొన్నిక్షణాలయిన తరువాత) మీ మధ్యనే మీ నగరంలోనే ఉన్న ప్రభువుని మీరు తెలుసుకోలేక పోయారు. నేను గుల్బార్గాలో ఉన్నా ఆ మహాపురుషుణ్ణి దర్శనం చేసుకుందామని రెండు సార్లు వెళ్ళాను. ఒక మారు వారు ఏకాంతవాసంలో ఉన్నారు. ఇంకొకమారు దేశాంతరం వెళ్ళారు. నేను చచ్చిపోయే మళ్ళీ వెళ్ళి వారి దర్శనంచేసి తీరుతాను. ఈ మాటు నా కుటుంబంతోనే

వెళ్దామనుకుంటున్నాను. ఇలా మాట్లాడుతూ ఉంటే అతడు దిగవలసిన స్టేషన్ వచ్చింది. వెంటనే ఆ ముసలి తాత మనవణ్ణి తీసుకుని దిగిపోయాడు. దిగిపోయే ముందు అతని ప్రక్కన కూర్చున్న దయామయుడైన ప్రయాణీకునికి (బాబాకి) ధన్యవాదాలర్పించి మరీ దిగాడు.

తరువాత బాబా ఎరచ్‌తో 'మెహెర్ బాబా జర్నల్ అనే పత్రికలోని బాబా చిత్రాన్ని తీసుకుని పరిగెత్తి వెళ్ళి అతనికిచ్చి రమ్మన్నారు ఎరచ్‌ని. ఫోటో ఇచ్చి రైలులో ప్రయాణం చేస్తున్న సహవాసి ఎవరో అతనికి తెలియ జెప్పమని (ఫలానా బాబా వారే అని), మెహెర్‌బాబా అతనిని అతని కుటుంబాన్ని ఆశీర్వదించారని, తాను బాబాను చూసాడు గనుగ ఇంక మళ్ళీ రానవసరం లేదని' బాబా అన్నారని, చెప్పిరమ్మని పంపించారు. స్టేషన్ బయటకు వెళ్ళి ఒక టాంగాలో ఎక్కడానికి సిద్ధంగా ఉన్న అతనిని కలుసుకుని ఆ బొమ్మ, బాబా సందేశము కూడా ఇచ్చాడు. ఇలా చెప్పగానే, తన ప్రక్కనే కూర్చున్న వ్యక్తే ఫలానా బాబా అని తెలియగానే కోపం తెచ్చుకుని ఎరచ్‌వైపు ఎంతో కోపంగా ఇంతసేపు బాబా సంగతి రహస్యంగా ఉంచినందుకు ఎరచ్‌ని అతని వంటి నేటికాలపు యువకుల్ని ఆడిపోసాడు. రైలుకి సమయం అయిపోతోందని ఎరచ్ రైలు వద్దకు పరిగెత్తాడు. వెంటనే ఆ ముసలివాడు కూడా పరుగెత్తి బాబా పెట్టెవద్దకు రైలు కదులుతుండగా వెళ్ళాడు. బాబా కిటికీ వద్దకు వచ్చి కూర్చున్నారు. ఆయన టోపీ, కళ్ళద్దాలు తీసేసి నవ్వుతూ అతనివైపు చూసారు. బాబా ఆ ముసలివాని తల మీద తమచేతిని ఉంచి ఆశీర్వదించారు.

జనవరి (1943)లో బాబా ఔరంగాబాద్‌లో ఒక ఇంట్లో కొన్నాళ్ళున్నప్పుడు ఆదీ వెళ్ళి మాయిబాప్ మస్తుని బాబా వద్దకు తీసుకుని వచ్చాడు. బాబా అతనితో మరల సాంగత్యం చేసారు. 20 నిమిషాలు బాబాతో ఒంటరిగా కూర్చుని తరువాత "ఈ అరణ్యంలో చాలా ముళ్ళున్నాయి బాబాయ్" అని కేక వేస్తూ బయటకు వచ్చేసాడు. మళ్ళీ అతనిని తీసుకుని వచ్చి బాబా ఎదుట కూర్చోబెట్టారు. అప్పుడు ఇంకొక పావుగంట ఉండి "నాకు మేకు గుచ్చుకుంది. ఆ నొప్పి నేను భరించలేను." అని మళ్ళీ బయటకు వెళ్ళాడు. మాయిబాప్‌కి బాబా ఏదో కష్టమయిన ఆధ్యాత్మికమైన పని ఇచ్చి ఉంటారు. అదే అతనికి

ఏదో బాధ కలిగించి ఉంటుంది. చట్టిబాబా ఒకమారు యిలాగే అరిచాడు. అతడేదో ఆధ్యాత్మిక సమస్యలలో సహాయం చేస్తున్నాడని ఆ కేకల వలన బాబాకు తెలిసినది. ఒక్కొక్కప్పుడు అతడు భరించలేనంత భారం అతనికి కలిగేదన్నమాట. మస్తులు వారికి ఎలా సహాయం చేస్తారనిగానీ వారు వాళ్ళకి ఏమి చేస్తారని గానీ బాబాని ఎప్పుడయినా అడిగితే దానికి బాబా సమాధానం చెప్పరు. 'పరస్పర సహాయం' అని మాత్రం సూచిస్తారు. వివరాలేవీ చెప్పరు. తరువాత 'మాయి బావ్‌ని తీసికొనివెళ్ళి అతని యింటివద్ద దిగబెట్టి రమ్మని, అక్కడినుంచి రోజా తీసికొని రమ్మని' కాకాతో చెప్పారు బాబా. అలా చెప్పిన తరువాత మాయిబావ్ కాకాతో "'నేను 7 రోజులు నీతోవస్తానులే'" అన్నాడు. అని తన కుడి అరచేతిని. కాకా కుడి అరచేతిలో తిరగేసి కొట్టాడు. అంటే అది వాగ్దానం కాదన్నమాట, వట్టి బూటకపుమాట అన్నమాట. మరునాడు కాకా వెళ్తే అతడు రానన్నాడు బాబాయే ప్రతిసాయంకాలము మాయిబావ్ యింటికి వెళ్ళేవారు.

బండిల్ షా అనేవాడు 1943లో పూనాలో నివసిస్తూ ఉండేవాడు. ఇతడ ఒక మస్తు. మహాబలేశ్వర్ ఆశ్రమంలో ఉంటూ బాబా మస్తుల నెవరినయినా తీసికొని ఎరచ్‌ని పంపించారు. ఎరచ్ పూనా వచ్చి బండిల్‌షా మస్తును తనతో తీసికొని వెళ్ళడానికి ప్రయత్నం చేసాడు. బండిల్‌షా ఎప్పుడూ తన చంకలో ఒక బండిల్ (మూట) పెట్టుకుని ఉండేవాడు. అందుకే ఆ పేరు అతనికి వచ్చింది. లేకపోతే అతనిని ఫాదర్ అనేవారు. అతనికి 65 సంవత్సరాల వయసుంది అప్పటికి. గుర్రప్పందాలకి వెళ్ళేవాళ్ళు యితని వద్దకు టీ మొదలయినవి తీసికొని వచ్చి పెట్టేవారు. ఏ పందెంలో ఏగుర్రం నెగ్గుతుందో యితడు చెప్పగలడని వారి నమ్మకం. అతడు చెప్పిన గుర్రం మీదకాస్తే వాళ్ళ పంట పండుతుందని ఆశ.

ఈ మస్తు ఎప్పుడూ తన ఆరోగ్యం బాగాలేదని అంటూ ఉండేవాడు. టీ తాగితే బాగానే ఉంటుంది. కానీ కప్పు శుభ్రంగా కడగాలి. టీ లో పోసే పాలు బాగా కాచాలని యిలా యింకా ఏవేవో చెప్పేవాడు. ఎరచ్ ఒకటి రెండుమారులు ఫాదర్‌వద్దకు వెళ్ళాడు. తన యింటికి రమ్మని అడిగాడు. మస్తు ఒకటి రెండు సార్లు ఏదో సాకుచెప్పి తప్పించుకున్నాడు. అడగ్గా అడగ్గా ఒక రోజున ఎరచ్ యింటికి వచ్చాడు. అతనికి టీ యిస్తానని కూర్చోమన్నాడు. మామూలుగా టీ

తయారు చేయడానికి షరతులన్నీ చెప్పాడు. టీ అయిన తరువాత బండిల్‌షా మహాబలేశ్వర్ వెళ్ళడం సంగతి ఎరచ్ ఎత్తాడు. మెహెర్‌బాబా అనే పేరు మాత్రం ఉచ్చరించకుండా ఉండడానికి జాగ్రత్త పడ్డాడు ఎరచ్. మహాబలేశ్వరం వెళ్ళడం సంగతి చెప్పిన తరువాత బండిల్‌షా ఎరచ్‌ని ఒక కాగితం తెమ్మన్నాడు. దగ్గరలో ఉన్నది తీసికొని వచ్చి ఎరచ్ అతని చేతికి ఇచ్చాడు. అది ఒక ఎక్సర్‌సైజు పుస్తకం. ఆ నోటు బుక్కు తన తమ్ముడు మెర్వాన్‌ది. ఆ పుస్తకం బండిల్‌షా తీసుకున్నాడు. అందులో ఏముందో ఎరచ్‌కి తెలియదు. ఆ పుస్తకంలో మెహెర్ బాబా ఫోటో ఒకటిఉంది. కానీ ఆ ఫోటో మీద బాబా పేరు ఎక్కడా లేదు. బాబాను తెలిసినవారు కాని ఆ ఫోటో ఎవరిదో చెప్పకోలేరు.

బండిల్‌షాకి ఆ పుస్తకం ఇవ్వగానే అందులో బాబా ఫోటో ఇవతలికి లాగి దానివైపు తదేకదృష్టితో చూస్తున్నాడు మస్తు. ఒక పెన్సిల్ తెమ్మని అడిగాడు ఎరచ్‌ని. ఆ ఫోటో వెనుకవైపు ఏవో అంకెలు వేసి "20+15—17+12 + 1... ఈ విధంగా ఎన్నో అంకెలు వేసి చివరికి ఆఖరు '7' వేసి అంటే దేవుడు అని వ్రాసాడు. దేవుడనే మాటను చూపించి ఎరచ్‌కి బాబా బొమ్మను చూపించాడు. "దేవుడంటే మెహెర్ బాబా" అన్నాడు. మెహెర్ బాబా యొక్క ఆధ్యాత్మిక ఘనత తెలిసిన మస్తులను సాధారణంగా బాబా సాంగత్యం చేయనొల్లరు. ఆ సంగతి ఎరచ్‌కి తెలుసును. అందుచేత మహా బలేశ్వర్ వెళ్దాం అనే మాట ఇంక అతనితో అనలేదు ఎరచ్. ఆ మస్తుతో అతని ఇంటికి వెళ్ళి దింపేసాడు ఎరచ్. తరువాత ఆ ఫోటో వెనుక మస్తు వ్రాసిన అంకెలు కూడికలు తీసివేతలు చేస్తే చివరకి 7 వచ్చింది. బాబాకి తరువాత ఈ సంగతి ఎరచ్ చెప్పగా 'అతనిని నా వద్దకు తీసుకు రావద్దు' అని బాబా చెప్పారు. ఈ సమావేశం తరువాత కొన్నాళ్ళు బండిల్‌షా పూనా లోనే ఉన్నాడు. తరువాత అక్కడనుంచి బొంబాయి వెళ్ళాడు. అక్కడినుంచి బెంగుళూరు వెళ్ళి కొన్నాళ్ళున్నాడు.

'బండిల్‌షా ఆరవ భూమికలోని మస్తు అనియు, కొన్ని సమయాలలో సాలిక్‌వలెను మరికొన్ని సమయాలలో మజ్జూబ్‌లాగానూ ఉంటాడని' బాబా వివరించారు.

అది 1943వ సంవత్సరం. ఒక మహారాష్ట్ర హైందవుడు బాబా దర్శనం చేసుకున్నాడు. ఆతనికి చిన్నప్పటి నుంచి దేవుడంటే చాలా యిష్టం. బాబాతో సంభాషించినపుడు అతడు 'తనకు ప్రపంచం అన్నా, ప్రాపంచిక జీవితంలో ఏమయినా నిర్వహించడమన్నా అంత ప్రాకులాట లేదని, జ్ఞానం కోసమే తపిస్తు న్నానని' చెప్పాడు. 'తన యిల్లూ వాకిలీ వదిలివేసి బాబాతో ఉండడానికి సిద్ధంగా ఉన్నానని" కూడా అతడన్నాడు. బాబా చెప్పిన ఏ పనయినా చేస్తానన్నాడు. బాబా సంతోషించి అతనిని దీవించారు. బాబా అతనితో "నేను ఉత్తరం వ్రాసినప్పుడు అహమద్‌నగర్ రా" అన్నారు. మూడు నెలలయిన తరువాత అతనికి రమ్మని బాబా ఉత్తరం వ్రాసారు. అతడు వెళ్ళి బాబా వద్ద ఉన్నాడు. తరువాత బాబాతో, మండలితో హైదరాబాద్ కూడా వెళ్ళాడు. పొట్టిగా బలంగా ఉంటూ రోజూ వ్యాయామం అభ్యాసం చేసేవాడు. మండలివారు అతనిని "హనుమాన్" అని పిలిచేవారు.

బాబా ఔరంగాబాద్ వెళ్ళారు. అక్కడ కారిగార్‌బాబా అను నతనిని, జనవరి (1943) 30వ తేదీన బాబా సాంగత్యం చేసారు. కారిగార్ బాబా చాలా పెద్ద తలపాగా పెట్టుకుని ఉంటాడు. ఇతడు కాళ్ళు ముడుచుకొని అతని ముందు ఎవరినీ కూర్చోనివ్వడు. రోడ్డు మీద వెళ్తుంటే రాళ్ళు గజిబిజిగా పడిఉంటే అతడు అవన్నీ సరిగ్గా సర్ది మరీ వెళ్తాడు. అతడు పగలు మాటా డడు. అతని శిష్యుడొకడు సితార్ వాయిస్తాడు.

ఔరంగాబాద్‌లో అదే రోజున వాలిజీ అనే మస్తును బాబా సాంగత్యం చేసారు. అతడు బాబాకు ఒక పోలీస్‌స్టేషన్‌వద్ద కనిపించాడు. అతని చేతిలో కర్ర ఒకటి ఎప్పుడూ ఉంటుంది. టాంగాల వాళ్ళు అతడు కనిపించినప్పుడు అతనిని మొక్కుంచుకుంటారు. ఔరంగాబాద్‌లో ప్రజలు అతనిని బాగా ఎరుగుదురు.

ఔరంగాబాద్‌లోనే జనవరి (1943) మాసంలో కుతుబ్‌షా అనే మస్తును కూడా బాబా సాంగత్యం చేసారు. ఇతడొక ముసలివాడు. బక్క పలుచగా, పొట్టిగా మాసిపోయిన పాతగుడ్డలు కట్టుకుని ఉండేవాడు. ఒక ప్లీడరు యింటిముందర వసారాలో కూర్చుని ఉండేవాడు. వచ్చిన ప్రతివారితోనూ 'జావో, జావో' అని అంటూ ఉండేవాడు. చింకిపాతల మూటలు దగ్గర ఉంచుకునేవాడు. ఇతడు ఆరవ భూమికలోని మజ్జూబ్‌వంటి మస్తు. అతని శరీరం యేమి చేస్తోందో అతనికే

తెలియదు ఆ యింటి యజమాని అయిన ప్లీడరు స్వయంగా అతనికి స్నానం చేయించి అతడు అంగీకరించినంత వరకు శుభ్రంగా ఉంచేవాడు ఆ మస్తును. ఇతనిని కెప్టెన్ అని పిలిచేవారు.

జనవరి (1943) మాసం చాలా వరకు బాబా మెహెరాబాద్‌లోనే ఉన్నారు. జొరాస్ట్రియన్ పంచాంగం ప్రకారం బాబా జన్మదినం ఫిబ్రవరి 14వ తేదీన అయినది. బొంబాయి, పూనా, మద్రాస్, నాగపూర్, షోలాపూర్, లాహోరు నగరాలలో పెద్ద పెద్ద సమావేశములు జరిగినవి. ఆ సభలలో ఆ సందర్భమున పంపించిన బాబా యొక్క సందేశం చదువబడినది బాబా సందేశం 'ఆధ్యాత్మిక కార్యకర్తల కర్తవ్యము' అనే విషయం మీద యిచ్చారు. అందులో బాబా యిలా చెప్పారు.

"ఆధ్యాత్మిక కార్యకర్తలుగా మీరు జ్ఞాపక ఉంచుకోవలసిన సంగతి ఏమి టంటే మీరు యితరులకు యివ్వాలని కోరుతున్న ఆధ్యాత్మిక జ్ఞానం వారిలో గుప్తంగా ఉండనే ఉన్నది. ఆ ఆధ్యాత్మిక జ్ఞానం ఆవిష్కరించుటకు మీరు నిమిత్తమాత్రంగా ఉండాలి. ఆధ్యాత్మిక ప్రగతి బయటనుంచి సంపాదించే క్రమం కాదు. అది లోపల వికాసం పొందవలసిన క్రమం."

1943 ఫిబ్రవరి 25వ తేదీన బాబా జననియగు షిరీన్‌మాయి పూనాలో తన స్వగృహమందు కాలం చేసినది. ఆ రోజుకి సరిగ్గా 49 ఏళ్ళక్రితం ఆమె అవతారునికి జన్మనిచ్చి ధన్యత గాంచినది. అప్పుడు బాబా మహాబళేశ్వర్ ఆశ్రమ మందున్నారు. ఈ వార్త వినగానే బాబా వెంటనే బయలుదేరి పూనా వెళ్ళారు. చనిపోయినప్పుడు బాబా తల్లికి 65 సంవత్సరాల వయసుండెను.

1943 ఫిబ్రవరి మార్చి నెలలలో బాబా మహాబలేశ్వర్‌లో ఉంటూ అక్కడినుండి మస్తు సాంగత్యమునకై ప్రయాణాలు చేసారు. మార్చి (1943) 10వ తేదీన షోలాపూర్‌లో పేదవారిని, పిచ్చివారిని, భగవదున్మత్తులను మొత్తం 20 మందిని బాబా బంగాళా వద్దకు రప్పించి వారందరికి స్నానం చేయించి, క్రొత్త బట్టలు కట్టించి భోజనం పెట్టారు. ఆ రోజున షోలాపూర్‌లో బాబా దర్శనకార్యక్రమం జరిపించారు. ఇదంతా భక్తుడయిన రామచంద్ర గడేకర్ తన యింట్లో నిర్వహించాడు. అతనిని నానాసాహెబ్ అనికూడా అంటారు. ఆ మరు

నాడు అనగా మార్చి నెల 11వ తేదీన బార్సీ అనే గ్రామంలో బాబా రహదారీ బంగళాలో బసచేసి ఉన్నారు. ఆ రోజున 20 మంది పేదవారిని అక్కడికి రప్పించి ఆలాగే వారికి స్నానం చేయించి క్రొత్త బట్టలు కట్టించి వారికి స్వయంగా భోజనాలు పెట్టారు. ఆ ఊరిలో బాబా ప్రజలకు దర్శనం కూడా యిచ్చారు. బార్సీలోనే బి జి. ఖేర్ అనునతడు బాబాను దర్శనం చేసుకున్నాడు. అప్పుడు తనకున్న సందేహాలన్నీ బేరీజు వేసి, బాబాను అడుగుదామని ఒక కాగితం మీద వ్రాసుకుని వెళ్ళాడు. ఖేర్ తీరా ఆయన సన్నిధిలోనికి వెళ్ళిన తరువాత బాబాను అవన్నీ అడగక్కరలేదని మానివేసాడు.

1943 మార్చి నెలలో బాబా ఆంధ్రదేశంలో పోలవరం వెళ్ళారు. అక్కడ ఆరవ భూమికలోని ఒక గొప్ప మజ్జూబ్ వంటి మస్తు. 'భిక్కు బాబా'' అనే వానితో బాబా సాంగత్యం చేసారు. అతనిని భిక్కుభగవాన్ అని కూడా అనేవారు. ఇతనికి 125 సంవత్సరాల వయసుందని అక్కడి వారంటారు. ఇతడెప్పుడూ నగ్నం గానే ఉండేవాడు. ఎప్పుడయినా ఒకమారు శరీరాన్ని ఒక దుప్పటితో కప్పుకునే వాడు. ఇతడుండే గుడిసెలో నేలమీద ఇసుక కుప్పగా వేయబడి ఉంది. చేతులతో ఆ ఇసుకను తనవైపుకు లాక్కునేవాడు. అతని కాళ్ళ మధ్య ఒక దిబ్బలాగ చేసే వాడు. మరల ఇంకొక చోట కూర్చుని యిలాగే చేసేవాడు. ఈ పని చేస్తూ లోపల ఏదో గొణుక్కునేవాడు ఎవరికీ ఒక్కమాటయినా అర్థం కాకుండా.

సంక్రాంతినాడు ఊరి ప్రజలువచ్చి అతని దర్శనం చేసుకుని అతనికి పూల మాలలు వేసి క్రొత్తబట్టలు కొంతడబ్బు యిచ్చి గౌరవించేవారు. బాబా సాంగత్యం చేయడానికి అనేక సంవత్సరాలు ముందు భిక్కు బాబా ''నేను చచ్చిపోతాను'' అని అంటూ ఉండేవాడు. ఒక ధనికుడయిన శిష్యుడు అతని మరణానికి ముందే సమాధికూడా కట్టించాడు. బాబా సాంగత్యం చేసేటప్పటికి అది కట్టించి ఏడేళ్ళయింది. తరువాత యీ మస్తు కాలం చేసాడు. తూర్పు గోదావరిజిల్లా క్రొత్త లంకలో సైయిద్ అహమ్మద్ ఆలీషా అనే ఉన్నతుడయిన మస్తుతో బాబా సాంగత్యం చేసారు. ఇతనిని క్రొత్తలంకయోగి అని అనేవారు. అతడు ఆ జిల్లాకి ఆధ్యాత్మిక పాలకుడు. ఇతనిలో జమాలీ, జలాలీ వైఖరులు రెండూ ఉన్నాయి. ఇతడు దిగంబరిగా ఉండే ఒక వృద్ధుడు. ఇతనికి ముందు పళ్ళు ఊడి

పోయాయి. ఒక బ్రాహ్మణుని యింటిముందు అరుగు మీద కూర్చుని ఉండే వాడు. ఈ మస్తుని దర్శించడానికి వచ్చినవారు బస చేయడానికి ఇతని యింటికి ఎదురుగా ఒక ధర్మశాల కట్టించాడు. ఆ బ్రాహ్మణుడు అతడే ఆ మస్తుయొక్క సంరక్షణ పోషణభారం వహించాడు. బాబాతో ఎరచ్, బైదుల్ అనే శిష్యులు వచ్చారు. ఇద్దరూ మస్తుల పనిలో ఆరితేరినవారే. బైదుల్ వెళ్ళి ముందు ఆ మస్తుతో మీ కోసం రుస్తుం వచ్చాడు, (మనసులో బాబా అనుకుని) అన్నాడు. అందుకు ఆ మస్తు "కాదు, నా కోసం కాకి వచ్చింది. (అంటే కాకి రావడం ఒక స్నేహితుడు వచ్చాడని అర్థం. కాకి రాక మంచి శకునం అంటారు) బైదుల్ వెళ్దామని లేచేసరికి బైదుల్ కడుపులోకి చేత్తో పొడిచి 'కూర్చోవెళ్ళవుగానీ' అన్నాడు మస్తు. మరొక అరగంటసేపు బైదుల్ వేచి యున్నాడు. తరువాత వెళ్ళా లని మళ్ళీ లేవగా 'మళ్ళీ వస్తానని' అతనిచేత అనిపించి అతడు వెళ్ళడానికి ఆలీషా అనుమతించాడు. బాబా తరువాత వచ్చి ఆలీషాతో కొంతసేపు కూర్చుని సాంగత్యం చేసి వెళ్ళినప్పుడు ఆ బ్రాహ్మణుని పిలిచి యిరవై రూపాయలిచ్చి 'ఆలీషా పరుండేం దుకు ఒక మంచం చేయించమని' చెప్పారు. తరువాత ఆలీషాకి యిష్టమయిన అత్త రులు కొని యిమ్మన్నారు. బాబా మరల మహాబలేశ్వర్ వెళ్ళిపోయారు.

1943 మార్చిలో విజయవాడలో ఒక యాత్రికుని కలిసారు. అతడు 90 ఏళ్ళ వృద్ధుడు. ఇతడు విజయవాడలోను చుట్టుప్రక్కల విఖ్యాతినొందిన వృద్ధుడు. అతని పేరు దాదాపీర్. అతనికోసం ఒక యిల్లు కట్టారు. అతడందులో రాత్రుళ్ళు నిద్రపోతాడు. ప్రతి సంవత్సరం అతని గౌరవార్థం ఒక ఉత్సవం చేస్తారు. పగలు యింకొక యింట్లో ఉంటాడు. బాబా దాద్‌పీర్‌ని రెండవమారు 1945వ సంవత్సరంలో జూన్ 4వ తేదీన సాంగత్యం చేసారు.

బాబా గుంటూరులో 1943 మార్చిలో మజ్జూబ్ ఆలీషా అనే మంచి మస్తును సాంగత్యం చేసారు. ఇతడు 47 ఏళ్ళ మనిషి. సన్నగా వుంటాడు. కఫ్నీ ధరించాడు. గడ్డి చాపలతో కప్పిన ఒక గుడిసెలో వుండేవాడు. ఈ గుడిసె ఒక గోడ ప్రక్కన వేయబడినది. ఇంతకుముందు రోడ్డు ప్రక్కన ఆరుబయటే ఎండకి ఎండి వానకు తడుస్తూండేవాడు. గుంటూరులోనే బాబా నవాబ్ ఆలీషా అనే మస్తును కూడా కలిసారు. ఇతడు 60 ఏళ్ళ వృద్ధుడు. కాళ్ళకి శరీరమునకూ

కూడా గుడ్డలు చుట్టుకుని వుండేవాడు. తలకి కూడా గుడ్డలు చుట్టుకునేవాడు. ఈ వేషం చాలదన్నట్లు ఒక బొగ్గుల దుకాణంలో రాత్రుళ్ళు ఆ బొగ్గులమీదే క్రింద పరుండేవాడు. అతని గుడ్డలు శరీరమూ కూడా మసితో నల్లగా అయిపోయి నవి. అతడంటే అక్కడి వారికి గౌరవం ఎక్కువ. ఎక్కడికి వెళ్ళినా అన్నం పెట్టేవారు. ఫలానా చోటుకి వస్తాను అని ముందే చెప్పేవాడు. అక్కడికి వెళ్తే భోజనం పెట్టేవారు. మస్తులయిన వారు భోజనం చేస్తే చాలని సాధారణంగా అటువంటి వారికి స్వాగతం చెప్పి ఆతిథ్యమిస్తారు మన భారతీయులు. అందులోను మన ఆంధ్రులు ఆతిథ్యమివ్వడానికి పెట్టింది పేరు. ఈ మస్తు హృదయంయొక్క గొప్పదనం అతని ఆధ్యాత్మికౌన్నత్యం బాబాకి బాగా తెలుసును. అందులో యీమస్తు సాంగత్యమునకు బాబా ఎంతో ఆనందించారు.

బాబా 193?వ సంవత్సరంలో కేన్స్ మకాం నుంచి ఇండియా తిరిగి వచ్చిన తరువాత ప్రారంభించిన ఏకాంతవాస 1943 మార్చిలో అంతం చేసారు. ఈ లోపుగా చేసిన ప్రయాణములన్నీ ఏకాంతవాసంలోనే చేసారు. తరువాత బహి రంగంగా అక్కల్‌కోట వగైరా వెళ్ళారు. బాబా ఎక్కడికి వెళ్ళినా జనసందోహాలు వేలకొలదీ వారిని దర్శించడానికి వచ్చారు. ఒక నగరంలో 50,00? మంది రావడంచేత అక్కడ బళ్ళ రాకపోకలు కూడా కట్టుపడి చాలా యిబ్బంది కలిగింది. అనేకమంది పోలీసులు రావలసి వచ్చింది. అక్కడ బాబాను బ్యాండుమేళంతో ఊరంతా $4\frac{1}{2}$ గంటలసేపు ఊరేగించారు. ఒకచోట భక్త్యావేశంచేత ఒక భక్తుడు బాబాకు క్రొత్త చెప్పులు తీసుకువచ్చి పాత చెప్పులు తీసుకొని వెళ్ళిపోయాడు. మరియొకకోట యింకొక భక్తుడు బాబాను కనుగొన్న సంతోషం చేత బాబాను గట్టిగా పట్టుకొని కుదిపివేసాడు కళ్ళవెంబడి నీరు కారుస్తూ.

ఈ పర్యటనలలో బాబా కొన్నిచోట్ల బహిరంగముగా కొన్ని సందేశాలు కూడా యిచ్చారు. జీవమంతా ఒకటేనని, మానవుడు ఆ సంగతి గ్రహించి సత్య దర్శనము చేయవలసిన సమయమాసన్నమైనదని బాబా చెప్పారు. "భగవంతుడి కొరకే జీవించాలి. ఆయన కొరకే మరణించాలి. మిగిలినదంతా వట్టి మాయా మయమయిన విలువలతో కూడుకున్నది మాత్రమే" అని బాబా ఒక సందేశంలో చెప్పారు. ఇంకొక సందేశము మానవాళి యొక్క స్వేచ్ఛకు సంబంధించినది. అనేక

రకముల స్వేచ్ఛా స్వాతంత్ర్యముల కొరకు ప్రపంచంలో మానవులు పోట్లాడుకుంటు న్నారు. కానీ మౌలికమైనది అతి ప్రధానమయినది ఆధ్యాత్మిక స్వేచ్ఛ మాత్రమే. ''స్వేచ్ఛ జీవితము యొక్క బాహ్యస్థితులు ఏర్పడినప్పుడు మానవునియొక్క ఆత్మ ఆధ్యాత్మిక స్వేచ్ఛ బడయకపోతే యింకా బంధనము నందే వుంటుంది. అందుకు ముఖ్యమయిన షరతు ఏమంటే అన్ని కోర్కెల నుండి స్వేచ్ఛ పొందడము. అంటే ఏ కోరికా లేకుండా చేసుకోవడం. కోరికయే ఆత్మను బానిసగా చేసుకుని బంధి స్తుంది. ఈ కోరికలు గనుక విచ్ఛిన్నం చేసుకోగలిగితే శారీరక, మానసిక అహంకార ములకు లోబడక మానవుడు స్వేచ్ఛను పొందగలడు. దానితో అన్ని విచారములు అంతమవును. అన్ని సందేహములు పటాపంచలవును. జీవమంతా ఒక్కటే నన్న సత్యం తెలుసుకో బడుతుంది. ఆధ్యాత్మిక స్వేచ్ఛ యివ్వడము కంటె ఎక్కువ గొప్ప కానుక మరొకటిలేదు. అది సాధించడానికి చేసే సహాయము కన్న గొప్ప పని యింకొకటిలేదు... మానవులు భగవంతుని పొందడానికి గాను ఆధ్యాత్మిక మార్గ మందు పయనించడానికి సహాయము చేసే ఆ ఉద్యమమందు చేరి మానవ పున రుజ్జీవనమునకు అందరు సహాయం చేసే సమయమాసన్నమైనది. భగవదిచ్ఛ ప్రకారము, దైవ నిర్ణయం ప్రకారము యిదివరకే నిర్ణయించబడినట్లుగా మానవా ళికి ఆధ్యాత్మిక స్వేచ్ఛను తీసికొని వచ్చే మహత్కార్యంలో పాల్గొనేవారు ప్రతి రక మయిన బాధ, త్యాగమునకు లోనుగావలసి వస్తుంది. చివరికి వారు శరీరత్యాగం కూడా చేయవలసి వుంటుంది. కానీ వారి అలసటలేని పనులద్వారా శాశ్వత శాంతి పటుత్వము గల సామరస్యము, అప్రతిహతమయిన విశ్వాసము, మాసిపోని ఆనం దము, అమరమైన మధురానుభూతి, కల్తిలేని పరిశుద్ధత, నిర్మాణాత్మకమైన ప్రేమ, అనంతమైన అవగాహన వీటిని మానవకోటి పొందగలరు'' అని బాబా చెప్పారు.

ఏప్రెల్ (1943) 1వ తేదీన తమకు ప్రియమైన వారికి బాబా యీ క్రింది లేఖ పంపించారు. ''మెహెరాబాద్‌లో మే 15వ తేదీ నుంచి 5 రోజులు జరుగు సహవాస్‌కి మీరు రావాలని నిశ్చయించాను. మీరు ఏ ప్రశ్నలూ నన్ను అడుగకూడదు. నేను చెప్పబోయే స్పష్టమైన వచనాలు మీరు వినాలి'' ఆ విధంగా మెహెరాబాద్‌లో సమావేశం జరిగింది. బాబా యీ సంగతులు చెప్పి అందరినీ వారి జీవితాలలో ఆచరించమని చెప్పారు.

1. మీరు చేసే అన్ని పనులలోను మీకు వున్న అన్ని ఆసక్తులలోను, భగవంతుడొక్కడే సత్యము మిగతా అంతా మాయ అనే భావం మీ మనసులో వుంటూ వుండాలి.

2. ఆయన యొక్క సత్యము అనంతత్వము గురించి తెలుసుకొనుటయే జీవితములో పరమ లక్ష్యము. అని మీరు యితరులకు చెప్తూ వుండాలి.

3. మిమ్ము గురించి తక్కువగా ఆలోచించుకుంటూ మీకు బాధ కలుగుతున్నా యితరుల గురించే ఆలోచిస్తూ వారికి సుఖం కలుగచేయడానికి ప్రయత్నం చేస్తూండాలి.

మే 15వ తేదీ నుంచి ప్రారంభం చేసి 14వ తేదీ జూన్ 1943 వరకూ ప్రత్యేకంగా యీ సంగతులు పాటించాలి.

1. నీవు పెళ్ళి చేసుకున్న వాడవయినా బ్రహ్మచర్యం అవలంబించాలి.

2. వినోదములకు దూరంగా ఉండాలి.

3. ప్రతీ ఉదయం నీవు భగవంతుని, ఆయన ఇచ్ఛను అర్థం చేసుకొనేలా చేయుమని ఆయనను ప్రార్థించాలి.

ఆ సమావేశంలో పునర్జన్మ సిద్ధాంతము, మానవ పరిణామక్రమము, అంతమున భగవత్సాక్షాత్కారము గురించి బాబా ప్రవచనం చేసారు. ఈ ప్రవచనం బాబా రంగు రంగుల పటముల సహాయంతో చేసారు. తరువాత యీ వివరణములు ఒక గ్రంథరూపంగా ప్రచురింపబడినవి. ఈ ప్రవచనం చేసేటప్పుడు ఛగన్ అనే మండలిలోని శిష్యుడు తాను వినలేదని విచారిస్తూ బాబా వద్దకువెళ్ళి ఆ సంగతి చెప్పగా— "విచారించకు, నేను చెప్పిన దాని సారాంశము చెప్తాను విను" అని బాబా సూక్ష్మంగా పైన చెప్పిన సిద్ధాంతాలు వివరించారు. తరువాత బాబా అక్షర ఫలకంమీద యీ దిగువ వ్రాసిన సంగతి కూడా ఛగన్‌కి చెప్పారు—

"నీవు ఎల్లప్పుడు "నీటిలో వున్నావు నీరంటే తెలియకుండానే. అంతే' సూరత్‌లో ఏప్రెల్ (1943) 12వ తేదీన అబ్దుల్ రహ్మాన్ మాలిక్ అనే

మంచి మస్తును బాబా సాంగత్యం చేసారు. ఈ మస్తు అనేక రకముల వస్తువులు పోగు చేస్తాడు. ఇతనికి సిగరెట్లంటే యిష్టం. గోచీపాతరాయుడు. సూరత్‌లో ఒక పలుకుబడి గల ఒక ఆసామీ మేడమీద గదిలో కూర్చుని ఉంటాడు. ఆ గదిలో అనేక అలమారలు వున్నవి. వాటినిండా సిగరెట్ పాకెట్లు, టిన్నులు, థెర్మాస్ ఫ్లాస్కులు, సువాసన ద్రవ్యములు, అత్తర్లు, 11 జతల జోళ్ళు, ఎన్నో శాలువలు, ఇంకా ఎన్నో ఒక దుకాణంలో పెట్టినట్లు అమర్చి వున్నాయి. వచ్చిన వారిని సిగరెట్లు యిమ్మని ఆ మస్తు అడిగేవాడు వచ్చిన వారందరికీ ఆడవారికి పిల్లలకు కూడా సిగరెట్లు యిచ్చి కాల్చమంటాడు. వారు అందుకు నిరాకరిస్తే అక్కడినుంచి వెంటనే వెళ్ళిపొమ్మని చెప్పేవాడు. బైదుల్ వెళ్ళినప్పుడు తాగడానికి సోడా యిచ్చి సిగరెట్లు యిచ్చాడు. బాబా ఏప్రెల్ (1943) లో సూరత్ వచ్చినప్పుడు రెండు మారులు యితనితో సాంగత్యం చేసారు. అబ్దుల్ రహమాన్ మాలిక్ తరువాత కొంత కాలమునకు గతించాడు ఆ మరునాడు (13-4-43) సూరత్‌లో గరీబ్‌బాబా అనే మస్తును మస్తాన్ హాఫీజ్‌జీ అనే మస్తును బాబా సాంగత్యం చేసారు. హాఫీజ్‌జీ ఒక మసీదు ప్రక్కన ఒక చిన్న చీకటి గదిలో ఉండేవాడు. అతని శరీరంమీద యినుపముక్కలు దించాడు. ప్రతి రోజు యితడు ఒక మూత్రశాల వద్ద కూర్చుని బిగ్గరగా ఖురాన్ - చదివే వాడు. అప్పుడప్పుడూ ఆ మూత్రశాల అతడే శుభ్రంగా కడుగుతూంటాడు. అప్పుడు ఖురాన్ గ్రంధం ఒకచేతి క్రింద పెట్టుకుంటాడు. సూరత్‌లో ఆచార వంతులయిన మహమ్మద్దీయులు కొందరు ఖురాన్ గ్రంధముయొక్క పవిత్రతకు యితడు చేసే పని విరుద్ధంగా వుందని విమర్శించేవారు. హాఫీజ్‌జీ ఇత్తెఫాకీ రకానికి చెందిన మంచి మస్తు.

ఏప్రెల్‌లో జలగావ్ అనే ఊరిలో జుమ్మా అనే మస్తును బాబా సాంగత్యం చేసారు. జలగావ్ సమీప గ్రామమయిన నసీరాబాద్‌లో చిప్పాబాబా అనే మస్తును బాబా 14వ తేదీ ఏప్రెల్ (1943) న సాంగత్యం చేసారు. ఇతడు నగ్నంగా ఉండేవాడు. బాబా యితనిని ఉన్నతుడైన ఒక విచిత్రమైన మస్తు అని వర్ణించారు. మొదట ఇత్తెఫాకీ మస్తుగా ఉండేవాడు. తరువాత ఇతనిలో జలాలీ మాదర్ జారీ లక్షణాలు కనిపించినవి. ఇతడొక ముసలివాడు. బీడీ కావాలని ఎవరి నయినా అడుగుతాడు. సిగరెట్టయినా యిమ్మంటాడు. ఒక దమ్ములాగి ఆ సిగ

రెట్టి అవతల పారేస్తాడు. మళ్ళీ యింకొకటి యిమ్మంటాడు. అతనికేది యిచ్చినా అంతే. ఏదైనా తినే పదార్థమయితే కొంచెం రుచి చూసి మిగిలినది అవతలికి విసిరేస్తాడు. తరువాత 'అభి' అంటాడు అంటే యింకా కావాలని. ఏదయినా ద్రవ పదార్థమైతే కొంచెం త్రాగి పారపోసేస్తాడు. రొట్టెలాంటిదయితే కొంచెం కొరికి మిగిలినది పారేస్తాడు. జిప్రా బాబాకి భార్య ఉంది. అప్పుడప్పుడతడిని చూడ్డానికి వస్తూంటుంది.

1943 ఏప్రెల్ మాసంలో భూసావల్ పట్టణంలో మార్వారీమస్తాన్ అనే మస్తును బాబా సాంగత్యం చేసారు. అతడొక అల్యూమినియం పాత్రతో ఊరంతా తిరుగుతూంటాడు. అతనికి ఏదైనా తినడానికి ఎవరైనా యిస్తే ఆ పాత్రలోనే వేయించుకుంటాడు. టీ యిచ్చినా అందులోనే పోయించుకు త్రాగుతాడు. అర్ధ నగ్నంగా ఉండే శరీరం. రాత్రిళ్ళు హిందువుల స్మశాన భూమిలోనికి పోయి పరుంటాడు. 1943 ఏప్రెల్‌లో బాబా చాలిస్‌గావ్ వెళ్ళారు. వృద్ధురాలయిన మంచి మస్తానీని బాబా అక్కడ కలిసారు. ఆమెను మస్తానీమాయి అని పిలిచే వారు. ఈ మస్తానీ ఒక వీధిలో కూర్చునేది. తరువాత ఆమె ఊరంతా తిరిగేది. బాబా ఆమెను తెల్లవారు జామున 3 గంటలకు కలుసుకున్నారు. ఆమెకు టీ యిచ్చి ఆమెతో రెండుగంటలసేపు కూర్చున్నారు. ఈ నెలలోనే బాబా మస్తు సాంగత్యం కోసం ఖండేష్‌కి వెళ్ళి తరువాత 1943 ఏప్రెల్ మే నెలలో పంచాగ్నిలో బాబా వారి మండలితో మకాం చేసారు. బాబా మే 25వ తేదీ రాత్రి పంచాగ్ని నుంచే మెహెరాబాద్ వెళ్ళిపోయారు.

మెహెరాబాద్‌లో మే నెలలో సమావేశం అయిన తరువాత అహమద్‌నగర్ నుంచి మొదటిమాటుగా ఆలీషా అనే మస్తు మెహెరాబాద్‌లో బాబా వద్దకు తీసికొని రాబడెను. తరువాత యీ మస్తు బాబాకు అయిదుగురు యిష్టులలో ఒకడయ్యెను. ఇతడు జమాలీరకం మస్తు. సాధువుగా ఉండేవాడు. పసివాడిలా అమాయకంగా ఉండేవాడు. బాబా తమ అంతరంగిక కార్యం కోసం ఇతరుల కంటే ఆలీషానే దగ్గర ఎక్కువగా ఉంచుకునేవారు. తరువాత బాబాదాస్ అనే శిష్యుడు జిప్రా బాబాని పంపి లగావ్‌కి 1943 మే మాసంలో (జూన్‌లోనో) తీసుకు వచ్చాడు. రెండవమారు బాబా అతనితో సాంగత్యం చేసి మరునాడే అతనిని నసీరాబాద్‌కి పంపించేసారు.

1943 జూన్ మాసంలో సంగమ్‌నేర్ నుంచి ఛోటుమియా అనే ఒక జమాలీరకం మంచి మస్తును మెహెరాబాద్‌లో ఒక్కరోజు ఉంచుకుందామని రప్పించారు బాబా. బైదుల్ అతనికోసం సంగమ్‌నేర్ వెళ్ళినప్పుడు స్థానిక ప్రజలు ఛోటుమియాని తీసుకువెళ్ళడానికి ఒప్పుకోలేదు. బైదుల్ మళ్ళీ రాత్రి వచ్చాడు. అప్పుడు ప్రజలందరూ నిద్రపోతున్నారు. ఛోటుమియా మస్తు ఒక మంగలి దుకాణం బయట పరుండి ఉన్నాడు. బైదుల్ అతనిని లేపి కారు ఎక్కమని బ్రతిమాలాడు. ఎక్కిన తరువాత అప్పుడు ఆ కారులో, తిన్నగా మెహెరాబాద్ తీసుకువచ్చాడు. ఛోటుమియాకి టీ అన్నా తమలపాకులన్నా చాలా యిష్టం. తాంబూలం రసం అతని బట్టలనిండా పడి మరకలయినది. బైదుల్ మొదట వచ్చినప్పుడు ఛోటుమియా అతనితో.. ''ఏరా ప్రవక్త చాలా గొప్పవాడు. ఆయన క్రైస్తుకన్నా మహమ్మదుకన్నా గొప్పవాడు. ప్రపంచం అంతా అతనిని నమ్ముతారు'' అన్నాడు.

జూలై (1943) మాసంలో ప్రారంభంలో బాబా చాలామంది శిష్యులతో లాహోరు వెళ్ళారు. బాబా లాహోరులో గార్డెన్ టౌనులో అమృతకుటీ జూలై 7వ తేదీ నుంచి 21వ తేదీ వరకూ ఉన్నారు. బాబాతో కూడా మాసాజీ (పెండు తండ్రి) గుస్తాద్‌జీ, కాకా, బైదుల్, విష్ణు, నీలు, చాన్‌జీ, డాన్‌కిన్ మరియు ఎరచ్ వీరంతా లాహోరులో ఉన్నారు'' వారు పని ఉన్నప్పుడే బాబా వద్దకు వెళ్ళేడివారు. లేక రమ్మన్నప్పుడు వెళ్ళేవారు. స్త్రీ మండలికూడా బాబాతో ఉన్నారు. వారితో ఐరిన్, మార్గరెట్ ఉండడానికి బాబా అనుమతించారు. లాహోరులోను రావల్పిండి లోను కాశ్మీర్‌లోను ఆ నగరాలలోను ఆ చుట్టుప్రక్కల గ్రామాలలోను కొందరు మస్తులను బాబా సాంగత్యం చేసారు. 1943 జూలై మాసంలో మంద్రాకి సమీపంలో పిండోరియా అనే ఒక గ్రామంలో అష్రఫ్‌ఖాన్ అనే ఒక నిజమైన సాధువును బాబా సాంగత్యం చేసారు.

బాబా హెూష్‌ఆలీషా అనే అత్యున్నతుడైన మస్తు చోర్‌కోటీ అనే చిన్న గ్రామంలో, ఖుడియన్‌ఖాన్ పట్టణమునకు కొద్దిమైళ్ళ దూరంలో ఉంటున్నాడు. అతనిని ఆ కుగ్రామంలో బాబా 1943, జూలై 15వ తేదీన సాంగత్యం చేసారు. కొద్దిమైళ్ళే అయినను యీ కాస్త దూరము వెళ్ళడం చాలా శ్రమతో కూడుకున్నది. దారి అటువంటిది. బాబా నడిచి వెళ్తున్నారు గానీ తిరుగు ప్రయాణంలో ఆ మస్తుని సాంగత్యం చేసాక ఖుడియన్‌ఖాన్ వస్తుంటే బాబా శిష్యులు యిద్దరూ

డా॥ గనీ, ఇంకొకడూ ఒక గాడిదను కుదుర్చుకొని దానిమీద ఎక్కారు. వారిద్దరూ సుమారు 50 ఏళ్ళ వయసు గలవారు. గనీ యింకా పెద్దవాడే. అది నడుస్తూ ఉండే వారికది అలవాటు లేక, వారు సమానంగా దాని వీపుమీద కూర్చోలేక క్రిందపడ్డారు. ఒకమాటు నవ్వుకుని లేచి దులుపుకొని బాబా ముందు నడుస్తుంటే వారు వెనుక బయలుదేరారు. ఆ సమయంలో చాలా చాలా వేడిగా ఉండెను. చాలా మైళ్ళు నడిచాక కనుచూపు మేరలో స్టేషన్ ఉంది. లాహోరు వెళ్ళే రైలు అప్పుడే ప్లాట్‌ఫామ్ మీదకు వచ్చింది. బైదుల్ ముందు పరుగెత్తివెళ్ళి స్టేషన్ మాష్టరుని కొంచెంసేపు బాబా వచ్చేవరకూ రైలు ఆపమని ప్రతిమాలాడు. స్టేషన్‌మాష్టరు అదృష్టవంతుడు. రైలు కొంచెంసేపు ఆపి బాబా పరివారాన్ని అందులో ఎక్కించాడు. ఈ విధంగా అతడు అవకాశం తీసుకొని తెలియకుండానే అవతారపురుషునికి సాయపడ్డాడు. గాడిద మీదనుంచి పడిపోయిన యిద్దరిలోను డా॥ గనీ పరుగెత్తివెళ్ళి రైలు ఎక్కిన తరువాత ఆ ఆయాసంతో ఒక అరగంట సేపు రైలులో స్పృహతప్పి పడిపోయాడు. మస్తు ప్రయాణాలు చాలా కష్టం అనుటకు ఇది ఒక నిదర్శనం. ఈ చిన్నస్టేషన్‌లో యీ రైలు అందకపోతే మళ్ళీ రైలుకోసం సాయంత్రం వరకూ ఉండవలసి వచ్చేది. ఒక ఊరిలో మస్తు సాంగత్యం పూర్తికాగానే బాబా అక్కడనుంచి సాధ్యమయినంత త్వరలో వెళ్ళిపోతారు.

జూలై (1943) 16వ తేదీన కసూర్‌కి సమీపంలో కొద్దిమైళ్ళ దూరములో ఉన్న పట్నీ అనే గ్రామంలో ముండా బాబా అనే అభివృద్ధి పొందిన యాత్రికునితో బాబా సాంగత్యం చేసారు. ఇతడు 18 ఏళ్ళ యువకుడు. ఇతడు తన పూర్వజన్మలో ఒక యోగి అని బాబా చెప్పారు. ఇతడు కాషాయాంబరాలు ధరించి యున్నాడు. బాబా వెళ్తానంటే ఆయనను వదిలి పెట్టడం అతనికి యిష్టము కాలేదు. బాబా వెనుక పరుగెత్తి యింకా కొంచెం సేపు కూర్చోమని నిర్బంధించాడు. కూర్చున్నాక బాబాకి ఒక గ్లాసుడు మజ్జిగ యిచ్చాడు త్రాగడానికి. రైలుకి వెళ్ళి పోవాలి సమయము అయినదని బాబా అతనితో చెప్పగా "రైలుని నేను ఆపేస్తాను "మీరు ఉండాలి," అన్నాడు బాబాతో. ఇంకొంచెం సేపుబాబా కూర్చున్నారు. ముండాబాబా అప్పుడు గానం చేయడం ప్రారంభించాడు. బాబా మండలివి కూడా

పాడుమన్నాడు, అప్పుడు బాబా తనతో వచ్చిన డా॥ అబ్దుల్‌గనీని పాడమన్నారు. అతడు అలవాటు లేనివానివలె సిగ్గుపడుతూ పాడాడు.

1943 జూలై 16వ తేదీన బాబా, సైయిద్ రెహ్మాతుల్లాబాబా అను ఉన్నతమయిన మస్తును కంగన్‌పూరుకి సమీపమందున్న జామ్ షేర్ అన్న గ్రామంలో సాంగత్య చేసారు. ఆ మస్తుకి బాబా వారి బృందము కనబడగానే అతడు నాట్యం చేయడం ప్రారంభించాడు అలా నాట్యం చేస్తూ "ఇక్కడ ఉన్నాను. రండి. మీకోసం సిద్ధంగా వేచి యున్నాను" అని అన్నాడు. వారి నంద రను దగ్గరకు పిలిచి తన ప్రక్కమీద కూర్చోమని చెప్పాడు. తరువాత ఒక మైలు దూరంలో ఉన్న గోరీలదొడ్డికి పిలుచుకు వెళ్ళాడు. అక్కడ ఆ మస్తుకి ఒక గది ఉన్నది. ఆ గదిలో బాబా అతనితో సాంగత్యం చేసారు. అక్కడి నుంచి తిరిగివచ్చిన తరువాత బాబాకి సైయిద్‌రెహ్మాతుల్లాబాబా ఒక పాత గోనినంచి ఒక ఇనుపముక్క తోను ఒక కర్రముక్కతోను యిచ్చాడు. అవి బాబా కోసం అనేక సంవత్సరాల నుంచి దాచి ఉంచానని చెప్పాడు. ఇవి పనికిరాని వస్తువులుగా కనిపించినప్పటికీ నిజానికి యివి ఎంతో విలువైనవి. సాంకేతికంగా అవి ఏదో విశ్వనిర్మాణం కార్య క్రమానికి సంబంధించినవి. బాబా యివి తీసుకొని వెంటనే అక్కడ నుంచి ప్రయాణమయ్యారు. త్వరగా మండలిని స్టేషన్‌కి రమ్మని తొందరపెట్టి తీసుకు వెళ్ళారు.

1943వ సం॥ జూలై 22వ తేదీన గుజ్రన్‌వాలాలో ఒక మోటారు షెడ్డులో ఉంటూ ఉన్న మస్తాన్ రెహ్మాతుల్లాబాబా అనే మస్తును బాబా సాంగత్యం చేసారు. ఇతడు కుళ్ళుతో నిండిన మామూలుగా ఉండే మస్తు. ఆ తేదీనే గుజ్రన్ వాలాలో నంగాషా అనే మస్తును బాబా కలుసుకున్నారు. ఈ మస్తును యిదివరకు మే 1942లో బాబా ఒకమారు చూసారు. షేక్ మలంగ్‌బాబా అనే మస్తును కూడా ఆ తేదీనే బాబా సాంగత్యం చేసారు. ఇతడు వృద్ధుడు. ఉన్నతుడైన మస్తు. జమాలీ రకంలోని మంచి మస్తు. ఇతడు కుద్దేషా అనే సాధువు యొక్క దర్గాలో ఉంటుంటాడు. ఇదివరలో యితడు ఒక సబ్ జడ్జిగా ఉండేవాడు. ఒకదాని తరువాత ఒకటిగా ఆర్పకుండా సిగరెట్లు కాలుస్తూ ఉంటాడు. నెమ్మదిగా ఉంటూ సిగరెట్లు కాల్చడం యిష్టమైన యితనికి ఆలీషా అనే అహమద్‌నగర్ మస్తు

(బాబాకు అయిదుగురు యిష్టులలో ఒకడు)తో పోల్చవచ్చును. ఇతడు తరువాత గుజ్రన్‌వాలా విడిచి వెళ్ళిపోయాడు.

## బాబా షహబుద్దీన్

బాబా షహబుద్దీన్ అని భగవత్సాక్షాత్కారం పొందిన మహాత్ముడు భట్ లాహోరు అనే గ్రామంలో ఉన్నాడు. ఇండియాలో ఉన్న సప్తమ భూమికలోని యిద్దరు మజ్జూబ్‌లలో మజ్జూబ్-ఎ-కామిల్ ఒకడు. ఇతనిని భట్‌వాలాబాబా అని కూడా అంటారు. కొంచెం లావుగా ఉండే ఒక వృద్ధుడితడు. ఎక్కడికయినా నడిచి వెళ్ళేటప్పుడు పెద్దవాడు గనుక, ఎవరి భుజం మీద నయినా చేయివేసి నడిచేవాడు. ఇతనితో బాబా సాంగత్యం చేసినప్పుడు, మొదట స్నానం చేయించారు. తరువాత షహబుద్దీన్‌తో ఒక గంట ఏకాంతస్థలంలో కూర్చుని అతనితో సాంగత్యం చేసారు. స్నానం చేసిన తరువాత ఆ మస్తే బాబాను; ఏకాంతంగా వారితో కూర్చునేందుకు ఒక మంచి స్థలమునకు తీసుకువెళ్ళాడు.

"అనేక సంవత్సరముల క్రిందట షహబుద్దీన్‌బాబా ఒక గ్రామానికి వెళ్ళే దారిలో కూర్చున్నాడని అప్పుడు ఒక ఎద్దుబండి సరుకేదో వేసుకొని ఆ దారినే వచ్చిందని బండితోలేవాడు షహబుద్దీన్‌బాబాను అడ్డులెమ్మని కేకలు వేసాడని, ఎన్ని కేకలువేసినా అతడు దారినుంచి తొలగక పోగా ఆ బండివాడు కోపంతో బండిని అతనిమీద నుంచే పోనిచ్చాడని తరువాత వెనుదిరిగి చూడగా అతనికి ఏవిధమైన హానికలుగలేదని చెక్కుచెదరకుండా ఉండడం చూసి ఆ బండివాడికి ఆశ్చర్యం వేసి పశ్చాత్తాపం చెంది అతనినద్దకు వెళ్ళిక్షమార్పణ చెప్పుకున్నాడని'' ఒక కథఉంది. ఇది నిజంగా జరిగియే ఉండవచ్చును. ఏడవ భూమికలో ఉన్నాడంటే నేనే దేవుడను అని చెప్పుకోగలిగినవాడు. అతనికి సాధ్యం కానీ దేమీలేదు. అద్భుతమయిన సంగతి వలన అతనికి అఖండమైన కీర్తివచ్చింది. బండి శరీరం మీదనుంచి వెళ్ళిపోయిందంటే చావు తప్పించుకోలేరు. చావక పోయినా చావు దెబ్బలయినా తగులుతాయి తప్పదు.

బాబాషహబుద్దీన్ మజ్జూబ్ స్థితిలో ఉంటాడు. అంటే భగవంతునిలో లీనమైపోయి ఉంటాడు. అతనికి చాలామంది శిష్యులు కలరు. అతని పేరున పేద వారికి అన్నసత్రం ఒకటిపెట్టారు. ఈ ఆశ్రమంలో క్రూరుడైన ఒకడు ఒక

గుడిసెలో ఉండేవాడు. అనేక సంవత్సరముల క్రిందట ఒకరోజున ఒకడు 'తాను హత్యచేసానని' షహబుద్దీన్ వద్దకు వచ్చి చెప్పాడు. చెప్పి 'షహబుద్దీన్‌ను సహాయం చేయు'మన్నాడు. 'సరే అక్కడే ఉండమన్నాడు' ఆ మజ్జూబ్. బాబా షహబుద్దీన్ సాంగత్యం చేసినప్పుడు కూడా అప్పటికి అక్కడే ఉన్నాడు అతడు. కానీ ముఖం మాత్రం చూస్తే ఎంతో హింసపొందినట్లు కనిపిస్తుంది. తాను చేసిన క్రూర కార్యానికి అతని అంతరాత్మ అతనిని చిత్రవధ చేస్తూ ఉంటుంది కదా.

లాహోరులో బాబా ఒక యువక మస్తును కలుసుకున్నారు. ఆ మస్తు తండ్రే అతనికి ఏమికావాలో చూసుకుంటున్నాడు. అతని కుమారునికే తాను ఆధ్యాత్మిక కుమారునిగా ఉన్నాడు.

బాబా సైయిద్ అహమద్‌షా అనే జమాలీరకం మస్తును సాంగత్యం చేసారు. అతడు కుల్‌మోకా అనే గ్రామంలో ఉంటాడు. ఇతడు పొట్టిగా నాలుగడుగుల ఎత్తే ఉన్నాడు. సన్నగా ఉంటాడు. ఇతనికి నల్లమందు అంటే యిష్టం. ఆజిల్లాలో అందరూ ఇతనిని గౌరవిస్తారు. ఇతడు మంచి మస్తు అని బాబా చెప్పారు. ఇతని ఆశ్రమంలో పశువులున్నాయి. అతని శిష్యులు కూడా అక్కడే ఉంటున్నారు. ఇతడు దిగంబరిగానే ఉంటాడు. కానీ ఊరికే ఒక దుప్పటిమీద వేసుకుంటాడు. ఇతని వద్దకు వెళ్ళేటప్పుడు ఒక హోటలు యజమాని బాబాకి మండలికి భోజనం తయారుచేసి పెట్టాడు. అతడొక సిక్కు. పేరు మాత్రం ముస్లింలా ఉంది. ఆ భోజనం అర్థరాత్రి వేళ రెండు మైళ్ళ దూరమున ఉన్నరైలుస్టేషన్‌కి తెచ్చి పెట్టాడు. సాధారణంగా మస్తు ప్రయాణాలలో యిటువంటి సౌకర్యం దొరకదు. ఆ సిక్కువాడు దానికి డబ్బుతీసుకోవడానికి నిరాకరించాడు. ఈ మాత్రం నా సేవ అంగీకరించమని బాబాని బ్రతిమాలాడు. కానీ బాబా అందులకు ఒప్పుకోక అతనికి ఎంతడబ్బు యివ్వాలో అంతా యిచ్చేసారు. బాబా ఫలానా అని మండలి అతనికి తెలియపరచలేదు. మామూలుగా మస్తు సాంగత్యానికి వెళ్ళినప్పుడు బాబా ఎవరో ఎవరికీ తెలియపరచరు. 1943 జూలై 16వ తేదీన బాబా సైయిద్ అహమద్‌షాను సాంగత్యం చేసారు.

1943 జూలై 23వ తేదీన రావల్పిండిలో మస్తాన్‌షా అనే మస్తును బాబా సాంగత్యం చేసెరు. న్యూరోజ్ సినిమాకు ఎదురుగా యీ వృద్ధుడు

కూర్చుని ఉంటాడు. ఒక మారు ఎవరో అతనికి క్రాప్ చేయించాడుట. అప్పుడు కత్తిరించిన వెంట్రుకలన్ని పోగువేసి యీ మస్త్ తినేసాడట. ఇందుకు తప్ప ఇతడొక సాధారణమైన మస్త్ అని చెప్పవచ్చును. బాబా యింతకుముందు 1942 ఏప్రెల్‌లో రావల్పిండి వెళ్ళినప్పుడు యితనితో సాంగత్యం చేసారు. ఆ తేదీనే రావల్పిండిలో నంగాఖాన్‌మస్తాన్ పెషావరీ అనే మస్త్‌ను కూడా బాబా సాంగత్యం చేసారు. ఈ మస్త్‌కి 100 సంవత్సరముల వయస్సు ఉందని చెప్పారు. ఇతడు ఎన్ని మైళ్ళయినా పరుగెత్త గలడు. ఇతడు మాదర్‌జాద్ రకమునకు చెందిన మస్త్. దిగంబరంగా ఉంటాడు. ఇతడు సాధారణంగా నాలుగయిదు మైళ్ళు ఒకే సారి పరుగెత్తుతూ ఉంటాడు. తరువాత కాస్సేపు ఒకచిన్న గోతిలో కూర్చుని మళ్ళీ పరుగు సాగిస్తాడు. పరుగెత్తుతుంటే యితనికి స్థానిక ప్రజలు ఆహారం చేతికి అందిస్తారు. పరుగెత్తుతూనే అది తినేవాడు కూడాను. అయిదవ భూమికకు చెందిన మంచి మస్త్. ఇతనిని కూడా బాబా 1942 ఏప్రెల్‌లో మొట్టమొదట సాంగత్యం చేసారు.

అదే విధంగా షా సాహెబ్‌ను కూడా జూలై 23వ తేదీన సాంగత్యం చేసారు. ఇతడు వృద్ధుడు. అయిదారు పొడుగైన కోట్లు తొడుక్కుంటాడు. రావల్పిండి కంటోన్మెంటులో టోప్‌ఖానా రోడ్డులో ఒక గదిలో అనేక సంవత్సరము లుగా అతడు కూర్చున్నాడు. ఆ గదిలోనే తన సమాధికి గోయి త్రవ్వుకొని సిద్ధ పరిచాడు. వచ్చిన వారితో ఎప్పుడయినా అర్థమయేలా మాట్లాడుతాడు. సాధా రణంగా గోడవైపు తిరిగి ఏదో దానితో మాట్లాడినట్లు చెప్తాడు. ఎవరికీ అర్థం కాదు. ఇతడు జమాలీ రకమునకు చెందిన మంచి మస్త్. నంగాషామస్తాన్ అనే వాడు రావల్పిండిలో ఉండే మంచి మస్త్. ఖుతుబ్‌లా ఉండే మస్త్ ఆ ఊరిలో యితడొక్కడే. ఏది చేసినా గుండ్రంగా సున్నాలుగా చేస్తాడు. పూర్తి దిగంబరుడు. ఆర్క్టేయి వద్ద ఒక టెలిగ్రాఫ్ స్తంభమునకు చుట్టూ సున్నలా గుండ్రంగా తిరుగుతాడు. నేలమీద కూర్చుంటాడు. అతడు కూర్చుని ఏదయినా తింటే అది చేత్తో గుండ్రంగా కలుపుకుంటాడు. నిలబడి మూత్రం పోసుకుంటూ గుండ్రంగా నెమ్మదిగా తిరుగుతాడు. దారే వెళ్ళేవారిని డబ్బు కావాలని అడుగుతాడు. ఏదైనా యిస్తే ఆ డబ్బు విసిరేస్తాడు. ఈ మస్త్‌తో సాంగత్యంచేసి (1943 జూలై 23) బాబా ఒక కొండమీద ఏకాంతంగా 3 గంటలు ఒక్కరూ కూర్చున్నారు. ముర్రీ

వెళ్ళే రోడ్డుమీద ఆ కొండ ఉంది (17 మైళ్ళ దూరంలో) ఇతనిని కూడా బాబా 1942 ఏప్రెల్‌లో మొదట సాంగత్యం చేసారు.

1943 జూలై 23వ తేదీనే రావల్పిండిలో ఉంటిమాయి అనే మంచి ఉన్నతమైన మస్తానీని బాబా కలుసుకున్నారు. ఆమె చాలా ముసలిది. ఒక గోనె సంచి ఆమెమీద వేసుకుంటుంది. కంపెనీబాగ్‌లో ఇటుకలు పేర్చిన ఒక అరుగుమీద కూర్చుంటుంది. ఆమె ఒక కుక్కను పెంచుతోంది ఆమె తినే అన్నాన్ని ఆ కుక్కకుకూడా పెడుతుంది. ఆమెను తరచుగా పిల్లలు బాధ పెడుతూంటారు. బాబా మొదట్లో ఆమెను 1942 జూలైలో సాంగత్యం చేసారు. రెండవమారు పై తేదీన కలిసినప్పుడు బాబాను ఆమె ఒకకోటు యిమ్మని అడుగగా ఒకకోటు ఆమెకు యిచ్చారు. ఆమెకు ఎవరైనా ఏదయినా బహూమతి యిస్తేనెంటనే అది యింకొకరికి యిచ్చేస్తుంది. ఆమె నూటికి 90 పాళ్ళు జమాలీ అని 10 పాళ్ళు జలాలీ అని బాబా చెప్పారు. సాధారణంగా ఆమెవద్దకి ఎవరినీ రానివ్వదు. కానీ ఆమె బాబాను చూసినప్పుడు అయనను దగ్గరకు రమ్మని పిలిచింది. బాబా అ ఇటుకల అరుగు మీదకి ఎక్కి ఆమెను సమీపించి ప్రక్కన కూర్చున్నారు. అప్పుడామె ఒక పాతరొట్టె తీసి అది బాబాకి యిచ్చి తినమన్నది. అది బహుశా సంవత్సరం నాటి రొట్టె. మస్తు ఏమిచ్చినా బాబా అది స్వీకరిస్తారు. అలాగే ఆ రొట్టె తీసుకొని బాబా తిన్నారు. అది బాబాకు ఎంత రుచిగా ఉందో ఏమో.

లాహోరులో మొహియుద్దీన్ అనే వృద్ధ అన్వేషకులు ఒకడున్నాడు. చాలా సంవత్సరములు యితడు మౌనవ్రతం పట్టాడు. ఇతనికి చాలా మంది శిష్యులున్నారు. ఆగష్టు (1943) 1వ తేదీన బాబా బసచేసిన యింటికి ఆయన మండలి తీసుకువచ్చారు యీ అన్వేషకుణ్ణి. అప్పుడు బాబా అతనితో సాంగత్యం చేసారు. వెళ్ళేముందు బాబా అతనికి ఒకరూపాయి యిచ్చారు.

పెషావర్‌లో ఖాయుూమ్‌బాబా అనే జలాలీమస్తు ఒకడున్నాడు. అతనొక ముసలివాడు. ఒక చిన్నగదిలో నివసిస్తున్నాడు. అక్కడతడు అనేక వందల డబ్బాలు పోగుచేసి ఆగదిలో పడేసాడు. ఆ గదిలోనే ఖాయుూమ్‌బాబా ఎల్లప్పుడూ వెలిగే ధుని వుంచుకున్నాడు. అతడు నిత్యాగ్నిహోత్రి ఎంత వేసంగి అయినా సరే

నిప్పురాజుతూ ఉండవలసిందే. ఆ నిప్పు దగ్గర కూర్చుని ఏదో అస్తమానం వ్రాస్తూ వుండేవాడు. అతడెప్పుడూ నేరాలు శిక్షలు గురించి మాట్లాడుతూండేవాడు. దాన్ని గురించే అస్తమానం వ్రాసేవాడు కాబోలు. సాధారణంగా అతడంటూఉంటే వినిపిస్తుంది. 'వీడికి రెండేళ్ళు వెయ్యండి, వాడికి 50 రూపాయలు జరిమాన విధించండి', వాడిని ఉరితీసేయండి', 'వాడిని ఒదిలేయండి. పోనివ్వండి' అని యీ విధంగా అంటూ ఉండేవాడు. ఒక ముజావర్ అతనికి ఏంకావాలో చూస్తుంటాడు. బాబా యితనిని 1943 ఆగస్టులో సాంగత్యం చేసారు. పెషావర్‌లో విశ్వంలో ఎవరికి శిక్షవేస్తున్నాడో.

అషన్‌బాబా అనే నడివయసు కలిగిన మస్తు పెషావర్‌లో కాబూల్‌రోడ్ లోని కంటోన్మెంటు తీగ ద్వారమునకు బయట తిరుగుతూ ఉండేవాడు. 1943 ఆగస్టులో బాబా అతనితో సాంగత్యం చేసినప్పుడు ఈ మస్తుకి ఒక పుచ్చకాయ యిచ్చారు. మరల పెషావర్‌కి వచ్చినప్పుడు బైదుల్, అషక్ బాబాను, బాబా సాంగత్యం చేసిన విషయం జ్ఞాపకముంచుకున్నా ఒకనిని కలిసాడు. బాబా తనతో సాంగత్యం చేసినప్పటి నుండియు అషక్‌బాబా, తన గుడిసెలో నుంచి బయటకే రావడం లేదని చెప్పాడు. గుడిసెలోనే చెత్తలో కూర్చుంటాడని అన్నాడు. అతడు మజ్జూబ్ మాదిరిగా అయి పోయినట్లు తెలిసినది.

1943 ఆగస్టులో మిస్కిన్‌షామలాంగ్ అనే అన్వేషకుని పెషావర్‌లో బాబా సాంగత్యం చేసారు. ఇతడు ఒక దర్గాలో నివసిస్తున్నాడు. అతని వద్ద పవిత్రమైన ధుని వెలిగించి ఉంటుంది పెషావర్‌లో యితనంటే చాలా గౌరవం. ఆ నెలలోనే నంగాబాబా అనే అహ్మద్‌షాను బాబా పెషావర్‌లో కలుసుకున్నారు. ఇతడు ఒక అసలయిన జలాలీ మస్తు చాలా ఉన్నతుడు. ఒక స్మశానంలో ఒక గుడిసెలో నగ్నంగా కూర్చుంటాడు. హుక్కా పీలుస్తుంటాడు. ఎవరయినా దగ్గరకు పోతే తిడ తాడు. తనముందు ఒక దుంగ వేసుకొని దానిని ఒక బలమైన పెద్దకత్తితో ఎప్పుడూ కొడుతూంటాడు. అనేక సంవత్సరములుగా ఆ గుడిసెలో ఉండి యిప్పుడు ముసలివాడయ్యాడు. బాబా అతని వద్దకు రెండు మార్లు చూడటానికి వెళ్ళారు. అతడు జలాలీ మస్తు గనుక సరిగా అతనితో సాంగత్యం చేయడానికి వీలులేక పోయింది. నంగాబాబా యొక్క పరిచారకుడు అతడు పెషావర్‌లో చాలాకాలం ఉన్న అతడు డెక్కన్ పీఠభూమి నుండి వచ్చాడని చెప్పాడు. (హైదరాబాద్ ప్రాంతం.)

1943 ఆగస్టు 6వ తేదీన బాబాఫకీర్ అను నిజమైన ఫకీర్‌ను హసన్ అబ్దల్ అనే గ్రామంలో బాబా సాంగత్యం చేసారు. ఆ రోజునే ఆ గ్రామంలో హిందూ మస్తాన్ అనే మస్తును కూడా కలిసారు. ఆగస్టు మాసంలో హరిపూర్‌లో బాబా గాజులు తొడుగుకుని ఉన్న ఒక మహబూబీ మస్తును సాంగత్యం చేసారు. ఆనుస్తు ఒక మడుగు గట్టున ఒక గుడిసెలో వుంటున్నాడు. అతని పేరు బాగులాబ్. ఈ మాసంలోనే బాబా హరిపూర్‌లో బాబాలోక్ అనే మస్తును సాంగత్యం చేసి అతనికి భోజనం పెట్టారు. అతడొక మధ్య వయస్కుడు. హరిపూర్‌లో యితనిని ప్రజలు ఎక్కువగా గౌరవిస్తారు.

ఆగస్టులోనే బాబాకరీంఖాన్ అను ఒక ముసలి వానిని బాబా సాంగత్యం చేసారు. అతడు పొడవైన కఫ్నీని తొడుగుకొని యున్నాడు. ఇతడు రోడ్డు ప్రక్కన ఒక గుడిసెలో నివసించేవాడు. ఆగస్టు (1943) 21వ తేదీన బాబా కంచ్నీవాలా మస్తాన్ అనే మస్తును లాహోరులో బాబా సాంగత్యం చేసారు. ఇతడొక మంచి మస్తు అనీ చాలా తిరుగుతుంటాడనీ బాబా చెప్పారు. ఈ మస్తు సైయిద్ పురాలో ఒక మసీదులో కూర్చుండేవాడని ఆ మసీదులోనే బాబా అతనితో సాంగత్యం చేసారని తెలుస్తోంది. ఆ రోజునే (ఆగస్టు 21వ తేదీ) లాహోరులో ఒక సినిమా వద్ద ఒక చెట్టు క్రింద కూర్చుని ఉన్న సైయిద్ మస్తాన్ అనే మస్తును బాబా సాంగత్యం చేసారు. బాబా క్రిందటి సంవత్సరం మే నెలలో యిక్కడికి వచ్చినప్పుడ యిదే పేరు గల ఒక మస్తును హుజూరీ ద్వారం వద్ద సాంగత్యం చేసారు. ఇతడు వేరు అతడు వేరు ఆగస్టు (1643) 29వ తేదీన బాబా కర్తార్‌పురంలో చూహీబాబా అనే హరిజన వృద్ధుని సాంగత్యం చేసారు. ఇతడు మోతాదుగా ఉండే ఒక మస్తు. ఎన్నో సంవత్సరముల నుంచి ఒక మజ్జూబ్ వలె ఉన్నాడు. తెల్లవారుజామున రెండు గంటలకు బాబా అతనిని సాంగత్యం చేసారు.

ఇంతకు ముందు ఆగస్టు 23వ తేదీన కర్తార్ పురం వద్ద హాజీమస్తాన్ అనే మంచి మస్తును బాబా సాంగత్యం చేసారు. అతడు నడివయస్కుడైన ఒక దిగంబర మస్తు కర్తార్‌పురం నుంచి మూడు మైళ్ళ దూరంలో వున్న ఆప్‌గావ్ అనే గ్రామంలో కనిపించాడీ మస్తు రెండు గడ్డిమేటుల మధ్య ఇతడు కూర్చుండి ఉండగా బాబా మండలి యితనిని కనుగొన్నారు. బాబా ఇతనికి మిఠాయి పెట్టారు.

సెప్టెంబరు మాసంలో బాబా హరిపూర్ మళ్ళీ వెళ్ళి అక్కడ రెహ్మాతుల్లా బాబా అనే ఒక అన్వేషకుని సాంగత్యం చేసారు. సెప్టెంబరు మాసంలో బాబా కాశ్మీర్ వెళ్ళారు. అక్కడ చాలా మంది మస్తులను బాబా సాంగత్యం చేసారు. వీరిలో కొంత మందిని బాబా మరల 1944వ సం।లో కలుసుకున్నారు. కాశ్మీర్ వెళ్ళి నప్పుడు బాబా జాన్‌గిరాన్ అనే కొండ ప్రాంతానికి వెళ్ళారు. అది శ్రీనగర్‌కి వాయువ్యంగా సింధునది ఎడమ గట్టున వుంది.

(1943వ సంవత్సరం) సెప్టెంబర్ నెలలో జాస్పిరాన్‌లో బాబా నంగాబాబా అనే మస్తును చూసారు. ఇతడు మజ్జూబ్ స్థితిలో ఉన్నా ఉన్నతుడైన మస్తు. బాబా యితడు ఆరు, ఏడవ భూమికల మధ్య వున్నాడని చెప్పారు నంగాబాబా 25 సంవత్సరములు వరుసగా ఒక కొండ మీద నగ్నంగా కూర్చుని ఉన్నాడు జాస్పిరాన్ అనే గ్రామం సముద్ర మట్టమునకు 2,500 అడుగుల ఎత్తున ఉన్నది. అది అడవితో కూడిన కొండ ప్రదేశం అది సింధునదికి ఎడమ గట్టుపైన వున్న గ్రామం. శీతాకాలంలో అక్కడ మూడు నాలుగు మారులు మంచు దట్టముగా కురుస్తుంది. నంగాబాబా యీ పాతికేళ్ళు బట్టలు లేకుండా వర్షంలోను, ఎండలోను చలిలోను, మంచులోను అలాగే కూర్చున్నాడు. అతని భోజనం సంగతి తెలుసుకుంటే నమ్మలేము. అతడు ఎండు రొట్టె, కఱ్ఱ, రాళ్ళు తింటాడు. కఱ్ఱ మొదట వీళ్ళలో నానవేసి కొన్ని గంటలసేపు, రాళ్ళు పిండి క్రింద విసరి, నానవేసిన కఱ్ఱ, నూరగా వచ్చినదీ, ఆ రాళ్ళపిండి కలిపి తింటాడు. అతని సేవకుడు ఈ విసరడం రుబ్బడం, దేస్తుంటాడు' ఈ విసిరిన పిండి ఒక రొట్టెలాగ చేసి నంగ బాబా అది తింటాడు. ఈ పని ఒక పరిచారికుని చేత చేయించేవాడు.

నంగాబాబా చుట్టూ చాలా మంది జనం ఉండుటచేత అతనిని ఏకాంతగా చూడాలనుకున్నా బాబా అట్లు ఏకాంత సాంగత్యం చేయలేక పోయారు. రాత్రి కూడా నంగాబాబా ఒక్కడూ ఉండడు. అతని సేవకుడు ప్రక్కన పరుంటాడు. బాబా వెళ్ళి నంగాబాబా ఎదుట కూర్చున్న కొంతసేపటికి నంగాబాబా బాబా వైపు చూసి "ఆయన మా అన్నయ్య, ఆయన ప్రపంచాన్నంతటినీ సరిదిద్ది రక్షిస్తూ ఉంటాడు" అన్నాడు.

జాస్పిరాన్‌కి వెళ్ళిరావడం చాలా శ్రమతో కూడిన పని. హరిపూర్‌కి ఆఊరు 20మైళ్ళు ఉంటుంది. అంతా రాళ్ళదారి. నడచి వెళ్ళడం కష్టం. గుర్రాలు ఎక్కి వెళ్ళాలి. బాబా బృందం వెళ్ళేటప్పుడు గుర్రాల మీద ఎక్కికూర్చుని వెళ్ళారు కానీ, తిరిగి వచ్చినప్పుడు హర్‌పాల్‌పూర్ వరకూ నడిచే వచ్చారు. వారి సామాను మోయడానికి మాత్రం వచ్చేటప్పుడు ఒక గుర్రం ఉపయోగించారు. దారి కొండ లలోనుంచి గుట్టల మీద నుంచి లోయలలో నుంచి వంతెనలు లేని ఏరులకి అడ్డంగా పోతుంది. ఆపదలతో కూడిన ఆ ప్రయాణం చాలా ప్రయాసకరంగా ఉంది. బాబా అతనిని 1943వ సంవత్సరంలో సాంగత్యం చేసారు. తరువాత 1944 సం॥ లోనే, నంగాబాబా మరణించాడు. ఇన్ని కష్టాలు పడి వెళ్ళి బాబా ఆ మస్తులతో ఏం పని చేస్తారో బాబాకే గానీ యింకెవరికీ తెలి యదు. బాబా చేసే ఆధ్యాత్మిక కార్యంలో ఆ సాంగత్యం అన్యోన్య సహాయం కలుగ జేస్తుందన్నారు బాబా.

1943 సెప్టెంబరు మాసంలో కాశ్మీర్ దేశంలో అచ్చిబల్ అనే స్థలంలో 40,45 సంవత్సరముల వయసుగల తోటూమట్టూ అనే ఉన్నతుడైన మస్తును బాబా సాంగత్యం చేసారు. ఒక నీటి యింజను వద్దనున్న ఒక చిన్న గుడిసెలో నివసి స్తున్నాడితడు. మజ్జూబ్ వంటి స్థితిలో తరుచుగా ఉండేవాడితడు. కొన్ని సమ యాలలో సాలిక్ వంటి స్థితిలో ఉంటాడు. ఇతడు ప్రార్థనలు వ్రాసి మంత్రాలు వేసి తాయత్తులు యిస్తాడు కావలసినవారికి. ఇక్కడికి వచ్చి యీ గుడిసెలో ఉండే ముందు కాశ్మీర్ దేశంలో అనేక సంవత్సరాలు తిరుగాడాడు. 'కాశ్మీరులో అయిదు గురు గొప్ప మస్తులున్నారని బాబా చెప్పారు. ఇతడు ఆరవవాడనియు వారి తరు వాత యితడే గొప్పవాడని' బాబా అన్నారు. బాబా ఇతనిని మరల 1944 సెప్టెంబరు 4వ తేదీన కలిసారు.

1943వ సంవత్సరంలో సెప్టెంబరు 14వ తేదీన బాబా చీనీవాలాబాబా అనే మస్తును అమృతసర్‌లో సాంగత్యం చేసాడు. బాబా కనిపించగానే అతడు నూరు రూపాయలిమ్మని కోరాడు. వెంటనే బాబా ఆ సొమ్ము అతనికి యిచ్చారు. ఇతడొక మోతాదుగా ఉండేమస్తు. ఆ నెలలో కాలాసాయిన్ అనే ఉత్తీర్ణుడైన యాత్రి కుని అమృతసర్‌లో బాబా సాంగత్యం చేశారు. ఇతనికి 110 సంవత్సరములు వయ సుంది. ఇతను మామూలు చైతన్యస్థితిలో ఉన్నాడు. అందుచేత మస్తు కాడు యితడు.

మామూలుగా ఉన్నా యితడెవరితోనూ మాట్లాడడు. ఇంతకు ముందు బాబా యితనిని 1942వ సంవత్సరం ఏప్రెల్ లో కలిసారు. ఇతడు ఏకాంత స్థలంలో అమృతసర్ ఊరి బయట ఒక గుడిలో ఉండేవాడు. 1946 మే నెలలో ఇతడు ఒక చెట్టు క్రింద దిగంబరిగాకూర్చునేవాడు. అతడంటే బాబాకి చాలా యిష్టం.

సెప్టెంబరు 17వ తేదీన లాహోరులో మురశ్ సాయిన్ అనే మస్తును బాబా సాంగత్య చేసారు. ఆ రోజునే కాశ్మీర్‌బాబా అనే మస్తును కూడా బాబా కలిసారు. అక్కడే మిస్కిన్‌బాబాను కూడా కలిసారు 1943 సెప్టెంబరు 21వ తేదీన బాబా ఎనమండుగురు మస్తులను సాంగత్యం చేసారు. వారి నందరినీ బాబా లాహోరులో ఉన్న యింటికి తీసికొనిరాగా బాబా వారికి స్నానములు చేయించి భోజనము పెట్టి నూతన వస్త్రములిచ్చి వారి సాంగత్యం చేసారు. వారిలో 7 గురు సాధారణ మస్తులు. వీరిని ఆరోజే నగరంలోనికి పంపించేసారు. ఒక మంచి మస్తును తమతో ఉంచుకున్నారు బాబా. ఇతనిని కూడా రెండు మూడు రోజులలో పంపించివేశారు.

ఆ మరునాడు లాహోరులో బాలీమస్తాన్ అనే మస్తును బాబా సాంగత్యం చేశారు. ఈ మస్తు ఒక ఎర్రని జెండాను కొన్ని కర్రలను చేతులతో తీసికొని వెళ్ళేవాడు. ఒక్కొక్కప్పుడు రైలు పట్టాల వద్ద తిరుగుతూ ఎర్ర జెండా ఆడిస్తుండేవాడు. ఏ రైలు అయినా వస్తే అది చూసి అతనివి ఎరుగని డ్రైవరయితే రైలు ఆపి వేసేవాడు. పంజాబ్ దేశంలో అన్నిచోట్లకి రైలుమీద ప్రయాణం చేసేవాడు. చాలా పట్టణాలలో యితనిని చాలా మంది ఎరుగుదురు. లాహోరులో అతనిని బాబా దిగిన బంగళాలకు బాబా మండలి తీసికొనివస్తే అక్కడ బాబా అతనిని సాంగత్యం చేశారు. మరునాడు సెప్టెంబరు (1943) 23వ తేదీన నిమూమస్తాన్ అనెడి మస్తును మండూమస్తాన్ అనెడి యింకొక మస్తును బాబా సాంగత్యం చేశారు. 30వ తేదీన బాబా గూండావాలాబాబా అనే మస్తుని సాంగత్యం చేశారు. ఆ తేదీనే జాఫర్ మస్తాన్ అనే మస్తుని కూడా కలుసుకున్నారు. ఇతడు వల్లని గుడ్డలు ధరిస్తాడు. పెద్ద కర్రఒకటి చేతిలో పట్టుకుంటాడు. ప్రజలు యితనిని ఎంతో గౌరవిస్తారు అదే రోజున మియా మిస్త్రి దర్గాలో ఉండే జానీ మస్తానీని కూడా కలిశారు బాబా. ఆమెదిగంబరి. బట్టలు యిస్తే ఆమె విసిరి పారేస్తుంది. ఈమెను బాబా మరల నవంబరు మాసంలో సాంగత్యం చేశారు. సెప్టెంబరు 26వ తేదీన లోబామస్తు అనే ముసలి వానిని

ఇచ్ఛ్రాలో ఒక దర్గాలో బాబా సాంగత్యం చేసారు. అతడు నడవలేక ఉన్నాడు. ఆ దర్గా ఒక గోరీల దొడ్డిలో వుంది. దానికి కాపలాదార్లు అతని పోషణ భారం వహించారు. ఆ రోజునే మాంయీకూలీ అనే మంచి మస్తానీని బాబా సాంగత్యం చేసారు. ఈమె వృద్ధురాలు. ఈమెకు చాలా మంది శిష్యులున్నారు. ఆమె ధుని వెలిగించి ఊరుకుంటుంది. అది ఆరిపోకుండా ఆ శిష్యులు చూసుకుంటారు. ఆ చుట్టు పట్ల గ్రామాలలో ఆమె ప్రసిద్ధి కెక్కినది.

ఆ మరునాడు (27-9-43 తేదీన) ఇచ్ఛ్రా (లాహోరు) నుంచి ఒక అన్వేషకుని మండలి బాబా ఉన్న యింటికి తీసుకువచ్చారు. అతని పేరు ముండియా మస్తాన్. బాబా అతనికి స్నానం చేయించి క్రొత్త బట్టలు కట్టించి భోజనం పెట్టారు. తరువాత అతనితో సాంగత్యం చేసారు. అతడు బాబాని ఒక 'కప్పు, సాసరు కావాలని' అడిగాడు. అవే కాకుండా కొంత డబ్బు కూడా యిచ్చి బాబా అతనిని పంపించారు. 28వ తేదీన సైయిద్ అహమ్మద్ షా అనే జమాలీ మస్తును బాబా సాంగత్యం చేసారు.

ఆరోజు బాబా కసూర్ అనే గ్రామమునకు వెళ్ళారు. అక్కడ చౌదురిలాత్ అనే అత్యున్నతుడైన జలాలీ మస్తును కలుసు కున్నారు. ఇతడు ఒక చిన్న గదిలో ఉండేవాడు. కానీ యితడు అనేకమైన దుస్తులు ధరిస్తాడు. అవి చాలక యింకా అయిదారు దుప్పట్లు శాలువాలు కప్పుకుంటాండు. అన్ని కాలములలోను యిలాగే అనేక మయిన బట్టలు ధరిస్తాడు. వేసంగి వేడి ఎంత ఎక్కువుగా ఉన్నా అలాగే బట్టలను ధరిస్తాడు. మొదట ఇతని కోసం బైడుల్ వచ్చేసరికి అతనిని వీపుమీద ఒక చెప్పుతో చరిచాడు, ఎవరైనా ఆ వాళ్ళు అతని దగ్గరకు వస్తే వాళ్ళని కూడా కొడతాడు. ఇతడు జలాలీ మస్తు అని ఇదివరకే చెప్పావు కదా. ఆ లక్షణం అదే కానీ యితనిని గూర్చి మంచి మస్తు అని బాబా చెప్పారు. అదే తేదీన కసూర్‌లో యింకా ముగ్గురు మస్తులను బాబా సాంగత్యం చేసారు.

1943 సెప్టెంబరు 30వ తేదీన మానా మస్తాన్ పఠాన్ అనే పొడవైన వృద్ధుని బాబా లాహొర్‌లో సాంగత్యం చేసారు. ఇతనిని చూస్తే నవ్వు వస్తుంది. ఒక భుజం మీద ఒక రజాయి వేసుకొని తిరుగుతూంటాడు. వండుకునే పాత్ర టీకెటిల్, ఒక లాంతరు కూడా పట్టుకుని తిరుగుతాడు. ఇతని వద్ద రెండు మూడు

పెద్ద కుక్కలున్నాయి. ఈ కుక్కలతనితో వస్తుంటాయి. వీధిలో కుక్క పిల్లలు కనిపిస్తే ఇతడు వాటిని ఎత్తుకొని ఆ లాంతరు వగైరాలుతో పాటు తీసుకు వెళ్తాడు. లేకపోతే వాటి మెడకి త్రాడుపోసి తన గుడిసె వద్దకు లాక్కుపోతాడు. 'పెషావర్ వెళ్తానని' అస్తమానూ అంటూ వుంటాడు. అది అతని జన్మస్థలం. ఈ మస్తూ లాహోరులో వుంటూఉన్నా జన్మ స్థలమయిన పెషావర్ని రోజూ తలచుకుంటూ ఉంటాడు. బాగ్ బాన్ పురా (లాహోరు)లో నవాబ్ ఆలీషా అనే మంచి మస్తు వున్నాడు. బైదుల్ అతని కోసం సెప్టెంబరు మాసంలో వెళ్ళినప్పుడు అతనితో ఆ మస్తు ఇలా అన్నాడు- "నాకు ఆలిగర్ వెళ్ళాలని ఉంది కానీ నాకు రోడ్ మూసేసారు. లాహోరులో ప్రపంచ ప్రఖ్యాతి పొందిన డాక్టరున్నాడు. ఆయనను అనుమతి కోసం అడుగుతాను. ఆయన సెలవు యిస్తే వెళ్తాను."

"ఆ డాక్టరు పేరేమిటి?" అని అడిగాడు బైదుల్ ఆ మస్తును. అతడు "మౌని" (మౌనంగా ఉండే వాడు) అని జవాబిచ్చాడు. "నీవు (బైదుల్ని సంబోధిస్తూ) ఆయన వద్ద నుండేగా వచ్చావు. నవాబ్ ఆలీషా చాలా సంతోషించాడు. బైదుల్కి ఒక రూపాయి యిచ్చాడు. ఒక తమలపాకు, ఒక సిగరెట్ పాకెట్ కూడా యిచ్చాడు. తరువాత బాబా 30 సెప్టెంబరు తేదీన నవాబ్ అలీషా మస్తును సాంగత్యం చేసారు.

1943వ సంవత్సరం అక్టోబరు మాసంలో బాబా ఫదన్ మస్తు అనీ దూాలె సాహెబ్ అని ఇద్దరు మస్తులను సాంగత్యం చేసారు. అ మాసంలోనే బాబా మస్తాన్ దాదాను కూడా కలిసారు. ఈ అక్టోబరు మాసంలో పిషోర్ వాలా అను యింకొక మస్తును కూడా లాహోరులో సాంగత్యం చేసారు. అక్టోబరు 7వ తేదీన లాహోరులో బాబా బాబాషాజు మస్తానీ షంటి మస్తుని సాంగత్యం చేసారు. ఆ రోజునే కౌలామస్తాన్ అనే ఒక మస్తును కూడా బాబా కలుసుకున్నారు. అతడెప్పుడూ తిరుగుతూ వుంటాడు. ఇచ్ఛాలో (లాహోరు) లాలాసాయిన్ అనే మస్తును అక్టోబరు 7వ తేదీన బాబా సాంగత్యం చేసారు. అక్కడ నుంచి బాబా కొందరు శిష్యులతో కలకత్తా వెళ్ళారు. అది 1943వ సం. అక్టోబరు మాసం. ఆ సమయంలో తీవ్రమైన కరువు సంభవించింది. అది భయంకరమైన క్షామం. అనేక లక్షల మంది వంగదేశంలో ఆకలిబాధ చేత ప్రాణాలు వదిలేసారు. ఈ మారు కలకత్తా వెళ్ళినప్పుడు బాబా మూడు ముఖ్యమైన పనులు చేసారు. వెయ్యి మందికి

సంతర్పణ చేసారు. పదివేల చపాతీలు చేయించి అవి రిక్షాలలో తీసికొని వెళ్ళి పంచి పెట్టించారు. రెండువేల మంది పిల్లలకు క్రొత్త చొక్కాలు కొని పంచిపెట్టారు. లాన్స్‌డౌన్ రోడ్డు 44వ నెంబరు వద్ద పుర్ద్రోపుకుర్ సహాయ కేంద్రంలో వెయ్యిమంది మధ్య తరగతి కుటుంబముల వారికి సంతర్పణ చేయించారు. ఇందుకు బాబా చాలా ధనం ఖర్చు చేయించారు. బిచ్చమెత్తుటకు సిగ్గు పడుతూ తినడానికి లేని అనేక మధ్యతరగతి కుటుంబాల వారిని ఈ సంతర్పణకి ఆహ్వానించారు. అటువంటి కుటుంబములకు బాబా ధన సహాయం కూడా చేశారు. ఈ కాలము నందు ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. అందుచేత మధ్య తరగతి కుటుంబాల వారిలో కూడా ఆకలితో అనేక మంది మరణించారు. వీరంతా ఒక పాఠశాలా భవనంలో భోజనాలకి కూర్చున్నప్పుడు 'హిందువు కానివాడు వడ్డిస్తున్నాడని' కొందరు హిందువులు పూర్వాచారపరాయణులు అభ్యంతరం చెప్పారు. ఆ హిందువు కాని వ్యక్తి బాబాయే. బాబా ఫలానా అని ఎవరికీ తెలియకుండా ఈ సేవ స్వయంగా చేసారు. కలకత్తాలోని సంఘసేవకులు ఈ సంతర్పణ చేయించడంలో సహాయం చేసారు. అక్కడ భోజనం చేసేవారికి 'బాబా, వారియొక్క శిష్యులు బొంబాయి నుంచి యింత దూరము వచ్చి ఈపుణ్యకార్యము చేస్తున్నారని' చెప్పారు. భోజనాలయిన తరువాత బాబా స్వయంగా ధోవతులు, చీరలు, కొంత ధనము పంచిపెట్టారు. ఆ రోజు అక్టోబరు 18 వ తేదీ. ఈ సంతర్పణతో పాటు పదివేల చపాతీలు చేయించి ఒక రిక్షాలో పెట్టించి అన్ని వీధులు తిప్పించి బాబా శిష్యులచేత పంచిపెట్టించారు. బాబా శిష్యులలో బాబాదాస్ కూడా వున్నాడు. ఈ పని చేయడంలో బాబాదాస్‌కి, సి. డి దేశ్‌ముఖ్ సహాయం చేసాడు. ఇలా రిక్షా చపాతీలతో నింపి వీధులు తిరుగుతూ పంచిపెడుతుంటే ఒక మస్తు వచ్చి రిక్షా చక్రం ముట్టుకొని శిరస్సుకి తగిలేలా చేతులు జోడించి నమస్కారం చేసాడు. ఒక చపాతీ కూడా అడుగకుండా వెళ్ళిపోయాడు.

ఈ విధంగా చపాతీలు చేయించి రిక్షాలో వేయించి నాలుగయిదు రోజులు నగర వీధులలో తిరిగి బాబా ఆ చపాతీలు పంచి పెట్టించారు. బాబా కొన్ని మిఠాయిలు తీసుకొని చిదిపి చపాతీలతో ఆ తియ్యని మిఠాయి కూడా పంచిపెట్టారు. 'ఇవ్వగానే ఆ మిఠాయి ముక్కలు నోటిలో వేసుకోమని' బాబా చెప్పించేవారు. చపాతీ అప్పుడుతినక పోయినా వాడుమిఠాయి ముక్కలు మాత్రం తినాలి. కడుపుకాలి అన్నం లేక అలమటిస్తున్న వారికి మిఠాయి ఎక్కడ దొరుకుతుంది. పైగా మిఠాయి

ముక్కలు ముందుతిని నోరు తీపిచేసు కోవడంలో ఆతీపి మిఠాయిలో బాబాఆధ్యాత్మి కంగా విశేషంగా ఏదోవారికి యిచ్చి వుండాలి. అందుకే వారికది ముదు తినిపించే వారు. ఈ విధంగా బాబా ప్రసాదం తీసుకొని తిన్నవారిద్వారా బాబా ఆంతరంగికమైన ఒక బృహత్కార్య మాచరించారు. బాబా కలకత్తా విడచి వెళ్ళిపోయే ముందు స్థానిక సహాయ కేంద్ర కార్యకర్తల సంఘానికి కొంత సొమ్ము యిచ్చి 2000 మంది పేద వారి పిల్లలకు చొక్కాలు కొని పంచిపెట్టే ఏర్పాటు చేయించారు. కలకత్తాలో పని చేసే ప్రతి సహాయ కేంద్రానికి వెళ్ళి బాబా వారుచేసే పని చూసి వచ్చారు. ఈ పర్యటనలో కలకత్తాలో రామ తీర్థ ప్రచురణ సంఘం వారి సహాయంతో వర్మ మెమోరియల్‌హాల్ అనే పెద్ద పుస్తక భాండాగారంలో పేదవారికి బాబా షడ్రసోపే తంగా భోజనం పెట్టించారు. ఒక సద్గురువు పేదవారికి ధర్మం చేస్తే అది పుచ్చు కున్న వారు ప్రపంచానికి కలిగే ఆధ్యాత్మికలాభానికి మార్గంగా ఉంటారు. అంటే వారి ద్వారా ప్రపంచానికి ఆధ్యాత్మిక లాభం కలుగుతుంది—అని బాబా వివరించారు. ఈ సంతర్పణల వలన బాబా రెండు కార్యములు ఈ విధంగా సాధించారు. ఆ రోజులలో నలుగురు మస్తుల సాంగత్యం కూడా బాబా చేశారు. బాబా కలకత్తా నుంచి మరల లాహోరు వెళ్తూ లక్నోలో దిగారు. అక్కడ కొన్ని రోజులున్నారు. ఆ సమయంలో కొందరు పేదవారికి బాబా కడుపునిండా భోజనము పెట్టారు. ఈ ధర్మ కార్యములు కలకత్తాలోను యిక్కడా కూడా ఎవరు చేస్తున్నారో పైకి తెలియలేదు. బాబా పేరు తెలియకుండా ఉంచవలసి వచ్చింది. అందుచేత అడిగిన వారి ప్రశ్నలకు బాబా మండలి వారు జవాబులు చెప్పక తప్పించుకోవలసి వచ్చింది. బాబా యొక్క మౌనం చూసి అయన శారీరక సౌందర్యం చూసి చాలా మంది ఆకర్షితులయ్యారు. ఈ విందు భోజనంలో పేదవారే గాక, వికలాంగులు అన్ని వర్గాలవారు, మతముల వారు బ్రాహ్మ ణులు, మహమద్దీయులు, కుష్ఠురోగులు, బిచ్చగాండ్రు అందరూ ఒక పంక్తిలో కూర్చుని భోజనములు చేసారు. ఇండియాలో యిలా కూర్చుని భోజనములు చేయ డం అరుదు. మండలి సహాయంతో బాబా వారికి స్వయంగా వడ్డించారు. భోజన ములయిన తరువాత వారందరికి బాబా స్వహస్తములతో ఒక్కొక్కరికి ఒక రూపాయి చొప్పున దక్షిణను పంచిపెట్టారు.

1943 అక్టోబరు 21వ తేదీన లక్నోలో బాబా ఒక వృద్ధురాలిని కలుసుకు న్నారు. ఆమె పేరు నిసిబన్ మస్తానీ. ఈమె 6వ భూమికలో ఉత్తీర్ణురాలయిన

యాత్రికురాలు. ఈమె కొంతకాలం తరువాత కాల ధర్మం చెందినది. లక్నోలో ఈ మస్తానీ ఒకానొక వంతెన వద్ద కూర్చుని ఉండేది. ఇంతకు ముందు బాబా ఈమెను రెండు మారులు సాంగత్యం చేసారు. 1941 అక్టోబరులో మొదటిమాటు సాంగత్యం చేసినప్పుడు బాబా ఆమెకు ప్రత్యేకమైన ఒక చీర, కొన్ని మిఠాయిలు ఇచ్చారు. ఆమె అందులో కొన్ని మిఠాయిలు తీసుకొని మిగతావి తిరిగి బాబాకే యిచ్చివేసినది. రెండవమారు 1942 మార్చిలో ఆమెను బాబా సాంగత్యం చేయుడానికి వెళ్ళినప్పుడు ఆమె ఒక హరిజనుల పేటకి వెళ్ళగా బాబా కూడా ఆమెకోసం అక్కడికి వెళ్ళారు. అక్కడ ఆమెను సాంగత్యం చేసి మెడకు చుట్టుకునే స్కార్ఫ్ ఆమెకు బహూకరించారు. ఇది ఆమె తలకు చుట్టుకుంది. తరువాత వెంటనే తీసేసి ఆమె ప్రక్కను నిలబడి వున్న ఒక హరిజన స్త్రీకి యిచ్చేసింది. తరువాత ఆమె బాబాను యింకొక స్కార్ఫ్ యిమ్మని అది యిచ్చిన తరువాత అలాగే చేసి అక్కడ యింకొక హరిజన స్త్రీకి యిచ్చినది. ఆమెను లక్నోలో చాలా గొప్పగా గౌరవిస్తారు. అప్పుడప్పుడు ఆమెకోసం ఒక రాఖీ వస్తూండేదని చెప్పారు.

1943 అక్టోబరు 21వ తేదీన లక్నోలో బాబా ఒక లావుపాటి వృద్ధురాలిని సాంగత్యం చేసారు. ఆమె పేరు బడేబీబీ. ఈమె ఒక పొడుగయిన కఫ్నీ ధరించి ఉండెడిది. ఎప్పుడూ ఆమెతో ఒక మూట మోసుకుని వెళ్ళేది. పగలంతా ఒకచోట కూర్చుని రాత్రిళ్ళు నగరం అంతా తిరుగుతూండేది. ఈమె మంచి మస్తానీ. తరువాత యీమె కాలం చేసింది. ఆ రోజునే బాబా లక్నోలో అల్లావాలాబాబా అనే మస్తును సాంగత్యం చేసారు. లక్నోనుంచి కపూర్తల, ఫగ్వార్, జలంధర్ మీదుగా బాబా లాహోరు వెళ్ళారు. అప్పటికి అక్టోబరు ఆఖరివారం. అక్టోబరు 25వ తేదీన తమ భక్తులకు ఒకలేఖ వ్రాయించారు బాబా. అందులో ఆయున 1944 మార్చిలో ఇరాన్ దేశంలో పర్యటిస్తామని తెలియజేసారు. 1943 అక్టోబరు 25వ తేదీనే కపూర్తలలో బాబా 25 ఏళ్ళ ఒక దిగంబర మస్తుని సాంగత్యం చేసారు. ఇతని తల్లిదండ్రులు తోటమాలీలు. ఈ కుమారుని సంరక్షణ వారేచేస్తారు. ఆ రోజునే మునిసిపల్ ఆక్ట్రాయిగేటు వద్ద ఒక వృద్ధుని బాబా కలుసుకున్నారు. అతని పేరు మహమ్మద్ ఫకీరు తరువాత ఒక చిన్న గదిలో తులిరామ్‌బాబా అనే మస్తును సాంగత్యం చేసారు. అతడున్న చిన్న గదిలో నిప్పు రాజుతూ వుంటుంది. అందుచేత ఆ గది ఎప్పుడూ పొగతో నిండి వుంటుంది.

ఫాగ్వార్ దగ్గర రావల్పిండి అనే గ్రామం వుంది. అందులో ఖురాషాబాబా అనే మస్తు వున్నాడు. ఇతడొక ముసలివాడు. ఒక సాధువులా వుంటాడు వేషం చూస్తే. ఇతడు మహమ్మదీయుడైనా అలా తయారవుతాడు. రావల్పిండిలో ఒక స్మశాన భూమిలో వుంటాడు. బాబా యితనిని 1943 అక్టోబరు 26వ తేదీన సాంగత్యం చేసారు. ఆ రోజునే నేకీషాబాబా అనే వానిని కూడా కలుసుకున్నారు. ఇతడు 25 సంవత్సరముల నుండి ఫాగ్వార్ సమీపంలో ఉన్న సంగత్పురాలో తన గుడిసెకు బయట కూర్చునేవాడు. అందులోనికి వెళ్ళినట్టుగా కూడా ఎప్పుడూ ఎవరూ చూడ లేదు. ఏడు సంచుల నిండా చెత్తనింపుకొని దగ్గరలో ఒక దాని మీద ఒకటి పేర్చి పెట్టుకొన్నాడు. ఇతని వద్ద ధుని ఎప్పుడూ వెలుగుతూ వుంటుంది. ఇతడు పేడ చేసి పిడకలు వేస్తూ చాలా సమయం వెచ్చించే వాడు. పల్లెప్రజలు అతని దర్శన మునకు వచ్చినప్పుడు కట్టెలు తెస్తూ వుంటారు ఈ ధుని వెలగడానికి. సాధార ణంగా అతడు ధుని ప్రక్కనే కూర్చుంటాడు. తలమీద ఒక ముసుగు వేసుకొని వుంటాడు. బాబా అతనిని కలుసుకున్నప్పుడు పంచదార, గోధుమలు యిచ్చారు. నేకీషా దానితో పిండిచేసి నీరుపోసి కలపమని బాబాతో చెప్పాడు. ఆ ప్రకారం బాబా తిరగలితో పిండి విసరి అతనికి రొట్టెలు చేసారు. ఇందులో బాబాకి బైదుల్ కూడా సాయం చేసాడు. నేకీషా ఆఖరికి బాబాకి బైదుల్‌కి కూడా రొట్టెలు పెట్టాడు. అతని గుడిసె వద్ద ఒక చిన్న ఆశ్రమం వుంది. అందులో నేకీషా శిష్యులు చాలా మంది వున్నారు. నేకీషాను అందరూ చాలా గౌరవిస్తారు.

ఆ తేదీనే స్వామీకాళీపర్బత్ అనే ఒక ముసలి వానిని బాబా సాంగత్యం చేసారు. ఈ స్వామి 'ఉపదేశం పొందిన' యాత్రీకుడు. ఇతనిని కూడా ఒక ఆశ్రమం వుంది. అందులో అతని శిష్యులు నివసిస్తున్నారు. ఫాగ్వారాలో యితనిని అందరూ గౌరవిస్తారు. ఫాగ్వార్ గ్రామంలో ఖుదాయిబాబా అనే అత్యున్నతుడైన మస్తును 1943 అక్టోబరు 26 తేదీన బాబా సాంగత్యం చేసారు. ఇతడు దృఢమైన శరీరం కలవాడు. ఒక రైతులా బట్టలు కట్టుకుంటాడు. ఇతడు నివసించే యింటికి ముందు ఆవరణ ఉంది. అందులో అతడు చాలా పశువులను పెట్టుకొని వుంటాడు. బాబా అతనితో సాంగత్యం చేసిన తరువాత బాబా కోసం ఆమస్తు టీ తెప్పించాడు.

అక్టోబరులోనే బాబా జలంధర్ కూడా వెళ్ళారు. అక్కడ 26 తేదీన, సాయిన్ మస్తాన్‌ను, బుఢీ మస్తానీని బుఢ్ఢామస్తానీని బాబా సాంగత్యం చేసారు.

బుడ్డా మస్తానే హరిజనవాడలో నివాసం పెట్టుకుంది. ఆమెను అక్కడి ప్రజల చాలా గౌరవిస్తారు. అదే రోజున దుర్గామస్తానీ అనే అన్వేషకురాలిని హరిజనవాడలో బాబా సాంగత్యం చేసారు. ఆమె ముందు ప్రజలు భజనలు చేసి, ఆమెనెంతో గౌర వించేవారు. అక్టోబరు (1943) 28వ తేదీన బాబా కాశ్మీరీమస్తానీ అనే ఆమెను బాబా హోషియార్ పూర్‌లో కలుసుకున్నారు. ఈమెను మొదట క్రిందటి సంవత్సరం ఏప్రిల్ మాసంలో బాబా ఒకసారి కలిసారు. అదే రోజున (1943 అక్టోబరు 28వ తేదీన) హొషియార్ పూర్‌కి 7, 8 మైళ్ళ దూరంలో వున్న సిసోలీ గ్రామంలో బాబావఃస్తాన్ అనే వృద్ధమస్తును సాంగత్యం చేసారు ఆ మస్తు ఊళ్ళో 10,15 సంవత్సరముల నుండి వుంటున్నాడు. ఈ మాసంలోనే షాదారా (లాహోరు)లో బాబా చుంగీవాలాబాబా అనే మస్తును సాంగత్యం చేసారు.

నవంబరు (1943) 1టవ తేదీన పాండురంగ అనే వృద్ధుణ్ణి బాబా అతని గుడిసెలో కలుసుకున్నారు. అతడొక అన్వేషకుడు. నవంబరు 4వ తేదీన ఒక మసీదులో నంబర్‌దార్ అనే మస్తుని కలిసారు. ఇతడు చాలా సంవత్సరముల క్రితం ఒక భూస్వామిగా ఉండేవాడు. ఆ రోజునే బాబా పఠాన్ మస్తాన్ అనే మస్తును సాంగత్యం చేసారు. ఆ తేదీనే లాహోరులో షేరుబాబా (షేర్ అలీషా) అనే మంచి మస్తును బాబా కలుసుకున్నారు. ఇతడు దిగంబరిగా పబ్లిక్ గార్డెన్‌లో తిరుగుతూ వుంటాడు. బాబా అతనిని మొదట ఒక హొటలులో సాంగత్యం చేసారు. నవంబరు 4వ తేదీన చూరాసాయిన్ అనే ఒక వృద్ధ మస్తుని లాహొరులో బాబా సాంగత్యం చేసారు. ఆ నగరంలో ఢిల్లీ గేటు వద్ద అతని నివాసం. ఇతడు పాకీ కులంలో జన్మిం చాడు. అక్కడి పాకీ వారంతా అతనిని ఎంతో గౌరవిస్తారు. ఆ రోజునే లాహొరులో కాలాసాయిన్ అనే మస్తును కూడా బాబా సాంగత్యం చేసారు.

1943 నవంబరు 4వ తేదీన గోద్రీవాలా బాబా అనే వృద్ధుని, ఉత్తీర్ణు డైన యాత్రికుని వంటి మంచి మస్తుని బాబా షాదారా (లాహూరు)లో సాంగత్యం చేసారు. గోద్రీవాలాబాబా ఎప్పుడూ తన భుజం మీద ఒకరజాయి వేసుకొని వుండే వాడు. ప్రతి ఉదయమూ షాదారా నుంచి లాహొరుకి నడచి వెళ్ళేవాడు. అతడు భోగం వాళ్ళుండే సందులలోకి వెళ్ళేవాడు. అక్కడ వేశ్యలను అతడు గట్టిగా తిట్టే వాడు. సాయంత్రానికి మళ్ళీ షాదారా వెళ్ళేవాడు. అక్కడే అతడు రాత్రి పడుండే

వాడు. ఇతనిని కనుక్కోవడం కష్టం. కానీ చివరకు బాబా మండలి వారు యితనిని ఒక బావి దగ్గర ఉండగాకనుగొన్నారు. బాబా అతనితో సాంగత్యం చేసినప్పుడు ఒక కొబ్బరికాయ కొన్ని ద్రాక్షపండ్లు ఇచ్చారు. అతడిప్పుడు షాదారాలో లేడు. ఎక్కడికి వెళ్ళాడో ఎవరికీ తెలియదు.

1943 నవంబరు 9వ తేదీన జమ్మూలో బాబా చుంగీవాలాబాబా అనే ఒక అన్వేషకునితో సాంగత్యం చేసారు.గత మాసంలో (అక్టోబరు ) 7వ తేదీన బాబా మొదట లాహోరు షాదారాలో సాంగత్యం చేసిన చుంగీవాలాబాబా యితడు ఒకడే ఇతనిని చిల్లంవాలా అని కూడాఅంటారు. చుంగీవాలా నడివయస్కుడు. తన శరీరం మీద మెడలోను, మొలకి, చేతులకు, ఎముకలు దండకట్టి ధరిస్తాడు. ఎందుకూ పనికిరాని చెత్తా చెదారము పోగుచేసి ఒక గోనీ సంచిలో వేసి తనతో ఉంచుకుంటాడు నవంబరు నెలలో వ.ళ్ళీ యితనిని జమ్మూలో బాబా కలిసే సమయము నకు ఎముకల దండలు పారేసి మట్టి గొట్టాలు ధరించాడు. వీటి మూలమున యితనిని చిల్లంవాలా అనిపిలిచారు.

1943 నవంబరు 9వ తేదీన బాబా జమ్మూలో ఫలాయివాలాబాబా అనే మస్తును సాంగత్యం చేసారు. ఇతడు ఒక చిన్న గదిలో ఎప్పుడూ కూర్చుని వుంటాడు అతని చుట్టూ 5–6గురు ఎప్పుడూ కూర్చుని ఉంటారు. అతడంటే వారికి మిక్కిలి గౌరవం. అ రోజునే కాశ్మీర్‌బాబాను, శంకూబాబాను కలుసుకున్నారు. మౌనంగా ఉండే మౌనిబాబాను, దిగంబరిగా ఉండే తతావోవాలా మస్తాన్ అనే మస్తును కూడా బాబా సాంగత్యం చేసారు. పురిస్నీ టోపీసింగ్ అనే మంచి మస్తునుకూడా జమ్మూలో నవంబరు 9వ తేదీన బాబా సాంగత్యం చేసారు. అతడు ఒక టోపి (హాట్)ను పెట్టుకునేవాడు. ఇతడు సిక్కు మతమునకు చెందినవాడు. ఒకరి స్వంతయింటిలో బాబా అతనితో సాంగత్యం చేసారు.

నవంబరు 10వ తేదీన బుడాసాహెబ్ అనెడి మస్తును బాబా జలంధరులోనే కలుసుకున్నారు. ఆ రోజునే కాశ్మీరీషానుకూడా సాంగత్యం చేసారు. అ మరునాడు బాబా మధ్యవయసు కల్గిన ఒక మస్తును మంచిబట్టలు వేసుకున్న మహమదాలిషా మస్తాన్ అనే వానితో సాంగత్యం చేసారు. ఈ మస్తు ఒక భూస్వామి యింటిలో

ఒక గదిలో నివసిస్తున్నాడు. అతడు వేయించిన శనగలు మాత్రం తినిఉంటాడు ఇంకేమీ తినడు. క్రితం రోజున ఫుల్లాషా అనే మంచి మస్తుతో సాంగత్యం చేసారు. ఇతడు తన సమాధిని కట్టించుకొని సిద్ధం చేసుకున్నాడు. బాబా ఈమస్తుతో ఒక గంట ఏకాంతంగా సాంగత్యం చేసారు. 1943 నవంబరు 11వ తేదీన లాహోరులో బాబా రంజానీమాయి అనే మస్తానీని కలుసుకున్నారు. ఆమె చాలా సంవత్సరములనుండి ఒకేచోట ఉంటోంది. బాబా సాంగత్యం చేసిన కొన్నాళ్ళకి యీమె కాలం చేసింది. ఆ తేదీనే హోషియార్‌పూర్‌కి 5 మైళ్ళ దూరంలో ఉన్న హార్మోయా అనే గ్రామం వెళ్ళి అక్కడ బాబా హస్‌వలీ అనే మంచి మస్తును బాబా సాంగత్యం చేసారు అతనికి సుమారు 60 ఏళ్ళ వయసుంటుంది. ఇతడు పూర్తి దిగంబరుడు. కొంచెం లావుగా ఉంటాడు. హార్మోయాలో ఒక చెట్టు క్రిందకూర్చుని ఉండగా బాబా అతనిని కలుసుకున్నారు.అతనికి చాలామంది శిష్యులున్నారు. ఆ చుట్టుప్రక్కల గ్రామములో బాబా హసన్‌వలీ మిగుల విఖ్యాతిగాంచాడు. అనేక సంవత్సరముల క్రిందట ఒక స్త్రీ అతనిని తన శిష్యురాలిగా అంగీకరించమని ప్రాధేయపడగా అతనికి విసుగెత్తి వేధిస్తున్న ఆమెను కొట్టగా ఆదెబ్బతో ఆమె ప్రాణం వదిలేసినది. మనిషిని చంపినందుకు అతనిని జైలుకిపంపించారు. అతడు వదిలిపెట్టబడిన తరువాత హార్మోయావచ్చి అక్కడ స్థిరపడ్డాడు.

1943 నవంబరు 11వ తేదీన హోషియార్‌పూర్‌లో బాబా ఒక నిజమైన సాధువుతో సాంగత్యం చేసేరు. అతనిపేరు సాధుబాబా. ఆ రోజున నామామస్తాన్ అనే అతనిని కూడా బాబా కలిసారు. తరువాత మస్తానీమాయి అని పిలువబడే ఒక మంచి మస్తానీని బాబా కలుసుకున్నారు. ఆమెకు పలువురు శిష్యులున్నారు. ఆమె మంచి బట్టలు వేసుకుని పట్టణద్వారం వద్ద హుక్కాపీలుస్తూ కూర్చుంటుంది. బాబా ఆమెకు భోజనం పెట్టారు. హోషియార్ పూర్‌లోనే అదే రోజున లిన్‌జిమస్తాన్ అనేమస్తును కూడా బాబా సాంగత్యం చేసారు. ఇతడు పొట్టిగా ఉంటాడు. తునక టోపీ పెట్టుకుంటాడు. ఒక పమూట పుచ్చుకొని ఊళ్ళో తిరుగుతూ ఉంటాడు.

నవంబరు 27వ తేదీన రట్లంలో రావ్‌మస్తును, బాబా సాంగత్యం చేసారు. ఇతడు నడివయస్కుడు. నల్లగా ఉంటాడు. స్మశాన భూమిలో నివ

సిస్తాడు. ఇతని వద్ద అనేకమైన కుండలు మట్టిపాత్రలు ఉంచుకుంటాడు. వాటిలో ఆహారపదార్ధములు దాచుకుంటాడు. నవంబరు ఆఖరికి బాబావారి మండలి సహితంగా మెహెరాబాద్‌కి తిరిగివచ్చారు.

## (మూడవ భాగం సమాప్తం)

తరువాయి 4వ భాగంలో...